అంతటి రచనలు 1

మొదటి ముద్రణ 1950
రెండవ ముద్రణ 1959
మూడవ ముద్రణ 1992

వెల: 35 రూపాయలు



పబ్లిషర్స్:
సమతా సాహితి
4-సంతోష్ అపార్ట్‌మెంట్స్.
సంతోష్‌నగర్ కాలనీ,
మెహిదీపట్నం,
హైదరాబాదు-500 028.
ఫోన్: 253564

ముద్రణ:
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380
ఫోన్: 611413

# అంకితం

## పాతికేళ్ళకే నూరేళ్ళు నిండిన
## మల్లిశెట్టి సుబ్బరామయ్యకు

ఆదియందు సోదరులం
అంతకు ముందద్వైతం
మామకొడుకు పుట్టుకతో
మంచి హితుడు పెరుగుటతో

చదువులందు సమాజ దృక్
పథమునందు రాజకీయ
పథము నందు నీతియందు
సహచరులం సంస్కృతులం

భావిలోన తన తమ్ముడు
మల్లిశెట్టి చిన్నయ్యకు
వారసత్వ సర్వంగా
వదలిపోయె నన్నిటిని

పాతికేళ్ళలోపలనే
నూరేడులు నిండినట్టి
మల్లిశెట్టి సుబ్రామునకు
మక్కువతో అంకితమిది.

# ఒక మనవి

ఆదర్శం వ్రాసింది 1946 లో. ప్రథమ ముద్రణ 1950 డిసెంబరులో. ఇందులోని విషయాలు అస్పృశ్యతా నివారణ, కులాంతర వివాహాలు, సామ్యవాద ప్రచారమూనూ. ఇందలి ఇతివృత్తం 1930 నుండి 1950 వరకూ జరిగిన రాజకీయ సామాజిక చరిత్ర.

కొన్ని పత్రికలు ఉన్నవవారి మాలపల్లి తర్వాత అస్పృశ్యత విషయంలో ఇంతగా చర్చించిన మరొక గ్రంథం లేదన్నవి, పాఠకలోకం ఇంత ఆదరాభిమానాలు వర్షించి నందుకు వారి కందరికీ నా కృతజ్ఞత.

రెండవ ముద్రణ 1959 లో జరిగింది. స్వరాజ్యంలో రాజకీయుల పదవీ పోరాటాలూ, పదవులందిన వారి భోగభాగ్యాలూ, లంచగొండితనాలూ అంతకంతకూ అధికమయ్యాయి. సమాజంలో దోపిడీతత్వం పెరిగింది. కుల స్పృహ పెరిగింది. అస్పృశ్యత అట్టే తగ్గలేదుగాని రాజ్యాంగం ప్రసాదించిన రిజర్వేషన్ ఫలితంగా హరిజనులకు విద్యావసతులూ, ఉద్యోగాలూ కాస్త మెరుగయినవి. అస్పృశ్యతా నివారణలో ఇది సముద్రంలో కాకిరెట్టంత మాత్రమే!

ఈ మూడవ ముద్రణ కాలానికి సమాజంలో చాలా మార్పులొచ్చాయి. రిజర్వేషన్ మూలాన హరిజనులకు ఉద్యోగావకాశాలు ఇంకా పెరిగినా, అస్పృశ్యతా జాడ్యం తగ్గలేదు. సంస్కరణకు ఉద్దేశించిన ఈ నవలకు ప్రాధాన్యం తగ్గలేదు.

కేవలం హరిజన సమస్యలతో నిండిన నవల కాబట్టి, సాంఘిక సంక్షేమ శాఖ కమీషనర్ పి. కమలేశ్వర్‌రావు IAS గారు ఈ నవలను హరిజన కమ్యూనిటీ హాల్సులో ఉంచి ప్రచారం కావించాలని సిఫార్సు చేశారు. ఆయనకు మా కృతజ్ఞత. జాయింట్ డైరెక్టర్ అడిదం పాపారావు గారికీ, డిప్యూటీ డైరెక్టర్ డాక్టర్ బండారుగారికీ కృతజ్ఞతలు.

ఈ నవలను సొంతం కుతూహలంగా చదివి తెగమెచ్చుకొని, ఆంగ్లంలో గొప్పగా విమర్శ వ్రాశారు ప్రఖ్యాత ఆంధ్రాంగ్ల విమర్శకులు శ్రీ డి. రామలింగంగారు. ఆయనకు కృతజ్ఞత లర్పిస్తూ దాన్ని ఆంగ్లంలోనే ప్రచురిస్తున్నాము-చదవండి.

27-2-92 — రచయిత

A High Estimate

# AADARSAM
# Dr. NARSIMHAM'S
# PATHFINDING NOVEL

"Aadarsam" is the novel in which Sri Anthati Narasimham, not only gave powerful expression to his ideals, but also saw to it that they put into practice by a hero who is an idealist as well as a man of action. For this, the author has chosen a village named Kota which is a typical Andhra village–nay, a Rayalaseema village, in its social and economic backwardness, where the untoucha-bles are treated in the traditional oppressive and reactionary mannner.

The Hindus belonging to higher castes in this village are against the education of Harijans because, as they think, if Harijans begin to study in a school, the well-to-do farmers will find it difficult to get agricultural labourers without whom they can never mannage their farms and it is the Harijans who ultimately turn agricultural labourers as we see in our villages. Moreover, people of the higher castes do not want that their children should sit in a school along with the Harijans who are outcastes and pariahs. They also believe that the Goddess of learing will get defiled if Harijans are imparted education. And Ellappa, a Harijan, whose son Sreenu began going to the school in the village, is pressurisad by the leaders of dominant communities to withdraw his boy from the school and put him in their farms so that the boy may supplement the family income. Ellappa is half-willing to submit to the pressures, where as his wife Lakshmi is strongly against succumbing to such high handed pressures. The caste Hindus also fear that if Harijans have higher education they will join the Government service, in which are sure to lose their dominant position in the village- so they are determined to see that no Harijan in

the village gets education. Subba Reddy, a high-handed landowner, Sastri, an obscurantist and the village Karanam, a wicked fellow are the leaders of this village called Kota.

To such a village the author of the novel takes Kesava Rao as a teacher to translate his cherished ideals into action. Kesava Rao is a Brahmin youth who too was an orthodox in his early days, scrupulously abiding the outdated social norms of caste hirachy and following the age-old practice of untouchabily. But there came a change in him as he was getting educated and as he began to move among the enlightened people. He had, in his love affair a bitter experience from the caste system which played havoc with his love for a girl belonging to a different community. He got despaired and finally had to sacrifice his love. Moreover, winds of change began to blow in the country with the launching of national movement. There was practice acvity for social reformto which the enlightened youth were attracted. There was also political upheaval with the arrival of Gandhiji on the scene. The country was fighting for its indepen-dance and all this had its impact on the impressio-

nable Kesava Rao who turned a reformer and humanist. He was determined to put an end to artificial barriers placed between man and man by the Hindu caste system. He was strongly of the view that the social distinctions of high and low castes should go and that equality of humans should be ushered in. He discarded his sacred thread which was a symbol of his high caste. His father was enraged at this revolting act and turned him away from home

Kesava Rao reached Kota and settled there as a Primary School teacher. He made the village as the center for putting into practice his ideals of Harijan uplift, reforming the Hindu Society by eradicating caste distinction and ushering in the equality of all human beings. He was also strongly in favour of widow marriages and inter-caste marriages apart from women's education. For this, a revolution of ideas and a charge in the thought-pattern was essential, he believed. He encouraged the Harijan boys to pursue their studies, helping them economically and giving them moral courage. They in turn proved to be brilliant and hard working pupils. The transformations brought by Kesava

Rao and his colleague Narayana in the school is amazing and worthly of commendation. They actually brought a revolution in the village. The Harijanawada had undergone a metamorphosis. Its lanes became clean and its occupants were no more slaves of the well-to-do farmers. They were having a daily newspaper and knowing what was transfering in the rest of the world, A sort of awakening was discernible among them. In short, they became real citizens of a modern State.

Especially the transformation among the younger generation in the village who took to education was remarkable. Boys and girls belonging to different high and low communities developed friendship among themselves. Understanding each other, and fully well aware that all of them were partners in an effort at modernising themselves. They moved together to a near by town for higher studies and unitedly working as a group acquitted themselves well in the pursuit of their studies, bringing name and fame to their village. There was also union of hearts among these youngsters and in course of time, there emerged ideal lovers. Sri-Lakshmi the daughter of the Karanam loved Rami

Reddy, and a Reddy girl Anasuya lost her heart to Sreenu, the upcoming Harijan boy. The old Sastri's second wife Kamakshi too had her education and loved Narayana, the non-brahmin colleauge of Kesava Rao. In Kamakshi's case, it is triple adavancement in reform, being a widow marriage, an inter-caste marrige and a love marriage - all at the same time. And the most surprising developing is that Nagalinga Sastri, the son of the old Sastri loved Sujata, a Harijan girl. These lovers had to encounter many hurdles. Especially the love between Sri Lakshmi and Reddy ran into rough weather which the novelist has depictcd in an interesting scene, thus giving a human touch to the story, which is otherwise a saga of conflicting interests of tne village which has been for centuries in the same state meting out injustice to the depressed classes, and maintaining caste heirarchy in the name of tradition and age-old practice, apart form the machinations of vested interests.

The old Sastri before meeting his death is shown by the author of the novel as a changed man. Sastri admits his mistakes and repents for his conduct throughout his life in perpetuating the

social system. He asks for the pardon of one and all. The old Reddy too relents and allows the things to take their own shape in the new desperation. Thus the citadel obscurantism and oppression is pulled down, paving the way for an egalitarian soceity.

The services rendered and the sacrifices made by the hero Kesava Rao stand apart. What a contribution he has made to change the face of the village. What a change he has wrought! It is difficult to put into practice the profession one makes. One should have strong will power apart from sincerity integrity, determination and devotion to the cause one takes up. Kesava Rao had all these traits in ample measure. The novelist believes that Harijan uplift and inter - caste marriges bring strength and health to the Hindu Society and that an integrating process alone brings harmony to the strife torn Hindu community which is a divided house now. And that harmony in its turn elevates the society. So an ideal is the need of the hour. The present-day youth must be imbibed with such an ideal and they must be exhusted to work for the transformation of the

society. Thus this novel is an effective presentation of a social transformation process based on an ideal. It sets before the youth an example of a small village community experimenting with the ideal and achieving tremendous results in a peaceful manner and moving towards progressive society where all humans are equal and friends of each other.

—D. RAMALINGAM

## ౧

ఆకాశమంతా మేఘాచ్ఛాదితమై వుంది. ప్రొద్దుపొడిచి అప్పటికి గంట అయినప్పటికీ ఇంకా సరిగ్గా తెల్లవారనట్లే వుంది. చెవిగూబలు పగిలిపోయేటట్లు గర్జిస్తున్నాయి మేఘాలు. సన్నటి విషపు సూదులతో పొడుస్తున్నట్లుగా వుంది చలిగాలి తాకిడి. అతిసూక్ష్మరంధ్రాల పంపులో నుండి సన్నని నీటిధారలు చిందినట్లుగా జల్లులను కురియిస్తున్నది ఆకాశం. కాశ్మీర్ శాలువ ఒంటినిండా కప్పుకొని నిశ్శబ్దంగా అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు సుబ్బారెడ్డి మొగసాల్లో. కోపోద్రేకంవల్ల హృదయం వేడెక్కి, వెచ్చటి రక్తాన్ని శరీర భాగాలకు హృదయం చిమ్ముతూండడంవల్లనేమో, అతడు చలిబాధ పడనట్లుగా కనిపిస్తున్నాడు. అపుడపుడూ తలవూచి హ్రస్వంగా నిట్టూరుస్తూ వున్నాడు. అంత నిశ్శబ్ద వాతావరణంలో అతని హృదయం ఝంఝామారుతాహతమై వుందంటే కారణం మాత్రం లేకపోలేదు. మిడిగ్రుడ్లు చింతనిప్పుల్లాగా మెరుస్తున్నాయి. నిర్వాత ప్రదేశమైన మీసాలుమాత్రం కదుల్తూ ఆడుతున్నా యాతని నిశ్వాస వేగంవల్ల. అపుడపుడూ తలవూచుతూ అనుగుణంగా ఎడమ అరచేతిలో కుడిపిడికిలి వేసి బిగిస్తూ మాటిమాటికి దర్వాజావైపు చూస్తూ అస్పష్టంగా అపుడపుడూ ఏదో గొణుక్కుంటూ వున్నాడు. సద్దుగాకుండా వాళ్ళ ఆరో సేద్యగాడు లోపలికొచ్చాడు. వాణ్ణి చూడ్డంతోటే తొలకరి వర్షాలముందు ఉరిమినట్టుగా "ఆ గాడ్దికొడుకేడ్రా?" అన్నాడు. సుబ్బడు చేతులు నలుపుకుంటూ "వాడి పెండ్లాం......."

"ఏం దానికేమొచ్చింది?"

"నొప్పులు పడతావుండాది."

"అయితే?"

"కానా పెమాదంగానే వుండాది."

"ఉంటే?"

"మందూ మాకూ సూస్తావుండాదండి."

"యిక్కడ వాడెమ్మా మొగుడు చేస్తాడంట్నా? ఇప్పటికింకా కాడే కట్టలేదు. మళ్ళు దున్నడం అర్జెంటూ అని చెప్పాను."

అనేటప్పటికి ఆ దృశ్యాలు చూచివచ్చి యీ పలుకులు విన్న సుబ్బడికి కన్నీళ్ళురాక తప్పలేదు. అవి కనబడకుండా, తటాలున అటు తిరిగి గొడ్లగాటిదగ్గర కెళ్ళాడు.

"యిందుకేరా మీ జన్మ ఇట్లా కాలబడింది? లేకపోతే బాగానే వుండే వాళ్ళు. యేనాడన్నా చెప్పందే తెల్లారుఝామున కాడిగట్టారా? చీకటిపడితే సరి-పెళ్ళాం బిడ్డలో అంటూ పరుగెత్తి పోవడం! ఏం, వాళ్ళ నెవరన్నా ఎత్తుకపోతారా? మూడుపూటలా బాగా పెడ్తావుంటే తిని పొగరెక్కిందిరా మీకంతా" అంటూ అటు చూచి,

"వాణ్ణి ముందూ యిక్కడికొచ్చి మళ్ళాపొమ్మను. లేకపోతే నేను రావాల్నేమో అడుగు" అనేటప్పటికి సుబ్బడు మళ్ళా వెళ్ళాడు.

కూతురు అనసూయ పరుగెత్తుకుంటూవచ్చి ఒగరుస్తూ "నాన్నా, నాన్నా! అమ్మ చెయ్యి కాలింది" అనేటప్పటికి కప్పుకున్న శాల్వ విసిరట్లా పారేసి పరుగెత్తాడు వంటింట్లోకి. కన్నీళ్ళుకారుస్తూ కాలినచేతిపై ఊదు కుంటూ వుంది పార్వతమ్మ.

"అంత అజాగ్రతయితే ఎట్లాగే?" అంటూ, కొబ్బరినూనె తీసు కొచ్చి కోడికతో తడిపి పూస్తూ,

"మంటగా వుందా?" అన్నాడు ఆదరంగా చూస్తూ.

నాన్నకు కనబడగూడదని అంతవరకూ నిర్ధారణలో వున్న రామిరెడ్డి, అనసు వెళ్ళి అమ్మ సంగతి చెప్పగా అంతా మరిచి పరుగెత్తు కొచ్చాడు. వాణ్ణి చూడగానే సుబ్బారెడ్డి "ఏరా, ఇపుడేనా నిద్రలేస్తు న్నావ్?" అన్నాడు. రామిరెడ్డి మాట్లాడకుండా, గుడ్లు మిణకరిస్తూ నిలబడ్డాడు.

"రాత్రం తాలస్యంగా యెందుకొచ్చాడో అడుగు" అంది తల్లి.

ఆ మాట వినగానే రామిరెడ్డి గుండెల్లో పిడుగు పడ్డట్లయింది. రాత్రి అన్నంత పని ఇపుడు చేసింది వాళ్ళమ్మ. గుడ్లపై నీళ్ళు పొరాడగా,

"వెన్నెల్లో అడుకుంటూ వుండినా" అన్నాడు ప్రశ్న లేకుండానే. దగ్గరికొచ్చాడు సుబ్బారెడ్డి. కొంచెం కొంచెం వెనక్కి జరుగుతున్నాడు రామిరెడ్డి. జరిగి పారిపోబోయాడు. పట్టుకున్నాడు సుబ్బారెడ్డి. చెవి పట్టుకొని నలుపుతూ "రాత్రిపూటానామ్మా ఆటలూ? చదువుకోవద్దన్నారా అయ్యవార్లు?" అని అంటూ రాత్రి కరణం యింట్లో జరిగిన సమావేశం లోని సంఘటనలు జ్ఞప్తికిరాగా,

"నేనొకటడుగుతా గాని, చెప్తావుగదూ?" అన్నాడు శాంత స్వభా వాన్ని తెచ్చిపెట్టుకొని నవ్వును నటిస్తూ.

జవాబు సూచకంగా ఆయన మొగంలోకి చూచాడు రామిరెడ్డి.

"అయితే మాలవాళ్ళనెందుకురా తాకడం?"

"................................"

"తాకితే యింటికొచ్చి పసుపు నీళ్ళు అయినా చల్లించుకోవటి గదూ?"

"తాకితేయేం నాన్నా, వాళ్ళు గూడా మనుషులే గదూ? నిన్ను తాకి నట్లే వాళ్ళనూ తాకొచ్చు" అన్నది అతని నడుమును కౌగలించుకొన్న అనసు.

"ముయ్‌నోర్!" అని గుడ్లుఱిమేటప్పటికి, దారం తెంచిన గాలి పటంలాగా ఎగిరిపోయి వాళ్ళమ్మను కౌగలించుకొంది కన్నీళ్ళురాలుస్తూ.

"పలకవేంరా గాడ్దా! శీనుగాడు వాడికై వాడేవచ్చి కూచుంటాడా? లేకపోతే అయ్యవార్లు నీ పక్కలో కూర్చోమంటారా?"

"... ..........................."

"నీవేం మాలోడివై పోదా మనుకున్నావా?"

"..............................."

దేనికి జవాబీలేదు రామిరెడ్డి. తెచ్చి పెట్టుకున్న శాంత స్వభావం కొంచెం కొంచెమే జారిపోగా,

"గాడ్దికొడకా, అంతగానా మీరిపోయేది?" అంటూ చెంపకేసి కొట్టాడు.

"అమ్మా!" అంటూ ఏడ్చింది అనసు.

పరుగెత్తుకుంటూ వెళ్ళి, చలనం లేకుండా స్థైర్యంగా ఉన్న కొడుకును కౌగలించుకొని, "చంపచూడూ, ఎట్లా పొంగిందో! ఇంతగానా కొట్టేది? కోపమొస్తే కండ్లు కనబడవేమో?" అంది పార్వతమ్మ.

బుర్రున బయటి కెళ్ళాడు సుబ్బారెడ్డి. మొగసాల్లోకి పోగానే యల్లప్ప కనబడ్డాడు. చూడగానే సుబ్బారెడ్డి కోపం ఒక రూపాన్ని ధరించింది. కోపాన్ని అణుచుకోడానికి ప్రయత్నిస్తూ,

"యల్లప్పా! రాత్రి యేం జరిగిందో తెలుసా?"

"యేంది సామీ?"

"శాస్త్రిలూ, కరణమూ నామీద పడ్డారు."

"ఎందుకో?"

"మీ శీనిగాణ్ణి బళ్ళోకి రాకుండా అపుచెయ్యించలేదని."

ఎన్నిసార్లు చాలించినా ఆ అయ్యవోర్లు...."

"అయ్యవార్ల దేముందిరా మధ్య? నీవు ఘట్టిగా చెప్పితే గదూ? ఏదో నన్ను తృప్తిపరచడానికి అపుడపుడూ చాలించినట్లు నటిస్తున్నావ్. అంతేనా? ఇక ఆ వేషాలు కట్టిపెట్టు. మన దగ్గరిక ఆ పప్పుడకదు.... మాల వెధపలకు కూలీనాలీ చేసుకొని బతక్కుండా చదువేందోయ్? పీళ్ళకు చదువొస్తే ప్రపంచాన్నే తినెయ్యరూ? నేను మొదట్నుండీ చెబుతున్నా వాణ్ణి మన ఆవలకాడికి పంపీరా అని. కూడూ గుడ్డా యిచ్చి నెలకొక రూపా యిస్తాను గదా! నా మాట విన్నావా? యెందుకింటావులే? నీకూ నెత్తికొచ్చినాయ్ కండ్లు. ఏమంటే చిన్నప్పట్నుంచీ మనకుండే చనువువల్లా, మన రెండు కుటుంబాలకుండే దగ్గరతనంవల్లా కచ్చితంగా చెప్పలేకపోయాను. వాడే గ్రహించుకుంటాళ్ళే అని నిన్ను ఖండితంగా అడగలేదు. అయినా ఆ వెధవ బడికిపోయి యేడ్చేదేముందిరా? లక్ష ణంగా మనింట్లోవుంటే కూడూ గుడ్డా సుఖంగా లభిస్తుంది గదా! నేను పిల్లవాడుగా వున్నప్పట్నుండీ నీవు మనింట్లో వుంటున్నావు గదా! నీకేం లోటొచ్చిందిరా? యేది లాభమో ఆలోచించు. యింతకూ వాణ్ణి బళ్ళో వేసింది మొదలు అంతా అనష్టం. ఊళ్ళోపిల్లల్నంతా తాకడం - వాళ్ళతో సమానంగా కూర్చోడం - ఇంకా కొందరు పిల్లల్ను ఒరే అనడం. రామ రామ! ఇదే మన్యాయం? కులాలూ, వర్ణాలూ నాశనమై అధ్వాన్నమై పోతున్నాయ్. ఊళ్ళో కతంతా మనకెందుకులే - మన కత మనం జూచుకుంటే చాల్లే అనుకొని యిన్నాళ్ళూ యెట్లాగో కండ్లు మూసికో నుంటివి గదా - మొన్న మీ శీనిగాడూ, మా రాముడూ, మా యింటికొచ్చి మా మొగసాల్లో అరుగుమీద ఒకర్నొకరు తాకుతూ, కాళ్ళాడించుకుంటూ, ఒరే ఒరే అనుకుంటూ, రామరామ!.... సరేగాని, మావాడంటే పిల్ల వాడు, మీ శీనిగాడి కెంత పొగర్రా? మావాడితో సమానంగా కూచోడమే! వాడికెంత తెలివిలేదురా? ఆఁ- ఊరికే పోనీ లేదులే. అట్లా పట్టి, మాంచి రెండు పీకులు పీకాను చెంపకేసి.''

"వాడి కేందెలుసు సామీ, పిల్లయదవ? మీవోడికంటే ఒకేడు తక్కువేగదో? మీవోడికి మించిన తెలివితేటలు వాడికేడొస్తాయి? ఆనాడు కొట్టడం మంచిపనేలే! బలేపన్జేశినావ్!"

"అదిగాదురా వెధవముండాకొడకా! మావాడొకవేళ పిలిస్తే మాత్రం దగ్గిరికి రావచ్చా? ఒకవేళ తెలీక దగ్గిరికిపోతే, 'నేను సామీ తాకొద్దు' అని చెప్పడానికి బదులు, తాకి తగలెయ్యడమే? మీరింట్లో భద్రంగా చెపితే వాడిట్లా యెందుకు చేస్తాడ్రా? వాళ్ళమ్మ పట్నవాసం మనిషిగదూ - తాకితే లెక్కలేదని చెప్పిందేమోలే! అందరు మాల పిల్లలూ మీ పిల్లవాడి మాదిరే వున్నారా?

"ఈ అయ్యవారొకరు బాగయ్యాడు మా ప్రాణాలకు! ఇన్నాళ్లూ ఆ బాపనయ్యవోరుండె! ఎంత బాగుండింది! ఎంత బాగుండేది!! మాల వాణ్ణి చూస్తే-రామరామ! పదహారామడ పరుగెత్తేవాడు. అసలాశబ్దం వినే వాడా? నపిస్తే మాల పిల్లల్ని బడికి రానిచ్చేవాడా? పాపం, మహరాజు!. అట్లాంటోళ్ళు చాన్నాళ్ళు బతకరు. ఆయనుండే మాకీ చిక్కులొచ్చేవిగావు. ఇపుడుండే ఆయన గూడా బాపనోడే. యెందుకూ? రెండింగ్లీషు ముక్కలొచ్చాయో లేదో- అప్పుడే కులమూ లేదంట, ఏమీలేదంట - అందరూ ఒక్కటేనంట! ఇదెక్కడన్నా కద్దా? బాపనోళ్ళు, మాలోళ్ళు అంతా ఒకటే ఔతారంట్రా? ఎప్పటికన్నా అవుతుందా? బుద్ధివుంటేసరి!. ఇట్లాంటి కులభ్రష్టులు చదువు చెబితే పిల్లవాళ్ళుగూడా కులభ్రష్టులుగాక మరేమౌతారు?

"పాపం, మొన్న శాస్త్రిలొచ్చి, ఒకడే అఘవరింపు! వాళ్ళ పిల్లవాణ్ణిగూడా మీవాడు తాకుతూ వుంటాడట! అందులో ఆ పిల్లవాడి ప్రక్కన అదేపనిగా కూచుంటాడట! అయ్యో! బాపనోళ్ళ పిల్లోడి పక్కన మాలోడే! వాడు నాశనమైపోడూ? అసలు మీకు కూడు దొరుకుతుందా?" వంశనాశనమైపోరూ?"

"నేనేం వాడి శాత లోకా తేలిస్తా మనుకున్నానా సామీ? అసలు మాకెందుకండీ సదువు? మీబోటి మహరాజుల కుండాలగాని! ఆ అయ్యోరే వచ్చి రోజూ మొత్తుకుంటావుంటే, మా లచ్చిమి నాతో పోట్లాడి పంపిస్తా వుండాది. నువ్వు నాతో అన్నపుడల్లా వాణ్ణి సాలిస్తావచ్చినా. అడుగో, ఆ అయ్యోరే వాణ్ణి శెరుస్తుండాడు. నేనేం జేసేది? వాడింతగా శెడిపోతాడని ముందే తెలిసుంటే...."

"అందుకేరా నాయనా - వాడు చెడేదిగాక, అందర్నీ కులభ్రష్టుల్ని చేస్తున్నాడ్రా! వాడివల్ల మా కులాలు కాస్తా నాశనమౌతున్నాయి....ఇన్ని దినాలుగా చెప్పినట్లు నీకింక చెప్పను. నీవు వాణ్ణి బళ్ళోనుంచి చాలించి, మా ఆవలకాడికి పంపిస్తావా, లేకపోతే నీ పెండ్లి బావతు యిరవై రూపాయలూ యిచ్చి పన్లోనుండి మానుకుంటావా? ఇక రెండో మాట లేదు. ఇదివరకు చేసినట్లు చేసేదానికి వీల్లేదింక. తెలుసుకో" అని సుబ్బారెడ్డి బుర్రున యింట్లోకి వెళ్ళబోతుండగా ముదాంవాడికోసం వెళ్ళిన సేద్యగా డొచ్చాడు. గిర్రున తిరిగి "ఏడ్రా వాడు?" అన్నాడు సుబ్బారెడ్డి. "వాడి పెండ్లాం చచ్చిందండీ!" అనేటప్పటికి, "చావకుండా వుంటారా?" అంటూ లోపలి కెళ్ళాడు.

౨

సుబ్బారెడ్డిది 'కోట' అనే గ్రామం. ఆ వూళ్ళో సుబ్బారెడ్డిది పెద్ద సంసారం. రెండతస్తుల మహడీ. గొప్ప ఆస్తి. పూర్వం వాళ్ళ తాత చెన్నారెడ్డి కాలంలో పెద్ద దర్జాగా వుండేదట ఆ కుటుంబం. చుట్టుపట్ల వాళ్ళంతా ఆయన దెబ్బంటే హడల్. చెన్నారెడ్డి చేతిక్రింద ఒక దోపిడి గాండ్ర జట్టుండేది. ఎవరన్నా పరపతికొస్తే లక్షణంగా అన్నం గిన్నం పెట్టి బాండు రాయించుకొని డబ్బిచ్చేవాడు. వారు కొంతదూరం పోయాక

తన దోపిడిజెట్టీలను పంపి కొట్టించేవాడట. తన ధనం తక్షణం తనకు దక్క డమే గాకుండా, వ్రాయించిన బాండ్ల మూలాన వాళ్ళ భూములూ, బుర్రా స్వాధీనం చేసికొనేవాడట. ఇంకా యెక్కడన్నా, ఈ దోపిడిగాండ్రు దోచి తెచ్చిన సొమ్ములు మొదలైనవి అగ్గువగా కొనేవాడు. తన వూళ్ళో యెవరికన్నా పరపతి యిస్తే, దానికి అంతకాలు కట్టి, వడ్డీకి వడ్డీ పెంచి, అంతకు పదంతలు చేసి, గోలపెట్టి, బెదిరించి, పాపం అమాయకుల నోరుగొట్టి, వేలకువేలు చేసే భూములను కొన్ని నూర్ల బాకీల్లోకి చెల్లుగట్టి స్వాధీనం చేసుకొనేవాడు. ఈ విధంగా యిరుగు పొరుగుల రక్తాన్ని త్రాగి, వాళ్ళ ఆస్తులు దోచుకొని తాను గొప్ప మహరాజై-అంతా మనుమ డైన యీ సుబ్బారెడ్డి చేతిలో పెట్టి చనిపోయాడు.

సుబ్బారెడ్డి ఆకారం చూడటానికి కటువుగా వుండదు. అయినా చాలసార్లు భయంకరంగానే కనిపిస్తాడు. మాంచి ఒడ్డు మనిషి. పెద్దపెద్ద మీసాలు. చింతనిప్పల్లాంటి కండ్లు. ఎప్పుడు గూడా నిషాలో వున్న మనిషిలాగా వుంటాడు. ఊళ్ళోవాళ్ళంతా అతన్ని చూస్తే భయంతోనైనా గౌరవిస్తారు. బీదవాళ్ళు ఎక్కడన్నా కూర్చొని వున్నారంటే అతన్ని చూడగానే లేవాల్సిందే. లేకపోతే వాళ్ళ తాత మాదిరిగా దౌర్జన్యంగా కొట్టిస్తాడేమో అని భయం. అతనితో విరోధం పెట్టుకుంటే చాలా విష యాలలో జరగడం కష్టం అని హృదయవిరుద్ధంగానైనా ఆ విధంగా చేస్తూవుంటారు. అతని వద్ద చనువుగా వుండగలిగేది ఒక యల్లప్ప మాత్రమే. ఎందుకంటే- చెన్నారెడ్డి కాలంలో యల్లప్ప తండ్రి చంటెప్ప అతనికి చేదోడువాదోడుగా వుండేవాడు. వాళ్ళ ప్రాపువల్ల చంటెప్పకు ఆ వూళ్ళోనూ, మాలవాడలోనూ మంచి పలుకుబడి వుండేది. చిన్న పిల్లవాడుగా వున్నప్పట్నుండీ సుబ్బారెడ్డికి చంటెప్పంటే భయమూ గౌరవమునూ. యల్లప్పా, సుబ్బారెడ్డి ఒకే వయస్కులు గాబట్టి-యల్లప్ప గూడా వాళ్ళింట్లో పెరిగినవాడు గాబట్టి - యల్లప్పకు సుబ్బారెడ్డంటే

చనువే. అందుకే అందర్నీ శాసించే రెడ్డి, శ్రీనివాసుడి విషయంలో యల్లప్పను శాసించలేకపోయాడు. శ్రీనివాసుణ్ణి చదువు నుండి చాలింపించాలని చాలా ప్రయత్నం చేశాడు. ఎన్నిసార్లో యల్లప్పకు తమ పాత సంబంధాన్ని జ్ఞప్తికి తెస్తూ "మా తాతకు మీ నాయన మాదిరిగా-నాకు నీ మాదిరిగా - మన పిల్లవాడికి శ్రీనుగాడు బంటుగా వుంటే ఎంత బాగుంటుందో చూడు" అని చెప్పినపుడంతా అమాయకుడు యల్లప్ప, నేరుగా వెళ్ళి పెళ్ళాంతో కొట్లాడి, శ్రీనివాసుణ్ణి చాలించేవాడు. చాలించి బలవంతాన్నైనా ఆవులకాడికో, గొఱ్ఱెలకాడికో పంపించేవాడు. తర్వాత అయ్యవార్లు వచ్చి యల్లప్ప కేదోవిధంగా నచ్చజెప్పి మళ్ళా బళ్ళో చేర్చేవారు.

సుబ్బారెడ్డి కొడుకు రామిరెడ్డికి పన్నెండేండ్లు. అనసూయకు తొమ్మిదేండ్లు. అమ్మ చాలు గాబట్టి అందంగా వుంటారు. హైస్కూల్లో చేరాలని ప్రైవేటు చదువుకుంటున్నారు.

ఆ ఊళ్ళో వున్న బ్రాహ్మణ కుటుంబాలు రెండే. శాస్త్రిలది కొంత నెమ్మదైన సంసారం. మర్యాద బాగానే వుంది. ఆ ఊరికే గాకుండా చుట్టుపట్ల పల్లెలకు గూడా పురోహితు డతను. అతను పౌరోహిత్యం వల్లనే మంచి ఆస్తి సంపాదించాడు. అదే యితర పురోహితులకూ శాస్త్రిలకూ వున్న తేడా. తనకున్న యీనాం భూమి ఐదెకరాలే కాకుండా, పైగా పది యెకరాల మంచి మాగాణి సంపాదించాడు. ఒక సుమారైన ఆరంజి తోట గూడా వుంది. ఏటేటా మొత్తం నూరు బస్తాల ధాన్య మొస్తుంది. వెయ్యి రూపాయలకు తక్కువ లేకుండా ధనాదాయం వస్తుంది. పెండ్లిండ్లకు, తద్దినాలకు, దివసాలకు, పుణ్యాహవాచనాలకు బియ్యం, పప్పు, దక్షిణ వగైరా దండిగా వచ్చేది. దక్షిణ విషయాలలో దాక్షిణ్యం చూపని పురోహితుడని ప్రఖ్యాతి. అడిగినంత డబ్బు పీడించి

అయినా పుచ్చుకుంటాడు. తనవూరివ్యక్తి పొరుగూరిలో వివాహం జరుపు కుంటున్నాగూడా తానుగూడా అక్కడ ప్రత్యక్షమై ఆ వూరి పురోహితుడితో తన హక్కును గురించి తగువులాడ్తాడు. ఆ పురోహితుడికి మంత్రాలే రావని కేకలేస్తాడు. ఏదైనా సమయం సంధించుకొన్నపుడు పురోహితులంతా ఈ విధంగానే పోట్లాడతారు కాని మన శాస్త్రులు చాలా నీచంగా గూడా ప్రవర్తిస్తాడు. ఈ విషయంలో ఇతనిది పెట్టిన పేరు. కోమట్లెవరన్నా చనిపోతే శాస్త్రులకు బలే హుషార్. ఎందుకంటే, ఒక్కొక్క చావుకు కనీసం నూరురూపాయలైనా గిట్టుకుంటుంది. పైగా ఒక ఆవుదూడగూడా లభిస్తుంది. ఇపుడు శాస్త్రుల యింట్లోవుండే ఆవులన్నీ కోమట్లపుణ్యమే. ఇటువంటిధనం యితరులకు అంతగా అచ్చిరాదు గాని శాస్త్రులకు అచ్చిరావడమేకాకుండా సంసారం పెరిగిపోతూవుంది. రాబడి యెక్కువయ్యే కొద్దీ వ్యయం తక్కువయింది. అందులో అతను బలే పిసినిగొట్టు. నశ్యానికి తప్ప బయటికి ఒక రాగిదమ్మిడీగూడా పోనీడు. అయితే ఇటీవల పడుచు పెండ్లాం విషయంలోనూ, ఆమె ప్రోత్సాహంవల్ల కొడుకు విషయంలోనూ కొంచెం ధారాళంగా వుంటున్నాడు. మంచి మంచి గుడ్డలూ, నగలూ కొంటున్నాడు.

శాస్త్రులు సన్నగా బక్కచిక్కివుంటాడు. శరీరం చామనచాయ రంగుతో వుంటుంది. అరవై అయిదేండ్లు పైబడ్డది వయస్సు. సాధారణంగా కర్రసాయంతో నడుస్తూ వుంటాడు. తల కొంచెం వొణుకుతూ వుంటుంది. పండ్లు బొత్తిగా లేవు. దవడలు నొక్కుకుపోయి వుంటాయి. కండ్లుగూడా చాలా లోతులో వుంటాయి. గోగునారపోచలు ముచ్చెన గుంతలో అతికించినారా అన్నట్టుంటుంది చిన్న పిలక. కొలింతిత్తి మడతల్లాగావున్న నొసటిపై ధారాళంగా విభూతిధారణ చేసివుంటా డెప్పుడూ. తాళ్ళతో కట్టిన ముక్కద్దాలు ముక్కుదూలంపై వ్రేళ్లాడుతూ వుంటాయి. కొద్దిగా నోరు తెరచి క్రింది పెదవిని వెనక్కి లాగి అద్దాల అధోభాగం గుండా చూస్తూవుంటే కొత్తగా చూచేవాళ్ళకు అపుకున్నా నవ్వాగదు.

ప్రొద్దున్నే స్నానం చేస్తాడు. అంతవయసులో గూడా పాలుమాల కుండా కాలువకెళ్ళి చన్నీటి స్నానమే చేస్తాడు. సంధ్యావందనం మాత్రం తప్పక ఆచరిస్తాడు. పొడిగుడ్డలు కట్టుకొని విభూతి ధారణచేసి అద్దాలు పెట్టుకొని మొగసాల్లో ఎత్తుగద్దెమైన చాపేసి కుర్చుంటాడు, జందెం సవరించుకుంటూ. అనుష్ఠానవేదమైన పంచాంగం ముందు వుంటుంది. కొద్దోగొప్పో కలిగిన రైతులు అవతలి ప్రక్కన ఎత్తు అరుగుపై కూర్చుం టారు. ఆ తాహతులేని బీదరైతులు అరుగును ఆనుకొని నిలబడ్తారు.

"సామీ! యీరోజు యేంవారం? పంచాంగంలో వానెట్లా వుంది? ముహూర్తాలు యేయేనెలల్లో వున్నాయి? మా పిల్ల అత్తవారూరికి పోవాల, యేదినం బాగుంటుంది? కాస్త చూడండి" అని అడుగుతూవుంటే-

"ఆఁ! ఏమోయ్ శేషయ్యా! మొన్న రాగులు కొట్టి యింట్లో పోసు కుంటివే- నాకు తెచ్చియిచ్చావా? ఏరా పుల్లారెడ్డీ! పాతబాకీ విషయం యేం చేస్తివి? ఏరా మల్లప్పా! మొన్నటి దక్షిణ యింకా యివ్వలేదు" అని యీవిధంగా అధికారయుతంగా, దర్జాగా వూగుతూ మాట్లాడేవాడు. ఎప్పుడూ ఏదో ఒకటి, ఎవర్తోనో మాట్లాడందే అతనికి తోచదు.

అంతా రెండేండ్లయింది మళ్ళా పెండ్లయి. కొంత డబ్బు ధార పోసి మాణిక్యంలాంటి ఒక పిల్లను కట్టుకున్నాడు. ఆమె పేరు కామాక్షి. తొలి భార్య సంతానం ఒక కొడుకున్నాడు. పేరు నాగలింగం. పద కొండేండ్లుంటాయ్. రెడ్డి పిల్లలతో కలిసి ప్రైవేటు చదువుకుంటున్నాడు.

ఎదుటిల్లే కరణంగారిది. పేరు మల్లంభొట్లు. ఆ జిల్లాలో వైదీకి కరణం యితడొకడే. ఇతర కరణాల మాదిరిగా తప్పులు, దౌర్జన్యాలు, అన్యాయాలు చేస్తాడుగాని, తప్పించుకొనే నేర్పు తెలియక, అపుడపుడూ దేహపూజలుగూడా పొందుతూ వుంటాడు. మాటలుకూడా కొంత పెడస రంగా వుంటాయి. యుక్తిరహితంగా వుంటాయి. కచ్చితంగా వుంటాయి. అతను, యెక్కడో మూడవ ఫారం చదువుకున్నాడు. చదువుతో

పోరాడి, పోరాడి, కడపటికి కిట్టక చాలించుకున్నాడు. చదువుకుంటూం డిన కాలంలో అంత యిదిగా పాటించకపోయినా యింటికొచ్చిన తర్వాత పదిలో పదకొండయ్యాడు. తన కులానికుండే మర్యాదస్థానం నిలపా లనుకున్నాడు. అందులో కరణీకం పుచ్చుకోడంవల్ల గౌరవం సంపాదిం చాలనీ, అందర్నీ అదుపాజ్ఞల్లో వుంచుకోవాలనీ, ఇంకా యేవేవో ఆయన ఊహలు! ఆయనకు ముప్పైయేండ్లుంటాయి. పెండ్లయి పన్నెండేండ్ల యింది. ఒక కూతురు, ఒక కొడుకు వున్నారు. కూతురు శ్రీలక్ష్మి ఆనసూయ తరగతి చదువుతూ వుంది. పిల్లవాని కయిదేండ్లు. అక్షరభ్యా సమై ఆరునెల్లయింది.

ఊరి నానుకుని మూడు ఫర్లాంగుల దూరంలో మాలవాడ వుంది. మాలవాడ ప్రక్కన్నే కాలవగూడా వుంది. అది కోట ప్రక్కగా పారి, కోట చెరువులో పడుతుంది. మాలవాడవున్న ప్రదేశం కాస్త ఎత్తైనదే. కాని అంత ఆరోగ్యంగా వుండదు. మాలవాడలో వీధులంతా అసహ్యంగా ఉంటాయి. ఆవుదూడలు, బఱ్ఱెదూడలు వచ్చి చెత్తలోని గడ్డిపోగులు తింటూ వుంటాయి. చిన్నపిల్లలు వీథులలోనే మలవిసర్జనం చేస్తారు. కోళ్ళు దాన్ని వీధిలో కంతా చిమ్ముతూ వుంటాయి. వారానికొకసారయినా చనిపోయిన పశువును కోస్తారు. ఎముకలంతా ఎక్కడంటే అక్కడ పడి వుంటాయి. కుక్కలు పటపటా యెముకలు కొరుకుతూ, కాట్లాడుతూ, కోళ్ళను, ఆవుదూడల్నూ తరుముతూ వుంటాయి. మురుగుడు గుంతలలో పొర్లాడి మదించి తిరుగుతూ వుంటాయి పందులు. కుక్కలతో చెర్లాట మాడుతూ వుంటాయి పందిపిల్లలు. దిగంబర దేహాలతో, ప్రకృతి మానవుల్లాగా, ఆ పందులతో కుక్కలతో ఆడుకుంటూ, వాటిపై రాళ్ళు విసుర్తూ ఉంటారు పిల్లలంతా. ఇంతగా వర్ణించడంకంటే, అక్కడ దరిద్ర దేవత నానా వేషాల్తో తాండవ నృత్యం చేస్తూ వుంటుందంటే చాలు.

అందరూ దరిద్రులు. కూలీలు. ఎప్పుడూ పొలాల్లోనే వుంటారు. ప్రొద్దస్తమానం కష్టం చేసినా సంపాదించాంలే అనే తృప్తి వుండదు. కోడికూతతో లేచి పొలాలకు వెళ్ళి గుడ్లగూబల కూతలతో యిల్లు చేరు కుంటారు. ఎముకా యెముకా విరగ్గొట్టుకొని, ఉసురోమని యింటికొచ్చే వ్వటికి బావురుమని యేడుస్తూంటారు పిల్లలు. చంటిబిడ్డలకు పాలివ్వడం, అన్నం చేసుకోడం, అన్నీ అయ్యేటప్పటికి సగం రాత్రవుతుంది. మళ్ళా కోడి కూత వేసేదే తడవు, లేచిపోతూ వుండడమే. ఇక ఇంటిని శుభ్రం చేసుకోడానికీ, వీధుల్ని నీటుగా పెట్టుకోడానికీ వాళ్ళకు తీరికెక్కడిది? శరీరమంతా హూనంచేసుకొన్న వాళ్ళు శుచిభోజనాలు, శుభ్రవాతావరణాలు కావాలని కూచుంటారా? నిరక్షర కుక్షులకు ఆరోగ్య సూత్రాలూ, శాస్త్ర పద్ధతులూ మనసుకు పడతాయా?

వీళ్ళకు పుట్టుకతోనే వస్తుంది బానిస బ్రతుకు. ప్రతి మాలవాడు గూడ ఒక కామందు క్రింద సేద్యానికుండవలసిందే. అతనికి పుట్టిన బిడ్డలందర్నీ సేద్యపు పనులలో నిపుణులను చేస్తాడు. ఈడు వచ్చిన కొడుకుల్ని వేరే రైతుల యిండ్లలో సేద్యానికి నిలుపుతాడు. సేద్యంచేసే యీడు రాకపోతే, గొర్రెలకాడికో, పశువులకాడికో నిలుపుతాడు. అట్ల యినా దండిగా వస్తుందా అంటే అదీ లేదు. ఎంతజేసినా, యెన్నిరోజులు చేసినా కడుపూ నిండదు, కాలూ నిండదు. ఎప్పుడూ అరగడుపు కూడే. అర్ధశరీరానికి గుడ్డే. అమాయకులు! ఈ కూలీ సేద్యపు పనులు భగ వంతుడే వారికి ప్రసాదించినట్టుగా, అందుకే వారాకులంలో పుట్టినట్లుగా, ఆ వృత్తి తమ విధిగా భావిస్తారు. పుట్టింది మొదలు గిట్టేవరకూ బాని సత్వమే. జీవితంలో తామెవరా అని ఆలోచించుకోడానికి గూడా వ్యవధి వుండదు. ఎవరో ఒకరికి దాస్యం చెయ్యాల్సిందే. లేకపోతే స్వతంత్ర జీవనాని కాధారం? మాలవాడికిగూడా భూములా? జ్ఞానార్జనానికి చదువా?

అజ్ఞాన దేవతకు ఉనికిపట్టులు మాల మాదిగ వాడలు. ఒకవేళ యెవరన్నా చదువుకో దలచుకొన్నారో రైతు లూరకుండరు. వాళ్ళు చదువుకుంటే "మరెక్కడ చెప్పినమాట వింటారు?" అని ఏదో ఒక విధంగా, మరొక రూపాయ యెక్కువిస్తామని ఆశ పెట్టో- పాలికి పది సెంట్లు దున్నుకోడాని కిస్తామనో చెప్పి చదువు చాలింపించి సేద్యంలో నిలుపుకుంటారు.

## 3

సుబ్బారెడ్డి యింటినుండి యల్లప్ప యెనిమిది గంటల కిల్లుచేరాడు. బాగా కల్లుతాగి కొంచెం కోపంగా కాస్త పట్టుదలగానే వచ్చాడు. కూలికి వెళ్ళి వొళ్ళంతా హూనమైనట్లు కాగా నరాలొకవైపు పీకుతూ వుండగా అలిసివచ్చిన లక్ష్మి పొయ్యి దగ్గర కూచొని సంకటి చేస్తూ వుంది. శ్రీనివాసుడు పొయ్యివెల్తురున పాఠం చదువుకుంటూ,

"అమ్మా! అందరూ ఆవిధంగా మంచి యిండ్లు కట్టుకొని, బాగా గుడ్డలు వేసుకొని, ప్రతిరోజూ కూడు తింటా వుంటారే-మనం గుడిసెల్లో వుండి, గుడ్డలకూ, సంకటికీ లేక చస్తామే....అదేమమ్మా?" అన్నాడు.

"అవున్నాయనా! మనకెక్కడొస్తాయిరా ఆ సుఖాలు? పగలంతా యెండకు యెండి, చచ్చిసున్నమై మన మాలమాదిగలమంతా పనులు చేసి పండిస్తే వాళ్ళు గాదెలకు పోసుకుని తింటారు. కష్టం మంది, ఫలం

"అయితేమ్మా! మనం మాత్రం సేద్యం చేసుకుంటేయేం? మా నాయన సుబ్బారెడ్డింటిలో సేద్యంచేసేదానికంటే మనకు చెయ్యగూడదూ?"

"మనకు భూములెక్కడివిరా?"

"వాళ్ళకో?"

"వాళ్ళకున్నాయ్."

"మన కెందుకు లేవు?"

"మనకు పట్టా రానివ్వరు."

"ఎందుకు?"

"మాలవాళ్ళకు భూములుంటే కూలికి రారని రైతు లడ్డుపడి భూములు రాకుండా చేస్తారు. రెడ్లూ, కరణాలూ లంచాలు తిని, వాళ్ళకే సాయం చేస్తారు. వాళ్ళవైపే వుండి, మనకొచ్చే భూములు గూడ ఏదో ఒక విధంగా రైతులకే పట్టా వచ్చేటట్లు చేస్తారు."

"అయితే గంగయ్యమామకు ఇదివరకు భూమి వుండిందట గదూ? నిరుడు ఉలవలు పండించుకున్నాడు."

"మొన్ననే రామయ్య ఆ పొలాన్ని కొంత డబ్బు గంగన్న కిచ్చి పట్టా మార్పించుకున్నాడు. గంగన్న యిపుడు వాళ్ళింట్లో సేద్యగాడు."

"మనకు భూములే వుండగూడదని పట్టుదలామ్మా వాళ్ళకి?"

"లేకపోతే వాళ్ళకు కూలీలు దొరకరు."

"అయితే మనమెప్పుడూ కూలిచేసి బ్రతకాల్సిందేనా? .... ఎందుకమ్మా యేడుస్తున్నావ్?"

లక్ష్మి కన్నీళ్ళాపుకోలేకపోయింది. ఎపుడూ కూలిచేసి బతకాల్సిందేనా? అన్నమాట వినేటప్పటికి, ఇన్నాళ్ళుగా చేసిన కష్టం అమాంతంగా అనుభవానికి వచ్చి దుఃఖాన్ని తెప్పించింది. సంకటి కెలికే కర్రను కుడిచేత్తో పట్టుకొని, యెడమచెయ్యి శ్రీనివాసుడి మెడకు చుట్టి లాగి తల ముద్దాడుతూ,

"మనం చచ్చేంతవరకూ రైతులకు కూలి చెయ్యాల్సిందే నాన్నా!" అంది.

"భూములుంటే కూలిబతుకు లేకుండా పోతుందమ్మా! వాళ్ళ మాదిరిగా మనం గూడ మర్యాదగా బతకొచ్చు" అంటూ ఆమె మొగం లోకి చూచాడు. లక్ష్మి కన్నీరు తుడుచుకుంటూ ఏమీ మాట్లాళ్ళేక "నీవు బాగా చదివి కొలువులో చేరినపుడు సంపాదించుకుందాంలే," అని సంకటి కెలకడం మొదలుపెట్టింది. "అమ్మా! నేను బాగా చదువుకుంటానే, మా అయ్యవారు చాలా మంచోడమ్మా! 'నీవు రోజూ బడికి వస్తూ వుండు, మంచి చొక్కాలూ చెడ్డీలు కుట్టిస్తా' నన్నాడు. నన్ను పెద్దబళ్ళో చేరుస్తాడట! కొత్తయ్యవోరుగూడా మాలోళ్ళంటే పడిచస్తాడు. బలే మంచోడు. నన్ను బాగా దగ్గరికి లాక్కొని మాట్లాడ్తాడు" అని అంటూ౦ డగా యల్లప్ప వచ్చాడు. వచ్చీ రావడంతోటే—

"ఒరే, శీనిగా! నువ్వు బడిసాలించైరా" అన్నాడు కఠినంగా. శ్రీనివాసుడు వెర్రిగా తండ్రి మొగంలోకి చూస్తూ, లేచి, "యెందుకు నాయనా?" అన్నాడు.

"యెందుకా? నోరుమూసుకోని కూచో; రేపట్నుంచీ గొర్రెల కాడికి పో!"

"ఉఁహూఁ, నే చదువుకోవాల."

"మహా సదివినావ్‌లేవోయ్ , మాటకుమాట?"

"నే బడికిపోతా" అన్నాడు యల్లప్ప ధోరణి అర్థం చేసుకోకుండా.

"ఆఁ, గాడ్డికొడకా, ధిక్కరించి మాట్లాడ్తావురా?" అని రెండు చెంపలమీదా రెండు దెబ్బలేశాడు. బుసబుస పొంగాయి చెంపలు. ఎఱ్ఱగా వేళ్ళేర్పడ్డాయి ముద్రేసినట్లు. కెలికే సంకటి విడిచిపెట్టి పిల్లవాణ్ణి రెండు చేతుల్లోకి జవురుకొని, చెంప నిమురుతూ,

"ఎందుకంత కోపం? ఎప్పుడూ యింతేనా? ఊరికే బట్టుక్కొడ తావు పిల్లల్ను. మళ్ళా పంపించాడేం సుబ్బారెడ్డి?" అన్నది అనునయ కంఠంతో లక్ష్మి.

"ఆఁ, పంపించినాడు, పోవద్దంటుండా. సదువంట సదువు! మాలో డేందీ, సదువేందీ? మేమంతా సదివినామా? మేం బతకడంలే? ఏనాడూ తినడానికీ, తాగడానికీ తక్కువలేకుండా సంపాయించుకోడంలే? యీన సదివి రాజ్యాలేల్తాడు కామోసు! ఏ పనికైనా అద్దుండాల. బళ్ళోకిపోతే యెడంగా కూసోలేవా? వాళ్ళందర్నీ తాకేదెందుకో?"

"మా అయ్యవోరందర్నీ తాకుతాడు. ఆయనే కూర్చోబెడతాడు వాళ్ళమధ్య. నేనేంజేసేది?" అన్నాడు ఏడుస్తూనే శ్రీను.

"భాగైనాడులే మీ అయ్యోరు! పెద్దోళ్ళు పెట్టిందాని కిరుద్దంగా యేందిది? అయ్యవోరికేం? ఆయన తాకొచ్చు."

"వాళ్ళు తాకితే తప్పులేదురా! మనం తాకితేనే తప్పు. తప్పు పట్టేదీ, దండించేదీ మనల్నే" అంది లక్ష్మి.

"అయ్యంతా మనకెందుకులేయే యిపుడు? వాడు సదువు సాలిం చెయ్యాల్సిందే. మనకెందుకు సదువు? రేపట్నుండీ గొర్రెపిల్లల కాడికి పంపమన్నాడు సుబ్బారెడ్డి."

ఏదో రెండు మంచిమాటలు చెప్పి, భర్తను శాంతపరుద్దామని, శీనును వదిలిపెట్టి దగ్గిరకొచ్చింది లక్ష్మి. గప్పున కల్లుగబ్బు కొట్టింది. ఆ వుండే కొంచెం వెల్తురులో యల్లప్పకండ్లు అగ్నికణాల్లాగా మెరుస్తున్నాయ్. ఇది ప్రథమంగాదు. యీవిధంగా యెన్నోసార్లు తాగివచ్చేవాడు యల్లప్ప. చాలాసార్లు శాంతపు మాటల్తో చెప్పేది. చెప్పినపుడంతా సరే అనేవాడు. వొట్టుగూడా వేసుకునేవాడు. మళ్ళా మామూలే. అందుకే కుటుంబ పోషణకు లక్ష్మి కూలికి పోవాల్సొచ్చింది. యల్లప్ప యిటీవల నేర్చుకొన్నదిగాదా తాగుడు. చిన్నప్పుడు వాళ్ళ తాతా, వాళ్ళ నాన్నా, అదే పనిగా కల్లంగడికి తీసుకెళ్ళి, బాగా నేర్పారు. పొగాకు కలిపి తాంబూలం

వెయ్యడం, కల్లు, సారాయి మొదలైనవి తాగటం పిల్లప్పుడు పెద్దవాళ్ళ వల్లనే నేర్చుకుంటారు మాలమాదిగలూ ఇతర చిన్న కులాలవాళ్ళు. ఆడవాళ్ళు చేసే కూలి వాళ్ళ వక్కాకుక్కు చాలదు. మగవాళ్ళు చేసేకూలి వాళ్ళ బీడీలకూ త్రాగుడుకూ చాలదు. కాబట్టే ఆ జాతి క్రమేపి బీదస్థితినుండి నీచస్థితికి వస్తూవుండటం! ఆ విధంగా సమీపించిన లక్ష్మి గిరుక్కున తిరిగి యింట్లోకి వెళ్ళింది. యల్లప్ప గూడా తప్పుచేసినవాడు మొగం చూపలేనట్టు బయటికి వెళ్ళాడు.

స్నానానంతరం భోంచేసి తాంబూలం వేసుకుంటున్నాడుయల్లప్ప. లక్ష్మి పొగాకు తెచ్చి అతనిచేతికందిస్తూ, కొంచెం దూరంగా కూర్చొని, ప్రసన్నవదనంతో—

"ఒక మాటడుగుతాగాని కోప్పడకుండా జవాబు చెప్తావుగదూ?" అంది యల్లప్పవైపు అదొకమోస్తరుగా చూస్తూ. కండ్లింకా యెరుపులోనే వున్నాయ్. ఆ యెర్రకండ్లను బాగా తెరిచి చూస్తూ,

"యేందో శెప్పు" అన్నాడు నెమ్మదిగా.

"అయినా-వాళ్ళెవరో చెప్పినారని మనవాణ్ణి చదివించుకోకుండా వుండటమా? వాణ్ణి చదువుకోనీరాదూ? చదివితే మనకే మేలు!"

"అదుగో! మళ్ళీ అమాటే యెత్తావుండావ్!"

"అంతమంది చదువుకుంటా వుంటారు గదా, వాళ్ళతోపాటు మన వాడుగూడా...."

"ఛా! వాళ్ళతో మనకు పోటీ అంటనే! గొప్పోళ్ళకూ మనకూ సాటే? యెవురన్నా యింటే మొకాన వూస్తారు."

"దీంట్లో పోటీ యేముంది? వాళ్ళూ అన్నం తింటారు. మనమూ తింటాము. అది పోటీ అనుకుంటామా? అట్లని తినకుండా వుంటామా? తిండి యెంతో చదువూ అంతే!"

"అబ్బా! నీతో యెప్పుడూ యింతే; నీకు జవాబు శెప్పుకోలేక సచ్చిపోతావుంటాన్నేను. అయినా, వాడు బళ్ళోకి వెళ్ళి అందర్నీ తాకుతా వుంటాడంట! ఆ రెడ్డి, శాస్త్రుర్లు, కరనమూ, అందరూ, పట్టుపట్టేశినారు."

"అసలు మా వూరిబడికి పోయే పిల్లోళ్ళల్లో యిట్టా బేదాలు లేనే లేవు. అందరూ ఒకటిగానే వుంటారు. ఆస లాపట్నంలో మేం గూడా బాగా తిరిగి తాకుతూ వుంటాం. అవంతా యిక్కడే. పోని, యీ సంవత్సరం యేదో వొకవిధంగా యిక్కడ సదివించుకుందాం. వచ్చే యేడు మా యమ్మగారూరికి పంపి అక్కడ సదివించుకో వచ్చు. అన్నయ్య కొడుకులు కూతురూ చదువుతున్నారు. వాళ్ళతోపాటు సదువుకుంటాడు."

"అట్ట యీల్లేదే! ఇంక యీవూళ్ళో యీడు సదివేదానికి యీల్లేదని సుబ్బారెడ్డి కచ్చితంగా శెప్పినాడు. వాడు బడన్నా మానుకోవాలంట. లేకపోతే నేను వాళ్ళింట్లోనుండి సాలించుకోనన్నా సాలించుకోవాలంట. పని మానుకుంటే మనకు జరగటం?"

"బాగానే జరుగుతుంది. యిపుడు మాత్రం నీవు యింటికి ...." తర్వాత పూర్తిచెయ్యలేకపోయింది లక్ష్మి.

"నే నింటికేమీ తేవడంలేదు-నిజమే. అయినా సుబ్బారెడ్డింటికీ మనకూవుండే సంబంధం - ఆ వోదా-అయ్ సాలవంట్నే? అయినా మన కెందుకే రయితుల్తో పోరు వాళ్ళంతా యెదురుతిరిగి, మీవోడు బళ్ళోకే రాగూడదని అంటావుంటే మనం ఇరుద్ధంగా శెయ్యటం యేంబాగుంటాది? శెప్పు. వాళ్ళ ఆదరువుతో బతికేవాళ్ళం!"

ఈ మాటలు వినేటప్పటికి లక్ష్మికిగూడా మనసులో ఒకవిధంగా అయింది. భర్త మొగంలోకి చూచింది. ఒకవిధంగా ఫీలవుతున్నట్టుగా గ్రహించింది. అతని అమాయకత్వానికీ, తృప్తికి జాలి వేసింది. వెంటనే,

"పోనీ - యీ సంవత్సరమే వాణ్ణి, అంటే రేపే, మా యమ్మగారూరికి పంపిస్తే?"

"అబ్బో ఆ పని జేశేవ్! యింకేమీ సాగదు. వాడు సుబ్బారెడ్డింట్లో సేద్యానికుండాల్సిందే రేపట్నుంచీ."

"మనం ప్రతిదానికీ యింతగా అదిరిపోయి చావబట్టే వాళ్ళు మన పైన స్వారి చెయ్యటం! పిల్లవాణ్ణి చదివించుకోడంలోగూడా యిదేందబ్బా? వాళ్ళనేమన్నా కర్చుపెట్టి చదివించమన్నామా?"

"ఆఁ, యేమంటావే ? మొదట్నుంచంతా మా తాతల్నూ, తండ్రుల్నూ, మమ్మల్నూ సాకిందంతా యెవరనుకున్నావే? మొద ట్నుంచీ సాకింది వోళ్ళుగదూ! యిపుడు మన మాలోళ్ళంతా బతికేది ఆ రయితులవల్ల గాదూ! మంచి రోజుల్లోనూ, శడ్డ రోజుల్లోనూ, కూలికి పిలిచి, యేదో పనులు సూపించి, బతికించేది ఆళ్ళుగాదంటే?....ఆళ్ళ మాటకు యెదురు తిరిగితే, తిన్నింటి వాసాలెంచినట్టుంటాది. శిన్నప్ప ట్నుంచీ కూడూ, గుడ్డా యిచ్చి సాకింది వోళ్ళూ-పెండ్లి శేశింది వోళ్ళూ- అంతా శేశింది సుబ్బారెడ్డి గదంటనే? ఆయన మాట యినకుండావుంటే బాగుంటాదా?''

లక్ష్మి యేమీ మాట్లాళ్ళేకపోయింది. ఇంత బానిసత్వం అనుభ విస్తూ, అంత విశ్వాసపు మాటలు మాట్లాడే యల్లప్పపై కొంచెం సాను భూతి చూపింది గాని, ఏమీ అనలేక పోయింది. వాళ్ళ అక్కరకొద్దీ బాగా పనులు చేయించుకొని, ముష్టి వేస్తూవున్న వాళ్ళ మాదిరిగా యిచ్చే కూలీగింజలు వాళ్ళ దాక్షిణ్యంతో మనకు లభిస్తున్నాయని సంతోషిస్తూ కృతజ్ఞత చూపిస్తున్న అమాయకుడి పలుకులకు ప్రత్యుత్తరమేమీ స్ఫురించలేదు. స్ఫురించినా ఇక మాట్లాడ్డానికి బాగా లేదనుకొంది. అయితే ఒక్కటి మాత్రం అంది: "ఇంత అమాయికంగా బతుకుతూ, అల్పసంతోషులుగా వుండబట్టే యీ కూలీ జనం కూటికి లేక కుళ్ళి చావడం - మర్యాదలేని మానహీనులుగా బతకడం" అని.

లక్ష్మీది అక్కడికి యిరవై మైళ్ళ దూరంలో వున్న రాజంపేట. అది మంచి టౌను. దాని ప్రక్కనే మాలవాళ్ళకు ప్రత్యేకంగా ఊరుంది. ఆ ఊళ్ళోవాళ్ళు టౌనుకెళ్ళి, పనీ పాటా చేసుకొని బ్రతుకుతూ ఉంటారు. పల్లెల్లోమాదిరి వాళ్ళనంత నీచంగా చూడరు. అంటరానితనాన్ని అంతగా పాటించరు. అటువంటి వాతావరణంలో పెరిగింది లక్ష్మి. భేద భావాలామెలో లేవనవచ్చు మొదట. యల్లప్పను పెండ్లాడి పల్లెకొచ్చింది మొదలు ఆమెలో సమత్వభావాలు నశించాయ్. కొత్తకొత్తలో, అందరు మాలవాళ్ళ మాదిరిగా రైతుల్నిజూస్తే, అనవసరంగా, అదిరిపోయి, 'సామీ, సామీ' అంటూ, ఒదిగొదిగీ తిరిగేదికాదు. అందుకామెను రైతులు పొగరుబోతనుకుంటూ వచ్చారు. తోడిమాలలు గూడా అంతే అనుకొనేవారు.

ఆమె సంసారాని కొచ్చినప్పటినుండీ రామయ్య కామెపైన కన్నే. అతను సుమారుపాటి రైతు. కొద్దిగా పలుకుబడి వుండేవాడే. వయసు ముప్పైపైన ఉంటాయి. చాలా పోకిరీరకం. పెద్ద వ్యభిచారి. అతని చేతికింద గంగయ్య, గుండయ్య అనే ఇద్దరు పేరుమోసిన రౌడీలుగూడా వున్నారు. తన ధన సాయంచేతా, రౌడీల సాయంచేతా, సాధారణంగా నాజూగ్గా కంటబడ్డ యువతుల్ని - ఊళ్ళో గాకుండా, మాలవాడలో గూడా - పొందడానికి ప్రయత్నించేవాడు. చాలవరకూ కృతకృత్యుడౌతూ వచ్చాడు.

లక్ష్మి కొంతవరకూ అందగత్తే. మనిషి కాస్త చలాకీగానే వుంటుంది. మొదట మొదట బాగా జడవేసి తిరిగేది. అందుకామెను చూచి చాలామందికి నోట నీళ్ళూరేవి. రామయ్య కామెను పొందాలని పెద్ద కోరిక పుట్టుకొచ్చింది. ఆమె యెపుడూ ఒంటరిగా యితనికి చిక్కలేదు. ఆమె లభించకుండా పోయేకొద్దీ అతనికామెను పొందాలనే ఆశ యెక్కువైంది. లక్ష్మి మొదట కూలికి పోయేదిగాదు. ఇటీవల పిల్లలు

కలిగారు కాబట్టి, మగని సంపాదన అతనికే చాలదు గాబట్టీ, ఓర్పు దేవతైన లక్ష్మి కుటుంబ పోషణ కోసం కూలికి పోవాల్సొచ్చింది. ఒకనాడు యల్లప్ప, లక్ష్మి యేదో మాట్లాడుకుంటున్నారు. అప్పటికి ప్రొద్దుపోడుస్తూ వుంది. రామయ్య ఆదరా బాదరా వచ్చి, "ఏమే, లక్ష్మి! ఈరోజు మడినాటుకు వస్తావంట్నే?" అన్నాడు శ్రద్ధగా ఆమె మొగంలోకి చూస్తూ. ఇదివర కపుడపుడూ, అక్కడక్కడా లభిస్తూ వుండిన చిరునవ్వులు, క్రీగంటి చూపులు ప్రతిఫలిస్తా యనుకొన్నాడు రామయ్య. దానికి విరుద్ధంగా, లక్ష్మిముఖం కోపంతో కమిలిపోయింది. కొంచెం చీదరగా, ముఖం చిట్లించుకుంటూ,

"ఏమయ్యా! అట్లా మాట్లాడ్తావ్? ఏమే గీమే అంటా వెందుకూ? నీ పెండ్లాన్నా? నీ వుంపుడుకత్తెనా? మర్యాద లేదూ?" అనేటప్పటికి యల్లప్ప నోరుమూశాడు "ఊరుకోయే" అంటూ. అంతలో రామయ్య,

"యేమే! శానా దర్జాగా, సున్నితంగా, రాగాలుదీసి మాట్లాడు తున్నావ్? ఇంకేమనమంటావే బోడిముండా? యిది మీయమ్మగారూరను కొన్నావా? కోట! కొంచెం చూచి మాట్లాడు. యెవరనుకున్నావ్? రైతను కున్నావా? లేకపోతే మాలమాదిగనుకున్నావా? నెత్తికొచ్చినట్లున్నాయే కండ్లు - చూస్తాం!" అంటూ వెళ్ళాడు అంగలు వేసుకుంటూ.

లక్ష్మికి ఇంకా అవమానం తెప్పించాయి అతని మాటలు, చదికిలబడి మొగం చేతులతో కప్పుకొని యేడుస్తూంది చవికలో. ఆమె నావిధంగా ఇదివరకు తన ఊళ్ళోగానీ, యింతవఱకూ యీ ఊళ్ళో గానీ, యెవరూ సంబోధించి యెరగరు. అసలు భర్త సమక్షంలో భర్త గూడా పిలవనంత హక్కుతో పిలుస్తూవుంటే స్వతంత్ర హృదయం తిరగబడింది. అంత నీచంగా ఆ గర్వి పిలిచేటప్పటికి వళ్ళు మండింది.

రామయ్య వెళ్ళిపోగానే "యేమే! మీ వూళ్ళో చదువుకున్నానని శెప్తివే, యిదేనా సదివిందానికి తెలివి? రైతుల్ను పట్టుకొని యంత మాటంటే అంతమాటంటావా? ఛా ఛా! యిందుకే మాలోళ్ళు సదవగూడ దని మన బామ్మోళ్ళు కట్టు కట్టేశింది. లేకుంటే వూరికేనా?" అన్నాడు యల్లప్ప అంతా యెరిగినవాడులాగా.

"ఏఁ, కట్టుకున్న మొగుడు యెదురుగా వుండగానే మొగుడుకంటే ధీమాగా ఏయ్, గీయ్ అంటే—వాళ్ళ ఆడవాళ్ళను గూడా అట్లా అంటే...." అనేటప్పటికి నోరు గట్టిగా మూసి, "చాల్లే! యింక నోరు మూసుకో, అందరూ యింటావుండారు" అన్నాడు యల్లప్ప. అంతకు ముందే ఆ వ్యవహారాన్ని చూడ్డానికి మూగిన పిల్లలూ, పెద్దలూ ఆమె మాటలు విని చాలా ఆశ్చర్యపడ్డారు. అన్యాయంగా భావించారు. అందరూ దవళ్ళు నొక్కుకుంటూ "ఇదేందమ్మా! మనకూ రైతులకూ సాటా? అబ్బో!" అంటూ వెళ్ళిపోయారు.

ఇంతలో గంగన్న వచ్చాడు లోపలికి. జరిగిందంతా విన్నాడు. రైతుల దౌర్జన్యం అతని కంతగా నచ్చదుగాని, తిరుగుబాటు మాత్రం కూడదంటాడు. అంటే అహింసా సిద్ధాంతం అని గాదు, బలం లేదని. లక్ష్మి భావాలూ, ధోరణీ అతనికి బాగా నచ్చినాయ్. ఆమె యెడ అతనికి గౌరవభావమూ, వాత్సల్యమూనూ. అతన్ని 'అన్నా' అని బాగా గౌర విస్తుంది. టౌనుల్లో విషయాలూ, మాలల అధోగతి, సవర్ణుల దౌర్జన్య మూఢ ప్రవర్తనలు గురించి తీరిక వున్నపుడు మాట్లాడుతూ వుంటారు. కాస్త తిరిగి, ఆ ఊరూ యీ ఊరూ చూచినవాడవటంవల్ల లక్ష్మి ధోరణి కాస్త అతనికి అర్థమయింది. ప్రస్తుతం జరిగిందానికి లక్ష్మిపై సానుభూతి కలిగిందిగాని, ఆ కాస్త గూడా తొందరపాటే అనుకున్నాడు. లోపలి కొచ్చి,

"యేందమ్మా యిదంతా?" అన్నాడు.

"నీకు తెలీందేముందన్నా?" అంటూ సజలనేత్రాలతో చూచింది అతనివైపు.

"నిజమేతల్లీ! మనం యేంజాస్తాం శెప్పు-ఏమీ శెయ్యలేనప్పుడు వాళ్ళ దవుర్జన్నెం సగించుకోని వూరికే వుండాల్సిందే."

"నిజమే, తరతరాలుగా యిట్లానే సాగింది. ఇంకా యెన్నితరాలు సాగుతాయో!"

"అయితే శేశేదేముండాదే, దరిద్రులము - వాళ్ళకింద బతికే వాళ్ళమూ!" అన్నాడు యల్లప్ప విసుగ్గా. "నిజమే! నేను వూళ్ళో నుంచి వస్తావుంటే దోవలో రామయ్య యెదురుపడ్డాడు. కోపంగా రుసరుసలాడ్తూ పోతావుండాడు. పక్క మనిషితో 'దీని కొవ్వు కరిగించాల్సిందే-ముందూ యెల్లుగాణ్ణి రెడ్డి యింట్లో లేకుండా చెయ్యాల. తర్వాత వూళ్ళో యెవరుగూడా వాళ్ళను కూలికి పిలవకుండా చెయ్యాల. అపుడుగాని దిగదు కైపు' అని అంటూ పోతావుండాడు. 'ఏందా?' అని ఆలోశిస్తా యీడికొచ్చేటప్పటికి కతంతా అర్థమైంది" అంటూ వెలవెల పోయే యల్లప్ప మొగంచూస్తూ,

"యిట్టా వుండాయమ్మా పరిత్తితులు; అంతా వాళ్ళ శాతల్లో వుండాది. యేమన్నా శెయ్యగలరు. యింతకూ ఆ పాపిష్టి మనిషి యెంత శాస్తాడో!" అన్నాడు. "యింకేముండాదిలేరా గంగా! కొంపకు నిశ్చొచ్చి నాయ్! ఇదంతా కర్మ!" అంటూ నెత్తికొట్టుకొని, పైగుడ్డ చంకలో యిరికించుకొని, మూలవున్న కర్రను తీసికొని బయటి కెళ్ళాడు యల్లప్ప.

లక్ష్మి ఆలోచిస్తూ అక్కడే కూచుంది. శ్రీనూ, సుజాత ఎదురుగ్గా కూర్చున్నారు. సుజాత చిన్నపిల్ల. ఆమె మెడ కౌగలించుకొని

మొగంలోకి చూస్తూ కన్నీళ్ళు తుడుస్తూవుంది. ఆ పరిస్థితులు, ఆ విష యాలూ, అంతగా అర్థం కాలేదు పిల్లలకు. లక్ష్మిమాత్రం ఆలోచిస్తూ కూర్చుంది. శీను కాసేపుండి బడికి వెళ్ళాడు. సుజాత కాస్త చద్ది తిని నిద్రపోయింది. అప్పటికీ కూర్చున్న స్థలం నుండి లేవలేదు లక్ష్మి.

యల్లప్ప అమాయకత్వం - మౌఢ్యం - స్వామిభక్తి - భయమూ- రైతుల మూర్ఖం - దౌర్జన్యం అన్నీ ఆలోచిస్తూ వుంది. ఈ వ్యవహారం యేమవుతుందో - సాయంకాలం యల్లప్ప యే ధోరణిలో వస్తాడో అని లోలోపల కొద్దిగా భయపడసాగింది. ఎంతాలోచించినా తన తప్పు మాత్రం ఏమీలేదని తేలిపోతున్నదేగాని ఖిన్నంగా ఏమీ తేలడం లేదు. మధ్యాహ్నమయేటప్పటికి గంగన్న పెండ్లాం సుబ్బువచ్చి "లెయ్ వొదినా, అన్నందిను" అంది. ఇంతలో యింకొకామె వచ్చి "జరిగిందేదో జరిగింది లేమ్మా, కొంచెం అన్నంతిను. వూరికే ఆలోశిస్తే మాత్రం యేమున్నది?" అన్నది.

ఈ సానుభూతి వాక్యాలు వినడం లక్ష్మికిది ప్రథమం ఈ మాల వాడలో. దానికి కారణం లక్ష్మి వాలకమే.

లక్ష్మి తల్లిగారివూళ్ళో నాలుగో తరగతివరకూ చదువుకొంది. మంచి గుడ్డలు కట్టడం, మంచి భాష మాట్లాడ్డం అలవాటు. ఆమె వేషం, భాషా మాలవాళ్ళకు కాస్త విరుద్ధంగా, విచిత్రంగా కనిపించేవి. రైతులకు వెగటుగా, హేళనగా వుండేవి.

పుట్టింట యిక్కడవున్న పుల్ల అట్టాయెత్తి యెరగదు లక్ష్మి. ఏదో చదువుకుంటూ వుండేది. ఆమెకు నలుగురన్నగార్లు. నలుగురి వెనుక ఒకే ఆడపిల్లగాబట్టి ముద్దుగా పెంచేవారు తల్లిదండ్రులు. అన్నలకామంటే బలే ప్రేమ. ఆయింట్లో ఆమెకేమీ లోటు రానిచ్చేవారుగారు. కొంతవరకూ చదువుకుందిగాబట్టి మంచి గుణా లేర్పడినాయ్. ఓర్పు, మంచి నడవడి

అలవాటు చేసుకున్నది. సాధారణంగా పల్లెలోగూడా, నవ నాగరకతా వ్యామోహంవల్ల స్నోలకనీ, పౌడర్లకనీ, సబ్బులకనీ డబ్బు సంపాదించేందుకు, తలిదండ్రుల కంటబడకుండా, భర్తలకు తెలీకుండా, అన్నదమ్ముల చెవుల బడకుండా, ఆ వయసులో వుండే అజ్ఞానులైన కొందరు బీద యువతులు కొంత అవినీతికి పాల్పడతారు. ఇది ఒక కులంలోనేగాదు, అన్ని కులాల్లోనూ జరిగేదే. లక్ష్మి అవన్నీ చూస్తూ వచ్చిందేగాని, అనుసరించలేకపోయింది. అట్టి వాళ్ళను అసహ్యించుకొనేది. కొంతమంది యువకులు ప్రయత్నించ పోలేదు. ఈమె లొంగలేదు. ఇటువంటి కులం తక్కువ వాళ్ళను చూస్తే పైవారికి లేశమాత్రం గూడా జంకూ గొంకూ వుండదీ విషయంలో. ఎందుకంటే, పైవారి సాంగత్యం అదృష్టదాయిని అనో విధిలేక, తప్పించుకోలేకనో చాలమంది వారి చేతులలో పడతారుగాబట్టి. పట్టణాలలోని అవినీతి కంటికి అంతగా కనిపించదు, పల్లెలలో బాగా కనిపిస్తుంది; ఎక్కువగా ప్రబలిపోతున్నదిగూడా. మాల, మాదిగవాడల్లో యింకా జాస్తి; లక్ష్మి కోటకు వచ్చిన కొత్తలో కొంతమంది మాల యువకులు కొంచెం హుషారుగా చెనికారు. కాని, ఆమె తెలివిగా, నేర్పుగా, అల్లరి లేకుండా వారికి బుద్ధిచెప్పి తప్పించుకొంది. అందుచేత అక్కడామెకు కొంచెం పగగూడా మొదట వుండిందంటే సత్యదూరంకాదు.

ఆవిధంగా ప్రతిజ్ఞాపూర్వకంగా బయలుదేరిన రామయ్య నేరుగా బడిదగ్గరికొచ్చాడు. అప్పుడే స్నానం ముగించి రెండవ అయ్యవారు నారాయణతో మాట్లాడుతున్నాడు కేశవరావు తల దువ్వుకుంటూ. సటుక్కున లోపల ప్రవేశించి ఉగిత్తలగా,

"అయ్యా!" అన్నాడు రామయ్య. అతని వాలకం, ఆ కంగారు చూచి నిశ్చేష్టులై కూర్చొన్నారయ్యవార్లు. గాఢంగా నిశ్వసిస్తూ దృఢ

స్వరంతో "చూశారా, ఎంతపనయిందో?" అన్నాడు రామయ్య. "ఏం జరిగింది రామయ్యా? ముందూ కూర్చొని మాట్లాడు" అని బెంచీ చూపించాడు కేశవరావు.

"కూర్చోడం లేదయ్యా, రెడ్డి దగ్గరికి పోతావుండా."

"అయితే విషయం ఏమిటో చెప్పు."

"మాలోళ్ళకు సదువు కావాల్నో అని మొత్తుకుంటారే - యిందుకేనా?"

"ఏం-ఏమయింది?"

"ఆ మాలముండకు రెండక్షరాలొచ్చునో, రావో, ఏమంటుందో చూడు" అంటూ జరిగిందంతా చెప్పాడు. అయ్యవార్లిద్దరికీ నవ్వు వచ్చింది. ఒకరిమొగా లొకరు చూచుకొని చిరునవ్వు నవ్వుకొని మళ్ళా దాన్ని ఉపసంహరించుకొని,

"దాంట్లో యేముంది రామయ్యా? ఆమె వొక సాధారణ స్త్రీ. మాదిరే జవాబిచ్చింది. మన స్త్రీలయినా అంతే. ఇందులో తప్పేముంది?"

"మన స్త్రీలూ మాల స్త్రీలూ ఒకటే నంటావా?"

"అంతే. తేడా యేముంది?"

"తేడా లేదా? బాగా చెప్పవయ్యా! యిట్టయితే రైతులిక బతకాల్సిన పనిలేదు. వాళ్ళు కొంతమంది చదువుకున్నా గూడా మేము నాశనం కావల్సిందే. అంతా వొకటే అంటే వాళ్ళు మమ్మల్ను లెక్కపెడ్తారా? మేమిక సేద్యాలు చెయ్యించుకుంటామా?"

''అయితే మీరంటే వాళ్ళు పడాల్సిందే నంటావు?"

"యెచ్చు తక్కువలు లేకపోతే పనులెట్టా సాగుతాయ్, ప్రపంచం యెట్లా నడుస్తుందయ్యా?"

"కూర్చో రామయ్యా, ముందు కూర్చో-చెబుతా" అన్నాడు కేశవ రావు. కేశవరావుకు బాగా తెలుసు వాళ్ళతో యెట్లా మాట్లాడేది. రామయ్య అగ్గి తొక్కుతున్నట్లుగా ఉద్వేగంతో మాట్లాడుతున్నాడు. కాస్త చిరునవ్వుతో కూర్చోమని అడిగాక, వాదన కెంతైనా తగుదు నంటూ బెంచి మీద కూర్చున్నాడు రామయ్య.

కేశవ రావన్నాడు : "ప్రపంచ విషయంపై నీవు శ్రద్ధ వహించడం బాగానే వుంది రామయ్యా! అయితే ప్రపంచం బాగు కోరేవాడివి కాబట్టి ఒకటి గ్రహించు. ఒక మానవుడింకొక మానవుడికి సేవ చేయాలనీ - వాడంటూ వుంటే వీడు పడాలనీ యెక్కడా లేదు. నిన్నెవడన్నా, యేమన్నా అంటే నీ వెట్లా మానసిక బాధ పొందుతావో, అందరూ అంతే అనుకో."

"పోవయ్యా బాగా చెప్పావుగాని! మీకేం, బాగా చెప్తారు. మీకు పర్వాలేదు. వాళ్ళ వల్ల చచ్చేది రైతులే" అన్నాడు కోపంగా, యీసడింపుగా. అయ్యవారికి వాదాన్ని పెంచా లనిపించలేదు. ఇపుడేదో నీతి బోధనలు బోధిస్తే, రామయ్య బుర్ర కెక్కుతాయనే ఉద్దేశ్యమూ లేదు. అందులో ఇక యెక్కువ మాట్లాడితే మర్యాద లేకుండా మాట్లాడతాడేమో అని,

"ఏముందిలే రామయ్యా, కాలం మారే కొద్దీ అన్నీ మార్తూ వుంటాయిలే. ఒకవేళ మాలవాళ్ళు చదువుకుంటే, చదువొచ్చింది గదా అని, రైతుల్ని తిడుతూ కూర్చుంటారా?" అన్నాడు అపుడే వచ్చిన శ్రీను వైపూ, మిగిలిన పిల్లల వైపూ చూచి.

## ౪

కేశవరావు బ్రాహ్మణ యువకుడు. పుట్టింది పూర్వాచార ధురంధరుల యింట్లో. ఆ ఆచారాలన్నీ భయంచేత పాటిస్తూ వుండినప్పటికి

హైస్కూల్లో చేరి, కొన్ని విషయాలు బోధపడినాక, వాటికి తిలోదకా లిచ్చాడు. మొదటి మాలవాళ్ళంటే ఒలే నీచం. యింట్లోవాళ్ళు బోధించే బోధనలు వినీ, వాళ్ళు యితరుల యెడ చూపే ప్రవర్తన చూచీ బ్రాహ్మ లంటే దేవుళ్ళతో సమానులనీ - యితరులంతా వారికంటే తక్కువనీ, నీచమనీ అనుకొనేవాడు. వాళ్ళమ్మ మాలవాళ్ళనూ, మంగలివాళ్ళనూ తాకవద్దని ప్రతి దినమూ నేర్పుతూ వుండేది. యెవరన్నా బ్రాహ్మణే తరుల పిల్లలు వారింటికొస్తే నీచంగా సంబోధిస్తూ, క్రింద కూర్చో మనేది. మనవాడు మాత్రం కాళ్ళాడించుకుంటూ, మంచంపై కూర్చొని ఠీవిగా మాట్లాడేవాడు. ఇతను యితరుల యింటికి పోయినపుడు వాళ్ళు బాగా మంచంపైన కూర్చోమనేవారు. ఇందులో తేడా అప్పటికే బాగా అర్థమయిందతనికి. శూద్రపిల్లల్తో తన కొడుకును "స్వామీ" అని పిలువ మనేది వాళ్ళమ్మ. వాళ్ళుగూడా అట్లాగే పిలిచేవారు. ఇతని కెక్కడాలేని ఆధిక్యత వచ్చేది. శూద్రుల యిండ్లకు పోనేవద్దని చెప్పేది. ఒకవేళ వెళ్ళినా, మంచినీళ్ళు కూడా ముట్టుకోవద్దని చెప్పేది. యివేగాకుండా, యిట్లాంటివెన్నో అంతర్యాలు బోధించేదా తల్లి! తల్లి నేర్పుకొద్దీ బిడ్డలు గదా!

అతను వీధిబళ్ళో చదివేటప్పుడు గూడా ప్రత్యేకంగా కూర్చొనే వాడు. తాను బెంచీమీద కూర్చుంటే- ఇతర కులస్థుల పిల్లలు ఎవరన్నా దానిపైన కూర్చున్నారో - సహించుకొనేవాడుగాడు. తనతో సమానంగా కూర్చుంటారా అనుకొనే రకం. అనుకోడమే గాదు, అనేవాడు గూడా. అతనికి చదువుచెప్పేవాడుగూడా ఛాందస బ్రాహ్మణుడుగాబట్టి,ఆ భేదాలు పాటించేవాడు. ఆ చర్య కేశవరావుకు ఒక చిన్న దైవత్వాన్ని ఆరోపింప చేసేది. మొదటా అయ్యవారు మాలపిల్లల్ని బడికి రానిచ్చేవాడు గాడు. తర్వాత యిన్‌స్పెక్టర్లు చాలా కఠినంగా చెప్పడంవల్లా - పంతులు పని పీకేస్తామని భయపెట్టడంవల్లా-ప్రత్యేకంగా ఒక వసారా వేయించి, దానిలో

ఆ మాలపిల్లవాళ్ళను కూర్చోబెట్టి, ఎపుడో బుద్ధి పుట్టినపుడు, ఆ అమృతపు ధారలొలికే నోటినుండి రెండు చదువు ముక్కలు వారిపై విసిరేవాడు. ఆయన పెద్ద ఛాందసంగా, సంధ్యావందనం చేస్తూ - జపాలు చేస్తూ-మాల వాండ్లను దూరంగా పొమ్మంటూ-స్నానానంతరం గంటసేపు మంత్రాలు చదువుతూ వుంటే - ఇవన్నీ చూచిన కేశవరావు "నే నెప్పుడబ్బా పెద్ద వాణ్ణయి, యిట్లా చేసి, యీ విధమైన గౌరవం సంపాదించేది" అనుకొనే వాడు. ఒకనాడు సమీపంలో ఉన్న గుండాల కోనకు వెళ్ళారందరూ. అక్కడ గుండంలో అయ్యవారు స్నానం చేస్తూవుంటే, గట్టున విప్పేసిన గుడ్డల్ని కనిపెట్టుకు కూర్చున్నాడు కేశవరావు. గుండంలోకి అయ్యవారు దిగి పోతూవుంటే. ఆ అయ్యవారు ప్రాణాపద లేకుండా ఎంత లోతునీళ్ళలో కయినా పోగలడనీ - లోపలికెళ్ళితే, నీళ్ళ అడుగున వున్న దివ్య సౌధంలో బంగారు ఉయ్యాలలో ఊగుతున్న దేవు డాతనితో మాట్లాడ గలడనీ- బ్రాహ్మణుడంటే దేవుడు గూడా మాట్లాడ్తాడనీ - ఇంకా యీ విధంగా ఎన్నెన్నో ఊహిస్తూ కూర్చున్నాడు. అయ్యవారు పొరపాటున ఎదురురొమ్ము లోతు నీళ్ళలోకి జరిగాడు. భయపడి గట్టుకు రాబోయాడు. నీళ్ళు అతనిని వెనక్కిలాగజొచ్చాయి గాని, ముందుకు రానీలేదు.

భయపడుతూ, ఒగరుస్తూ, కండ్లుతేలవేసి 'ఏయ్‌య్' అంటూ వెర్రి అరుపు అరిచాడు; అప్పటికి నోరు దాటుతున్నాయి నీళ్ళు. మునిగిపో బోతున్నాడు. అందరూ చూస్తూనేవున్నారు. కేశవరావు కేకలేసి యేడుస్తు న్నాడు. ఇంతలో యెవరో యిద్దరు దూకి బయటికి లాక్కొచ్చి, "యీత రానివాడివి లోపలికెందుకు పోయావయ్యా?" అన్నారు. కొంతమంది 'అయ్యో' అన్నారు. కొంతమంది నవ్వారు. ఈత రాకపోతేమాత్రం దేవు ళ్ళతో మాట్లాడే శక్తి వున్న బ్రాహ్మణులు నీళ్ళల్లో మునిగిపోతారా? అని అనుమానించి, ఆసలా ప్రభావం వల్లనే ఇవు డాయన బ్రతికి గట్టున పడ్డట్టుగా నిర్ధారించుకున్నాడు కేశవరావు. తర్వాత దేవుడి దగ్గరికి

వెళ్ళారు. బ్రదికిన యెం[డకాయ రూపంతో యీశ్వరుడు కనిపిస్తాడు. ఆ యెం[డకాయను గురించి పెద్ద పెద్ద కతలు చెబుతారు. కొంతమంది నవీన యువకులు దాన్ని గురించి నమ్మరు. పాతవాళ్ళు అదంతా సత్యం, నిత్యం అంటారు. అందరూ అక్కడికి వెళ్ళి 'గోవిందా' అంటే దేవుడు బయటికి వస్తాడు. పుణ్యాత్ములకు మాత్రం కనిపిస్తాడనీ, పాపాత్ములు వెళ్ళినట్టయితే కనబడడనీ ప్రతీతి. కేశవరావు ఆ మూగిన జనంలో దూరి లోపలికివెళ్ళి అయ్యవారి ప్రక్కన నిలబడ్డాడు. ఎన్ని గోవిందలు పెట్టినా యెం[డకాయ బయటికి రాలేదు. కడపటికి, విఫల మనోరధుల వెంట వీళ్ళు బయటపడ్డారు. కొంతదూరం వచ్చింతర్వాత "అయ్యా! మీకు గూడా దర్శనం కాలేదేం?" అన్నాడు. "ఒక్కొక్కసారి దేవుడికి కోపం వస్తుంది" అన్నాడు అయ్యవారు. "అయితే పాపాత్ములకేగదా కనిపించక పోవడం? మనకెందుకు కనిపించలేదు?" అన్నాడు సందేహాలపై మనస్సును కేంద్రీకరించుతూ. "ఈ గుంపులో ఏ వొకరు పాపాత్ములైనా దేవుడికి కోపమే" అని సమర్థించాడయ్యవారు. ఆ సంఘటనలను గురించి కొంత ఆలోచించిన తర్వాత బ్రాహ్మణులకు గూడా ఈ కాలంలో అంత మహత్తు లేదనుకొన్నాడు.

మాలవాళ్ళంటే మనుషులే కాదని అతని అభిప్రాయం. వాళ్ళ గురించి అంత నీచంగా అనుకోవడానికి ఇదివరకు నేర్చుకొన్నవే గాక మరొకటి గూడా వుంది.

ఒకనాడు వాళ్ళయ్యవారు కాలువకు స్నానానికి పోతూవుంటే ధోవతి తీసికొని వెంట వెళ్ళాడు. స్నానాంతరం, అయ్యవారు తడి గుడ్డలు కట్టుకొని, బిందెనిండుకూ నీళ్ళు తీసికొని, ఏదో మంత్రాలు ఉచ్చరిస్తూ వస్తున్నాడు. తీరా యిల్లు సమీపించేటప్పటికి, వాళ్ళూరి మాల వాడు యెదురుగా వచ్చాడు.

"ఛూ! వెధవముండాకొడకా! కండ్లు కనబశ్చేదంట్రా?" అంటూ ఆ నీళ్ళక్కడే కుమ్మరించి, ఆ మంత్రాల నోటితో యింకా కొన్ని తిట్లు తిడుతూ వెనక్కివెళ్ళి మళ్ళా తెచ్చుకున్నాడు. ఈ విధంగానే తర్వాత కొన్నిసార్లు జరిగింది. ఇవన్నీ కలిసి కేశవరావుకు మాలలంటే - చెట్ల కంటే, పుట్లకంటే, రాతికంటే, రప్పకంటే - నీచాతినీచంగా అయి పోయారు.

తర్వాత ఒకయ్యవారి దగ్గర ప్రైవేటుకు చేరాడు కేశవరావు. 'కుల మత సమత్వాల గురించి'అంటూ వుండేవాడతను అపుడపుడూ. మాల వాళ్ళను తాకేవాడు గూడ. బ్రాహ్మణుడు కాదు గాబట్టి అట్లా అంటున్నాడనీ, ఆ విధంగా ఆచరిస్తున్నాడనీ అనునేవాడు కేశవరావు. చిలక మాదిరిగా నేర్చుకున్న కేశవరావు కుల మత భేదాలుండటమే మంచిదనుకొనేవాడు. దానికి కారణం లేకపోలేదు. ఏదైనా పండగా పబ్బం వస్తే శూద్రులూ, మిగిలినవారూ, బియ్యం, పప్పు వగైరా తెచ్చి దూరంగా నిలబడి "స్వామీ, ఇవిగోండి, తీసుకోండి" అని యిస్తారు. పంచాంగం చెప్పిందానికీ, ముహూర్తాలు చెప్పిందానికీ, అటువంటివాటికంతా దక్షిణలు, తాంబూలాలు దొరుకుతాయ్. ఊరివాళ్ళు పాలూ, పెరుగూ, మజ్జిగా, నెయ్యీ మొదలైనవి ఉచితంగానే యిస్తారు. కొత్తగా పైర్లు కోసినపుడు ముందుగా వీరికిస్తారు, ధాన్యం కొంత. ఒకటిగాదు - యింకా యెన్నివిధాలనో సత్కరిస్తారు. ఇవన్నీ భక్తిచేతగాకున్నా సంప్రదాయం క్రింద జరుగుతూన్నాయంటే సమంజసంగా వుంటుంది. ఇదంతా యింట్లో చూసేవాడు కేశవరావు. తాము గొప్పవారయినందున జరిగే సన్మానాలే యివి అనుకొనేవాడు. ఇట్టి అంతరాలు లేకపోతే మనకీవిధంగా జరుగుతుందా అనుకొనేవాడు.

తర్వాత హైస్కూల్లో చేరాడు. చాలా విచిత్రంగానే వుండేది హైస్కూలు జీవితం. అక్కడే అతనిలో గొప్ప మార్పు రావటం. అక్కడే కుల మత సమత్వభావాలతనిలో పొటమరించి పాదుకున్నాయ్. అక్కడే మాలలపై ఉండే అసహ్యభావం ప్రేమగా మారి పెరుగ జొచ్చింది అక్కడే గాంధీ జీవిత విధాన ప్రభావానికి లోబడి ఆ ఆదర్శాల నాచరించా లనే పట్టుదల కలిగి, కార్యదీక్ష హెచ్చజొచ్చింది. తన కాలేజీ జీవితం గూడా బాగా జరిగింది. ఆదర్శాలను కొంతవరకూ ఆచరణలో పెడుతూ వచ్చాడు. అప్పట్లో గృహకల్లోలాలు బయలుదేరాయ్. తన హృదయ స్వాతంత్ర్యానికి అడ్డువచ్చాయి. ఇంట్లోవాళ్ళతో విరోధం సంభవించింది. కాలేజీ మానుకోవాల్సొచ్చింది. హృదయ స్వాతంత్ర్యానికి ప్రాధాన్యం యిచ్చే కేశవరావు స్వతంత్ర్యజీవనంవల్ల బీదగా వుండిగూడా ప్రపంచానికి మేలు చేయవచ్చనే నిర్ధారణకు వచ్చాడు. గాంధీజీ నాయ కత్వంకింద కాంగ్రెస్ ఉద్యమం మహోజ్జ్వలంగా జరుగుతున్న రోజులవి. ఆత్మ స్వాతంత్ర్యంకోసం, దేశ స్వాతంత్ర్యంకోసం వేనకువేలు స్త్రీ పురుషులు లాఠీదెబ్బలు తింటున్న సమయం అది. జైళ్ళకు విరివిగా పోయే తరుణం అది. సంతోషంతో, తృప్తితో, చిరునవ్వు నవ్వుకుంటూ ఉరికంబాన్నెక్కే కాలమది. దేశంలోని ఆబాలగోపాలం ఒక ఉద్రేకంతో, ఒక ఉత్సాహంతో, ఒక ఉత్తేజంతో ముందుకు నడుస్తున్నారు. వినూత్న వికాసం, సౌందర్యశోభ దేశాన్ని క్రమ్మినాయ్. "అందరు మానవు లొకటే, మానవసేవే మాధవసేవ. ఆత్మ స్వాతంత్ర్యమే అమూల్యమైన ఆభరణం" అనే పలుకులు దేశమంతటా వినబడుతున్నాయ్. చైతన్యం కల్గింది కేశవరావులో. ఉద్రేకంతో పొంగిపోయాడు. హృదయ స్వాతం త్ర్యాన్ని ప్రకటిస్తూ యిల్లు విడిచాడు. స్వేచ్ఛగా మానవ సేవ చేయ సంకల్పించి, ముఖ్యంగా హరిజనోద్ధరణకు పాటుపడాలన్న ఉద్దేశంతో,

బయలుదేరాడు. "ముందుగా గ్రామపునరుద్ధరణ జరగాలి. గ్రామ సౌభాగ్యమే దేశ సౌభాగ్యం. గ్రామాల్లో అవిద్యాపరుడుంటే దేశమంతా నష్టపడుతుంది. ప్రతి యువకుడు విద్యానంతరం గ్రామాలకు వెళ్ళి గ్రామ సౌభాగ్యానికి పాటుపడితే, దేశాభ్యుదయానికి పాటుపడినవాడౌతాడు" అని చెప్పిన గాంధీజీ ఆదేశానుసారం పనిచేయ సంకల్పించుకున్నాడు. తన ఉద్యమానికి కోటను కేంద్రంగా పెట్టుకున్నాడు.

అతనికి హరిజన సేవ మొదటిది. రెండవది మన తుచ్ఛమై, కుళ్ళి, చీకి, చివికిపోయిన ప్రస్తుత సవర్ణ హిందూ సంఘాన్ని సంస్కరించడం! హరిజనులకు విద్య నేర్పడం - వారిని సంఘంలో సమస్థానంలో నిల్పడం - కులాంతర వివాహాలు జరపడం - వితంతు వివాహాలు జరపడం - యింకా యిటువంటివి దేశ సౌభాగ్య ప్రదములైనవి అతని ముఖ్యాంశాలు. అతనికి రాజా రాంమోహనరాయ్ - కందుకూరి వీరేశలింగం-వివేకానంద-మహాత్మాగాంధీ మొదలైనవారు ఆదర్శ పురుషులు.

యింత కార్యదీక్షతో యిల్లు వదలి, యూనివర్సిటీ వదలి, యిక్కడికి వచ్చి, యీ కోటలో బడిపంతులుగా చేరాడు గదా - యిక్కడ గూడా తన స్వేచ్ఛాభావాల కడ్డుతగిలే జీవులుద్భవించినయ్. "హరిజన సేవే తన విధి" అని వారికి చదువు బాగా నేర్పి, వారిపై వారాధారపడి జీవించేటట్టు నేర్పితేగాని సమత్వం రాదని, అతను శ్రమపడి, వచ్చిన కొత్త కొత్తలో ఎంతోమంది హరిజన బాలబాలికలను చేర్పిస్తే, శాస్త్రి-రెడ్డి - రామయ్య - కరణం మొదలైనవారు మాలల్ని బెదిరించి, పిల్లల్ని బడికి రానీకుండా కట్టుబాటు చేశారు. కేశవరావునుగూడా ఆ పని చెయ్యగూడదని హెచ్చరించారు. ఇతడు పట్టుదల వదిలే ఘటంగాదు. మళ్ళా మాలవాడ కెళ్ళి, వాళ్ళకేవేవో బోధించి అందర్నీ వచ్చేటట్టు చేసేవాడు. రైతుల పట్టుదలకు మాలమాదిగల మూర్ఖత్వం తోడుకాగా, మళ్ళా హరిజన విద్యార్థుల సంఖ్య తగ్గేది.

హరిజనులయెడ తనకుగల ప్రేమా ఆదరమూ సన్నిహితత్వమూ వల్ల మళ్ళా సంఖ్య యథాస్థితికి వచ్చేది. ఈ విధంగా హరిజన పిల్లలు రావటం చాలించడం, మళ్ళా రావటం జరుగుతూండినప్పటికీ. శ్రీనివాసుడు మాత్రం వస్తూనే వుండేవాడు. కడపటికి ఆ దెబ్బ వాడికేగూడా తగి లింది. పై క్రమం వాడిపట్ల గూడా రుజువయింది. ఎందర్ని వదిలినా శ్రీనును వదలలేకపోయాడు కేశవరావు. యల్లప్పకేదైనా చెప్పి ఒప్పించా లంటే ప్రపంచమంతా ఒకవైపు తిరగాలి. అటువంటి యల్లప్పనుగూడా ఒప్పించి శ్రీనును రప్పించేవాడు బడికి. శ్రీను చాల చురుకైన పిల్లవాడు గాబట్టి - అందమైనవాడు గాబట్టీ తన ఆశయ సిద్ధికి బాగా ఉపకరిస్తా డని - వాణ్ణి ఎట్లయినా బాగా తయారు చెయ్యాలనే ఉద్దేశంతో - ఎంత వరకైనా చదివించాలని దృఢసంకల్పుడైనాడు.

పరిస్థితులవల్ల చదువు మానుకున్నాడేగాని, యం. ఏ. ఫైనల్ పరీక్షకు కట్టుకొని ప్యాసు కావాలని సంకల్పించుకున్నాడు. పుస్తకాలు తెప్పించి చదువుతున్నాడు. అతడు అన్‌ట్రెయిండు అయినందువల్ల జీతం నెలకు 25-00 లు వచ్చేవి. అన్నికర్చులూ 10 రూపాయలతో సరిపెట్టు కొనేవాడు. మిగిలిన డబ్బును పుస్తకాలకూ, దిన, వార పత్రికలకూ, కొంత బీదలకూ, హరిజనులకూ వ్యయించేవాడు. ప్రతి నెలా ఒక అయిదు రూపాయలు మాత్రం ప్రస్తుతం ఎం. ఎ. చదువుతున్న తన సహాధ్యాయినిగా వుండిన అమ్మాయికి పంపుతూ వుండేవాడు. వంట మాత్రం తానే స్వయంగా చేసుకొనేవాడు. శాస్త్రిగానీ, కరణంగానీ ఎపుడన్నా పండగా పబ్బాలలో పిలిపించినా భోజనానికి వెళ్ళేవాడుగాడు. ఎవరైనా యేమైనా యివ్వబోయినా, కడకు తన విద్యార్థులు తెచ్చినా గూడా - కూరగాయలుతప్ప మరేమైనా ఉపాయనాలనుగూడా తీసికొనే వాడుగాడు.

కేశవరావుకు సరైన స్నేహితుడే దొరికాడిప్పుడు. నారాయణ కేశవరావు పాత స్నేహితుడే, అతనికంటే రెండేండ్లు జూనియర్. కేశవరావు అనుయాయుడు. నిర్మలమైన భావాలుగల వ్యక్తి. అందుకే కేశవరావే అతన్ని రమ్మని కోరాడిక్కడికి. కోట పాఠశాలలో విద్యార్థులు సమృద్ధిగా వుండటంవల్ల పంతుళ్ళు ఎక్కువ కావలసివచ్చారు. అయ్యేవార్లు దొరికేరోజులు కావని. కేశవరావు ప్రయత్నంవల్ల ఒకరైనా రావడమైంది. నారాయణ యస్. యస్. యల్. సి. ఫేలయి, హయ్యర్ గ్రేడ్ ట్రెయినింగుకు వెళ్ళాడు. కేశవరావు ట్రెయినింగు చదవలేదు. కాబట్టి, నారాయణే హెడ్‌మాష్టరు కావల్సివచ్చింది. అంత చదువుకున్నా, రెండేండ్లు ఉపాధ్యాయ వృత్తిలో వున్నా, అత దర్హతలేనివాడు ప్రభుత్వ దృష్టిలో. సరే - వాళ్ళిద్దరిలో యెవరైతేయేం? నారాయణే పేరుకు హెడ్ మాష్టరయ్యాడు.

నారాయణ కోటలో దిగిననాడు చంద్రోదయ సమయంలో సముద్రం పొంగునట్లు పొంగిపోయాడు కేశవరావు. ఇక ప్రపంచాన్నే తల్లక్రిందులుగా చెయ్యగలననే విశ్వాసం కలిగిందతని హృదయంలో. నారాయణను గట్టిగా కౌగిలించుకొని "నారాయణా! చదువుకుంటున్న వారంతా నీ మాదిరి ఊహలు కలిగి వుంటే దేశం అయిదు సంవత్సరాలలో అత్యున్నత స్థానాన్నందుకోదూ?" అన్నాడు ఆనందబాష్పాలు కారుస్తూ.

"అది నిజమే కేశవ్! స్కూళ్ళు తగలబడిపోయాయోయ్ వెధవ భావాలతో. వట్టి అనుకరణ-ఆవేశం, అంతే. కార్యశూరత యేమీ లేదు. మరి కాలేజీలలో కొంత బాగా వుండవచ్చు."

"ఛా! ఛా! ఇంకా నీచం. హైస్కూళ్ళలో చదివేవాళ్ళకు అమాయకత్వం విడవదింకా. అందుచేత వాళ్ళ అజ్ఞానాన్ని సహించుకోవచ్చు.

కాలేజీకి వచ్చి గూడా చాలమంది అతి మూఢంగా ప్రవర్తిస్తున్నారంటే దానికి క్షమాపణే లేదు. ఎంతోమంది ఎన్ని కులాలవాళ్ళో చదువుతూ వుంటారు గదా! పైకి అసమత్వాన్ని ప్రకటించరు. లోలోపల అసమత్వ భావాలు అగ్ని గుండాలై ప్రజ్వరిల్లుతూ వుంటాయి. సహనం చాలా మందిలో కనబడదు. నైతిక ప్రవర్తన కనిపించడం కష్టం."

"సరేగాని బ్రామిన్, నాన్‌బ్రామిన్ ఫీలింగ్సు ఎట్లా వుంటాయి?"

"అవి కొంచెం కొంచెమే ప్రబలుతున్నాయి. అసమత్వాన్ని ఇన్ని దినాలుగా ప్రదర్శిస్తూ వచ్చిన బ్రాహ్మణులను, ప్రస్తుత ఏకైక భాషలో జరుగుతున్న విద్యాప్రబోధంవల్ల, సమత్వ మేమిటో తెలుసుకున్న బ్రాహ్మణేతర్లు కొద్దిగా ద్వేషిస్తున్నారు. ద్వేషకారణాన్ని కనిపెట్టి, అట్టి ద్వేషాన్ని అపనయించడానికి అనుగుణంగా ప్రవర్తించకుండా వీరుగూడా ప్రతిగా వారిని ద్వేషిస్తున్నారు. పోను పోనూ అపార్థాలెక్కువై ద్వేషాలు ప్రబలిపోతున్నాయి."

"ఇవి యెట్లా వొచ్చాయో తెలిసిందే గాని ఇంతగా విజృంభించడానికి కారణం?"

"అదీ తేలికే. యేముంది? ఇదివలకంతా చదువుకున్నవాళ్ళు బ్రాహ్మలు ఉద్యోగాలు చేస్తూ వచ్చారు. ఇపుడు ఇతరులు గూడా చదువుకుంటున్నారు. ఉద్యోగాలకే గదా ఈ చదువు? కాబట్టి ఉద్యోగాలు వాళ్ళకూ కావాలి. అప్పుడు పోటీ వస్తున్నది. పోటీలవల్ల విద్వేషాలు పెరిగిపోతున్నాయ్."

"అవునవును, కేవలం చదువుకొన్న, చదువుకుంటూన్న వాళ్ళలోనే యీ భావాలు కనిపిస్తున్నాయ్. పల్లెటూళ్ళలోకి ప్రాకలే దింకా?"

"అక్కడికీ ప్రాకుతూ వుంది. ప్రాకాల్సిందే. అప్పటికిగాని ఎవడూ పుట్టుకతో గొప్పతనాన్ని తెచ్చుకోలేదని తేలిపోదు! ఇదేగాదు,

ఇట్లాంటి అధికార ఆధిక్యాలపై 'ఎందుకు, ఎందుకు' అనే ప్రశ్న బయలుదేరితేనేగాని త్వరగా విషయాలు తేలవు."

"అవునవును, ఫ్రెంచి విప్లవంలో మాదిరిగా."

"రష్యా విప్లవం? అదీ అంతే. ఏదిగూడా నారాయణా, కల కాలం మనదు. అందులో తెచ్చిపెట్టుకొన్న భేదాలు అచిరకాలంలోనే అణగారిపోతాయి. ఏదిగూడా మొదట ఎంత ఉద్ధృతంగా ప్రబలుతుందో అంత అవలీలగా సమసిపోతుంది. మన కులతత్త్వాల సారాంశమూ అంతే."

"అయితే, ఫ్రెంచి విప్లవం, రష్యా విప్లవం వంటి విప్లవాలు రావాలంటావన్న మాట?"

"అటువంటి విప్లవాలు హృదయానికి రావాలి. అవి ఆర్థిక రాజకీయాలలో ప్రతిఫలించగూడదు."

"అంటే?"

"అంటే - ప్రస్తుతం మన మతం అనుసరిస్తున్న పాత పద్ధతులు సమసిపోవాలి - ఆర్థికాంతర్యాలు అణగారిపోవాలి - నైతిక శక్తులు అమాంతంగా అతిశయించాలి- అని హృదయంలో భావాలు ఉద్వేగంతో విహరించవచ్చు. అదే భావ విప్లవం. దీన్ని కార్యరూపంలో పెట్టడంలో జాగ్రత వహించాలి. దొమ్మీగా బయలుదేరి, కుల వ్యత్యాసాలకు కారకులైన బ్రాహ్మలను చెండాడతామనీ - ఆర్థిక వ్యత్యాసాలకు కారణభూతులైన జమీందార్లను హత మారుస్తామనీ - అవినీతిపరుల్ని అమాంతంగా తునుమాడ్తామనీ-ఈవిధంగా చేస్తే, తాత్కాలిక ఫలితాన్ని యీవచ్చేమో కాని, శాశ్వత ఫలితం శూన్యం."

"ఇక ఫలితానికేం? అట్టివాళ్ళే లేకుండా పోయినపుడు వాటికి తావే వుండదుగా?"

"కాదు. దౌర్జన్యంవల్ల యే పనీ శాశ్వతఫలదాయకం కాదు. దౌర్జన్యానికి ఎప్పుడూ తిరుగుబాటు తప్పదు. దౌర్జన్యం చూపితే, సుముఖులు గూడా విముఖు లౌతారు. చాలమందిని అణిచినప్పటికీ, మిగిలినవారూ, తర్వాత విముఖులైనవారూ కలిసి, ప్రథమ పోరాటం పైన్నే దెబ్బ తీస్తారు. ఎన్నో యుగాలనుండీ జరుగుతూండిన మత విప్లవాలూ, రాజకీయ విప్లవాలూ ఇందుకు తార్కాణం. నీవిన్నిటిని గురించి చదివావు గదా, ఫలితాలు చూశావు గదూ?"

"అయితే మన పని యెట్లా సాగించాలని నీ అభిప్రాయం?"

"సాఫీ మార్గంలోనే!"

"అంటే?"

"అంటే — విప్లవ మార్గం వదలాలి. పరిణామ వాదం స్వీకరించాలి."

"నీ విప్లవ వాదానికి తిలోదకా లిచ్చావా?"

"అవును. ఆ విప్లవం హృదయానికే. ఆదర్శాలవరకే. ఆచరణ మాత్రం పరిణామ పంథాలో నడవాలి."

"అవును. శాశ్వత ఫలితాన్ని చ్చేదదే."

ఉద్రేకంతో, ఆనందంతో వాళ్ళువిధంగా మాట్లాడుకుంటూ వుంటే పిల్లలంతా నోరు తెరుచుకుని వింటూ వున్నారు. మధ్యాహ్నం దాటి పోయింది. అన్నాలవేళ విషయం వీళ్ళూ మరిచారు, పిల్లవాళ్ళూ మరిచారు. అంతకు ముందు రాత్రి పెట్టి వుంచిన అలారం అపుడు కొట్టింది. గంట చూస్తే రెండు. పిల్లల్నందర్నీ అన్నాలకు పంపి, వాళ్ళు వంట ప్రారంభించా రానాడు.

౨౫

బడికి శ్రీనివాసుడు రాలేదు. కేశవరావు ఊహించాడు, ఏం జరిగి వుంటుందో. ఉస్సురంటూ తలపట్టుకొని "యెంతకష్టంరాబ్బా వీళ్ళతో నేగడం?" అన్నాడు.

"ఏమిటోయ్ నిస్పృహ?" అన్నాడు నారాయణ. నారాయణ అప్పటికి క్రొత్తే ఆ స్కూలుకు. అంటే రెండు నెలలయి వుంటుంది దాదాపు. అతను వచ్చినప్పటినుండీ స్కూలు సాఫీగా సాగుతూ వుండిం దానివల్ల తత్సంబంధిక పరిస్థితులు అతనికి తెలియవు.

"నిస్పృహ కాదోయ్, విసుగు."

"దేనికి?"

"శ్రీనివాసుడు బడికి రాకపోవడం తెలుసుగా?"

నారాయణ కిదివరకు పాతవిషయాలు కొద్దికొద్దిగా చెప్పివున్నాడు. మళ్ళా అన్నాడు: "యీ వూళ్ళో రైతులంతా వట్టిమూర్ఖులోయ్! శాస్త్రిలొక మూర్ఖుడు. రెడ్డి ఒక దౌర్జన్యవాది. కరణమొక దుష్టుడు. మాలవాళ్ళను పైకి రానీగూడదని వీళ్ళ పట్టుదలకు అంతంలేదు. మొన్న చూచావుగా రామయ్య ధోరణి?"అని.

"చాలా మూర్ఖమోయ్! మన హిందూసంఘం ఇల్లాంటి స్వార్థపరుల చేతులలో పడి నలిగి నాశనమై పోతూంది. ఈ విషయాన్నికొస్తే పల్లెటూళ్ళలో బలే నీచం. శుద్ధమొద్దులు! చెబితే అర్థంచేసుకోరు. పెద్దోళ్ళు పెట్టారంటారు. పైగా, తెలిసి చెప్పేవారిని తెలియనివారిక్రింద లెక్కేసి ఉపేక్షిస్తారు. ఏమన్నాగానీ, యీ దఫా అందర్నీ ఒకచోట చేర్చి మాట్లాడ్దాం. జ్ఞానాన్ని కొంచెం బోధిద్దాం. తక్షణం మాలవాడ కెళ్ళి శ్రీనివాసుణ్ణేగాకుండా, నిలిపేసినవాళ్ళందర్నీ బళ్ళో కొచ్చేటట్లు చేద్దాం.

తర్వాత పూరివారినంతా పిలిపించి 'తలిదండ్రుల' సమావేశం పేరట మాట్లాడ్దాం" అనేటప్పటికి అడ్డొచ్చి,

"అదంతా యెందుకయ్యా? ఊరంతా యెందుకు? ఆ శాస్త్రి, ఆ కరణం, ఆ రెడ్డి - యీ ముగ్గురే చాలు. మూడూ మూడు మొద్దులు, ఎంతజెప్పినా ఒకటే పట్టు" అన్నాడు కేశవరావు.

సాయంకాలం అయ్యవార్లిద్దరూ షికారు బయలుదేరారు. ఊరికి దక్షిణంగా వున్న చిట్టడవిలో నడుస్తున్నారు. చిట్టడవి దాటితే పెద్దడవి వస్తుంది. కొంచ లోస్తాయ్. అది వసంతకాల మవటంవల్ల చెట్లనిండా ఆకులు నింపుకొని, రమ్యత్వాన్ని ప్రసాదించకపోయినా, చిగుళ్ళతోను, పూతతోను నిండిన చెట్లు, సౌరభాన్ని వెదజల్లుతూ, ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయ్. ప్రొద్దు క్రుంకబోతున్నది. పక్షులన్నీ శబ్దం చేస్తూ గూళ్ళు చేరుకుంటున్నాయ్. కోకిలలు శ్రావ్యంగా పాడుతున్నాయి. గొర్రెలు, మేకలు, పశువులు మందలు మందలుగా గ్రామముఖమై వస్తున్నాయ్. అయ్యవార్లు దారిప్రక్కన ఒకచోట కూర్చొని ప్రకృతినీ, ఆకాశాన్నీ తిలకిస్తున్నారు. తెల్లటి కొంగలబార్లు రివ్వురివ్వుమని పయనిస్తున్నాయ్. వాళ్ళభావాలా పక్షులవెంటబడి పోతున్నాయ్. భావోత్తేజితులై మైమరచి నట్లున్నారు-ఆ పక్షుల స్వతంత్ర జీవనాన్ని గురించే ఆలోచిస్తున్నారు.

వాళ్ళ కెదురుగా కన్నీళ్ళుకారుస్తూ నిలబడ్డ శ్రీనును కొంత సేపటికి గాని వాళ్ళు చూడలేదు. పెద్ద కట్టెలమోపు నెత్తిపైనుంచి దింపి, నిలబెట్టి పట్టుకొనే వున్నాడు. నెత్తిపైనున్న గుడ్డచుట్ట అట్లాగే వుంది. కమిలి పోయిన మొగంతో, లోతుకుపోయిన కండ్లతో నిలబడి దీనంగా చూస్తున్న శ్రీనును చూచారు. ఇదివరకున్న భావ ప్రపంచంలో నుండి తటాలున ఈ అస్వతంత్ర, నికృష్ట, నీచ ప్రపంచంలోకి భావాలను మరలించే టప్పటికి, ఆ భావాలు నిర్జీవాలై, అచేతనాలై, గుండెల్లో కూలబడి భారాన్ని కలిగించినయ్.

"ఏరా, యిన్ని కట్టె లెందుకు కట్టుకున్నావురా?" అన్నాడు నారాయణ.

"దండిగా కట్టుక రమ్మన్నారు."

"ధారాళంగా యిన్ని మోయగలవా?"

"ఊహుఁ, చాలాచోట్ల దింపుకుంటూ వస్తున్నా, మెడలు నొప్పులు పట్టాయి."

"మీ నాయన మళ్ళీ పాతధోరణి కొచ్చాడుగదూ?"

"ఆయన కత మామూలేనండీ! ఉదయం రెడ్డి వచ్చి, గుడ్లురిమి నన్ను బయటికి నడు అన్నాడు. 'పో' అన్నాడు మా నాయన. మా అమ్మ మూకవ్రతంలో వుంది. పోక తప్పిందిగాదు."

అయ్యవార్లొక్కసారిగా నిశ్వసించి, నిట్టూర్చి ఒకరి మొగాలొకరు చూచుకున్నారు.

"నన్నెట్లైనా గట్టునెయ్యండి సార్!" అన్నాడు శ్రీను.

ఆ వేడికోలు ముఖభంగిమం, ఆ కన్నీళ్ళు చూచేటప్పటికి యిద్ద రయ్యవార్ల హృదయాలు చాలా బాధపడ్డాయ్.

"నీవు పద శీనూ, నిన్నెట్లయినా హైస్కూలులో చేరుస్తామ్. ఆ భారం మేము వహిస్తాం. నీకేం భయంలేదు. రాత్రికే వస్తున్నాం పద, మీ మాలవాడకు" అని చెప్పి పంపారు.

శ్రీను కట్టెలమోపును దొడ్డిలో వెయ్యటానికి వెళ్ళాడు. అనసూయ బావిలో నుంచి నీళ్ళు చేదుతూ వుంది, బకెట్టు బరువుగా వుండటంవల్ల బలవంతంగా లాగుతూ వుంది, తనకు మించిన శక్తిని దానిపై నియోగిస్తున్నది. ఈతనార తాడు చాలా రఫ్‌గా వుండటం మూలాన, చేతులు మంటలెత్తాయ్. చిన్నగా బయటికి లాగి, ఎట్టగా కమిలి బొబ్బలెగిరిన

అరచేతులు చూచుకుంటూ వుంది. ఇంతలో శ్రీను కట్టెలమోపుతో ప్రత్యక్షమయ్యాడు. చెమటలు కార్చుకుంటూ, గాఢంగా బుస పెడుతూ వచ్చి విసిరి కిందేసి, నొప్పులు పట్టిన మెడలను సవరించుకుంటూ, చేతులతో తల పట్టుకొని, ఈవైపుకూ ఆవైపుకూ తిప్పుతున్నాడు. తన అవస్థ తన కర్థమయింది అనసుకు. శ్రీను అవస్థ చూచి కండ్లనిండుకూ నీళ్ళు తెచ్చుకుంది.

"అన్ని కట్టె లెవరు తెమ్మన్నారు నీనూ?" అంది సజలనేత్రాలతో వాడి మొగంలోకి చూస్తూ. వాడు సమీపించి, కొంతదూరంగా వుండే "చేతులట్లా యెందుకయ్యాయి?" అంటున్నాడు సానుభూతితో. మాట్లాడకుండా కన్నీళ్ళెక్కువ కార్చింది అనసు. ఇవన్నీ వస్తూ వస్తూ చూచిన తల్లి ఆదరా బాదరా సమీపించి, తటాలున పిల్లను రెండు చేతుల్లో జవురుకొని, "ఎందుకే నీకు నీళ్ళజోలి? చేతులు చూడు!" అంటూ "ఏరా, ఇంకా యిక్కడే వున్నావు, ఆ దూడల్ని వదలకుండాను"అని బిరబిర వెళ్ళింది. అనసు కన్నీటితో నిండిన చూపుల్తో శ్రీనును తిలకిస్తూనే వుంది కనబడినంతవఱకూ.

రాత్రి భోజనానంతరం బయలుదేరారు మాలవాడ కయ్యవార్లు. ఆ వాడలో యిరవై చుట్టిండ్లు వుంటాయ్. దాని ప్రక్కన మాదిగవాడలో పది అటువంటి యిండ్లే వుంటాయ్. చుట్టూ గోడలకు మారు తడికలు కట్టబడి వున్నాయ్. ప్రక్క తడికల నానుకొని ఒక అర అడుగు యెత్తు గడ్డ మాత్రం వుంటుంది గోడ వుండవలసిన స్థానంలో. కొన్ని యిండ్లకా తడికలు గూడా శిథిలమైపోయి వుంటాయ్. పందులు దూరటంవల్లా కుక్కలు దూరటవల్లా, తడికల అడుగు భాగమంతా కిటికీలు కిటికీలుగా కనబడుతూ వుంటాయి. యల్లప్ప యిల్లు మాల వాడలోకల్లా కొంచెం బాగా వుంటుంది. చుట్టిల్లే గాక ఒక చవిక గూడా వుంది. బాగా యెత్తైన గోడలు - ఎవరన్నా వస్తే ఆ చవికలో కూర్చొని మాట్లాడిపోతూ

వుంటారు. ఇల్లు కొంచెం నాజూగ్గా వుంటుంది. లక్ష్మి కొంత నాగరికు రాలు కాబట్టి, కొంచెం ముందడుగు వేద్దాం అనే దృక్పథంలోని మనిషి కాబట్టి, దరిద్రంలో పడి అవస్థ లనుభవిస్తున్నా, యింటిని మాత్రం శుభ్రంగా పెట్టుకుంటుంది. అయ్యవార్లను చూస్తూనే ఆశ్చర్యపడ్డారు యల్లప్ప, లక్ష్మి. వారు వచ్చిన ఉద్దేశం లక్ష్మి తటాలున గ్రహించింది. లోలోపల చాలా ఆనందించింది. ఆదరాబాదరా మంచంవాల్చి "కూసోండి సాములూ! ఏం, ఇట్టావచ్చినారు?" అంటూ నిలబడ్డాడు యల్లప్ప చేతులు నలుపుకుంటూ.

"భోజనాని కొచ్చామోయ్!" అన్నా రిద్దరూ ఒక్కసారి.

రెండు చెంపలూ వాయించుకుంటూ "తప్పు తప్పు, అట్టనొద్దు సాములూ! మాకు పాపం. యంత మాట!'' అన్నాడు యల్లప్ప.

అతని గాభరా చూచి నవ్వుతూ,

"అదేమోయ్, మీరు మాత్రం ఆ యన్నమే గదా తినేది?" అన్నారు.

"అయితే, భేదం లేదా?"

"భేదమేమిటోయ్ అందులో? అదే బియ్యాన్ని - అదే నీళ్ళుపోసి, అదే కట్టెల్తో గదా అందరూ ఉడికించేది! మాకు పెట్టబడుతుందనా?"

"మీ రామాట అంటమే తప్పు. అది యింటే మాకు నరకం. అసలు మా యిండ్లలోకన్నా రావచ్చా మీరు? మన పెద్దోళ్ళట్టా పెట్టినారు సామీ! వాళ్ళేమి తెలీక పెట్టినారా? ఆ పాటింపులు తప్పితే తల పగిలి పోదా?" అన్నాడు యల్లప్ప భయంగా.

"తల పగిలిపోవడమే?"

"మీకు తెలీందేముండాదయ్యా, బాగా సదువుకున్నోళ్ళు మీరే అట్టంటే యట్ట?''

సంవాదం మార్చదలిచి కేశవరావు "పోనీగాని, శ్రీన్ను ఎందుకు చాలించావు చెప్పు?" అన్నాడు.

"యెందుకూ లేదు సామీ. వాళ్ళంతా వకటే మోయిన, సాలిస్తావా లేదా అంటావుంటే యేంజేసేది? అయినా మా కెందు కండీ సదువు, మీ పాదాల కాడ బతికేవోళ్ళకు? ఇంకా బాపనోళ్ళకు, సూద్రోళ్ళకు, రాసోళ్ళకు, కోమటోళ్ళకూ వుండాల గాని."

"వాళ్ళూ, మీరూ అంతా మనుషులే లేవోయ్! సరేగాని, భోం చేశావా?"

"యాడసామీ? అదో, యిపుడే వొచ్చి లచ్చిమి అన్నం శాస్తా వుండాది. నేను తానంశేశి యీడ కూసోంగానే మీరూ దిగినారు."

అన్నానికి పిలుపు రాగా యల్లప్ప వెళ్ళాడు. వానికి వడ్డించి లక్ష్మి బయటికొచ్చి, "మీరు చెప్పేదంతా పట్టణాలలో పనికొస్తుందేమో గాని, యిక్కడెట్లా సరిపోతుందండీ? చెవిటివాని ముందు శంఖూదినట్లుందేమన్నా చెబితే. వీణ్ణి చదివించాలని నాకు శానా యిష్టంగా వుంది. రైతులు పూర్తిగా వ్యతిరేకిస్తా వుండారు. మేము విడ్డూరంగా వుంటే గడవదు. కడకు మా యమ్మగారి వూళ్ళో గూడా చదివించడానికి వీలులేకుండా పోతూ వుండాది. సుబ్బారెడ్డి పట్టుపట్టి కూచున్నాడు. చూడండీ, యెండకూ, గాలికీ, అడివంతా తిరిగి, అన్నమూ నీళ్ళూ అనుకోకుండా యట్లా నిద్రపోతా వుండాడో - కట్టెల మోసి మెడలు నొప్పులు పట్టాయని, తోమించుకొని పడుకున్నాడు. మీరు వాడిపైన దయగా వుండటం చూచి వాడి చుక్కలు భాగుండాయ్, బాగా చదువుకుంటాడు అనుకున్నా. యేంజేస్తాం?" అని యింకా తత్సంబంధమైన మాటలు మాట్లాడుతూవుండగా, యల్లప్ప చెయ్యికడుక్కొని వచ్చాడు. రాగానే "యల్లప్పా! దేవళంముందు చాప వేయించి, అందర్నీ పిలు, మాట్లాడాలి" అన్నాడు కేశవరావు.

పిల్లా, జల్లా, ముసలీ, ముతకా, అంతా వచ్చి కూర్చున్నారు. కేశవరావు అన్నాడు:

"మనమంతా మానవులం. దేవుడిబిడ్డలం. భేదాలేమీలేవు. ఇవంతా మధ్యనే వచ్చాయి" అని అంటూ కులా లెట్లా వచ్చిందీ - అవి యేవిధంగా అపార్థం చేసుకోబడిందీ - అస్పృశ్యత యెట్లా వచ్చిందీ - అది యెట్టి అనర్థాన్ని మన దేశానికి కలుగజేసిందీ - దాని నిర్మూలనంకోసం మహా నాయకులంతా యేవిధంగా కష్టిస్తూ వుండేదీ - మొదలైన విషయాలన్నీ ఒక గంటసేపు చెప్పాడు. ఒక ముసలివాడు:

"సామీ! కులాలు లేకుంటే యట్ట?" అన్నాడు.

"ఏం, లేకుంటే బువ్వ దిగదా? కులం అంటే యేమిటోయ్? అదొక వస్తువా? ఒక కల్పితపు మాట. దాని కిపుడర్థం లేదు. అసలు కులం లేకుంటే బతకలేమా? అన్నం దిగదా? ఏదీ, కులం లేదనుకుని అన్నం తిను. దిగదేమో చూడు. నీళ్ళు త్రాగు. సహించవేమో చూడు. ఇదంతా వట్టిది. బూటకపుమాట. అది వున్నప్పటికంటే లేనప్పుడే, యే పేచీలేకుండా - యే భేదం లేకుండా. మానవు లెట్లా బతకాల్నో అట్లా బతుకుతాం."

మరొకడన్నాడు:

"మీరెన్ని అన్నారుగదా, రైతులు ఒప్పుకుంటారా?"

"దీనిలో ఒకరొప్పడం, ఒకరొప్పకపోవటం ఏమీలేదు. మన సంఘం పతనం కావడానికి అందరూ కారకులే. దీన్ని బాగు చెయ్యా లన్నా అందరూ చెయ్యాలి. మీకు చెప్పిన మాటలే ఎవరికైనా గూడా."

ఇంకా యిటువంటి ప్రశ్నలకంతా తగువైనట్లు జవాబు చెప్పాడు. అందరికీ బాగా నచ్చింది ఉపన్యాసం. యిదివరకు వచ్చి అపుడపుడూ మాట్లాడడంకంటే ఈనాడు చాలా ఉద్రేకంగా ధైర్యంగా మాట్లాడాడు. అందరూ లేచారు.

"రేపట్నుండీ రాత్రిపూట వస్తాం. మీరందరూ చదువుకోవాలి. పలకలూ పుస్తకాలూ మేం తెస్తాం" అన్నాడు నారాయణ. నవ్వులతో, సంతోషంతో, ఉప్పొంగిపోయే హృదయాలతో వాళ్ళను సాగనంపిం తర్వాత ఒకడన్నాడు:

"ఒరేయ్, వాళ్ళు శెప్పింది నిజమేరో! అందరూ మనుషులే గదా, మనల్ను యెంత నీశంగా సూస్తార్రా? పుట్టిన బిడ్డకాణ్ణుంచి, సచ్చే ముసిలోడివరకూ, మనలో యెంత పెద్దోణ్ణయినా 'వొరే' అంటారు. యీళ్ళు సూడు! యంత బాగా మాట్లాడ్తారో?"

ఇంతలో యింకొకడు-

"అవున్రో! వాళ్ళు శెప్పిందంతా నిక్కచ్చిగానే వుండాది. సదువు కొని, మన మాలమాదిగోళ్ళు శానామంది కొలువులు శాస్తుంటారు. మొన్న మనూళ్ళేకి తాశిల్దారొచ్చిండ్లే- ఆయన్ను సూశేటప్పటికి, మన సుబ్బారెడ్డి, కరణం అంతా అడల్. 'ఏమోయ్ రెడ్డీ, నీ యిట్టమొచ్చినట్టు శాస్తుండావే- కిచ్చీలెక్కలు అయిదురోజుల లోపల సరిశేశి సూపక పోతే నిన్ను సస్పెంటు శాస్తాను - ఏం కరణం! జమాబందీ లెక్కలలో తేడా కత యేంజేస్తివి? యిట్లా శేశావంటే నీ కొలువూడ్తాది' అని అంటావుంటే, 'శిత్తంసార్, శిత్తంసార్, తొరగా శాస్తామండీ' అంటూ కొంగ దండాలు పెట్టి గాభరా పణ్ణారు. ఆయన మాలోడంట!"

రెడ్డి సేద్యగాడు సుబ్బడన్నాడు:

"మాలోడికి సదువొచ్చే యిట్ట! అని సుబ్బారెడ్డీ, కరణమూ యింకా యేమేమో అనుకుంటావుంటే నేను యిన్నా. ఆ తరువాత ఆయన సుబ్బారెడ్డింట్లోనే భోంచేసిపొయ్నాడు. సదువొచ్చే అట్ట-రాకుండా యిట్ట- ఆ పొద్దు సుబ్బారెడ్డి కులం చెళ్ళేదేమో!"

# ౬

కోట పాఠశాల బాగా జరుగుతూందిపుడు. హరిజనులు దండిగా వస్తున్నారు! వాళ్ళకు ప్రత్యేక స్థానంలేదు. ఏ తరగతివాళ్ళ నాతర గతిలో సవర్ణులతోబాటు కూర్చోబెడుతున్నారు. అలవాటుపడ్డవాళ్ళు కాదు. గాబట్టి హరిజన పిల్లలు మొదట జంకేవారు, ఇతర పిల్లలతో కూర్చోడానికి. పైవారుగూడా కొంచెం దూరంగా పోయేవారు. వీళ్ళలో నాగలింగం మొదటివాడు. నాగలింగం, శాస్త్రి తొలిభార్య కొడుకు. వాని వేషం అచ్చం వాళ్ళ నాన్న వేషంలాగుంటుంది. చిన్న కొప్పెరజుట్టు- నొసట నల్లని చుక్కబొట్టు - చెవులలో సన్నని పోగులు - ముక్కుకొక పోగు-మెడలో హనుమంతుడి తాయెత్తు-యింకా యేమేమో! పొట్టిచొక్కా వేస్తాడు. నిక్కరు గజ్జల్లోకి యెగదీసి కడ్తాడు. అచ్చం ఆ దేందుకు సిద్ధంగా వున్న దొమ్మరి పిల్లవాడులాగా వుంటాడు. వాళ్ళ నాయన పుస్త కాలూ, పంచాంగాలూ, అన్నీ దస్తరంలో వేసి కట్టుకొని, బళ్ళోకి మోసుకొస్తూ వుంటాడు. పెద్ద చదువరిలాగా ఆ యెత్తుదస్తరాన్ని ముందు పెట్టుకొని, పిల్లవాళ్ళకంతా చెప్పేవాడు - "చూడు. నాదెంత దస్తరమో" అని. ప్రత్యేకంగా కూర్చునేవాడు మొదట! అయ్యవారు కావాలని మాల వాళ్ళల్లో కూర్చోమనేవాడు. అయిష్టంతో బలవంతంతో వాళ్ళ దగ్గరికి పోయి, ఏదో ఒకవిధంగా వాళ్ళని తాకీతాకనట్లుగా కూర్చునేవాడు. శ్రీను వాడి క్లాసే అయినందువల్ల ఒకచోట కూర్చోక తప్పించికాదు. పాపం, ప్రాయశ్చిత్తరూపంగా సాయంకాలం పసుపునీళ్ళు చల్లించుకొనేవాడు.

శ్రీను చామనచాయగా వుంటాడు. చక్కనిశరీర నిర్మాణం.కొద్దిగా పుష్టించివుంటాడు. వాని మొగానికి పలువరస చాలా అందానిచ్చేది. వాడు నవ్వుతూవుంటే చూచేవాళ్ళకు తనివితీరదు. వాడికి అయ్యవారు కుట్టించిన రెండు చొక్కాలూ, రెండు చెడ్డీలే. వాటినే వాళ్ళమ్మ శుభ్రంగా

ఉదికి ప్రత్యేకంగా పిల్లి బళ్ళోకి పంపేది. శ్రీను ఎవరితోగూడా యెక్కువ మాట్లాడడు. జాగ్రత్తగా మాత్రం పరిశీలిస్తూ వుంటాడు.

, వేదాలు విస్మరింపడానికి అయ్యవార్లెన్నో కథల రూపంగా బోధిస్తూవుండేవారు. దినాలు గడిచినకొలదీ-సన్నిహితత్వం ప్రబలేకొద్దీ-అందరూ కలిసిపోయారు. వాళ్ళందర్లో ఒకటిలవడింది - యెవరన్నా "యేరా మాలోళ్ళ తాకుతావు?" అంటే-

"యేం? వాళ్ళు మనుషులు కాదూ? పశువుల్ని తాకుతారే, కుక్కల్ని మీదెక్కించుకుంటారే, మనుషుల్ని తాక్కూడదూ? తాకితే యేమన్నా అంటుకుంటుందా? - అంటుకుంటే కడుక్కుంటాంలే. నిన్ను తాకొచ్చా?" అనేవారు. ఈ వింతసంతా పూళ్ళోవా ళ్ళనుకుంటూండే వారొక వింతగా.

అట్లా మూడు మాసాలు గడిచినాయ్. ఊళ్ళో కొంతమందికి నచ్చినా చాలామందికి నచ్చలేదీరకం. "ఈ పాపిష్టి అయ్యవార్లు బాగ య్యారు మనకు? మరీ ఆ కొత్తయ్యవోరొచ్చినాక యింకా యెక్కు వైంది" అనుకొనేవారు. మన త్రిమూర్తులతో, "యేందయ్యా యీ అన్యాయం? కులాలు నాశనమైపోతా వుండాయి. యేమీ, యీ సదువు లేకపోతే చస్తామా?" అనేవారు. ఊరబావికడ చేరిన ఆడంగులకంతా యివే ప్రసంగాలు!

ఒక సాయంకాలం జవానొచ్చి, 'రేపు యినస్పెక్టరొస్తా'డని చెప్పాడు. ఊరంతా తెలిసిందా ఉదంతం. చాలమంది మాట్లాడుకు న్నారు. బళ్ళోకి పిల్లలు రాలేదు మరునాడు. సరిగ్గా బెల్ అయ్యేటప్పటికి యినస్పెక్టరొచ్చాడు. మాలపిల్లలు పూర్తిగా వచ్చారు. తక్కినవారు చాల కొద్దిమంది వచ్చారు. నారాయణమాత్రం కొద్దిగా భయపడ్డాడు. యిన

స్పెక్టరు కేశవరావును బాగా యెరిగినవాడే. అయినా చాలా స్ట్రిక్టుమనిషి. అటెండెన్సు రిజిష్టరు తీసికొన్నాడు. నిన్నటిదినం హాజరయినవారిలో చాలామంది యీ దినం రాలేదు.

"యేమిటిదంతా?" అన్నాడు యినస్పెక్టరు.

"ఏమిటో మాయగా వుందండీ!" అన్నాడు నారాయణ.

"మాయకాదు, సవర్ణులు కావాలని చేసిన పన్నాగం" అన్నాడు కేశవరావు.

"అంటే?" అన్నాడు ఇనస్పెక్టరు.

చెప్పాడు కేశవరావు చాలా విషయాలు. నిన్నటివరకూ నడిచిన అటెండెన్సు చూపాడు. ఈనాడు హరిజనుల హాజరు చూపాడు. "ఇదంతా మామైన దెబ్బతీయాలని చేసినపని" అని చాలా చాలా విషయాలు చెప్పాడు. ఇనస్పెక్టరు కర్థమయింది. చాలా ఉత్సాహంగా విని, తలవూచి,

"మేనేజరున్నాడా వూళ్ళో?" అన్నాడు.

"ఆ."

"పిలిపించండయితే."

సుబ్బారెడ్డి వచ్చాడు భయపడుతూ. కొన్ని చీనీపండ్లెత్తించుకొని వచ్చి, పండ్లాప్రక్కన పెట్టించి, నిలబడ్డాడు దండంబెట్టి. యినస్పెక్టరు సీరియస్‌గా కూర్చోమని సంజ్ఞ చేశాడు. కూర్చున్నాడు గ్రుడ్లు మిణకరిస్తూ.

"స్కూలు కాన్సల్ చేస్తాను" అన్నాడు ఇనస్పెక్టరు భీకరంగా. సుబ్బారెడ్డి చేతులు నలుపుకుంటూ బయటికి చూశాడు. కొంతమంది బైటపోగయ్యారు వినటానికి, అయ్యవార్ల కత యీనాడుగాని తేలిపోదని

సంతోషపడుతూ. తమాషా యేం జరుగుతుందో చూద్దామని ఊపిరిబిగబట్టుకుని నిలబడ్డారు. ఇన్‌స్పెక్టరన్న ఆ మాట అయ్యవార్లనే అనుకున్నారు. ఒకరిమొగాలొకరు చూచుకొని, మోచేతుల్తో ఒకర్నొకరు పొడుచుకుని హెచ్చరించుకుంటూ, చిరునవ్వులు నవ్వుకొన్నారు. సుబ్బారెడ్డికి గూడా అంత బాగా అర్థంకాలేదు ఆ ప్రశ్న. అంత చలనం లేనట్టుగా నటిస్తూ "ఎందుకండీ?" అన్నాడు.

"ఎందుకా? మీ కెందుకయ్యా చదువు?" అన్నాడు ఇన్‌స్పెక్టరు విసుగ్గా.

"అదేమిటండీ?"

"ఏమిటా? ఇట్లావుంటే బడి యెన్నాళ్ళు సాగుతుంది?"

"ఇందులో మా లోపమేముందండీ?" అన్నాడు తప్పించదిలే అప వాదం అనుకుంటూ.

ఇన్‌స్పెక్టరు ముందే మండిపడుతున్నాడు. సుబ్బారెడ్డి వాదం ఇంకా రెచ్చగొట్టింది. చఱ్ఱున లేచాడు కుర్చీలోంచి. రిజిష్టరుముందుపడేసి-

"యేమిటీ హాజరు?" అన్నాడు.

"నా లోపమేముందండీ యిందులో?" అన్నాడయ్యవార్ల వైపు చూస్తూ. ఒక కటాక్షం బయటికిగూడా విసిరేశాడు. అప్పటికింకా యెక్కువగా పోగయ్యారు వేడుక చూద్దామని. ఈ దెబ్బతో అయ్యవార్లు తగ్గుతారని అందరూ సంతోషిస్తున్నారు.

"అయితే తప్పెవరిది?" అంటూ రొప్పినాడు ఇన్‌స్పెక్టరు.

"అయ్యవార్ల నడగండి."

"అయితే చూడు" అంటూ అంతక్రితం నాటివరకూ కనుపరచిన హాజరు, ఆనాడుకూడా తగ్గకుండా వుండిన హరిజనుల హాజరూ చూపించి,

"ఎవరు దీనికి కారకులు?" అన్నాడు. సుబ్బారెడ్డి కర్థమయింది కేసు తనవైపు వద్దదని.

"ఏమో నాకు తెలీదండీ!" అన్నాడు సర్దుబాటు గొంతుతో.

''తెలియదా! మీకెట్లా తెలుస్తుంది? ఎవరికన్నా ద్రోహం చెయ్యాలంటే ముందుకు దూకడం తెలుసు. ఇతరులు పైకివస్తారేమో అని అసూయ పడటం తెలుసు. అంతేనా? ఇదిగో, ఈ దినమే రికగ్నిషన్ కొట్టెయ్యిస్తా. పైకి వ్రాస్తున్నా. పాపం, పోసీలెమ్మని, అయ్యవార్లు దొరకని కాలంలో, మీరు ముగ్గురు అయినా కావాలని మొత్తుకుంటే కడపటికి ఒకాయన్ను పంపించాం. అదంతా యెందుకు? ఎవరికోసం? మీకోసమేనా? దానికిదా మీరు చేసేది? మీరు అయ్యవార్లపై దెబ్బతీయాలని, అంతాకలిసి యిట్లాచేస్తే, నష్టపడేది మీరే. వాళ్ళకేం? బంగారంగా మరొకచోటచేర్తారు. ఎవడో పూజారిపైన అలిగి దేవుడి మొగం చూడకుండా వెళ్ళాడట."

సుబ్బారెడ్డి మొగంలో కత్తి కాటేసినా రక్తం లేదు. వ్యవహారం జెడిసికొట్టిందనుకున్నారు, బయటున్నవాళ్ళంతా. ఒక్కరొక్కరే తప్పుకొనిపోతున్నారు. సుబ్బారెడ్డి కాస్త చిక్కులో పడ్డాడు. అట్లా ఆలోచిస్తే ఒక చిన్న ఉపాయం తట్టింది.

"నా లోపం యేమాత్రమూ లేదండీ యిందులో. మా పిల్లలు చూడండి వచ్చారో లేదో" అన్నాడు. నిజమే, రామిరెడ్డి, అనసూయ వున్నారు. శ్రీలక్ష్మి, నాగలింగం, యింకా కొద్దిమందికూడా వున్నారు.

ఇన్‌స్పెక్టరున్నాడు: "నిజయేనయ్యా. నీవంతమాత్రం యుక్తిగా చేస్తావని నాకు తెలుసు. తక్కినవాళ్ళంతా యేమయ్యారు?"

"దానికి నేనెట్లా పూచీ?" అన్నాడు రెడ్డి.

"సరేలే. బడి పోవడానికిగూడా నీవు పూచీ కావులే" అంటూ ఏదో వ్రాసినట్లు నటించి,

"వస్తానండి కేశవరావుగారూ!" అంటూ లేచా డినస్పెక్టరు. భోంచేసి వెళ్ళండి అన్నారు వారు.

"అట్లా వీలుకాదు. తక్షణం వెళ్ళాలి."

"అయితే...." అని సుబ్బారెడ్డి అంటుండగా అడ్డొచ్చి, "నాకు తెలుసు నీవు చెప్పబోయేది. ప్రస్తుతం కొంత టైం యిస్తున్నా. నేను సరిగ్గా ఐదవనాటికొస్తా. అప్పటికి.... జాగ్రత్త!" అంటూ ఇన్‌స్పెక్టరు వెళ్ళిపోయాడు.

౭

సుబ్బారెడ్డి మహడీపైన ఒక రూములో కలిశారు మన త్రిమూర్తులు. "సుబ్బారెడ్డీ! యీ రకం బాగులేదయ్యా! ఈవిధంగా ఆ పంతుళ్ళు బ్రాహ్మణ, శూద్ర, మాల అనే వివక్షతలు లేకుండా బలవంతంగా ఆ విధంగా తయారు చెయ్యటం బొత్తిగా బాగులేదు. అసలు కేశవరావు బాపన వెధవైపోయెనే, ఆ శూద్రయ్యవారితో కలిసి ఒకేచోట వండుకోడం-ఒకేచోట తినడం....అదీపోనీలే, ఆ మాల పిల్లవాడిచేత కుండలు తాకించడం.... ఏందిడంతా?.... మనపైన పంతానికే గదూ! పిల్లలు యిష్టపడకున్నా అదే పనిగా కూర్చొబెడతాడట! మా నాగలింగడు బళ్ళోకే పోనంటున్నాడు. మన హిందూ మతానికి పోగాలమొచ్చిందయ్యా, వచ్చింది! ఇటువంటి అయ్యవార్లను నెత్తినపెట్టికొని, మన కులాల్ని చెడగొడుతూంటే చూస్తూ వూరుకోవలసిందేనా? లేకపోతే దీనికి విరుగుడేమన్నా వుందా? నీవా స్కూలుకు మేనేజరువని చెబుతున్నా" అన్నాడు శాస్త్రిలు.

"అవును రెడ్డీ! మనం మాలవాళ్ళతో కలిసీ మెలిసీ వుంటే, మన నెత్తి కెక్కరూ? మాల మంచక్క అంటే, మదులెక్కి దూకిందట!

కిందుండేవాణ్ణి పైకెక్కిస్తే, పైవాళ్ళ మర్యాదేమవుతుంది? అసలు మన పనులు జరుగుతాయా? వాళ్ళంతా చదువుకుంటే మన పొలాలు బీడుపెట్టి, జోలికట్టుకొని అడుక్కుతినవలసిందే? ఆ మాలవాళ్ళు చదివి, కొలువుల్లో చేరితే, మనబోటి రెడ్లూ కరణాలూ చావాల్సిందే! చూస్తున్నాంగా? అనుభవిస్తూండి గూడా, మనం యింకా ఉపేక్షించినామంటే, వెనక చిక్కులొస్తాయి! ప్రతిచోటా మనమాదిరే అనుకొని, కట్టుకట్టి, మాలల్ను చదవకుండా చేస్తే దేశం తొందరగా బాగుపడుతుంది. నాకీ కరణీకమే లేకపోతే, ప్రచారానికే బయలుదేరేవాణ్ణి" అన్నాడు కరణం.

"నిజమే, మీరు చెప్పినదంతా నిజమే. వాళ్ళు చదువుకుంటే మన మాట లింటారా? మళ్ళా కూలికి రమ్మంటే వస్తారా? అసలు చదువు కోవచ్చా వాళ్ళు? సరస్వతిని ముట్టుకోవచ్చా? సరస్వతి అపవిత్ర ఐపోదూ?" అన్నాడు సుబ్బారెడ్డి.

"వెయ్యిమాట్లకు! మళ్ళేముంది? బాగన్నావయ్యా రెడ్డీ, శెబాస్! నా ఆయుస్సుగూడా పోసుకొని వెయ్యేళ్ళు వర్ధిల్లు....ఆఁ చూడూ.... అయ్యవార్లనే మార్పిస్తే, మనకా చిక్కులు అవే తొలగిపోతాయ్! వాళ్ళెంతకైనా సమర్థులు! రేపు వాళ్ళందర్నీ రెచ్చగొట్టి, మనకు పనులకే రాకుండా చేస్తారు. ఆలోచన చెయ్యి" అన్నాడు శాస్త్రిలు, కొంచెం దగ్గి,సర్దుకుని. "నిజమేనయ్యా! కాని ఈకాలం అయ్యవార్లు దొరికేదే చాలా కష్టంగా వుంది. అప్పుడు మనం బడి బీడు పెట్టుకొని కూర్చునుంటే, ఆ కేశవరావే వచ్చి వుంటానన్నాడు. మనం వెళ్ళిపొమ్మనడం బాగులేదు. అంటే బంగారంగా వెళ్తారు. వాళ్ళకేం? బోలెడు స్కూళ్ళు బీడుపడి వున్నాయ్. అందులో మన పిల్లవాళ్ళు ప్రైవేటు చదువుతున్నారు. అదొక చిక్కు."

"అసలు మాలవాళ్ళను రాకుండా చేస్తే?"

"అది గూడా కష్టంగానే వుంది. వాళ్ళు గూడా నేర్చుకున్నారు. ఈ అయ్యవార్లు వాళ్ళ మనసులు గూడా చెరిచారు. అయినా నిన్నటి విషయం మీరు చూచే వున్నారు. ఇన్స్పెక్టరు చాలా కోపంగా వున్నాడు. ఇపుడేం చేసినా మన స్కూలు కొట్టేస్తారు."

"దానికేంరెడ్డీ! మన పిల్లలు రానందుకు గదా ఆ ఇనస్పెక్టరట్లా అన్నాడు! మనం అందరం పిల్లల్ను బాగా పంపుదాం. మాలమాదిగల్ని చాలించేద్దాం" అన్నాడు కరణం ఆలోచించి.

"నిజమే, నిజమే, బాగుందయ్యా! నాయబ్బగదూ, వెయ్యేండ్లు బతుకునాయనా! బలే, బలే! ఇంకేం సుబ్బారెడ్డీ? రాత్రికే మాలవాడ కెళ్దాం" అన్నాడు శాస్త్రిలు మంచం పైన్నుంచి లేచి.

"సరే! కాని, యినస్పెక్టరు వచ్చి వెళ్ళినతర్వాత" అన్నాడు రెడ్డి.

వారం తర్వాత స్కూలు తనిఖీ అయిన రాత్రే బయలుదేరారు త్రిమూర్తులు మాలవాడకు. దేవాలయం దగ్గర ఒక చాపపైన దూరంగా కూర్చున్నారు. సమావేశమైన హరిజనులకూ, వాళ్ళకూ ఒక అయిదు గజాల దూరమైనా వుంటుంది. నశ్యం పీల్చి, రెండు తుమ్ములు తుమ్మి, దగ్గి, చీది, గొంతు సరిచేసుకొని, "ఏమంర్డా! మన పెద్దలంతా, యెన్నో యేండ్లనుండి, పేచీలు లేకుండా బ్రతికినారు. వాళ్ళ కాలంలో కుల ధర్మాలు చక్కగా పాటిస్తూ వచ్చినారు గాబట్టే నెలకు మూడు వానలు కురిసి, పాడీపంటా సమృద్ధిగా వుంటూ వచ్చినాయ్. ఈ కలి కాలంలో ధర్మం ఒక పాదాన మాత్రమే నడుస్తూ వుండబట్టి అధర్మం యెక్కువైంది. ఆ గాంధీగాడూ ఇంకా అట్లాంటి కాంగ్రెసు ఫకీర్లూ, అంతా ఒకటే అంటున్నారు-బ్రాహ్మడికీ, శూద్రుడికీ, మాలడికి భేదం లేదంట. ఇదెక్కడన్నా కద్దా? ఏ ధర్మశాస్త్రంలో వుందీవిధంగా? వేదాల్లో వుందా? మనుశాస్త్రంలో వుందా? రామాయణంలో వుందా? భారతంలో వుందా?

అవన్నీ మీకేంతెలుసు? భారతంలో,రామాయణంలో మరీ మా బ్రాహ్మల గురించి యేమి తెగ వ్రాశారనుకున్నావ్? బ్రాహ్మల దెబ్బంటే అంత యిదిగా వుండేది! కాబట్టే, భారతంలో, రామాయణంలో నెలకు మూడు వర్షాలు పడేవని వ్రాశారు. ఏం కరణం? ఏం సుబ్బారెడ్డీ, అంతేగదూ? ఆ ఘట్టాలను మొన్న నేగదూ మనం జదివింది?....ఆఁ! అటువంటి ఆచారాలను, ధర్మాలను, కాదని కాలదన్నడం మూలాన్నే ఈనాడు వానలు లేక చచ్చిపోతున్నాం. కాబట్టి పెద్దోళ్ళు పెట్టిందానికి విరుద్ధంగా అందరూ ఒకటే అనడం బుద్ధితక్కువ. అసలు దేవుడే ఆ విధంగా యేర్పాటు చేశాడు. 'చాతుర్వర్ణ్యం మ్మయాసృష్టం' అని దేవుడే అన్నాడు. అంటే, కులాలు, కులభేదాలూ దేవుడే పెట్టాడ్రా! దానికి మనమేం జేస్తాం? ఆ విధంగా పుట్టిన తర్వాత, ఆ కుల ధర్మాలు పాటించడం తప్పుతుందా? ఎవడి కులవృత్తి వాడు చేసుకోవాల. మీ కులాన్ని కూలీనాలీ చేసుకొని బ్రతకడానికి పుట్టించాడు దేవుడు. ఆ వృత్తి చేసి తరించాల్సిందే. అసలు వృత్తిలో ఎంత గొప్ప వుందనుకున్నావు? ఒకడు చేసే వృత్తి ఇంకొకడికి నాలుక్కోసుకున్నా రాదు. ఏదీ, కుమ్మరివాడుతప్ప, సారెపై కుండను ఎవడన్నా తీగలడేమో చెప్పు? చెప్పులు కుట్టడం, మాదిగవాడు తప్ప మరెవడన్నా చేయగలడేమో చెప్పు? తెగిపోయిన నూలుపోగును, సాలెవాడుతప్ప తదితరుడెవడైనా, ఎంగిలికాదు సరిగదా, జిగురైనావేసి అతికించగలడేమో చెప్పు? ఇట్లాగే ఎన్నో వృత్తులు.ఒక చిన్న కతచెప్పతా వినండి! జాతివాళ్ళు మన దేశానికి వచ్చిన కొత్త కొత్తలో, మన విద్యలన్నీ నేర్చుకోడానికి ప్రయత్నించారట! మంత్రాలు, తంత్రాలు, సంస్కృతం, అవీ, యివీ, అన్నీ నేర్చుకొన్నారట! కడపటికి కుండలుచేసేకాడికొచ్చి, చేతగాక నిలిచిపోయారట! సారెతిప్పగలిగారట. కుండచెయ్యగలిగారట! సారెపై నుండి కుండ దింపుకోలేక పోయారట! సతపోరి, సతపోరి, చేతగాక

దండం పెట్టి పోయారట! అట్లాగా, కులవిద్యం టే యేమనుకున్నారు? 'కులవిద్యకు సాటిరాదు గువ్వలచెన్నా' అన్నారు పెద్దవాళ్ళు. అంతేగాని, మీరుకూడా ఎవరెవరి మాటలో విని, తొందర పడకండి. ఇతర్ల కులవృత్తి జోలికి పోకండి! బ్రాహ్మలకు వృత్తి చదువుకోటం, ఉద్యోగాలు చెయ్యటం, పౌరోహిత్యాలు చెయ్యటం. అసలు చదువు బ్రాహ్మలకే! ఇంకెవరికీ పనికిరాదు. రాజులు చదువుకోవచ్చు. కోమట్లు 'హడ. శూద్రులు గూడ పరవాలేదు! కాని, మాలమాదిగలు మాత్రం చదవగూడదని అన్ని శాస్త్రాల్లోనూ నిషేధింపబడివుంది. వాళ్ళు తాకితే మైలపడిపోతుంది సరస్వతి. అసలు మనుషుల్నే తాకూడదే- దేవుళ్ళను తాకొచ్చేరా? అయినా అందరూ చదువుకొని, కొలువులు చెయ్యనుపోతే సేద్యం, కూలీ ఎవరు చేస్తారు?

"ఇంకొక విషయం యేమిటంటే...." అనేటప్పటికి, అప్పటికే విసిగిపోయిన కొందరు యువకులు "ఇక చాల్లెయ్యా, చదువు మీకే గాదులే, మాక్కూడా. మేంగూడా మనుషులమేలే!" అని అరిచారు. శాస్త్రులు బిక్కమొగమేశాడు. సుబ్బారెడ్డి లేచి "ముయ్యండోయ్ నోరు! ఆఁహాఁ!" అన్నాడు. సద్దణిగింది.

శాస్త్రులు మళ్ళా మాట్లాడాడు, ఏదేదో మాట్లాడాడు. విన్నవాళ్ళు విన్నారు. పెడచెవినిపెట్టేవారు పెట్టారు. కొంతమంది ముసలివాళ్ళు మాత్ర. శాస్త్రులవారి వాదాన్ని మెచ్చుకొని "ఎంత బాగా చెప్పినాడురా!" అనుకుంటూ మనసులో దండం పెట్టుకున్నారు. ఇటీవల రాత్రిపూట చదువుకొనే యువకులకు గిట్టలేదామాటలు. ముసలివారికంటే వీరే యెక్కువమందున్నారు. శాస్త్రి మాటలు వారికి అసహ్యంగా కనిపించాయి. తక్షణమే జవాబు చెప్పాలనుకున్నారు. ఒకరొకరు హెచ్చరించుకొని అన్నారు: "అదంతా వీలు కాదండోయ్! మీకు మాదిరి మాకుగూడా చదువవసరమే. పలకాపుస్తకాలు కొనగలములేండి" అంటూ గబగబా

లేచివెళ్ళారు. త్రిమూర్తులు వెర్రిమొగాలేసుకొని, ఒకరిమొగం ఒకరు చూచుకున్నా రాశ్చర్యంగా.

త్రిమూర్తుల ఉపన్యాస ఫలితం మరునాడే కనిపించింది. అయ్య వార్లు ఆ రాత్రి వెళ్ళగానే యువకబృందం విన్నవించింది విషయమంతా. సాంతం విని, శాంతంగా సమాధానాలు చెప్పి, బాగా ప్రోత్సహించారు. "సంఘీభావం కలిగివుండండి. అపుడు ఎవరూ మిమ్మల్నేమీ చెయ్యలేరు. ఎన్ని పనులైనా సులభంగా నెరవేర్చుకోవచ్చు" అని ఇంకా నెన్నెన్నో చెప్పారు.

రైతులకిపుడు మాలవాళ్ళు పొగురుబోతులుగానూ, బుద్ధిహీనులుగానూ కనబడుతున్నారు. వాళ్ళనుచూస్తే కోపం వీళ్ళకు. సాధారణంగా యిదివరకు మగవాడికి మూడణాలున్నూ, ఆడదానికి రెండణాలున్నూ కూలి యిచ్చేవారు. కాకపోతే రెండుశేర్లుగానీ, ఒకటిన్నరశేర్లుగానీ గింజ లిచ్చేవారు. ఆ కూలితో వారికవుతుందా? ప్రొద్దస్తమానమూ పనిచేస్తే అ పనిచేసే వ్యక్తికి ఒక పూటకైనా సరిపోని కూలి యిస్తారు. ఆ అమాయకులు అంతే అనుకొని వూరుకొనేవారు. కొన్నినెలలక్రితం, ప్రక్కపల్లెలలో కూలి యెక్కువ చేశారని గోలపెడితే ఇటీవల కాస్త ఎక్కించారు. ఇటీవల పేపర్లలో సమ్మెలు, హక్కులు మొదలైన విషయాలు విని, కాస్త ఆందోళన చేసేటప్పటికి, కూలి మరీ తగ్గించారు. కూలిచేసి యింటికొచ్చి గింజలివ్వమంటే, రేపిస్తాంపో, యెల్లుండిస్తాంపో అని తిప్పేవారు. ఘట్టిగా అడిగేందుకు వీల్లేదు. ఒకవేళ యెవడైనా అడిగితే "ఎంతపొగుర్రా?" అని తిట్టేవారు. పోనుపోను రైతుల దౌర్జన్యం యెక్కువయింది. కూలీలను చాలా నీచంగా చూడడం మొదలుపెట్టారు.

ఒకనాడు నారాయణ, కేశవరావులు వెళ్ళికూర్చున్నాక, ఒకడు ముందుకొచ్చి "సార్! మా కూలి విషయాలు చాలా తలక్రిందులుగా

వుండాయ్ సార్! పూర్వం కంటే తిట్టి తిట్టి యెక్కువ పని చెయ్యించు కొనేదే గాకుండా, కూలి సరిగ్గా యియ్యటం లేదు. కొంచెం ఆలోచిస్తే బాగుండు" అన్నాడు. అందరూ అదుర్దాగా ముందుకొచ్చి, "అదేసార్, మిమ్మల్నడగాలనుకుంటున్నాం" అన్నారు. "సమ్మె చేస్తే బాగుంటుంది" అన్నాడు మరొకడు.

"ఓ - భలేబాగుంటుంది" అన్నారందరూ.

మరునాటి నుండీ సమ్మె. కూలీలకోసంవచ్చిన రైతల్లా వెనక్కి పోతున్నాడు కోపంతో. ఊళ్ళో అంతా ఆలోచనలే! కొంతసేటికి సుబ్బా రెడ్డి వచ్చాడు. మాలలు పలకలేదు. కరణం, శాస్త్రి రోడ్డుపై నుండే పిలవమన్నారు మాలల్ని. ఒక్కరూ పోలేదు. కోపం అమితంగా వచ్చింది. సమ్మెందుకో అడిగారు. కారణంగూడా చెప్పలేదు. రైతులంతా శాస్త్రులింటిదగ్గర సమావేశమయ్యారు. ఎవడి నోటికొచ్చింది వాడు వాగే స్తున్నాడు. శాస్త్రులకు మంచిసమయం ఇది హరిజనులపై దెబ్బతీడానికి. అయ్యవార్లపై గూడా కసితీర్చుకోవచ్చనుకున్నాడు, రైతులంతా ఏకం కావటం చూచి.

"పోనీండ్రా, వాళ్ళు సమ్మెకడితే మనకేమి?" అన్నాడు.

"అదేంమాట? మా పనులు సాగొద్దో!"అన్నారంతా ఒక్కుమ్మడిగా.

"అది వాళ్ళయిష్టం" అన్నాడు శాస్త్రులు మళ్ళా.

"తెలుస్తుందిలెండి యెవరిష్టమైందీ" అన్నారు కొంతమంది మీసాలు మెలివేస్తూ.

"మీమొఖం, మీవల్ల యేమవుతుందర్రా! మీలో సత్తా వుంటే వాళ్ళ ఆటయెందుకాడతారూ?"అన్నాడుమళ్ళా శాస్త్రులు ఇంకాపురెక్కించడానికి.

"చూద్దురుగానిలెండి ఢడాకా" అన్నారు రామయ్య బృందం. శాస్త్రులు మొదలుపెట్టాడు:

"యెవరిపైన్నో పడతారెందుకర్రా? బీగం పెట్టి తిప్పితే తాళం వూడొస్తుంది. ఇదంతా అయ్యవార్లు చేసినపనే. వాళ్ళు వాళ్ళకు చదువు చెప్పి, వెధవ సమాచారాలంతా చెప్పకుండా వుంటే వాళ్ళీ విధంగా రైతుల్ను ధిక్కరించే వుండరు. మన పనుల్ను, మన కులాల్ను చెరచడమే కాకుండా, మన మానం గూడా తీడానికొచ్చారీ అయ్యవార్లు."

"ఛట్! ఈ అయ్యవార్లకు బుద్ధి చెప్పాల్సుందే మొదట" అన్నాడొకడు.

"పదండిశీ, పదండ్రాముందూ" అంటూ గబగబా బయలుదేరారు కొంతమంది.

అప్పటికి ఉదయం పదిగంటలయి వుంటుంది. ఆనా డాదివారమయిందానివల్ల బడి లేదు. ప్రైవేటు పిల్లలు మాత్రం వున్నారు. అపుడే భోజనం ముందు కూర్చున్నారు అయ్యవార్లు, నారాయణన్నాడు—

"కేశవ్! తర్వాత చెబుతానన్నావుగదా, ఆ విషయం చెప్పవూ?"

"ఏ విషయం?"

"జాబు విషయం."

"ముందూ సమ్మె విషయం ఆలోచించబోయ్! మిగిలినవన్నీ తర్వాత చూచుకొందాం" అన్నాడు చిరునవ్వుతో.

"చిత్తం, చిత్తం, బాగా సెలవిచ్చారు. సమ్మె నడుస్తుంది లెండి!"

"అయినా చాలా దౌర్జన్యంగా మాట్లాడుకుంటున్నారట రైతులీవిషయం."

"అది కొత్తేమిటి? పోనిద్దూ. కప్పిపుచ్చడానికి, నీ యెత్తులూ నువ్వూను. అయితే ఆ జాబు వ్రాసినమ్మా యెవరు?"

ఇంతలో పెద్ద కోలాహలం వినిపించింది బయట. ఏవేవో అరుపులు వినవస్తున్నాయ్. అంతకంతకు, కొంత స్పష్టమైన మాటలు వినిపిస్తున్నాయ్. బడిముఖమై ఏదో ఒక గుంపు వస్తున్నట్లు గమనించారు. తదేక దీక్షతో, అన్నం చాలించి వింటున్నారు. ఒకడు 'ధఢీ' మని తలుపును తన్నాడు. వెనక అనసూయ వచ్చింది. ఆ కోపంతో వచ్చిన మూకను చూచి నాగలింగం ఆ ప్రక్కనే ఒదిగి కూర్చున్నాడు. శ్రీలక్ష్మి అనసూయను పట్టుకొని నిల్చుంది.

"లేరంట్రా వాళ్ళు?" అన్నాడొక డందులో.

"ఏట్రా, పారిపోయినట్టుంది." మరొక కంఠం.

"ఆడు అసలు బాపనోట్రా! ఇంకా వుంటాడా పారిపోక?" ఇంకొక కంఠం.

"లోపల చూడండ్రా!'' మరొక కంఠం.

ముందు కడుగేసింది మూక. తటాలున తలుపు తెరిచాడు కేశవరావు. ఎంగిలి చేత్తో నిలబడ్డాడు నిశ్చేష్టుడై. నారాయణ వెనక నిలబడ్డాడు ఆదొక మోస్తరు గాభరాగా.

"చూస్తారేంరా తన్నకుండాను'' అన్నాడెవడో. మూక ఇంకా ముందుకు సాగుతూంది.

"ఏయ్‌యేయ్! నిలండి" అని కేకేశాడు సుబ్బారెడ్డి కొడుకు రామిరెడ్డి, అడ్డంగా చేతులు చాపి నిలబడి. కన్నీళ్ళు గారుస్తూ "జాగ్రత్త!" అంది అనసు.

"ఇంకా యింత సేపట్రా?'' ఒకడు.

"నాలుగు వాయించండశీ!" ఇంకొకడు.

"వొదిలితే కాదురోయ్!'' మరొకడు.

మూక ముందు కొస్తున్నది. కేశవరావు బెదరకుండా నిలబడ్డాడు. రామిరెడ్డిని తోసుకొస్తున్నారు. శ్రీలక్ష్మి తలుపు గొళ్ళెంపెట్టి, పట్టు కొంది గట్టిగా. అయ్యవార్లు లోపలుండి తియ్యమన్నారు. శ్రీలక్ష్మి తియ్య లేదు. ఒకడు రామిరెడ్డిని చెంపకేసికొట్టాడు. కెవ్వన కేకేశాడు రోషంతో. చిలుకు తీయబోయాడొకడు బలవంతంగా. కసిదీరా కొరికారు వాడిచేతిని అనసూయా శ్రీలక్ష్మలు. ఇంతలో ఏమవుతూందో పదండంటూ పరు గెత్తి రెడ్డి, శాస్త్రీ, కరణం వచ్చారక్కడికి మిగిలినవారితో కలిసి.

"ఆగండ్రా!'' అన్నాడు రెడ్డి. కదలకుండా నిలబడ్డా రెవరిపాటికి వారు. పిల్లల ప్రవర్తన చూచారు వారు. ముక్కుమీద వేలేసుకొని, "ఏమి టిదంతా, తొందరపడతారెందుకు?'' అన్నారు.

"చదువు చెప్పి, జ్ఞానాన్ని ప్రసాదించే అయ్యవార్లపైకా యీ విధంగా రావటం?" అన్నాడు రామిరెడ్డి.

"వాళ్ళ తప్పేముంది? అంతా యీ ముగ్గురే!" అంది శ్రీలక్ష్మి, ఉదయం అంతా చూచిందిగాబట్టి. మన త్రిమూర్తులు బిత్తరపోయినట్లు చూస్తున్నారు. కరణం "హూఁ" అని గదమాయించాడు శ్రీలక్ష్మిని. ఇంతలో తలుపు తెరిచింది అనసూయ. అయ్యవార్లు, త్రిమూర్తులు ఒకరిమొగాలొకరు చూచుకున్నారు. వాళ్ళచూపులు మాట్లాడుకున్నాయ్.

''పొరపాటు జరిగింది" అన్నారు త్రిమూర్తులు. "మేము దానికేమీ చింతించడం లేద"న్నా రయ్యవార్లు. "మాయింటిదాకా రండి, మీకేమీ ఫరవాలేదు" అన్నాడు శాస్త్రులు.

"మాకు అభయం అక్కర్లేదు. మాకాభయాలు లేవు."

"రావడానికి వీల్లేదు" అన్నారు శ్రీలక్ష్మి, అనసూయలు. పిల్ల వాళ్ళవైపు అట్లాచూశారయ్యవార్లు. చూపులు ప్రక్కకుతిప్పి నిలబడ్డారు. బయలుదేరా రందరూ. అందరూ వెళ్ళాక ఒకర్నొకరు హెచ్చరించు

కుంటూ పిల్లలుగూడా వెళ్ళారు శాస్త్రిలింటికి. నాగలింగం ఇపుడు ముందూవచ్చి నిలబడ్డాడు. శాస్త్రిలింట్లో అందరూ కూర్చొన్నారు. చాలా మంది ముంగిలితెరవలో నిలబడేవున్నారు. శాస్త్రిలన్నాడు :

"కేశవరావ్హూ, ఇప్పటికైనా అర్థమయిందా?"

లోలోపల మండిపోయిందయ్యావార్లకు. ఆ పరిస్థితుల్లో ఆ మాట యెంత ఉపద్రవమైందో శాస్త్రికి తెలీదేమో! అయినా త్రుళ్ళిపడే సమయం కాదది. శాస్త్రి కాస్త దార్లో పడ్డాడనుకున్నాడు కేశవరావు. బాగా బుద్ధి చెప్పాలీదఫా అనుకుంటున్నాడు—అయితే మనోవికారం పొందని వ్యక్తి లాగా నిశ్చలంగా, ధీమాగాకూర్చొని,

"ఏమిటి?" అన్నాడు.

"చూస్తూ యేమిటంటే?"

"నాకేమీ అర్థం కావటంలేదు."

"చెబుతా విను. మీ వాలకం అంతబాగులేదు. మీ ప్రవర్తనే యింత చేసింది."

"మా ప్రవర్తనవల్ల యేంలోపం జరిగిందీ?"

"ఇదే, మాలలు తిరగబడటం - రైతుల్ను లెక్కించకుండా పోవటం......—అన్నీని."

"మాలలు గూడా మనుషులమాదిరి సంచరిస్తున్నారనా?"

"అదో, ఆ ధోరణే వద్దంటూంట. ఎపుడు పట్టినా మాలలు, మాలలు! యేమిటయ్యా, నీవు గూడా మాలవాడివై పోదామనుకున్నావా యేం? అసలూ, యీ యింగ్లీషువచ్చినవాళ్ళు మాలా మాదిగలకన్నా కనాకష్టం. సరేగాని, నీవు బాపనోడివై పోతివే, మాలల్ను ముట్టుకోడం, వాళ్ళచేత కుండలు తాకించడం, శూద్రులతో కలిసి భోంచెయ్యడం, యివన్నీ

యేమిటయ్యా?" అన్నాడు నారాయణను చూస్తూగూడా ఉపేక్షాభావంతో. నారాయణ మొగం ముడుచుకున్నాడాసంభాషణ విని. కేశవరావు పట్ట లేకపోయాడు. అటు పిశాచాలాడే శాస్త్రి మొగంవైపు, ఇటు అవమాన భారంచేత నల్లబడివుండే నారాయణ మొగంవైపు చూచాడు. అమాంతంగా శాస్త్రిలపైబడి గొంతు నులిమేద్దామా అన్నంత ఉత్క్రోషం వచ్చింది. బుద్ధి చెప్పాలనుకున్నాడు.

"అయ్యా! మీరిన్నేండ్లు జీవించారేగాని, లోకజ్ఞాన మెట్లాంటిదో తెలీదు. ఎవర్ని గురించి మాట్లాడుతున్నామా, యేమి మాట్లాడుతున్నామా అనే వివక్షత లేశమాత్రం గూడా లేదు; బ్రాహ్మణుడంటే అర్థం తెలియని మీబోటి వారంతా బ్రాహ్మణులుకారు. జందెం తగిలించుకొని, కుల భేదాలు పాటించి, యితర్లను నీచంగాచూస్తేనే బ్రాహ్మణుడౌతాడనుకున్నావేమో! నీవంటి కపటు లెన్నటికీకారు. నీవన్నటువంటి మాల, శూద్ర, బ్రాహ్మణ వ్యత్యాసాలేమీ నాకులేవు" అంటూ అట్లా చూశాడు. ఎవరో ఊరి వారంతా అయ్యవార్ల మీద పడ్డారని విని, కొంతమంది హరిజనులు పరుగెత్తుకొచ్చారు. అప్పుడే ఒగిరిస్తూ వచ్చి నిలబడ్డ వాళ్ళను చూచి, కొంత ఉద్రేకంతో—

"ఆ మాలలు, శూద్రులు, నీబోటి బ్రాహ్మణులు, అంతా ఒకటే. మీ యింతమందిలోనూ, నాకేమీ ప్రత్యేకత కనబడలేదు. అందరూ ఒకేవిధంగా పుడతారు. పుట్టేటప్పుడు, వీడు ఫలానా మతంవాడు, ఫలానా కులంవాడు అని నొసట వ్రాసి వుండలేదు. తర్వాతనే యీ మార్పులు. మనం కల్పించుకొన్న మార్పులు. పుట్టుక యెట్లాగో, చావు గూడా అందరికీ ఒకటే. ప్రాణం పోవడం బ్రాహ్మడికి ఒకటే, శూద్రుడికీ ఒకటే, మాలడికీ ఒకటే.

"మరొక విషయం శాస్త్రులుగారూ! మనుష్యులు పుట్టేటప్పుడుగానీ. చచ్చేటప్పుడుగానీ, నిద్రించేటప్పుడుగానీ, అంతా సమానులే, అపుడు

కులం, మతం, భాగ్యం, బీదరికం, చిన్నా, పెద్దా ఏమీఉండవు. ప్రస్తుతం మన మనుకుంటున్న భేదాలు మనం కల్పించుకొన్నవే. స్వార్థపరుల కల్పితాలు! హృదయరహిత చేష్టితాలు. అంటరాదనేదెంత అమానుషమో యెంత మతిహీనతో ఆలోచించండి! మనిషికి హృదయం ప్రధానం-వేషం గాదు. నీవెంత లావు జందెం వేసుకున్నా, ఎన్ని కొంగ జపాలు చేసినా, నీ హృదయం మంచిదికాకపోతే - దేవుడే నిన్ను ఇతరులచేత నీచంగా చూడబడేటట్లు చేస్తాడు. అటువంటి వేషాలు లేకున్నా, నీ హృదయం మంచిదై, ప్రేమ మయమైతే, దేవుడు నిన్నందరిచేతా ప్రేమింపజేస్తాడు.

"ఈ భేదాలన్నీ కేవలం మానవ కల్పితాలని తెలుసుకో! మొన్న మాలవాడలో నీవన్నట్లు దేవుని కల్పితాలు కావు. దేవుడు తన బిడ్డల నెప్పటికీ భాగించి, నీచంగా ప్రవర్తించడు. ఆ మాటకే దేవుడు త్వరలో మీకు పెద్ద శిక్ష విధిస్తాడు."

అది శాపంలాగా గుండెలో జొరబడింది శాస్త్రికి. ఏదో నిజంగానే భయపడ్డాడు. అందరూ విస్తుపోయి చూస్తున్నారు కూర్చొని. అయ్యవార్లు బుర్రున లేచి వెళ్ళారు.

వారి వెనుకనే సీరియస్‌గా బయలుదేరింది శిష్యబృందం. నేరుగా రెడ్డింటి కెళ్ళారు. అనసు రూంలోకెళ్ళారు శ్రీలక్ష్మి అనసూయలు. సీరియస్‌గావున్న లక్ష్మి, అనసు పావడపైన రక్తము చూచి "ఓహో! ఇంకేం?" అంది కులుకుతూ.

గుడ్డలు మార్చేందుకుపోతున్న అనసు తిరిగిచూచి, "ఏమిటే?" అంది పరధ్యానంగానే.

"ఇంకా యేమిటి? మాకంతా నూజిమ్మిలీ, సలిపిండీ దొరుకు తుందన్నమాట!" అంటూ పావడ కేసి చూచింది కొంటెగా.

"ఛీ! నీవెప్పుడూ యింతే" అంటూ పెట్టెలో పావడ పైకితీసి లేచేటప్పటికి రామిరెడ్డి వచ్చాడు. వస్తూనే—

"యెంత రక్తం! శ్రీనేదే?" అన్నాడు.

శ్రీలక్ష్మి చూశ్శేదుగదా, అన్నగూడా చూశ్శేదనుకుంది అనసు తన చర్య. కొంచెం సిగ్గుపడి—

"యింటికెళ్ళాడిప్పుడే" అంది.

"ఏమిటే, యెందుకూ, ఏమిటిదంతా! చెప్పవూ?" అని అర్థించింది

అనసు అంది—

"మా అన్న వాళ్ళనడ్డాడు. నీవు మా అన్నకు కుడిభుజం లాగా తలుపు చిలుకేశావు. మా అన్న ప్రక్కగా వచ్చి అడ్డుతున్న శ్రీనును ఎవడో 'మాల ముండాకొడకా!' అని గట్టిగా కొట్టాడు. చెంపమీద నుండి కొద్దిగా జారి ముక్కుపై గూడా తగిలింది. పట పట నెత్తురు చుక్కలు రాలాయి ముక్కు రంధ్రాల్లో నుండి ముక్కు అదిరి. పడ బోతున్నాడు. తక్షణం పట్టుకొని కొద్దిగా నడిపించి ప్రక్కకు తీసుకెళ్ళి వసారాలో కూర్చోబెట్టాను. తడిగుడ్డ కావాలిగదా! ఎక్కడొస్తుంది?ఆదరా బాదరా నా పావడ తడిపాను. పడుకోబెట్టి మొగం బాగా తుడిచి, చన్నీటి తడుపు ముక్కు దగ్గర పెట్టినకాసేపటికి రక్తమాగింది, నాగలింగం నా ప్రక్కనే వున్నాడు. ఇంతలో అందరూ మా యన్నను కొట్టి తలుపు దగ్గరికి రావటం చూచి పరుగెత్తా నక్కడికి. నీతోపాటు ఆ పాపిష్టివాడి చెయ్యి కొరికాను" అంటూ "అన్నా! శ్రీలక్ష్మి కెంత ధైర్యమో చూడు! నీ వెనకనే రంయ్‌మని వచ్చింది రంగంలోకి. నిన్ను కొట్టేటప్పటికి,

శ్రీలక్ష్మి మొగం యెట్లా అయిందనుకున్నావ్? మొగం అంతా కోపంచేత ఉంగ్రించి వుంది. కండ్లలో నీళ్ళు పారాడుతున్నాయ్. పండ్లు పటపట కొరుకుతూ తీవ్రంగా చూస్తూంది. ఆ కోపమంతా చిలుకు తీడానికి వచ్చిన వాడిమీద చూపింది" అనేటప్పటికి కృతజ్ఞత, అనురాగం, ఒక విధమైన ఆవేశం పైకుబికిరాగా, ఉత్కంఠతో "బలే అమ్మాయ్ శ్రీలక్ష్మి" అన్నాడు ముందువాలి సోలిపోతున్నట్లుగా. కొంచెం సిగ్గుతో అనసూయ వెనక్కి వెళ్ళి రెప్పలారుస్తూ చూస్తూ నిలబడింది శ్రీలక్ష్మి. తటాలున రూముకు పరుగెత్తి, తక్షణం తిరిగివచ్చి, "శ్రీలక్ష్మి! నీకిదో ప్రజంటు" అంటూ మిఠాయి చూపించాడు మంచంపై కూర్చొని రెడ్డి.

"అబ్బే, శూద్రులు చేసింది తింటామా? మా నాన్న తినగూడదన్నాడు తెలుసా?" అంది చిరునవ్వుతో, రెప్పలాడిస్తూ, మనిషంతా పదివంకర్లు తిరిగి.

"నిజమే లెండి. తింటే అరగదు" అన్నాడు రామిరెడ్డి కూర్చున్న వాడల్లా కొంచెం నీల్గి, మొగం అదోక మోస్తరుగా పెట్టి. "అంతే" అంటూ చేతిలోది తటాలున లాక్కొని, ప్రక్కన కూర్చొని సగం తాను తీసుకొని మిగిలింది తన చేతిలో పెట్టబోయి, వెనక్కిలాక్కొని, అనసూయ చేతిలో పెట్టి, తాను కొంత నోట్లో వేసుకుంటూ,

"యిదో" అంది. రామిరెడ్డి చెయ్యి చాపాడు.

అంతా నోట్లో వేసుకొని, పైకి వేలు చూపించింది, అందరూ నవ్వుతున్నారు, ఇంతలో నాగలింగం వచ్చాడు. "అయ్యవార్లేం చేస్తున్నారో పదండి చూద్దాం" అంది శ్రీలక్ష్మి. అందరూ వెళ్ళారు బడికి. వెళ్ళేటప్పటికి అయ్యవార్లిద్దరూ కూర్చొని చిన్నగా మాట్లాడుకుంటున్నారు. బైట కొట్టం తలుపు మూసివుంది. వీరంతా తలుపు దగ్గర చేరారు. 'సద్దు' చెయ్యవద్దని ఒకర్నొకరు సైగలతో హెచ్చరించుకుంటూ నిలబడ్డారు, చెవులు తలుపుసందులకు తాకించి.

"అదే నేనంటూంట - పిల్లవాళ్ళెంత ధైర్యంగా నిలబడ్డారో చూచావా? తలుపు సందులోంచి చూస్తూనేవున్నా. రామిరెడ్డి చేతులుచాచి నిలబడ్డాడు. శ్రీలక్ష్మి వచ్చి చిలుకువేసి, ధీమాగా నిలబడింది ఒడ్డుకొని." "అది ధైర్యంకాదు. అయ్యవార్లపై ఈగగూడా వాలగూడదనే ప్రేమ. అదే మొండిధైర్యానికి ప్రోత్సహించింది." "శ్రీన్నెవ్వడో కొట్టాడోయ్, అనుసు వెళ్ళింది, చూశావా? వాళ్ళు గురువులయెడ విధ్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తూనే, పరస్పరం ఒకరికొకరు తాపత్రయపడటం! రామిరెడ్డికి కుడిభుజంగా శ్రీలక్ష్మి ప్రాణాలొడ్డి నిలిస్తే, శ్రీను కత చూచుకోవడానికి అనసు పారిపోయింది" ఇట్లా అయ్యవార్లు మాట్లాడుకుంటూంతగా, ఎవరో వస్తున్నట్లు గమనించడంవల్ల, పిల్లవాళ్ళంతా ఒక్కసారి దూరారు తలుపుతోసుకొని. ఏమీ తెలియని వ్యక్తుల్లాగా ఒక అరుగుపై కూర్చు న్నారందరూ పలకలు తుడుచుకుంటూ, పుస్తకాలు తీసుకుంటూ.

ఇంతలో ముదాం వచ్చి, "నారాయణయ్యవోర్ని రెడ్డి పిలుస్తా వుండాడండీ!" అన్నాడు. సరే వెళ్ళిరమ్మనగానే నారాయణ బయలు దేరాడు. సుబ్బారెడ్డి అపుడే వచ్చి, చొక్కాగిక్కాతీసి, దండెంపై వేసి విసనకర్రతో విసురుకుంటూ మొగసాలలో కూర్చున్నాడు. నారాయణను చూస్తూనే "రా, నారాయణా, కూర్చో!" అన్నాడు శాంతంగా. ఏదో ప్రక్కకు చూస్తూ కూర్చున్నాడు నారాయణ. కాసేపు ఎవరూ మాట్లాడ లేదు. నారాయణకు మాట్లాడ్డానికే మనస్కరించలేదు. సుబ్బారెడ్డికి సంభాషణ ఎట్లా ఉపక్రమించాలో తెలియలేదు. కడపటికి సుబ్బారెడ్డే అన్నాడు—

"చాల పొరపాటు జరిగింది" అని.

"దాంట్లో యేముందిలెండి? వారి భావాలెట్లా పొర్లాయో, ఆవిధంగా ఆచరించారు-అంతే" అన్నాడు నారాయణ మామూలుగానే. మనసులో

ఏమీ బాధ కనుపించలేదు. అంతకు ముందే కేశవరావు "ఎందుకు నారాయణా, అట్టా ఫీలవుతావు? ఇవొక లెక్కా? ఇట్లాంటి వెన్నో యిక. ఈ కొంచానికే యింత అయింది. ఇంకా ఎంతవుందో చూడు చెయ్యాల్సింది? దాని కెన్ని అడ్డంకులు, ఎన్ని ప్రతిఘటనలు ఉంటాయో చూడు" అని ఇంకా ఏమేమో చెప్పిన పలుకులన్నీ మళ్ళా నెమరువేసుకుంటున్నాడు.

"ఏమి టాలోచిస్తున్నావు?" అన్నాడు రెడ్డి.

"ఏమీ లేదు. మా కేశవరావును గురించే."

"చాలా గట్టివాడు. బలే గుండె నిబ్బరం! యివన్నీ ఎప్పటి నుండి నేర్చుకున్నాడో! వాళ్ళమ్మా, నాన్నా నేర్పారా యివన్నీ? శూద్రుల్తో కలిసి తినడం, మాలవాళ్ళని తాకడం చిన్నప్పటి నుండీ వుందా?"

ఇంతలోకే భోజనానికి పిలుపు వచ్చింది. "లే, నారాయణా! ఈ దినం ఇక్కడే భోంచెయ్యి" అన్నాడు రెడ్డి.

"అక్కర లేదండీ, భోంచేశాం యిప్పుడే. మీరు కానివ్వండి."

"సరేగానీ, మీ కెప్పటి నుండి సావాసం?"

"నేను హైస్కూల్లో చేరినప్పటి నుండి."

"అపుడు గూడా యింతేనా?"

నారాయణ కొద్దిగా నవ్వాడు. అన్నాడు :

"అప్పటి అతని కత వేరు. అప్పటి అతని వాలకం జూస్తే, చాలా పూర్వాచార ధురంధరుల యింట్లో పెరిగి, ఆ వాతావరణాన్ని బాగా నమ్మిన మూఢ బానిసలాగా కనిపించేవాడు. అంతే అయివుంటుంది. మొదట అతను హైస్కూలులో చేరినప్పటి విషయం తల్చుకుంటే చాలా విచిత్రంగా వుంటుంది. నవ్వు గూడ వస్తుంది. తొలినాడే నాన్నతోకూడా ఒక హోటల్‌కు వెళ్ళి నెల కింతా అని ఒప్పుకున్నాడు. ఆ రోజుల్లో చాలా

మంది విద్యార్థులు హోటళ్ళలో భోంచేస్తూ పెట్టి, బట్టలూ అక్కడే పెట్టుకొని ఉండేవారు. కొంత మంది రూమ్ గూడా తీసుకొని హోటల్లో భోంచేస్తూ వుండేవారు. ఆ దినం వాళ్ళ నాన్నతో పాటు లోపలే భోంచేశాడు. ఆ హోటలులో నానా జాతులు కలిసి భోంచెయ్యటం చూచాడు. నానా కుల విద్యార్థులొచ్చి ఒకే పంక్తిలో కూర్చుని వేళాకోళం చేసుకుంటూ భోంచేసేవారు. 'ఛా! బ్రాహ్మలు గూడా యింత అన్యాయం చేస్తున్నారే' అనుకున్నాడు. తాను మాత్రం హోటల్ అయ్యర్‌ను బ్రతిమాలి తనకు లోపల పెట్టమన్నాడు. ఏదో పిచ్చిరకంలాగున్నాడే అని అయ్యరు సరే అన్నాడు. పాపం, కొనాళ్ళు అతి ఛాందసంగానే భోంచేశాడు. ఆ హోటలు చిన్నది. ఒక చిన్న రూంలో వంట చెయ్యటం. ప్రక్కనున్న మరొక చిన్న గదిలో సామాన్లు పెట్టుకోడం. కేశవరావు కొద్ది దినాలు సామాన్ల గదిలో తినేవాడు. అక్కడ ఒక విధమైన సహించరాని కంపు కొట్టేది. అయినా సహించి తింటూ వుండేవాడు. అది తృప్తిగానే వుండేది తనకు. కొన్నాళ్ళు జరిగాక సహించుకోలేకపోయాడు. వంటింట్లో పెట్టమన్నాడు. అక్కడ ఉక్కబెడుతుంటే - మరొక ప్రక్కన పొగ చుట్టుకొని కంట్లు మంటలెత్తుతుంటే - కన్నీళ్ళు తుడుచుకుంటూ, చెమటలు తుడుచుకుంటూ, చీమిడి ఎగజీదుకుంటూ, వంట చేసేవాళ్ళు చూడనప్పుడు కాస్త తీసి గోడకు వేస్తూ, అవస్థపడుతూ తినేవాడు. బైటతిని కులం చెరుచుకొనేవాళ్ళకంటే నేనెంతో నయం గదా అని లోలోపల తృప్తిపడేవాడు. అతనికి అదిగూడా కష్టమనిపించినా, విధిలేక తింటూనే వున్నాడు. తనకేమీ చీకాకు వేయలేదు గాని, వంట వాళ్ళకిబ్బంది కలిగింది, 'ఏమిటిది' అని సణుగుకున్నారు చాలాసార్లు. అయ్యర్‌కు చాలా చీకాకు వేసింది, ఒకనాడన్నాడుగదా :

'ఎన్నాలిట్టనయ్యా? బైటదా కూర్చోని తినిమీ. నీ కొమ్ము లూడసవులే.'

ఆ చీదరింపు చూచి, మనసులో తిట్టుకుంటూ, బయట్నే యెవర్నీ తాక్కుండా కొన్నిదినాలు భోంచేశాడు. అక్కడ తినేవాళ్ళంతా అతని వైపు విచిత్రంగా చూస్తూ, హేళనగా నవ్వేవారు. అన్యాపదేశంగా గేలి చేసేవారు. ఇతని కత స్కూలంతా తెలిసింది. ప్రతివాడూ 'ఏయ్, పల్లెటూరి బైతూ' అనేవారు.

ఇతని జుట్టు బలే తమాషాగా వుండేది. కొప్పెరజుట్టు. జుట్టు ముడేసేవాడు. చుట్టూ గొరిగించేవాడు. పిల్లవాళ్ళంతా ఆ జుట్టులో పుల్లలు చెక్కేవారు. కోడికలు చెక్కేవారు. బాగా ఏడిపించేవారు. అందరితోనూ దెబ్బలాడేవాడు.

క్లాసులో ఆతనికింకొక చిక్కొచ్చింది. అతని ప్రక్కలో తెల్లని గుడ్డలు వేసికొని, ఒక నాజూకు పిల్లవాడొకడు కూర్చొనేవాడు. ఏదో ఒక విధమైన కొద్దిపాటి స్నేహం ఏర్పడింది. ఎందుకంటే, వాడీతనిని ఎగతాళి చెయ్యడుగనుక. కొన్నాళ్ళుగడిచాక-

మదనగోపాల్, మీదేకులం?" అన్నాడు.

"హరిజన్."

ఆ మాట వినేటప్పటికి కేశవరావు హృదయంలో కెళ్ళింతలు బయలుదేరాయి. తక్షణం బెంచీ మార్చాడు. కొంతసేపట్లో ఆ బెంచీలో మామూలుగా కూర్చునే పిల్లవాడొచ్చి లేపాడు. ఇంకొక బెంచీ దగ్గరి కెళ్ళాడు. వాళ్ళూ రానీలేదు. కడపటికి తన సీటుకేవచ్చి ఒదిగొదిగి కూర్చునేవాడు తాకకుండా. ఒకవేళ తాకితే హోటల్ కెళ్ళింతర్వాత కాస్త పసుపునీళ్ళు చల్లుకునేవాడు.

ఇట్లా ఉండేవాడు. నా కంటే అతను రెండేండ్లు సీనియర్. అయితే అతను చేరినప్పటినుండీ తెలుసు. కొంచెం కొంచెమే మారుతూ కాస్త దారిలో పడ్డాడు. ఆ సమత్వభావాలతనిలో ఫలానా విధంగా పోయా

యని చెప్పడం కష్టంగాని నాలుగోఫారాని కొచ్చేటప్పటికి, కులాలంటే వుత్తదంటూ, మాలల్ని చూస్తే 'అయ్యో' అంటూ వచ్చాడు. క్రమేణా మాలమాదిగల పైనుండే అసహ్యం ప్రేమగా మారింది. అప్పట్లో రాజకీయ సంచలనం ఎక్కువగా వుండేది. చాలామంది స్వరాజ్యాభిలాషులైన అయ్యవార్లు రాజకీయ విషయాలను గురించీ - సాంఘిక విషయాలను గురించీ-రాజకీయనాయకుల గురించీ-వారి వారి ఆశయాలూ, త్యాగాలూ మొదలైన వానిని గురించీ చెప్పేవారు. కేశవరావు చాలా శ్రద్ధగా, తదేక దీక్షతో అన్నీ వినేవాడు. ఉద్రేకం అతనిలో పెల్లుబికేది. దేశసేవ చేద్దామనుకొనేవాడు. ప్రతి దినం పేపరేగాకుండా, ఇంకా కొన్ని పుస్తకాలు చదివేవాడు. గాంధీజీ అడుగుజాడల్లో నడవాలనేవాడు. మేమందరం ఒక గ్రూపుగా ఉండేవారం. అతను విషయాలన్నీ బాగా చదివి మాకు చెప్పేవాడు.ప్రతి దినమూ ప్రార్థన సమావేశంలో ఏదో ఒక విషయాన్ని చెప్పేవాడు. తాను స్కూల్ ఫైనల్‌కి వచ్చేటప్పటికి, అందరి దృష్టిలోనూ పెద్దవాడయ్యాడు. మాకంతా నాయకుడివంటివాడంటే బాగుంటుంది. చదువు మాత్రం బాగా చదివేవాడు. చాలా వాటిల్లో బాగా ఆదర్శంగానే వుండేవాడు. మాకు ఎడబాటు వచ్చింది. తాను కళాశాలలో ప్రవేశించాడు. కేశవరావువంటివాళ్ళకు కళాశాలలే మంచి రంగాలు. అక్కడికివెళ్ళి, తన విషయాలూ, మీటింగులూ అన్నీ వ్రాసేవాడు మాకు. అక్కడ గూడా అందరు విద్యార్థులకు తల్లో నాలుకవలెనే మెలిగినాడు. ఇంటరు అయిపోయింది. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. ఇంటికొచ్చాడు ఆ వేసవిలో. తండ్రి, జందెం లేకుండా ఉండటం చూచి కోప్పడి 'జందెం వేసుకో' మన్నాడు.

"నేను వేసుకోను" అన్నాడు.

"ఎందు వేసుకోవురా?"

"దాంట్లో ఉపయోగం కనిపించడం లేదు."

"కనిపించకపోతే మాన్లేరా నాయనా, వేసుకోరా నామకేవాస్తే."

"అంటే లోకాన్ని మోసగించడానికా?"

"నలుగురూ బ్రాహ్మణుడనుకోడానికిరా!"

"అందుకే నాకది అక్కరలేదు. నాలో బ్రాహ్మణీకం ఏమీ కనిపించడంలేదు. అందరితోపాటు నేనొకణ్ణి. ఇతర్లను భేదంగా చూచి, నేను భేదంగా చూడబడాలని నాకు లేదు."

"ఇంత విడ్డూరంగా వుంటే ఎట్లారా? పిల్ల నెవడిస్తాడ్రా ఇట్లా చేస్తే?"

కాస్త మండింది కేశవరావుకు.

"అటువంటి నీచుల యిండ్లలో నేను చేసుకోను. జందెం చూచి పిల్లనిచ్చే వాడింట్లో అడుగే పెట్టను. అసలు పెండ్లే అక్కర్లేదు నాకు" అన్నాడు.

"వద్దా?"

"వద్దు."

"జందెం వేసుకోవా?"

"వేసికోను."

"మాలవాళ్ళతో తిరటం మానుకోవా?"

"నేను మనుషులతో తిరుగుతున్నా."

అయితే యింట్లోంచి వెళ్ళిపో."

'ఓ! అలాగే' అని పై గుడ్డలతో బయలుదేరాడు. అంతే. తర్వాత యెలాగో డిగ్రీ చదివాడు. స్వతంత్రంగా బదకాలని కోటకు రావటం, తర్వాత అంతా మీకు తెలిసిందే. అటువంటివాడు కేశవరావు. అధిక్యంతో. భేదబుద్ధితో ఎవరు, ఎవరినైనా, ఏమైనా అంటే లేశమాత్రం గూడా

సహించడు. ఇదీ అతని కత" అన్నాడు నారాయణ. శ్రద్ధగా, ఉత్సాహంగా అంతా విన్నాడు రెడ్డి. కేశవరావంటే మంచి గౌరవం కలిగింది. "అయితే మీరిద్దరూ మనింట్లో ఒకనాడు భోంచెయ్యాల" అన్నాడు రెడ్డి. "ఓ, నిరభ్యంతరంగా" అని నారాయణ అనగానే "అన్నం వడ్డించా" రంటూ కేక వినిపించింది.

"ఇక్కడే వుండు నారాయణా! త్వరగా భోంచేసి వస్తాను మాట్లాడాలి" అని లేచాడు.

"మళ్ళా వస్తాలెండి" అంటూ నారాయణ బయల్దేరాడు.

నారాయణ వెళ్ళిపోగానే రెడ్డిల్లు చేరారు శాస్త్రి, కరణం, మరి కొంతమందీ. భోజనమయ్యాక వారివెంట బయలుదేరాడు రెడ్డి. అందరూ స్కూలులోనికి వెళ్ళారు. సమ్మె విషయం అయ్యవార్లతోనే మాట్లాడాలనే నిర్ధారణతో వచ్చారందరూ. "ఎవరూ యేమీ మాట్లాడగూడ దక్కడ, జాగ్రత్త!" అని ముందే హెచ్చరించాడు రెడ్డి దోవలో. అంచేత యెవరూ మాట్లాడలేదు. ఇంతలో భోజనాలకు వెళ్ళి పిల్లలొచ్చారు. ఈ మూకను చూచేటప్పటికి వాళ్ళకేహ్యం గలిగింది. నిర్లక్ష్యంగా తల ఒరగబెట్టి ఎగేస్తూ, శ్రీలక్ష్మి—

"అంటరానివాడు - అంటకంటకుమంచు
పర్వువాడెగావి - పరుడుగాడు
యెవనినంటుకొన్న - నేమిగలదందులో?
విశ్వదాభిరామ వినురవేమా!"

అని చదివింది గట్టిగా. శాస్త్రులు, కరణం, రెడ్డి, మిగిలిన కొంతమంది వీళ్ళతట్టు చూశారు. నాగలింగం-

మూర్ఖుల గ్రామమ్ము - మొరటువాడేలిక,
అట్టిబంటు, నీచు - డయ్యవారు

ఊరి పెంపుజూడ - ఊహకందకయుండు
విశ్వదాభిరామ వినురవేమా!"

అని చదివాడు. శాస్త్రిలన్నాడు:

"ఇవేం పద్యాలయ్యా కేశవరావు, వేమనలో లేని పద్యాలు! ఎక్కడా విన్నట్లులేదు" అని.

"ఇవేగాదు, వేమన పద్యాలని ఇంకా బయలుదేర్తున్నాయి. ఇంకా ఎన్నో దొరకవలసినవి వున్నాయి" అన్నాడు కేశవరావు నవ్వుతూ.

"దొరకటమూ లేదు, గిరకటమూ లేదు. ఎవరో కిట్టనివాళ్ళిట్లా పద్యాలు వ్రాసి, చొనుపుతూ వుంటారు, ఇవంతా వేమనే వ్రాసినాడని మూఢులు అనుకుంటూ వుంటారు."

"నిజం, నిజం, ప్రపంచంలో యెపుడూ ఇట్లాగే జరుగుతూ వుంటుంది. మన పురాణాలన్నీ అంతే. మొదట ఇవన్నీ లేవు. అవక తవకలూ, హెచ్చుతక్కువలూ, ఆధిక్య అనాధిక్యాలూ, అన్నీ తర్వాత స్వార్థపరులు చొనిపారు. అంచేత ఒకే గ్రంథకర్త వ్రాసిన పురాణాల్లో, ఒకే విషయం, వివిధ విధాలుగా వుంటుంది. భారతంలో కర్మను బట్టి కులం అంటాడొకచోట. కొంతదూరం చూడగానే, పుట్టుకనుబట్టి అంటాడు. అట్లాంటి భేదా లెందుకొచ్చాయి? మధ్య స్వార్థపరులు చొప్పించినవే సందు జూచుకొని. మన ధర్మశాస్త్రమంతా అదే. అంతా తప్పుల తడకయిపోయింది. అంచేతే బ్రాహ్మణేతరులకు పురాణాలన్నా, ధర్మ శాస్త్రాలన్నా, పైగా యీ స్వార్థ పాపిష్టి హిందూమతమన్నా గౌరవం లేకుండా పోతున్నది. అసలు సానుభూతి గూడా వుండడం లేదు. కాబట్టి నీవన్నది తప్పుగాదు. ఇట్లాంటి ప్రక్షిప్తాలు కాలానుగుణ్యంగా జరుగుతూనే వుంటాయి."

ఇంతలో రెడ్డి అడ్డుపడ్డాడు - "ఉండు శాస్త్రిలూ!" అంటూ. తర్వాత - "ఎందుకులే అవన్నీ? ఇపుడు జరగాల్సిందేమో ఆలోచిద్దాం" అన్నాడు అయ్యవార్లనుద్దేశించి.

"ఏమిటి ఆలోచన?" కేశవరావన్నాడు.

"అదే. మనవాళ్ళు సమ్మె కట్టిన విషయం."

"అది మాకేం తెలుసు?"

"ఆ విషయం మాకు తెలుసులెండి, అయినా, మీరు కాస్త యీ విషయంలో శ్రద్ధ పుచ్చుకోవాలి. మీరు పిలిస్తే మాలవాళ్ళు వస్తారు. ఈ విషయాన్ని పరిష్కారంచేస్తే బాగుంటుంది."

అయ్యవార్లు పిలుస్తున్నారని చెప్పగానే, విషయం తెలుసుకొని, మాలమాదిగవాడలో కలిసి, 10 మందిని పంపారు విషయాలు చర్చించడానికి. మనిషికి కనీసం ఆరణాలన్నా కూలివ్వాందే రామన్నారు. రైతులకూ వాళ్ళకూ కొంత వాగ్వాదం జరిగింది. కడపటికి అందర్నీ ఊరుకొమ్మని "తేల్చండి మీరిద్దరూ" అన్నాడు సుబ్బారెడ్డి అయ్యవార్లను. వాళ్ళిద్దరూ విషయాలందరికీ నచ్చేటట్లు చెప్పి,అయిదణా లేర్పాటు చేశారు. సంవత్సరం పొడుగునా సేద్యానికుండే వాళ్ళకు గూడా జీతం యెక్కించబడింది.

౮

కామాక్షి శాస్త్రిలవారి రెండో భార్య. పద్నాలుగేండ్లుంటాయ్. నూత్న యౌవనం. పసుపుపచ్చని శరీరచాయ, పేరుకు తగినట్లా మె కండ్లు చాలా సొగసుగా ఆకర్షణీయంగా వుంటాయ్. కొంత సన్నంగానే వుంటుందనాలి. ఎత్తు పొటిగా వుంటుంది.

ఆమెది నైజాం యిలాకా. తలిదండ్రులు చాలా బీదలు. పిల్ల తనంలో అయిదో తరగతివరకూ చదువుకుంది. శ్రద్ధగా, చురుగ్గావున్నా, ఆ పైన చదవడానికి వీల్లేకపోయింది. అప్పటికామెకు పన్నెండో యేడు పడింది. అపుడే మన శాస్త్రిలు పెత్తన మెళ్ళాడు. కొంత చదువుకున్న వారూ - పరిస్థితు లెరిగినవారూ - కొంత నాగరికులూ అవటం మూలాన, యీ ప్రాంతంలో యెవరూ పిల్ల నీయలేక పోయారా అరవైయ్యేండ్ల యువకునికి. కామాక్షిని బేరానికి పెట్టారు. బేరమాడి బేరమాడి, చివరికి వెయ్యి రూపాయలిస్తానని ఒప్పుకున్నాడు శాస్త్రిలు. కక్కుర్తిపడి, గడ్డి కరచి, ఆ బీద దంపతులు మాణిక్యం వంటి పిల్లను, ఈ పిసినిగొట్టు చేతులలో పెట్టారు. ఆ పిల్ల మొత్తుకుంది పాపం, పెండ్లొద్దో అని. వినే వాళ్ళెవరు? తన క్షేమాన్ని కోరే తలిదండ్రులే మెడకు ఉచ్చుతగిలిస్తూ వుంటే, ఇంకేం జేస్తుంది?

ఇపుడామెకు పద్నానుగేండ్లు. కొత్తగా కాపురాని కొచ్చింది. అప్పట్నుండి ఒకే వ్యసనం. వ్యసనపడ కేంజేస్తుంది? తన వయసుకూ అతని వయసుకూ - తన వలపుకూ, అతని వలపుకూ ఎంత తేడా? ఆమెది కులుకుప్రాయం, అయ్యది వణుకుప్రాయం. ఆమె దగ్గర యౌవన సుగంధం, అయ్యదగ్గర ముసలికంపూ. ఆమె శరీరం మద నోద్రేకంతో వుప్పొంగి మిసమిసలాడుతూవుంది. అతని శరీరం భావజుడు విడిచిన పాడుమేడ. పాపం! చాలాసార్లు తన దురదృష్టాన్ని తలుచు కొని ఏకంగా యేడ్చేది. ఆ వయసులో పడుచులు, తమకు నచ్చిన ప్రియులతో కాపురాలు చేస్తూ, ఆనందంగా జీవిస్తూ వుంటే, ముసలివాణ్ణి కట్టుకున్నందుకు యేడవకేంచేస్తుంది? ముసలికంపు కొట్టుకుంటూ, కొద్దిగా వొణుకుతూ, బోసినోటి ముసిముసి నవ్వులతో, ఆ ముసలాయన దగ్గర కొస్తే "ఎంత సిగ్గులేదబ్బా!" అనుకొని, మనసులో అసహ్యించుకొనేది.

సంసారానికి వచ్చినప్పటినుండి నాగలింగాన్ని షోకుచేసి బడికి పంపుతూ వుండేది కామాక్షి. భర్తతో పోరి, బలవంతాన, వానికి క్రాపు పెట్టించింది. మెడలోని తాయెత్తులు, చెవులలోని పోగులు, ముక్కుపోగు అన్నీ తీసి దాచిపెట్టింది. కామాక్షిపైన వానికి మంచి అభిప్రాయం పడింది. బళ్ళోజరిగే సమాచారాలంతా దగ్గిర కూర్చొని బాగా చెప్పేవాడు. ఆమెగూడా అయ్యవార్లనడిగి, ఏమైనా కతల పుస్తకాలూ, నవలలూ అపుడపుడు తెప్పించుకొని మహా ప్రీతిగా చదువుతూ వుండేది.

సంసారానికొచ్చి ఇది ఆరోనెల. ఆనాడయ్యవార్లు ఇద్దరూ వచ్చి, వాళ్ళింట్లో మాట్లాడి భర్తకు బుద్ధిచెప్పినపుడు, కిటికీదగ్గర నిలబడి అంతా విన్నది. ఆ మాటలు బాగా నచ్చాయామెకు. అయ్యవార్లిద్దరూ బాగా నచ్చారు. ఆమె మనసులో ఏదో చలనం కలిగింది. ఏవో అవ్యక్తపు కోరికలు ఉద్భవించాయ్. చాలాసార్లు అయ్యవార్లు మనసులో తిరుగ సాగారు. ఆమె తీరిగ్గా వున్నప్పుడు శరీరం పరుపుపైకి ఆకర్షిస్తుంది. దానిపై వెల్లకిల పడుకొని భావనాప్రపంచంలోకి దిగుతుంది. ఆ నారాయణ నవ్వే కండ్లు, మెలికల క్రాపింగు - గుండ్రని యెర్రని దవడలు, ఆమె మనోనేత్రాలముందు ఆడుతూ వుంటాయి. ఏదో చెడ్డ ఆలోచనల్లో పడుతున్నాననుకొనేది. అటువంటి ఆలోచన్లను మనసులో దూరకుండా చేయాలనుకొనేది. అట్లా అనుకొనేకొద్దీ, రెట్టింపు వేగంతో వచ్చేవా భావాలు. ఒకని భార్యనుగా వుండి, పరపురుషుల గురించి ఆలోచించడం- పైగా కోరడం - తప్పనుకుంటుంది. అయితే ఆలోచించలేకుండా ఉండ లేకపోతున్నది. ఎన్నిసార్లో నారాయణను మరలా చూడాలనుకొనేది. చూడ్డానికి వీలు దొరికేదిగాదు. ఆమె బడివైపు ఎపుడూ పోదు. పోయే పనిగూడా వుండదు. అయ్యవార్లు గూడా వూళ్ళోకి విశేషంగా పోరు. ఎపుడన్నా పిల్లలకోసం వెళ్ళినా, వాళ్ళింటికి వెళ్ళేపని లేకపోయేది. అందని వస్తువు కోసం అర్రులు చాపడం, కనబడని వస్తువుకై పరిత

పించటం మానవునిలోని సహజగుణాలు. ఈమె నారాయణ విషయం అనుకొనే కొద్దీ - అతను కనబడకుండా పోయేకొద్దీ - కామాక్షి కాతన్ని చూడాలనే ఆతురత యెక్కువైంది. ఇట్లా వుండగా, ఒకనాడు బళ్ళో వున్న నాగలింగాన్ని పిలవాల్సిన పనిబడింది. అక్కడెవ్వరూ మనుషులు లేకపోబట్టి తానే వెళ్ళవలసి వచ్చింది. అందులో వుద్దేశం గూడా వుంది. పోతూవుంటే,

"యెక్కడికే? నువ్వెందుకే? ఎవర్నన్నా పిలిచి పంపు. అక్కడ మొగోళ్ళుంటారు" అన్నాడనుమానంగా శాస్త్రులు.

"ఎవరున్నారిక్కడ? వీధిలోకి వెళ్ళి, ఎవరన్నావుంటే పంపిస్తా, లేకపోతే నేనేవెళ్ళి పిల్చుకొస్తా."

"వొద్దే అంటే. ఆ మల్లయ్య కూతుర్నన్నా పిల్చిపంపు. నీవెందుకు అక్కడికి?"

"సరే" అంటూ స్వయంగా వెళ్ళింది కామాక్షి నేరుగా. ఉద్దేశ పూర్వకంగా వెళ్ళిందే కాని, తలుపు దగ్గరికి వెళ్ళి, గోడచాటున నిలబడింది. లోపలికెళ్ళడానికి జంకు. సంకోచిస్తూ తలుపుపై చెయ్యేసింది కొద్దిగా తీద్దామని. ఇంతలో హఠాత్తుగా, అదే సమయంలో నారాయణ తలుపులాగి బయటికి వచ్చాడు. గోడచాటు నుండి సగంమనిషి ఇవతలి కొచ్చిందప్పటికి కామాక్షి. ఆమె దక్షిణార్ధమూ, ఇతని వామార్ధమూ ఢీకొన్నాయ్. గాభరాపడుతూ గోడకానుకొని నిలబడి, పైటచెరుగు నోట్లో పెట్టుకొని, అతనివైపు అతి చంచలంగా చూచింది. రెపరెపా కొట్టుకొన్నాయి రెప్పలు. నారాయణ కొంచెం దూరంలో నిలబడ్డవాడల్లా, సాశ్చర్యంగా ఎవరా అని చూచాడు. చూపులు తీద్దామనుకున్నా వెనక్కిరాలేదు. ఒక విధంగా వొణుకుతూ, చిరుచెమటలతో నిండిన ఆమెను చూస్తూ, ఏదో గాభరాతో అప్రయత్నంగా "ఎవరు?" అన్నాడు.

ఆమెనోట మాట రాలేదు. అసలక్కడ ఉండలేకపోతున్నది. అప్రయత్నంగా జరిగింది వెళ్ళడానికి. లోపలకెళ్ళాడు నారాయణ.

"అనసూ, ఆమెవరో చూడమ్మా!" అన్నాడు. ఆ మాట విని నిల బడింది కామాక్షి. అనసు వచ్చి చూచి, "ఏమక్కా! నాగలింగం కావాలా?" అంటూ లోపలకొచ్చింది. నాగలింగం బయలుదేరాడు.

వాళ్ళు వెళ్తూంటే మళ్ళాబయటికి వెళ్ళాడు నారాయణ ఉమ్మేసుకొనే నెపంతో. ఆమె సోయగాన్నీ, నడకనూ చూస్తూ నిలబడ్డాడు. ఆమె రెండుసార్లు తిరిగి చూచింది. నారాయణను చూచి సిగ్గుపడి గబగబా నడుస్తూపోయింది. వాళ్ళుపోగానే వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. ఏదో శూన్యదృష్టితో చూస్తున్నాడు. మొగం ఏదో వికాసంతో నిండివుంది. పెదవులపై చిరునవ్వు తాండవిస్తూ వుంది. సిగ్గుభారంచేత, మొగా నికి ఆవరించి, ఆమె అందాన్ని అత్యంత అధికం చేసిన కెంజాయను ఊహిస్తూ కూర్చున్నాడు. నునుపైన గాజు ఫలకంపై స్థిరత్వం లేక సంచరించే పాదరస బిందువులులాగా భ్రమించిన ఆమె కనీనికలను మనోనేత్రంతో దర్శిస్తున్నాడు.

రబ్బరు శరీరమా అన్నట్లున్న ఆమె శరీర స్పర్శవలని సుఖాన్ని అంతరంలో అనుభవిస్తున్నాడు. ఏదో ఏదో, కవిలాగా ఊహిస్తూ కూర్చు న్నాడు.

కాసేపు చూచి,

"ఏంటోయ్ అదీ?" అన్నాడు కేశవరావు చిరునవ్వు నవ్వుకుంటూ సార్థంగా.

"చూచావా అన్యాయం?" అన్నాడు నారాయణ, తానింకొక విష యంపై భావిస్తున్నట్లు అనుకొనుగాక అని.

కేశవరావుగూడా అది గమనించకపోలేదు. అయితే ఈ యర్థాన్నే తీసికొని,

"పద్నాలుగేండ్ల పిల్లకు, అరవైదేండ్ల మొగుడు! రేపో యెల్లుండో, ఆ ముసిలోడు గుటుక్కుమంటే ఆమెగతేంగాను?" అన్నా డింగ్లీషులో.

"అంతా డబ్బుల కాశపడి! అసలు చేసికొనేవాడికి వుండక్కర్లేదా తెలివి? శాస్త్రిల మాటలకు తగినట్లే వున్నాయి చేష్టలు గూడా!"

ఒక పక్షం దినాలు గడిచాయ్. ఆ నా డాదివారం. అప్పటికి దాదాపు అయిదు గంటలయివుంటుంది. ఎవరో కోమటికర్మ అని శాస్త్రులు పొరుగూరికెళ్ళాడు. రాత్రి యెనిమిదిగంటలవరకూ రాడు. కామాక్షి యేదో నవల చదువుతూ కూర్చుంది. దానిలో స్త్రీ స్వేచ్ఛను పురుషుడేవిధంగా అణిచివేస్తూ వుండేదీ-ముసలిమొగుళ్ళు పడుచు పెండ్లాల నేవిధంగా అనుమానించి హింసించుతూవుండేదీ-పడుచు పెండ్లాలు విధిలేక యేవిధంగా వ్యభిచరించేదీ-దానిని కవి యేవిధంగా సమర్థించేదీ-అంతా చదువుతూ వుంది. తన జీవితానికి కొంత అనుగుణంగా వుందదిగూడా. ఆ నవలలో తనవంటి పడుచొకటి తన ముసలిభర్తను యేవగించి, ప్రపంచసుఖాలకై పరపురుషునితో సంపర్కం కలుగజేసికోడం-కవి దానిని సమర్థించడం చదివేటప్పటికి, యిదివరకు పట్టుదొరక్క, రెపరెపలాడే తన భావాలకు ఊత దొరికినట్లయింది. పుస్తకం మూసేసి, వెల్లికిలపడుకుని ఆలోచిస్తూ నేనీముసిలోడివల్ల యేంసుఖించేదీ; నేను మాత్రం ఆ విధంగా యెందుకు చేయగూడదూ? యీ ముసిలోణ్ణి చూచుకుంటూ-గుటకలుమింగుతూ-నా అందాన్ని, నా యౌవనాన్ని అధ్వానం చేసుకోవాల్సిందేనా? నా ఆనందం కోసం నేనెందుకు ప్రయత్నించకూడదూ- నాకు నచ్చిన పురుషుడితో నేనెందుకు సుఖించడగూడదూ? ........ఛా! అల్లా చేయగూడదు! అది

హిందూ స్త్రీధర్మంగాదు. భర్తను అంటిపెట్టుకొని వుండాల్సిందే. సంఘ ద్రోహిని కాకూడదు. భర్తృద్రోహిని కాకూడదు-అనుకుంది. మరలా.... అదే-స్త్రీకంతబానిసత్వంయెందుకు? పురుషుడికిమాత్రం అది ధర్మమా? తగిన వరుణ్ణి పెండ్లాడి, కష్టసుఖాలు సమంగా అనుభవించాలిగాని. ముసిలోణ్ణిగట్టుకొని, మనోవ్యథల ననుభవించడ మెందుకూ? ఆనందం లేని బ్రతుకెందుకు? ఎవరానందంకోసం వారెందుకు ప్రయత్నించ గూడదు? ఈ విధంగా తర్జన భర్జనలు జరిగా యామెహృదయంలో. ప్రపంచంలో జీవించే ప్రాణి, లౌకికసుఖాలకే ప్రాధాన్యం సామాన్యంగా యిస్తుంది గాని, కనబడని, యే ఊహామయమోక్షానికో ప్రాధాన్యం యిస్తుందా? దేనినో ఆశించి, ఊహించి, ప్రాపంచిక విషయాలను తృణీ కరిస్తే, ఆ ఉద్రేకం అణిగిం తర్వాతైనా కోరికలు దెబ్బకొట్టకపోవు. అణిచిపెట్టుకొనే కోరికలు ద్విగుణీకృతవేగంతో మనసులో దూర్తాయి. ఇదివరకంతా యే పనులైతే గర్హ్యము, నింద్యము, పాపము అనుకుంటూ ఉందో, వాటివైపే ఇపుడు బాహాటంగా, నిరాటంకంగా పారింది కామాక్షి మనసు. పయసులో సుఖాలూ, భోగాలూ అనుభవించి, వార్ధక్యంలో మోక్షంకోసం వెదకాలనే కొందరు తత్త్వవేత్తల వచనా లామెకు స్ఫుర ణకు వచ్చాయి. అట్లా ఆలోచించింది. సుఖాలవైపే మనసు దొర్లింది. ఎందుకు దొర్లదు? మంచి సౌందర్యవతాయె....నిండు యౌవనం పైకొన్న దాయె. మగడుచూస్తే ముసలి. తన దృక్పథంలోనా, మంచి సుందర యౌవన పురుషులున్నారు....కొంచెంసేపు ఆలోచించి, దిగ్గని మంచం పైనుంచిలేచి, అపుడే బళ్ళోనుండివచ్చిన నాగలింగాన్ని పట్టుకొని,

"నాగలింగం! రేపు వుగాదికి నీకు మంచి చొక్కాయిలూ, షరా యిలూ కుట్టించమని నాన్నకు చెప్పేదా?" అంది గుడ్లాడిస్తూ నవ్వుతూ కొంటెగా.

"ఆఁ, అట్లేక్కా, మంచిగుడ్డలు కుట్టించుమను. సుబ్బారెడ్డి కొడుకు వేసుకుంటాడే అట్లాంటివి కుట్టించు"అంటూ జరిగి కూర్చున్నాడు.

"నీవు బాగా చదివి......." అంటూంటే అడ్డొచ్చి,

"అక్కా! జూన్‌నెలలో మాఅయ్యవార్లు మమ్మల్నందర్నీ హైస్కూలులో చేరుస్తాడట! ఇక మూడు నెలలే వుంది. నాన్న పంపిస్తాడుగదూ?"

"ఓ నేనూపంపేది. నీవెంతవరకైనా చదువుకో, నిన్నెంతవరకైనా అడ్డంలేకుండా చదివిస్తా" అంటూ లోపలున్న కోరిక గుబ్బటిల్తూ వుండగా, వాణ్ణి బుగ్గలు పట్టుకొని రెండు చేతులతో ఇట్లా, అట్లా అని, వట్టలేని తమకంలో వాని చెంపలుపట్టుకొని, తల ఇటూ ఆటూ ఆడించి, "నేనొక పనిచెప్తా, చేస్తావా బుజ్జీ?" అంది.

"ఓ! యెంత పనైనా చెప్పు" అని లేచి నిలబడ్డాడు నాగలింగం ధీమాగా. కొంచెం ఆలోచనలో పడింది కామాక్షి. "మరీ, నీవు వెళ్ళి.... మీ.......అయ్యవార్లను నాన్న పిలుస్తున్నాడని పిల్చుకొస్తావా?" అంది.

"ఎందుకక్కా? నాన్నేడీ? ఆఁ- నీవే పిల్చుక రమ్మంటున్నావ్ గదూ?"

"పనుందిలే, నాన్న పిల్చుకు రమ్మంటున్నాడని పిల్చుకరా పో."

నాగలింగం వెళ్ళాడు గంతులేస్తూ. నిమిషంలో కాఫీ తయారు చేసింది కామాక్షి. వచ్చారు కావలసినవారు. వాళ్ళను మొగసాలలో కూర్చోమని, అక్కణ్ణుంచే, "వచ్చారక్కా!" అని అరిచాడు. ఆ మాట వినేటప్పటికి ఆమె గుండెలలో ఢడాల్‌మని అంది. అదొక యిదిగా అయింది మనసులో. వచ్చి తలుపు చాటున నిలబడింది. ఇంకా రాలేదే అనుకుంటూ వుండినామె, యెందుకు పిలిపించానా దేవుడా అనుకుంటూ వుంది. ఇపుడు వారి నేమని పలకరించడం? వారి రాకకు సమాధాన మేమని చెప్పడం? అని గాభరా పడుతూ వుంది. 'చాలా తెలివితక్కువ పని

చేశానే' అనుకొంది. ఇంతలో కేశవరావు 'నాగలింగం! మీ నాన్నేడిరా, పిలుమరి,' అన్నాడు. వాడు బిక్కమొగమేసి, పిన్ని మొగం చూచాడు. ఆమె యింక బయటికి రాకపోతే, వచ్చి కనబడి మాట్లాడకపోతే, మాట్లాడి వారి రాకను సమర్థించకపోతే, వారనుమానిస్తారేమో!

"నేనేనండీ పిలిపించింది" అంది తలుపు చాటునుండి కనబడీ కనబడనట్టుగా నిలబడి కంపించే స్వరంతో. ఆమె సర్వాంగాలూ కంపిస్తున్నాయ్: గుండెలు మహావేగంతో కొట్టుకుంటున్నాయ్. నోట్లో తేమే లేదు. శరీరమంతా తప్పతడిసి పోయింది చెమటతో. ముఖం పైనంతా ముత్యాలమాదిరిగా నిలిచాయి చెమట బిందువులు. ఆమెలో శక్తంతా ఆవిరై పోయిందా అన్నట్లు తేలికై పోయింది శరీరం. ఆనాటి అవస్థతోగూడిన మూర్తినే మళ్ళా చూచి ఆనందిస్తున్నాడు నారాయణ.

"మీరేనా?" అన్నాడు కేశవరావు ప్రసన్న వదనంతో.

"ఎందుకూ?" అన్నట్టు చూచాడామెవైపు నారాయణ చిరునవ్వు మొగంతో. ఆ రెండు సమాధానాలు, ఆమె కంపాన్ని కొంత శాంతింప జేసినాయ్.

"ఉండండి. కాఫీ పట్టుకొస్తా" అంటూ లోపలికెళ్ళి, మొగం గిగం బాగా కడుక్కొని, కాఫీ తెచ్చియిచ్చింది. యిచ్చి నిలబడింది చూస్తూ. త్రాగినాక-

"ఎందుకమ్మా పిలిపించావ్?" అన్నాడు కేశవరావు. ఇపుడు మళ్ళా దొడ్డచిక్కే వచ్చింది. తన చూపుల్ని ఎదుర్కొన్న నారాయణ చూపుల్నుండి, తన చూపుల్ని నిమ్నమార్గంలో నడిపిస్తూ, ఏమి సమాధానం చెప్పనా దైవమా అంటూ చింతించింది. కడకు-

"ఏమీలేదండీ, ఈ కథ చదువుతూ వుంటే, దీనిలో విధవా వివాహాల గురించి వ్రాసివుంటే, 'అది మన సంఘంలో తప్పుగదా - అయితే

మంచిదని వ్రాశాడే కవి-' అనే సందేహం వచ్చి, అడుగుదామనుకున్నా మిమ్మల్ని. అందులో ఆదివారం గదా యీ దినం అని పిలిపించాను" అన్నది చిరుచెమ్మటలు తుడుచుకుంటూ ఒక కటాక్షం నారాయణపైవేసి.

"ఫరవాలేదులెండి. ఐతే విధవా వివాహాలు తప్పంటావామ్మా?" అన్నాడు కేశవరావు.

"హిందూ స్త్రీకి ఆజన్మాంతమూ ఒకడే గదండీ భర్త! ఇన్నిసార్లు వివాహమా స్త్రీకి? పురుషుడికి పరవాలేదు. స్త్రీ పునర్వివాహం మన ఆచారంలో వుందా?" "ఆహా! లక్షణంగా వుంది. ఇపుడు కాకున్నా ఒకప్పుడు ఆచారంగా వుండేది. భర్తను పోగొట్టుకుంటేనూ - భర్త చనిపోతేనూ - పరివ్రాజకుడై పోతేనూ - నపుంసకుడైతేనూ - పతితుడై పోతేనూ - స్త్రీ మరలా వివాహమాడవచ్చని మన పరాశర స్మృతి అనే ధర్మశాస్త్రంలో వుంది. అపుడివన్నీ వుండేవి. స్వేచ్ఛ వుండేది. అందరికీ ఒకే న్యాయం వుండేది. తర్వాత తర్వాత పురుషులకు స్వార్థ మెక్కువై, స్త్రీలను కేవలం బానిసలుగా తయారుచేసి, లేనిపోని నిబంధనలూ, చట్టాలూ కల్పించి, సంఘాన్ని నాశనం చేశారు."

"అయితే యిపుడట్టివి జరిగితే సంఘం వూరుకుంటుందా?"

"చచ్చినట్లూరకుంటుంది. పసికూనల్ను పండు ముసలివాళ్ళకు కట్టే సంఘం, గడ్డి తింటూ వూరుకుంటుంది."

"ఆ విధంగా జరుగుతున్నాయా యిపుడు?"

"ఓ, లక్షలకు!" అన్నాడు నారాయణ ధీమాగా ఆమెకేసి చూస్తూ.

"జరుగుతున్నాయమ్మా,జరుగుతున్నాయి. కందుకూరి వీరేశలింగం పుణ్యాన, ఎంతో మంది వితంతువులు బ్రతుకు గాంచగలిగారు. ఆయన స్త్రీ స్వేచ్ఛకు, వితంతు వివాహాలకూ కృషిచేస్తూ వ్రాసిన ప్రహసనాలూ

నాటకాలూ, కతలూ మా దగ్గిర బోలెడున్నాయి. కావాలంటే నాగలింగా న్నంపు, యిపుడే పంపిస్తా" అన్నాడు కేశవరావు.

"అయితే అట్టి వివాహాలు తప్పుగాదంటారా?" అంటూ నారాయణ వైపు చూచింది.

"ఎప్పటికీ గాదు" అన్నాడు నారాయణ గంభీరంగా.

మన శిష్య బృందం హైస్కూలులో చేరింది. రామిరెడ్డి, నాగలింగం, శ్రీను రెండవఫారంలో చేరారు. అనసూయ, శ్రీలక్ష్మి ఒకటవ ఫారంలో చేరారు.

శ్రీను అవ్వగా రూరు హైస్కూలుకు అరమైలు దూరంలో వుంటుంది. మేనమామ వుండే యింట్లో చేరి చదువుకుంటున్నాడు శ్రీను. స్కూలు దగ్గరగా సరస్వతీపురంలో ఒక యింటిని అద్దెకు తీసి, వంట కొక ముసలమ్మ నేర్పాటు చేసి, రామిరెడ్డినీ, అనసూయనూ అందులో వుంచాడు సుబ్బారెడ్డి. నాగలింగం హోటలులో భోంచేసి రామిరెడ్డి బసలో వుంటూ వుండేవాడు. కరణానికి ఆ వూళ్ళో బంధువు లుండబట్టి, శ్రీలక్ష్మి అక్కడ వుంటూవుంది. శ్రీలక్ష్మి వుండే యింటికీ, అనసూయ వుండే యింటికీ ఒక అర్ధ ఫర్లాంగు దూరం గూడా వుండదేమో! అందుకే శ్రీలక్ష్మి యెపుడూ ఆనసూయ బసలోనే వుంటుంది. క్లాసులో గూడా వీరిద్దరూ ఒకేచోట కూర్చునేవారు. యెక్కడ కెళ్ళినా, యేమి చేస్తూవున్నా యిద్దరూ కలిసే వుండేవారు.

శ్రీను పేరుకు వాళ్ళ మేనమామ గారి యింట్లో వున్నాడే గాని యెపుడూ రామిరెడ్డి బసలోనే. ఎపుడు జూచినా యిద్దరూ ఒక చోట కూర్చుని యేదేదో మాట్లాడుకొనేవారు. "మనం ఇట్లా చేస్తే బాగుంటుంది..

అట్లా చేస్తే బాగుంటుంది" అని వాళ్ళకున్న జ్ఞానంతోటే తీర్మానాలు చేసుకుంటూ, ఆకాశహర్మ్యాలు నిర్మించుకుంటూ వుండేవారు. చదువు విషయంలో మాత్రం శ్రద్ధగా, దీక్షగా వుండేవారు. ఏనాటిపాఠం ఆనాడే చదివి జీర్ణించుకొనేవారు. ధనవంతుడైనా, అందులో రెడ్డి పిల్లవాడైనా, గర్వం లేకుండా, బాగా చదివేవాడు రామిరెడ్డి. క్లాసులో శ్రద్ధగా, ఏకాగ్రతతో వినివస్తారుగాబట్టి, వారికి తెలియందేమీ కనిపించదు అయిన పాఠాలలో. అథవా ఒకరికి తెలియకున్నా, మరొకరికి తెలిసే వుంటుంది. శ్రీనంటే మొదట్నుండీ బలే యిష్టం రామిరెడ్డికి. అతడొక నిమిషం కనబడకున్నా ఫీలయ్యేవాడు. ఇదివరకు తనవూళ్ళో వుండగా, అదంతా మూఢవాతావరణం కాబట్టి, శ్రీనుతో బాగా కలిసి వుండడాని కంత స్వేచ్ఛ లేకపోయేది. ఇపుడతన్ని అడిగేవాడు లేడు.

నాగలింగం రెడ్డి బసలో వున్నా చాలా విషయాలలో వాళ్ళతో కలిసేవాడుగాడు. చదువు సమయంలో అందరూ కలుసుకుంటారు. నాగలింగం కాస్తమారినప్పటికీ, ఏదో ఇంకా ఆధిక్యముందనుకుంటూనే వున్నాడు. అందులో వాళ్ళనాన్న యింటినుండి ఘాటైన జాబులు వ్రాస్తూ వుంటాడు. రాజంపేట కెప్పుడైనా వస్తేనూ, నాగలింగం తన వూరికి పోతేనూ, ఏమేమో విషయాలు చెప్పేవాడు. పూర్వం బ్రాహ్మలంతా యెట్లా బతికిందీ, యెట్లా రాజ్యా లేలిందీ, రైతులంతా వారంటే యెంత మర్యాద చూపేదీ - ఇల్లాంటివన్నీ చెప్పేవాడు. అయ్యవార్ల బోధన వేరే ధోరణిలో నడిచేది. వీళ్ళ స్నేహం వల్ల మరొక పంథాలో పడేది. ఇంతకూ ప్రస్తుతం అతను మధ్యేమార్గంలో నడుస్తున్నాడు.

కోట పిల్లవాండ్ల ప్రత్యేకతను గుర్తించడానికి పిల్లలకు ఉపాధ్యాయులకు ఎంతోకాలం పట్టలేదు. వాళ్ళక్వార్టర్లీ మార్కులు చూచేటప్పటికే అందరికీ ఆశ్చర్యం వేసింది. క్లాసులో వాళ్ళెంత ఏకాగ్రతతో వుంటారో, ఎంత త్వరగా, సూటిగా, ప్రశ్నలకు జవాబులు చెబుతారో టీచర్లను

కుంటూండేవారు. మొత్తానికి అందరూ కోటగడ్డవారు అని ప్రత్యేకతతో సంభావించేవారు. మనవారు గూడా సగర్వంగా "మేం కోటగడ్డవారమోయ్!" అనేవారు.

ఇట్లా రెండేండ్లు గడిచాయి. అనసు యిపుడు మూడవపారం. పదకొండుదాటి పన్నెండు నడుస్తూంది వయసు. అవయవాలు అట్లా అట్లా కుదురుకుంటూన్న వయసది. ఆ సమయంలో బాలికలు కొంత చిలిపిగా, చురుగ్గా వుంటారు.

శ్రీను, అనసూయ చిన్నప్పుడే పరస్పరం ఆకర్షించుకున్నారు అది అకారణం. అదెందుకో వారికి తెలియదు. ఆ పరస్పరప్రేమ వారికే యేదో అవ్యక్తంగా తెలుసు. అయితే, యితరులకంటే భిన్నంగా పరస్పరం ప్రేమించుకుంటూన్నామని బాగా యెరుగుదురు. అయితే యిపుడు కొంత భిన్నత్వం కనబడుతుంది. కారణం కొద్దికొద్దిగా ఆమెకు అవగాహన మౌతున్నది. ఆడపిల్లకు ఊహ తెలిసినప్పటినుండీ వివాహ విషయాలు వింటున్నప్పటికీ అదేమిటో తెలియదు. వివాహమంటే యేమిటో ఈ వయసులో ఆలోచిస్తారు. ఎటువంటివాణ్ణి చేసుకోవాలో, ఎట్లాంటి సుఖాలు అనుభవించాలో కొద్దిగా ఈ వయసులోనే ఊహించడం ప్రారంభిస్తారు. ఈ వివాహాదర్శాలు వారివారి సంస్కారాన్నిబట్టి వుంటాయి. అనసూయలోని మార్పులన్నీ శ్రీలక్ష్మిలో గూడా అక్షరం తప్పకుండా అన్వయిస్తాయి. ఒకే వయసు, ఒకే చదువు, ఒకే శిక్షణ, ఒకే ఆదర్శం- ఇవీ కారణాలు. చిన్నప్పటినుండి గూడా, వీరెంత అన్యోన్యంగా వుంటూ వచ్చేవారో, కాస్త ఊహించుకోవాల్సిందే. శ్రీలక్ష్మిని చూస్తే అనసూయ ప్రేయసికోసం యెదురుచూస్తూ గుటకలు మ్రింగుతూన్న ప్రేమికుడికి, ఆ ప్రేయసి కనిపిస్తే అమాంతంగా కౌగిలించుకొని, తనివిదీరా యెంతగా ముద్దాడుతాడో-అంతకంటే యేమాత్రమూ తక్కువ చెయ్యదు. ఇద్దరూ పరుపుపైబడి ఒకర్నొకరు గిలిగింతలు పెట్టుకొని కేకలేసి

నవ్వుకుంటారు. శ్రీలక్ష్మి తలను, తన మడిచిన హస్తంపై పెట్టుకొని, ఆప్యాయంగా ఆమె కండ్లలోకిచూస్తూ చేతివ్రేళ్ళతో ఆమె నునుపైన బుగ్గలపై కొడుతూ "నా బంగారు లక్ష్మి!" అనేది కండ్లు అర్ధంమూసి.

ఆనాడు వీళ్ళిద్దరికీ క్లాసు లేదు. ఇంట్లో పడుకొని, తమాషాగా మాట్లాడుకుంటూ, ఒకర్నొకరు గిచ్చుకుంటూ, గిల్లుకుంటూ ఉన్నారు.

ఇంతలో మధ్యాహ్నమైంది. రామిరెడ్డి వచ్చాడు. అంతలో పరు గెత్తుకుంటూ వచ్చాడు శ్రీను. వచ్చి—

"రెడ్డీ! మూడు రూపాయలు కావాలోయ్! అర్జంటు పని, పుస్తకా లొచ్చాయి" అన్నాడు.

"అయ్యో! నిన్ననే డబ్బయిపోయింది శ్రీనూ, ఇంకెట్లా? వి.పి. వెనక్కిపోతుందేమో! రేపో, మొన్నాడో డబ్బు వస్తుంది మనకు....శాస్త్రి గూడా లేడు, హోటల్ కెళ్ళినట్లుంది. వుండు, శాస్త్రి రానీ, అడిగి చూద్దాం."

"వీలుగాదు. పోస్టుమాన్ స్కూలు దగ్గిరున్నాడు. డబ్బు తెస్తానని చెప్పివచ్చా. ఎట్లా?"

"సరే యిక్కడేవుండు. చౌదరిదగ్గరుందేమో అడిగి తెస్తా."

రెడ్డి వెళ్ళాడు బయటికి. లోపల యిద్దరూ వింటున్నారు. శ్రీలక్ష్మి అంది: "నేను యింటికెళ్ళి పట్టుకరానా?"

"అంతదూరం యెందుకే" అంది అనసు. అప్పుడే పెట్టెలోనుండి డబ్బుతీసి శ్రీలక్ష్మి కొంటెచూపుల కొకవిధంగా సిగ్గుపడుతూ బయటి కొచ్చి,

"శ్రీనూ! ఇదో" అంది మూడు రూపాయలు చూపిస్తూ.

"నీ కెక్కడిది?"

"నీ కెందుకది? ఇది నాది."

"అది నాకు తెలుసు. ఎట్లా వచ్చిందీ అని?"

"అమ్మ ఇచ్చింది."

"అమ్మ నీకోసం యిచ్చింది, నాకోసం గాదు."

అనసు జవాబుకోసం వెతుకుతూవుంది గ్రుడ్లాడిస్తూ.

"వద్దు. నీ కర్చుకుంచుకో. అన్న తెస్తాళ్ళే యిపుడు."

"ఊహూఁ-తీసుకోవాల తప్పకుండా."

"వద్దు."

"తీసికోవూ?"

"నీ కర్చులకుంచుకో అనసూ!"

"నాకేమీ కర్చుల్లేవు, ఇది నా కర్చేలే. చెయ్యిపట్టు ముందు."

"వద్దంటే."

"?"

"తీసికోను."

ఆమె కండ్లలో నీళ్ళు పొరాడాయి. క్రింది పెదవి వణికింది. రెండు కొలుకులనుండీ రెండు బిందువులు బుగ్గలవైపు దిగజారాయి. అదొక మోస్తరుగా అంది "తీసికోవూ, శ్రీనూ?" అని.

ఆ ముఖభంగిమం, ఆ వేడికోలుచూచి శ్రీనుకు జాలేసింది. గుండె కొద్దిగా బాధపడింది.

"తీసికుంటాగాని, అన్నకు చెప్పు."

"వద్దు. చెప్పనక్కరలేదు. ఇది నా సొంతం" అని సంతోషంతో చేతిలో పెట్టింది. ఇంతలో "మరి,చిక్కు వచ్చిందే" అంటూ రెడ్డి ఎవర్తోనో మాట్లాడుతూ వస్తున్నట్లు వినిపించింది. సంతోషంతో అనసు లోపలికి పరు.

గెత్తింది. శ్రీలక్ష్మి పెదవు లోకవిధంగా పెట్టి కనురెప్పలెత్తి, తల ఇట్లా ఊపింది "ఊఁహుఁ" అంటూ. అనసు వెళ్ళి ఆమెపై పడింది, గాఢంగా కౌగలించుకొని.

దిగాడు నారాయణ మధ్యాహ్నం బండికి. అతను ఆ సంవత్సరం యస్. యస్. యల్. సి. పరీక్షకు కట్టుకున్నాడు. ఒక నెల ముందుగా వచ్చాడు సెలవు పెట్టి. ఆ నెలంతా అందరూ సక్రమంగా చదివారు. కొంచంకొంచెంమే సడలిన వాళ్ళ క్రమశిక్షణ ఆ నెలలో దార్లో పడింది. పరీక్షలు ముందే అయిపోబట్టి నారాయణ వెళ్ళాడు కోటకు.

నారాయణ చాలా చాలా విషయాలు గమనించాడు పిల్లల విషయంలో. ఇతర అయ్యవార్లవల్ల చాలా విన్నాడు. తాను స్వయంగా వాళ్ళ పద్ధతులు, వాళ్ళ పరస్పర ప్రేమ చూచాడు. ఎంతో ఆనందంగా చాలా చాలా విషయాలు కేశవరావుకు చెప్పాలని వెళ్ళాడు. నారాయణ కోట కొచ్చేటప్పటికి సుజాతకు A B C D లు నేర్పుతూన్నాడు కేశవరావు.

"అమ్మా! వచ్చావ్రా బాబూ ఒంటరిగానూ ...." అని, "పరీక్షలకు బాగా వ్రాశావా? పిల్లవాళ్ళెట్లా వున్నారు? ఆరోగ్యంగా వున్నారా? బాగా చదువుతున్నారా? వాళ్ళను చూచి నెలయింది" వరసగా ప్రశ్నలు వేస్తూ పోతున్నాడు. అన్నింటికీ, ఆఁ, ఆఁ, అంటూ,

"ఆగవయ్యా, ఆగు. ఊరికే ప్రశ్నలు వేసుకుపోతే ఎట్లా? జవాబు లక్కర్లేదాయేమిటి?" అన్నాడు నారాయణ చొక్కా విప్పుతూ. కేశవరావు బిగ్గరగా నవ్వుకున్నాడు. స్నానానికెళ్ళాడు నారాయణ.

మధ్యాహ్నం భోజనానంతరం చాలా చాలా విషయాలు చెప్పాడు నారాయణ. ఎంతో ఉద్రేకంతో, ఎంతో ఉత్కంఠతో ఎన్నెన్నో విషయాలు చెప్పాడు.

"క్లాసులలో, దేంట్లో గూడా అయా తరగతులలో మనవాళ్ళే ఫస్టు. పరీక్షలలో మార్కులు అద్భుతం. వాళ్ళ అభిరుచులు, అలవాట్లు అన్నీ ఏమీ మారలేదు. పరస్పరాకర్షణ బాగా గమనించాను. కులాంతర వివాహాలు జరగవచ్చునుకోడానికి నాకుమాత్రం సందేహం కనబడ్డంలేదు. నాగలింగం గూడా బాగా మారిపోయాడు. అందరికంటే వాడే అతిగా వాదిస్తాడు కులాల విషయం వస్తే. శ్రీనివాసుడి విషయం చెప్పడమెందుకు, అయ్యవాళ్లే వాణ్ణి పొగిడేస్తూ వుంటే? చూచావూ! వాడెక్కువ మాట్లాడడు అప్పటిమాదిరే. మన పిల్లవాళ్ళంతా మాట్లాడుకుంటూ తర్జన భర్జనలు జరుపుతూవుంటే చూస్తూ వూరుకుంటాడు. కడపటికి సొల్యూషన్‌కు మన వాడే కావాలి. వాడెంత చెబితే అంతే వాళ్ళకు, శ్రీనివాసుడి విషయం అనుకుంటే కడుపూ గుండెలూ చల్లబడతాయోయ్!"

"అంతే, ఆ తేజస్సు కొందర్లో ఉంటుంది."

"విజ్ఞానం పుట్టుకతో వస్తుంది. మంచి నాగరికత, సంస్కృతిగల కుటుంబాలతో పుట్టిన వానికి తెలివి బాగా వుంటుంది-అనాగరికకులంలో పుట్టినవానికి తెలివి వుండదు-పుట్టంగా పుడుతుంది తెలివి' అని అంటారే కొంతమంది, అదెట్లా అన్వయిస్తుందిక్కడ?"

"పుట్టుకనుబట్టి పుడుతుందే తెలివి - అన్నదబద్ధం. అది కుటుంబ సంప్రదాయాల్నిబట్టి, వాతావరణాన్నిబట్టి వుంటుందనటం సత్యం. అట్టి వాతావరణంలో పెరగటంవల్ల అట్టి విజ్ఞానమొస్తుందిగాని, అట్టిచోట పుట్టినంతమాత్రానరాదు. ఒకవేళ యెవరన్నా నాగరకతా - విజ్ఞానమూ-సంస్కృతీ వుండే యిండ్లలో పుడుతూనే గొప్ప నాగరకతా-విజ్ఞానమూ-జన్మతోపాటు కలుగుతాయనటం కేవలం పొరపాటు. పరిసరాల్నిబట్టి ఏర్పడతాయ్! తలిదండ్రులూ, గురువులూ శిక్షణలో యేర్పడతాయ్! అంతేగాని, గొప్ప కులంలో పుట్టూనే గొప్ప తెలివి ఉంటుందనుకోవడం అవివేకం! అయితే చాలామంది యీ వాదానికి విరుద్ధంగా భావిస్తారు.

రెంటికీ ఫలితం ఒకటే. అయితే వీరి భావన వేరు. బిడ్డ లెప్పుడూ తలి దండ్రులనూ, పరిసరాలలో తిరిగేవాళ్ళనూ అనుకరిస్తారు. అనుకరణ వల్లనే వాళ్ళు మాట్లాడ్డం, నడవటం, భోంచేయటం ఇత్యాదులన్నీ నేర్చు కుంటారు. వాళ్ళనుకరించేది నాగరికులనూ, విజ్ఞానులనూ, సంస్కృతీ పరులనూ అయినట్లయితే, తప్పకుండా వారిలో అట్టి బీజాలే నాటుకొని, పెరగడానికి ఆస్కారముంది. ఎక్కడో తప్పిపోవచ్చు. దీన్ని చాలా మంది జన్మకు అపార్థం చేసుకుంటారు. ఒక చిన్న ఉదాహరణ చెబుతా-

గొప్ప వైజ్ఞానికుని యింట్లో పుట్టిన బిడ్డను వెంటనే ఆటవికుల స్వాధీనంచేసి, అక్కడప్పుడే పుట్టిన బిడ్డను ఈ యింట్లోఉంచి, మార్పులు తెలియకుండాచేసి పెంచామంటే - ఆ విధంగా పెరిగిన బాలురు-ఎలాంటి సంస్కృతి గలిగివుంటారో చూడు! వాడిజన్మ యేదైనాగానీ వాడాట వికుడే! అవే చేష్టలు! అవేమాటలు! అనే భావాలు, వీడో? అన్నీ భిన్న మే!

ఈ వెధవకులాలు అట్లావుంచి మాట్లాడ్తే, శ్రీను ఏ కులంవాడు? ఆ మాలవాడలో ఏమి సంస్కారం, ఏమి నాగరికత యేడ్చింది? ఇట్లా యెందుకు తయారయ్యాడు? నాగలింగం అట్లా యెందుకు తయా రయ్యాడు శాస్త్రిలకు భిన్నంగా? రెడ్డి నాన్నకు భిన్నంగా యెందుకు తయారయ్యాడు? అంతా శిక్షణ వలన! అంతే. దాన్ని ఉపయోగించు కోవడంలో వుందంతా!"

"అయితే కొంతమంది చురుకైన జ్ఞానవంతుల బిడ్డలు ఆ విధం గానే వుంటారే, దానికేం జెప్తావు?"

"ఓహో, అది కాస్తవేరు. పిల్లలకు జన్మతః సంక్రమించేది కొంత వుంది. అది తలిదండ్రుల ఆరోగ్యం, తలిదండ్రుల మెదడు చురుకైం దయితే, బిడ్డలకది తప్పదు. అయితే పెంపకంలో దాన్ని దుర్విని యోగంచేస్తే, వెధవై పోతాడు. దీనికే, నాగరికతా విజ్ఞానమూ వున్న కుటుంబాలై చక్కని శిక్షణవుంటే ఇంకా మంచి ఫలితాన్నిస్తుంది."

వీరు కేంద్రీకరించిన హరిజనవాడలో ధారాళంగా వ్రాయ చదువ నేర్చిన యువకులు చాలామంది తయారయ్యారు. ఇప్పుడు పిల్లలు, ముసలివారూ అందరూగూడా దేశవిషయాలు మొదలైనవి బాగా తెలుసు కున్నారు. ప్రతి దినం పేపరు పట్టుకుపోయి, వారికి చదివి చెప్పేవా రయ్యవార్లు మొదట. ఇపుడు వారికి స్వంతంగా ఒక పేపరు వస్తుంది. ప్రపంచ పరిస్థితులు బాగా అర్థం చేసుకుంటున్నారు. దానిలో మానవస్థాన మేమిటో తెలిసికోగలుగుతున్నారు. "మాకెందుకయ్యా చదువు" అనే వాళ్ళు యిపుడు దాని విలువ గ్రహించారు. కాలం జరిగేకొద్దీ అయ్యవార్లపై వారి ప్రేమా, గౌరవాలు అతిశయించిపోతున్నాయి. వాళ్ళంటే పేళ్ళకు దేవుళ్ళతో సమానం. అయ్యవార్లడిగితే ప్రాణాలైనా యిచ్చేంత స్థితిలో వున్నారు.

ఆనాడే ఉదయం రాజంపేటనుండి విద్యార్థిబృందం దిగింది. సాయంకాలం చీకటిపడ్డాక కూడా అందరూ యేదో మాట్లాడుకుంటున్నారు. ఇంతలో మాలమాదిగలంతా బడివైపు వస్తున్నారు కోలాహలంగా. ఏవేవో అస్పష్ట ప్రతిజ్ఞలు వినవస్తున్నాయి. బడి తలుపు మూసివుంది. అందరూ వచ్చి తలుపుకొట్టి "తియ్యండి తలుపు" అని అరిచారు. విద్యార్థిబృందం అచ్చెరువుతో నిశ్చేష్ట అయింది. పాత సంఘటన జ్ఞప్తికొచ్చింది. తటా లునలేచారు. తలుపు తీయబోయే నారాయణను ఆపి, నాగలింగంతీశాడు.

"బైటికిరాండి ముందు. రాకపోతే బలవంతంగానన్నా యెత్తుక పోతాం" అంటున్నారు హరిజనులు.

"మేము రాం, మీరు వెళ్ళండి" అంటున్నారయ్యవార్లు.

కొన్ని నెలలక్రితం, మాలమాదిగలు వేర్వేరుగా నీటిబావులు కావాలని పిటిషన్ పెట్టుకున్నారు. మాలవాడలో యిండ్లుగానీ, జనాభా గాని యెక్కువగాబట్టి, మాలమాదిగ లిరుతెగలకూ కలిపి, మాలవాడలో

బావి పెట్టించారు సర్కారువారు. ఆ బావిని మన సుబ్బారెడ్డే కంట్రాక్టుకు తీసి, కొంతడబ్బు మిగిలించుకొని ఏదో ఒక విధంగా తయారుచేయించాడు. మాదిగలు ఆ బావికి మేము రామంటారు. "మాలవాళ్ళు తాకిననీళ్ళు మేం తాగం" అన్నారు. "మాదిగలు తాకితే మాకెందుకు?" అని వాళ్ళను రానీమంటారు మాలలు. వీళ్ళలో ఇదొక తెగులు! ఎక్కడగూడా యీ తేడా పాటిస్తారు. కడపటికి త్రాగుడుదుకాణాలలోగూడా పాటిస్తారు దీన్ని. లింగాయతులకూ, బ్రాహ్మణులకూ వున్నంత వైరుధ్యంకంటే యింకా పదునైంది వీరిది. పైవారు కొంత చదువుకున్న మూఢులు. వీరు చదువురాని మూఢులు! అంతే తేడా! కల్లంగడికిపోతే, బ్రాహ్మడుగానీ, లింగాయతుగానీ, శూద్రుడుగానీ, మంగలిగానీ, చాకలిగానీ ఒకేముంతతో ఒకేచోట తాగుతారు. అక్కడ తేడాలే వుండవు. కాని మాల మాదిగలు మాత్రం కలవరు. వారికి ప్రత్యేకంగా ఒక అర, వీరికి ప్రత్యేకంగా ఒక అర ఉండవలసిందే. పొరపాటున ఒకరిముంతొకరు తాకారో, దాన్ని పగలగొట్టాల్సిందే. అందులో మళ్ళా మాలచాకలి ముంత వేరు! మాదిగచాకలి ముంత వేరు!

అయ్యవార్లు చాలా ప్రయత్నం చేశారు. ఇన్నిటిలో గెల్చారుగాని, ఇందులో పూర్తిగా దెబ్బతిన్నారు.

"ఒరే, ఒకచోట చేరుకుంటే తప్పేముందర్రా? ఫరవాలేదురా, ప్రాణాలుపోవు" అని అంటే, గొంతుకోసి అట్లా పారేసినా ఆ పని చెయ్యమన్నారు.

"మీ రంటరానివారు గదా! పైవారు, మిమ్మల్నీ, మాదిగల్నీ కూడా తాకకుండా ఒకే గాటకట్టి నీచంగా చూస్తారుగదా, ఆ నీచత్వంలోనైనా మీరిరువురు సమానులౌతారా కారా? మీరే, అంటరానివారే కలవకపోతే, మిమ్మల్ని తాకనేగూడదో అనే సవర్ణులతో మీరెట్లా కలవగలరు?"

అని అన్నారు. ఎన్నన్నా "ససేమిరా" అన్నారు ముసలివాళ్ళు. "మేం చచ్చింతర్వాత ఆ పని చేసుకుంటే చేసుకున్నారుగాని, మా బొందెలలో ప్రాణాలుండగా అట్లా చేస్తే మేమోర్చుకోం" అన్నారు. అయ్యవార్లకు చాలా చికాకు వేసింది. చాలా కోపంగూడా వచ్చింది. ఎంత చెప్పినా వీలు కాలేదు, ఆమోయన సద్దుగాకుండా వచ్చి యింట్లో కూర్చున్నారు.

ఇదీ కత! అందుకే హరిజనవాడ ఆబాలగోపాలం కదలివచ్చింది. ఎంతో బ్రతిమాలడంవల్లా, ఆ విధంగా చేస్తాం చూద్దురు రమ్మని రెండు వర్గాలూ ఒప్పుకోడంవల్లా- క్షమాపణ వేడుకోడంవల్లా- అయ్యవార్లు శాంతించారు.

ఆ మరునాడు శ్రీను అన్నాడు:

"సార్! మాలవాడలో జంతువులకూ, మనుష్యులకూ తేడా కనిపించడం లేదండీ- అబ్బా! ఆ పందులు, ఆ కుక్కలు, ఆ కోళ్ళు.... మనం కాస్త శ్రద్ధ తీసికుంటే........"

"అవునోయ్, రేపే ఆదివారం. గ్రామ పారిశుధ్య ఉద్యమం ప్రకారం మనమంతా బయలుదేర్దాం" అన్నారు అయ్యవార్లు. మళ్ళా కేశవరావు అన్నాడు:

"మేం అనుదినమూ చెప్పేవాళ్ళం-యిండ్లనూ, వీధుల్నూ శుభ్రంగా వుంచుకొమ్మని. వారికావిషయం పట్టేదేగాదు. తాత్కాలికంగా తలలు వూపేవారు. అందులో వారి తప్పు మాత్రం యేమీ అంతగా కనబళ్ళేదు. ప్రొద్దస్తమానం గాడిద కష్టం చేసి, ఈసురోమని యింటికొచ్చి, కాళ్ళూ చేతులూ పీకుతూ వుండగా, చచ్చినట్లు పడిపోయే వారికి, శరీరంపైనా, ప్రాణంపైనా అంత మమత లేనివారికి, ఆరోగ్యసూత్రా లెక్కడెక్కుతాయ్! అయినా మేము చెప్పుతూనే వచ్చాం. చెప్పిచెప్పి విసుగెత్తింది. రేపటితో ఈ పనిగూడా ముగిసిపోవాలి.''

ఆదివారం అందరూ బయలుదేరారు మధ్యాహ్నం. ప్రతివారూ తలావొక చీపురు తీసుకున్నారు. రెండు తట్టలు తీసుకొన్నారు. వెళ్ళారు. ఒకచోట మొదలుపెట్టారు ఊడ్చేందుకు. అప్పటికి వేసవి అయినందువల్ల పనులు తక్కువకాబట్టి, చాలామంది ఆడవాళ్ళూమగవాళ్ళూ వున్నారిండ్లలో. అయ్యవార్లా పనిచేస్తూ వుంటే, ఆశ్చర్యంగా చూస్తూ పరుగొత్తుకొచ్చి,

"ఇదేందీ అన్యాయం?" అన్నారు.

పాతపాఠం వల్లించారయ్యవార్లు. తలావొక చీపురుకట్ట తెచ్చి ఆడవాళ్ళు వూడుస్తూ వుంటే, చెత్తంతా మగవాళ్ళు తీసి దిబ్బలలో వేశారు. అంతా వూడవటం అయింతర్వాత-

"ఇంకిట్ట రావొద్దు సామీ!" అన్నారు.

"మీరు ప్రతిదినం యీ విధంగా చేసుకుంటే సరి! మురికి కంటి కగుపడిందా, మేమొచ్చి ఊడుస్తాం- మమ్మల్ను ఇక్కడికి ఈ పనికి రాకుండా చెయ్యాలంటే, మీరు శుభ్రంగా వుండండి. ఇండ్లూ, వీధులూ శుభ్రంగా వుంచుకోండి" అన్నారు.

"ఏం, మేమొచ్చి రోజూ వూడిస్తే బాగుండదూ?" అన్నారు శ్రీలక్ష్మి అనసులు వంకర్లు తిరిగి.

"ఎందుకు బాగుండదూ?" అంటూ కులికారాడవాళ్ళు ఆనందంతో. అంతా పునరాగమనం చేశారు. అప్పట్నుండీ హరిజనవాడ చాలా శుభ్రంగా వుంటూ వుంది.

అదేగాకుండా, కోటలోగూడా చాలా ప్రాంతాలు చాలా మురికిగా వుండేవి. అదే మంత్రం పఠించారు. అది బ్రహ్మాస్త్రమైంది. కోటగూడా చాలా శుభ్రంగా వుంటున్న దిపుడు.

## ౧౦

పల్లెలలో యిదొక దురవాటుంది. ఎవతెన్నా కాస్త అందంగా ఉంటే ప్రతి యువకుడూ కన్నేస్తాడు. దాన్ని గురించి గుంపుగా గూడి మాట్లాడుకుంటూ వుంటారుగూడా వేరే పనిలేనట్టు. అది బీద యువతే అయితే ప్రయత్నాలు సాగిస్తారు. అందులో యానాది, యెరికల మొదలైన వాళ్ళయితే నేరుగా వెళ్ళి అడగడమే. మాలా మాదిగలయితే మరీ నీచం వారికి. ఒప్పుకోకపోతే, దౌర్జన్యంగా నయినా చెరచడమే. ఈ దౌర్జన్యం, ఈ హింసాకాండ, వీటివల్ల ఎంతో మంది మూఢులు, ఎంతో మంది శీలాన్ని చెరుస్తూ వుంటారు కామతృష్ణ కొరకు.

రామయ్య గూడా తేలిగ్గానే భావించాడు లక్ష్మిని గురించి మొదట. దానికి విరుద్ధమైన ప్రవర్తన చూచి, "ఈ మాలముండ గూడా పెద్ద పతివ్రతేరా?" అని హేళనగా అనేవాడక్కడక్కడా. కొంత డబ్బు యెక్కువగా యిస్తే లొంగుతుం దనుకున్నాడు. ఆనాటి విషయాన్ని తల్చుకొని కొంచెం జంకాడు. తానే స్వయంగా వెళ్ళి అడగడానికి గుండెలు లేకపోయాయి. పోనీ విరమిద్దామా అనుకుంటే కోరికలు విజృంభిస్తున్నాయి. వెనుకా ముందూ ఆలోచించాడు. "యేమైతే మాత్రం యేం జేస్తుందిలే అది" అనుకున్నాడు. ఒకనాడు వాళ్ళ కూలి కొచ్చే ముసలామె చేతికి పదిరూపాయ లిచ్చి పంపించాడు ఏమేమో, యింకా ఆశలు చెప్పి. ఆ ముసల్ది కూడా, డబ్బుకాశపడి తీరుతుందిలే అనుకొని లక్ష్మి నడిగింది పది రూపాయాలు జూపించి. తన జాతినే స్వయంగా వ్యభిచారానికి పురికొల్పుతున్న ముసల్దానిపై బలే కోప మొచ్చింది లక్ష్మికి. ఆపాదమస్తకం మండగా చీపురుకట్ట తీసికొని, గట్టిగా రెండు చరుపులు చరిచింది. పైగా అంది-"ఆ గాడిద కొడుకు పెండ్లాన్ని గూడా యిట్లాగే పంపిస్తాడా?" అని.

దెబ్బలు తిన్న ముసల్ది ఒకటికి రెండుగా చేసి వానితో అన్నది. వాడు మండిపడుతూ "ఆ మాలముండ నా పెళ్ళాం మాపెత్తిందా? కండ్లేమీ కనిపిస్తున్నట్టు లేదే! చూస్తాం దాని పతీత తనం!!" అని మీసం దువ్వి ఆలోచనలు సాగింప మొదలుపెట్టాడు ఆ దినం నుండి. లక్ష్మి ప్రతి దినం ఎటు పోయేదీ, ఎక్కడికి పోయేదీ అంతా కనిపెడ్తూ కూచున్నాడు.

ఒకనాడు వర్షం కొంచెం చినుకులు పడ్డాయ్. చాలామంది కూలికి వెళ్ళలేదు. యల్లప్ప ఆ దినం ఉదయం రాజంపేటకు వెళ్ళాడు. సాయంకాలం కొంతమంది ఆడవాళ్ళు ఆకు కోసుకొచ్చేందుకు అడవికి పోతూ వుంటే లక్ష్మిగూడా వెళ్ళింది. ఆ విషయం ఆనాటి ముసలిది రామయ్యతో అంది. రామయ్య తన రౌడీలతో బయలుదేరాడు. చెట్లచాటున నక్కినక్కి పోతున్నాడు రామయ్య. ఎంతసేపటికీ ఒంటరిగా దొరకలేదు లక్ష్మి. ప్రొద్దుకుంకిందిగూడా. అందరూ గంపలకు ఆకేసి యింటిమొగం పట్టారు. అందరూ ముందుగా వెళ్తున్నారు. లక్ష్మి కాస్త వెనుకపడింది. అప్పటికి కొద్దిగా చీకటిపడుతూవుంది. ఇంతలో ఆమె గంపపైనుండే ఆకు గాలికి కాస్తకిందపడింది. గంపదింపి, ఆకు మళ్ళావేసుకొని, నెత్తికెత్తుకొనేసరికి, ముందువారు మరికొంతముందుకు వెళ్ళారు. ఒక అరఫర్లాంగు ఎడముంటుంది. వాళ్ళీమెను గమనించలేదు. ఈమె వాళ్ళను హెచ్చరించాలేదు. లక్ష్మి గబగబా నడుస్తూన్నది వాళ్ళనెదుర్కోవాలని. మరికొంత చీకటి పడింది. అప్పటికొక చిన్నవంక సమీపించింది. వంక కొంచెం లోతుగా వుంటుంది. నీళ్ళులేవు. ఆ వంకలో దిగితే, ఇవతలా, అవతలా ఎవరూ కనిపించరు. దిగి గబగబానడుస్తున్నది లక్ష్మి. గుండెలెందుకో దడదడ కొట్టుకుంటున్నాయి. వెనక్కి తిరిగిచూడకుండా నడుస్తూంది. తనవెనకాల కాలిఅడుగుల చప్పుడు సన్నగా వినిపించింది. ఆ అసురసంధ్యవేళ ఏదో దయ్యమేమో అనుకొంది. హృద్వేగం ఎక్కువైంది. దేహమంతా

చెమటలు పోసినాయ్. ఊపిరంతా బిగబట్టి గబగబా అడుగులేస్తూవుంది. గంపే ముందు క్రింద పడిందో-తననోటికే గుడ్డ ముందు కట్టబడిందో తెలియదుగాని, అరవబోతే గుండెలో పట్టుకున్నట్లు తోచింది. ఏదో ప్రయత్నించి అరిస్తే, ఆ గుడ్డలో దూరి శబ్దం బయటికి రాలేకపోయింది. రౌడీలు ప్రక్కకీడ్చుకపోయారు దారితప్పించి. ఒక పొదలోకి మోసుకుపోయారు. ముఖానికి గుడ్డ విప్పేటప్పటికి, రామయ్య పిడిబాకు చేతపట్టుకొని నిలబడివున్నాడెదురుగా యమునిమాదిరిగా. వాని కండ్లు కాషాయ రంగుల్నీనుతున్నాయ్. భీకరాకారుడై నిలబడివున్నాడు. వాణ్ణి చూడగానే లక్ష్మికి గుండెలు అవుటిల్లిపోయాయ్. గడగడ వదుర్తూ, గాద్గదిక స్వరంతో-

"సామీ! చంపొద్దు" అంది రెండుచేతులెత్తి దండంపెడుతూ.

"ఊఁ" అంటూ, గుడ్లురిమి, జుట్టుపట్టుకొని, "అరిచేవ్! నోరెత్తితివంటే చంపేస్తా. చెప్పు, మొన్న నువ్వేమన్నావ్?" అన్నాడామె మెడను వెనక్కిలాగి తాను ముందుకు వంగుతూ.

లక్ష్మి వెలవెలపోయింది. నిలబడింది నిర్జీవంగా.

"ఊఁ, చెప్పు" అన్నాడు పండ్లుబిగించి, జుట్టువిడిచిపెట్టి.

ఏమీ పలకలేదు లక్ష్మి. తలవంచి నిలబడింది కన్నీళ్ళురాలుస్తూ.

"ఇటుచూడు! నీకేమీ భయంలేదు. చెప్పు నీకెంత కావాలో. ఏమైనా యిస్తా."

"నాకొద్దు. నన్నిడిచిపెట్టండి, మీకు పున్నెముంటాది. నాకు వొళ్ళు బాగాలేదు" అని యేడ్చింది వలవల.

మళ్ళా భీకరాకృతి దాల్చాడు రామయ్య.

"కూర్చో" అన్నాడు రొప్పుతూ.

సింహగర్జనకు లేడిపిల్లలాగా దడదడలాడింది లక్ష్మి. గడగడ వదుర్తూ, వణికే కంఠంతో, "విడు సామీ, పోతాను" అంది బెదరిచూస్తూ.

పండ్లు పటపట లాడించి, "ఎక్కడికే పోయేదీ?"అంటూ విసిరాడు జుట్టుపట్టి. గిరగిర తిరిగి పడింది లక్ష్మి. భూమిలోంచి పొడుచుకుని వచ్చిన రాతిపైన తల పడింది. రక్తం చిమ్మికొట్టింది వాడి గుడ్డల పైన. ఆ రక్తం చూచేటప్పటికి రామయ్య కండ్లు భ్రమిశాయి. వరుగెత్తడానికి అడుగు వెనక్కేశాడు. ఇంతలో బలంగా ఎవరో రెండు రెక్కలు పట్టు కొని, విరుగకట్టేశారు. రౌడీలు కేకలేశారు. ఊరొక ఫర్లాంగు కంటే కాస్త యెక్కువ వుంటుందక్కడికి. ఆ ఆర్తనాదాలు విని, పరుగెత్తారు చాలామంది కర్రలతో. ఆ వున్న నలుగురు మాల యువకుల్ని బాగా కొడుతున్నారు. ఇంతలో చాలా మంది మాలవాళ్ళు పొలమరిపని అయి పోగా అడవినుంచి వస్తున్నారు. దారిలో పడిపోయివున్న ఆకు గంప, ప్రక్కనే పడవేసివున్న సామాను కొయ్యలూ, దగ్గరలో వినిపిస్తున్న కోలాహలం విని - కర్రలు తీసికొని గబగబా, ముందువాళ్ళ మాదిరే పరు గెత్తారు. ఇంతలో ఊరివారు మాలవాళ్ళను బాగా చితకకొట్టి రామయ్య కట్లు విప్పారు. ఈ మాలల్ని చూడగానే కాలికి బుద్ధి చెప్పారు.

హరిజన వాడంతా ఆ రాత్రి అలజడి. అందరూ లక్ష్మికి సానుభూతి చూపుతూ, "అయ్యో, యెందుకు వెనకవిడిస్తివే?" అని వాపోయారు.

"పాడోడు, ఆ రామయ్యకేం పోగాలమమ్మా!" అన్నారు కొందరు.

యువకులకు పట్టపగ్గాలు లేవు. ఒకడికి భూమిమీద కాలు నిలవ లేదు. పొలాలలోంచి వచ్చినవాడు వచ్చినట్టుగా ఆ మూకలో చేరి అల జడికి చెయ్యికలప జొచ్చాడు.

ఒకడు మీసం తిప్పి, 'రాండిశీ, వాణ్ణి నమిలేస్తాం' అన్నాడు. మరొకడు పిర్రలమీది గుడ్డ ఎగదీసి, "పదండ్రా, వాడి పెళ్ళాన్ని-" అన్నాడు పండ్లు పట పట కొరికి.

లక్ష్మికి అప్పటికి బాగా తెలివి వచ్చింది. ఏదో తొందరగా ఆలోచించి, కండ్లనీళ్ళురాలుస్తూ "ఈ విషయంలో మీరేమీ గోల చెయ్యొద్దు. ఊరుకుండండి. ఏం చేసినా నన్ను శిక్షించినట్టే. నే నందర నోళ్ళలోనూ పడతాను. నా మీద మీకు దయవుంటే. ఎవరిపాటికి వాళ్ళు యిండ్లలోకి పొండి" అని బ్రతిమాలింది.

మరునాడు యువకులు చాలా మంది పనులకు పోలేదు. యల్లప్ప కోసం యెదురుచూస్తూ కూర్చున్నారు. మధ్యాహ్నానికి రావలసినవాడు సాయంత్రానికొచ్చాడు యల్లప్ప. చూచాడు, విన్నాడు, తోక త్రొక్కిన పాములాగా చుఱ్ఱున లేచాడు. గుండెలు మండిపోయాయ్. ఉద్రేకంతో ఒడలు ఉడుకెత్తింది. వెర్రెత్తి యిల్లంతా చిందులు తొక్కాడు. నోటి కొచ్చినట్లల్లా బూతులు తిట్టసాగాడు. మరికొంతమంది ఉద్రేకులు కలిశారు.

"ఇంత నీచంగా దారుణకృత్యాలకు పాల్పడేదీగాక, ప్రాణాలకు గూడా యెక్కు పెట్టడమా? ఇంతగా మనల్ను హింసిస్తూవుంటే, మనం సహించి వూరకుండడమా?" అన్నారు కొందరు.

"తక్షణం బుద్ధి చెప్పకపోతే వ్యవహారా లింకా ముదుర్తాయి" అన్నారు మరికొందరు.

"వాడి రక్తాన్ని కండ్ల చూడాల్సిందే" అన్నారింకా కొందరు.

వింటూంటే లక్ష్మికి ప్రాణాలెగిరి పోతున్నాయ్. శూన్య దృష్టితో, బయలుదేరబోతూన్న యల్లప్ప కాళ్ళపైబడింది. పోవద్దని బ్రతిమాలింది. కన్నీళ్ళు రాలుస్తూ కాళ్ళకు చుట్టుకొని కూచుంది గట్టిగా. ఇంతలోకే కోనప్ప ముందుకొచ్చా డందర్నీ తోసుకొని. పండు ముసలివాడు. అనుభవం బాగా వున్నవాడు. ఇటీవల కాస్త జ్ఞానార్జన గూడా చేసుకున్నాడు. రాబోయే కష్టసుఖాలు గుర్తించే ప్రజ్ఞ అతనికుంది. అతనితో

ఖాటు మరికొంతమంది ముసలివాళ్ళొచ్చారు. పాత అనుభవాల్ని జ్ఞప్తికి తెచ్చుకొని,

"మేమడ్డొస్తున్నా మని వారు కోప్పడకపోతే ఒకవిషయం చెబుతాను. మనకా, భూముల్లేవు. ఆస్తులు అంతకంటే లేవు. కూలి చేసుకొని బ్రతికే వాళ్ళం. కాలమంతా ధనమున్నవాళ్ళది. బీదవాడు న్యాయంగా సంచరించినా, ధనమున్నవాడు దయతలిస్తే, దాన్ని అన్యాయంగా మార్చ గలడు. అందరూ వాళ్ళతట్టే మాట్లాడ్తారు. మరొక ముఖ్య విషయం- మనం అంటరానివాళ్ళం. మనమంటే వాళ్ళకు బలేనీచం. ఇటీవల యింకా యెక్కువయింది. మనల్ని పైకి రానీకుండా తొక్కి వెయ్యాలని యుగ యుగాలుగా వారి హృదయాల్లో నాటుకుపోయింది. రక్తంలో కలిసి, నరనరాలకు పట్టి ఈ భావంతో చేవెక్కిపోయివున్నారు. మన విషయాని కొస్తే పైనలుగురూ ఒకటౌతారు. వారు ధనవంతులు, మనం ధన హీనులం - వారు పలుకుబడి గలవారు, మనకెక్కడా గెంటివేతలు- వారేపని చెయ్యడానికైనా సమర్థులు - మనం కాము - అటువంటప్పుడు మనదే న్యాయమైనా, వారంతా కలిసి డబ్బైనా ధారవోసి, దాన్ని అన్యాయం కింద మార్చేస్తారు. అదేగాదు - వ్యవహారం చేసి, డబ్బుంది గాబట్టి గెలుస్తారు. తర్వాత మనల్ని నానావిధాలా హింసిస్తారు. ఇంకొక విషయం. పాపం, ఆ యిల్లాలు ఒకే మోయన యేడుస్తూ వుంది. 'నా మానం కాస్తా మంటగలిసిపోతుందో' అని గోల పెడుతూ వుంది. కాస్త ఆమె కొరకన్నా ఆగాలి," అన్నాడు.

ఒక యువకుడు లేచాడు.

"అట్లా యెన్నటికీగాదు. వాళ్ళతో వ్యవహార మాడకుండా ఉండటం అసంభవం. మనం ముండల మాదిరిగా కూర్చుంటే, వారు మరికొంత తీవ్రంగా స్వారి చేస్తారు మనపైన. యీనాడు యల్లప్ప యింట్లో జొర

బడ్డారు. దాన్ని వుపేక్షిస్తే, రేపు మన యిండ్లలో దూరి మన ఆస్తుల్ని, మన పెండ్లాలనూ చెరుస్తారు. మనమంతా అసమర్థులంగా, నీచులుగా వారి కండ్లకు కనపడబట్టే వారీవిధంగా చేస్తున్నారు. మనం వారితోపాటు బ్రతకాలంటే, మనమూ, మన పిల్లలూ, మన భార్యలూ సవర్ణ హిందువుల మాదిరిగా బ్రతకాలంటే-మన జాతి సవర్ణ హిందూజాతి కాళ్ళ క్రింద పడి, నలిగి చావకుండా వుండాలంటే - ఇట్లాంటి చేష్టల్ని ప్రతిఘటించి మట్టు పెట్టాల్సిందే! ఇపుడు రామిగాణ్ణి చంపాల్సిందే - మానం గలిగిన మగవాళ్ళగా బ్రతకాలంటే రాండి. వెంటనే నడవండి" అన్నాడు ఉద్రేకంగా, అందర్నీ ఉద్రిక్తుల చేస్తూ.

ఔనంటే అవునన్నారు మిగిలిన యువకులు. కర్రలు పైకెత్తి బయలుదేరారు.

అప్పటి కెనిమిది గంటలయి వుంటుంది. అపుడే బట్టీలోంచి దింపిన కాపుడు సారాయిని కాస్త సేవించి, మిగిలిందాన్ని ముందు పెట్టుకొని, మాంసపు వేపుడును నంజుకుంటూ మాట్లాడుకుంటున్నారు రామయ్య, గుండయ్య, గంగయ్య,మరియిద్దరూ. మాలవాడలో జరుగుతూ వుండిన విషయం అంతా చెప్పాడు రామయ్య. "ఇక మన పైకి బయలు దేరడమే తడవు" అన్నాడు రామయ్య కాస్త అధైర్యంతో.

"ఊఁ, యేంది రామయ్యా? మన దెబ్బ జెప్పితే ఒక్కొక్కడే పారుకోడో?" అన్నాడు గంగయ్య మీసం త్రిప్పి సీసా పైకెత్తుతూ.

"అమాంతంగా నలగర్ని సంకలలో యిరికించుకొని, వూరి బయటికి యెత్తుకపోయి కొట్టనంట్రా" అన్నాడు గుండయ్య మైకంతో

"మత్రూంతేసుకో రామయ్యా, మజాగా వుండాది"అన్నాడింకొకడు తూగుతూ.

"వాళ్ళు చంపుతామన్నారట్రోయ్!" అన్నాడు రామయ్య తేలిగ్గా నవ్వి.

"అహ్హాఁ, మన మోచేతికింది నీళ్ళు తాగి, మనం పారేసిన సంకటి తినే మాలగాడ్డికొడకల కంతపొగరా? చంపుతారంట్నా, యీనాటి కింతకొచ్చినారా?" అన్నాడు మరొకడు.

నవ్వుకుంటూ, ఊగుతూ, తూగుతూ ఉండగా, బైట గట్టి కేకలు వినవచ్చాయ్. జన సమూహం తోసుకు వస్తున్నట్లుగా గ్రహించాడు రామయ్య.

"ఒరేయ్, వచ్చారర్రోయ్! లెయండి. లెయండి" అన్నాడు తత్తరగా.

"రామయ్యా! కూర బలేవుండాదయ్యా, ఇంకా నాలుగు తునకలు పట్టకరా" అన్నాడు గుండయ్య తూగుతూ.

"ఇంకా యేం తునకల్రా మొద్దుముండాకొడకా? లేరా! వచ్చారు వాళ్ళు. ఇంకేముంది?"

"అదొక లెక్కాంటయ్యా, కర్రతిప్పి పైనబడితే, ఎక్కడివాళ్ళ క్కడ పారిపోరో?"

"పదండ్రా. పదండి."

రామయ్య బయటికొచ్చిచూచి బిత్తరపోయాడు. ఆ వెన్నెల్లో మాంచి యిరవై అయిదుగురు మాల మాదిగలు కర్రలతో నిలబడి వున్నారు గుడ్డాగిడ్డా యెగజెక్కి. యల్లప్ప అందరికంటే ముందుగా వున్నాడు సిద్ధంగా. రామయ్యను చూడగానే యల్లప్పకు శివం హెచ్చింది. పండ్లు కొఱుకుతూ-

"రారా, నియ్యమ్మా! రా ముందుకు" అన్నాడు.

"............................"

"ఏయ్! నిన్నేనోయ్! నోటికి నక్కిళ్ళు వడ్డాయా?" అన్నాడు హుంకరిస్తూ.

"ఇంత రాత్రప్పు డెందుకొచ్చార్రా యీవిధంగా?" అన్నాడు రామయ్య.

"ఎందుకా? నీ పెళ్ళాన్నెత్తుకపోడానికి" అన్నాడొకడు.

"ముందూ వాడి పెళ్ళాన్ని బయటికి లాక్కురాండ్రా" అన్నాడింకొకడు.

"చూస్తారేంరా, తన్నకుండాసూ" అన్నాడు మరొకడు.

"ఊఁ, భెయ్," అన్నాయి కొన్ని గొంతులు.

కలబడ్డారు. ఇంతలో కొంతమంది ఊరివారు చేరారు. కలబడి కొట్టుకుంటున్నారు. కేకలు వేస్తున్నారు. కర్రకు కర్ర కొట్టుకుంటున్న శబ్దాలు వినవస్తున్నాయ్. దబా దబా అనే శబ్దాలు వినవస్తున్నాయ్. "అమ్మో" అనే ఆర్తనాదాలు వినవస్తున్నాయ్. బీభత్సమైన యుద్ధరంగంగా మారిందాస్థలం కాసేపట్లో. ఇంతలో త్రిమూర్తులొచ్చారు- "రే, రే, ఆగండి" అంటూ.

"భెయ్‌రా శాస్త్రిగాణ్ణొకేటు" అన్నాడొకడు. "భెయ్ కరణంగాడ్ని" అన్నాడింకొకడు. ఆ పనికాస్తా అయింది. "అమ్మో, నాయనో, చంపార్రా వెధవలు" అంటూ యేడుస్తూ బయటకొచ్చారు త్రిమూర్తులు.

బడి కాస్త దూరమవటంవల్ల అప్పటికొచ్చా రయ్యవార్లు. "ఆగండి" అన్నాడు కేశవరావు. లేచిన కర్రలు పైన్నే నిలిచాయి. క్షణం నిశ్శబ్దం. మరుక్షణమే పెఠామనే శబ్దం. వెంటనే "అమ్మా!" అంటూ యల్లప్ప పడిపోవటం జరిగింది. రక్తం 'చుర్' మని చిమ్ముతూంది తలలోంచి. తల రెండు వ్రయ్యలయింది. స్మృతితప్పి పడిపోయాడు. ఎక్కడివాళ్ళక్కడ తప్పుకున్నారు. తక్షణం కోడూరు ఆసు

వత్రికి తీసుకెళ్ళారు. వాఙ్మూలం కాగానే ప్రాణం పోయింది. శవాన్ని పోలీసుల వశంచేసి, కేసుపెట్టారు హరిజనులు.

యల్లప్ప చనిపోయాడని నిద్రలేవంగానే తెలిసింది రామయ్యకు. కంగారుగా పరుగెత్తాడు శాస్త్రిలు యింటికి. శాస్త్రిలు శరీరానికి వట్టు వేసుకొని, దుప్పటి కప్పకొని కొక్కరించుకొని కూర్చొనున్నాడు కోడి లాగా. గబగబా వచ్చి భయకంపిత కంఠంతో,

"చూశారా శాస్త్రిలూ, యెంత పనయిపోయిందో!" అన్నాడు.

"ఏమయిందేఁ, యెందుకంత కంగారు?"

"ఏమయిందా? యెల్లుగాడు చచ్చాడు!"

"చచ్చాడా? మాంచిపని జరిగింది! వాడొకడేనా, యింకా యెవ రన్నానా? మాలోళ్ళకు పెద్దట! ఛావాల్సిందేలే లమ్డీకొడుకు!"

"యేందయ్యా ఆ మాటలు! యిపుడు నా మెడకు తగులుకొంది."

"యేఁ, నీ మెడకెందుకు?"

"నేను చావగొట్టినట్టు యల్లప్ప వాఙ్మూలం యిచ్చాడంట."

"ఆఁ, నువ్వా? నువ్వేనా వాణ్ణి జంపింది! భలే పన్జేసినావ్! వీరుడ వంటే నువ్వు! నీబోటివాళ్ళు నలుగురు లేకపోయిరే యింత పూళ్ళో! వాళ్ళ పొగరణిగుండేది!!"

"ఇపుడు నా పొగురు కత చూచుకోవద్దటయ్యా!"

"నీకేమయ్యా, నేను చంపలేదంటే అడిగేదెవడు? సాక్ష్యం చెప్పే వాడెవడు? మాలవాళ్ళు చెపితే, కక్షవల్ల అందాం."

"ఎవడో సాక్ష్యం చెప్పేదేందయ్యా, యల్లప్పే వాఙ్మూలం యిచ్చి నాక?"

"ఆఁ. వాడొకడిస్తే అవుతుందా? కోర్టులో నిలబడి చెప్పేవాడు కావొద్దో?"

"అవన్నీ పోనీవయ్యా! యిపుడొచ్చే ముప్పు తప్పించుకోడమెట్లా అని?"

"ముప్పేమిటయ్యా ముప్పు? పెద్దగా బెదుర్తున్నావ్!"

"పోలీసులొస్తారు. అరెస్టు చేస్తారు. జైలుకేస్తారు."

"ఓశ్, అదేనా! ఫరవాలేదులేవయ్యా!"

"ఫరవేందయ్యా ఫరవా? నే జైలుకుపోతే ఫరవాలేదా?" అన్నాడు రామయ్య కోపం పట్టలేక కూర్చున్నచోటునుంచి లేచి. శాస్త్రిలన్నాడు-

"అదిగాదయ్యా పిచ్చివాడా! అంతదూరం పోతావెందుకు? అసలు కేసు అంతుచిక్కనిస్తేగదూ?"

"దీనికి తిరుగులేదయ్యా స్వామి! నన్ను జైల్లో వేసేది ఖాయం. శిక్ష పడిందంటే, మాలల్ను పట్టపగ్గాలుంటాయా?" అనేటప్పటికి మాల వాళ్ళు రాత్రి తన్నుగొట్టినదెబ్బ జ్ఞాపకానికొచ్చి, బహుబాధ పెట్టింది శాస్త్రిల్ని. రోషం వచ్చింది. నిర్ధారించుకొన్నవాడులాగా-

"భయపడొద్దు రామయ్యా! నేనున్నాలే, జామీనుండి విడిపిస్తాలే అంతగా అయితే. అంతకుమించిందంటే, డబ్బుందిగా, వ్యవహారం సాగిద్దాం. ఏం ఫరవాలేదులే. ధైర్యంగా యింట్లో కూర్చో."

ఇంతలో కరణం వచ్చాడు. నెత్తిన కట్టుకట్టి వుంది. "నీగ్గూడా తగిలిందా?" అన్నాడు శాస్త్రిలు, నాకేగాదులే అనుకుంటూ.

"అవునండీ! రాత్రి ఆ అయ్యవార్లు రాకుంటే నాపైన మరి రెండు కర్రలు వాలేవి" అనేటప్పటికి,

"చట్. అసలా అయ్యవార్లకు పడాల్సింది! మనవాళ్ళంతా చచ్చు వెధవలోయ్! మనల్ను చూడగానే 'భేయ్' అంటూ కొట్టారుగదా మాలలు-వీళ్ళను చూడగానే మనవాళ్ళెందుకు కొట్టలేదో?"

"కొట్టరు. అయ్యవార్లంటే వూరివారికంత పగలేదు మునుపటి మాదిరి. ఆనాడు మీ యింట్లో నిన్ను మందలించి మాట్లాడాడు గదూ, కులాలు లేవనీ అంతా ఒకటే అనీ. అప్పట్నుండీ అయ్యవార్లంటే కొంత అనురాగం కలిగినట్లుంది వూళ్ళోవాళ్ళకు."

"ఛాఛా! వట్టిమూర్ఖులు! ఎందుకు బుద్ధిలేదురా వీళ్ళకు? వాళ్ళంటే మాత్రం వీళ్ళకుతెలీదూ అనుభవించేవాళ్ళకు! వాళ్ళమాటలు వినడమే!.... ఆ పిల్లవెధవలు....రెండింగ్లీషు ముక్కలొచ్చునో రావో, అప్పుడే కులం లేదు, తలంలేదు.... అయితే కాకీ హంసా ఒకటవుతాయా? ప్రపంచానుభవం వుంటేగదూ! కాకికేందెలుసులే వింటెన్‌దబ్బేటు!....... పైగా బాపనోడంట ఆ కేశవరావు! ఇట్లా వెధవలంతా బాపనోళ్ళయ్యే కాలం యిట్లా యేడుస్తూ వుండేది! ఏదో నీబోటివాడూ నాబోటివాడూ పల్లెకొకరో యిద్దరో వుండబట్టే హిందూమతం కొంత నిలిచింది. బ్రాహ్మళ్ళని వూరికత యెందుకులే! చెప్పాలా?

"అప్పిచ్చువాడు వైద్యుడు

నెప్పుడు నెడతెగక పారునేరును ద్విజుడున్ - ఏమంటావు కరణం?.... ఆఁ.... మనమన్నా వుండబట్టే యీ వూళ్లో యింతమాత్రమన్నా ఆపగలిగాం. లేకపోతే, యీ వెధవలిద్దరూ యేకిబేకం చేసేసుందురు! ఊరంతా యీపాటికి కులభ్రష్టులై పోయుందురు! ఏదో పెద్దోళ్ళు బుద్ధిలేక పెట్టారా యివన్నీ? పిల్లవెధవలు! అనుభవం వుంటేగా!"

ఇంతలో సుబ్బారెడ్డికూడా వచ్చాడు. కడపటి మాటలు విన్నాడు. ఆలోచిస్తూనే కూర్చున్నాడు. అతనికి అయ్యవార్లయెడ ధోరణి కాస్త మారింది.

శాస్త్రిల యింట్లో కేశవరావు మాట్లాడినప్పటినుండీ - నారాయణ కేశవరావు విషయం చెప్పినప్పటినుండీ-వాళ్ళవిషయాలు గమనిస్తూవచ్చిన

కొలదీ-ఉద్దేశాలు మారజొచ్చాయి. కులతత్వాలపైన కొంత పట్టు తప్పిం దనవచ్చు. తానై తన స్కూలులో చేరి - తన స్కూలు కొఱకు పాటు పడుతూ-తన పిల్లలకు ఉచితంగానే అందరికి చెప్పినట్టే చదువు చెబుతూ నారాయణతో కలిసి భోంచేస్తూ-బ్రాహ్మలకూ, శూద్రులకూ, మాలలకూ భేదం లేదంటున్నాడు గదా కేశవరావు - ఆ మాట పెద్ద సంచలనం లేవదీసిం దానాడు సుబ్బారెడ్డి హృదయంలో. "అసలు బ్రాహ్మలు యేదో చాలా తేడా వుందని యితర్లను నీచంగా చూస్తారు. నేను యీ వూళ్ళో యింత గొప్పవాణ్ణయినా, శాస్త్రి, కరణం అన్ని విషయా లలో గాకున్నా కొన్నిట్లో నీచంగా చూస్తారు. చాలా మంది శూద్రులను, నా సమక్షంలోనే, వయో భేదం గూడా పాటించకుండానే, వొరే, తరే అని పిలుస్తారు......" ఇట్లాంటివన్నీ చాలాసార్లు మనసులో తర్కించు కున్నాడు. శూద్రుల్ని బ్రాహ్మలు నీచంగా చూడటం తప్పని నిర్ధా రించుకున్నాడు. అయితే, మాలల్ని మాత్రం దూరంగా వుంచాలనే ధోరణి పోలేదు.

"యేమిటి రెడ్డీ ఆలోచిస్తున్నావ్?" అన్నాడు శాస్త్రిలు.

"యేమీ లేదు శాస్త్రిలూ, వూరికినే."

"చూచావా, ఎంత దౌర్జన్యంగా వుందో! ఇట్లా అయితే మనం సేద్యాలూ, నాద్యాలూ చేసుకొని బతికే దేముందీ మాలల ముందు! యింకేముంది?"

సేద్యం మాట యెత్తేటప్పటికి రెడ్డికి హృదయంలో చలనం గలిగింది. మాలల్ను పట్ట పగ్గాలుండ వనుకున్నాడు. శాస్త్రిలు మళ్ళా అన్నాడు—

"చూశారా, మాలల కతలు! రెండు సంవత్సరాల్నుంచీ వాళ్ళే విధంగా చేస్తున్నారో! సవర్ణులను లెక్కించకుండా దొమ్మీగా వచ్చి

పైబడ్డారంటే, వాళ్ళ కెంత మదమెక్కి గుడ్డివారయ్యారో తెలుస్తూనే వుంది గదూ! ఇట్లా జరగడాన్ని ఉపేక్షిస్తే మన కులాలు, మతాలు నాశనమయ్యే కత అట్లా వుంచి, మొదట మన మర్యాద దక్కుతుందా? మన యెడ మర్యాద లేకపోతే వాళ్ళు మనకు పనీ పాటల కొస్తారా?...."
ఇంకా ఇట్లాంటివి చాలాచాలా చెప్పి, అక్కడి కొచ్చిన వారందర్నీ గూడా రెచ్చగొట్టి, ఉద్రిక్తుల్ని చేశాడు శాస్త్రులు.

"అవన్నీ సరేనయ్యా, యిప్పటి కత చూడండి!" అన్నాడు రామయ్య దిక్కులు చూస్తూ.

"నీకేం రామయ్యా, మేమంతా యింతమందుండగానూ?" అన్నాడు శాస్త్రులు అభయం యిస్తూన్నట్టు.

"ఎంతమందుంటే చేసేదేముందయ్యా! పోలీసోళ్ళొచ్చి బేడీలు వేసేది నాకు!"

"వేస్తే మాత్రం విప్పించుకోలేమూ? అసలు రెడ్డి రిపోర్టు తీసుకోందే జైల్లో వేస్తారాః"

"రెడ్డి తప్పుడు రిపోర్టిచ్చినా గూడా చెల్లదయ్యా! యల్లప్ప వాఙ్మూలం చాలు."

"అయితే నువ్వెక్కడికైనా యిప్పుడే పారిపో! అంతకంటే మించింది దేమీ లేదు. మూన్నాళ్ళ క్రిందటే రాజంపేటకు వెళ్ళి యింకా రాలేదని మేమంతా చెప్పుతాం."

"ఏమిటయ్యా ఆ వెఱ్ఱి? ప్రభుత్వం అంత తెలివి తక్కువ దనుకున్నావా? ఇవన్నీ సాగుతాయా? ఇవేం పెండ్లిండ్లలో ఆడే అబద్ధాలనుకున్నావా?"

"అయితే యేం జెయమంటా వయ్యా?"

"అందరం కలిసి రాజీకి ప్రయత్నిస్తే?"

"ఛట్, రాజీ యేందోయ్?" అన్నాడు కరణం.

"ఎప్పటికీ పనికిరాదు!" అన్నారు మరికొందరు.

"ఈ దినం రాజీ పడితే రేపు మన కత చూచుకోవద్దా?" అన్నాడు రెడ్డి. కొంతసేపు నిశ్శబ్దంగా వున్నారందరూ. రామయ్య అన్నాడు:

"అదిగాదు. రాజీపడినాగూడా, మాలవాళ్ళ గురించి అంత భయ పడనక్కర్లేదు. వాళ్ళు ఎన్ని చేసినా మనకింద బతికేవాళ్ళు! ఆ అయ్య వార్ల దగ్గరికిపోతే మన కత కాస్త చూస్తారు. వాళ్ళు చెబితే మాలవాళ్ళు వింటారు గూడా. అనుభవించబోయేవాణ్ణి నేను గనక, యింత మాట్లాడు తున్నా. మీకేం? యేం జరిగినా దూరాన్నుండి చూచేవాళ్ళు" అని, రెడ్డి వైపు ప్రార్థనార్థకంగా చూచి "నీవు పూనుకోవాలన్నా!" అన్నాడు అదొక మోస్తరు ముఖభంగిమంతో.

అందరూ బయలుదేరారు బడి దగ్గరకి. అయ్యవార్లావిషయమైయే మాట్లాడుకుంటున్నారు.

"రాజీకోసం వాళ్ళంతా మనదగ్గిరికొస్తే యెట్లా ?" అన్నాడు నారాయణ.

"రారులేవోయ్! వాళ్ళకుమాత్రం రోషంలేదూ? రోషం పొయ్యడానికి శాస్త్రిలున్నాడుగా!" అన్నాడు కేశవరావు.

"కాదోయ్! నాకెందుకో అనుమానంగా వుంది వస్తారని. వస్తే మన స్థితి యేమిటి?"

"ఏమీ చేయజాలనట్లు ఊరుకోవాల్సిందే! ఇదిగూడా మన మేలు కొరకే వచ్చింది. వీళ్ళెన్ని చేసినా మాలవాళ్ళ పక్షమే కేసు గెలుస్తుంది."

ఇంతలో అందరూ వచ్చారు. రామయ్య అందర్నీ తోసుకుంటూ వచ్చి కేశవరావు కాళ్ళపైబడ్డాడు. కేశవరావు ఆదరాబదరా అతన్ని లేవనెత్తి తాను లేచి-

"యేమిటిదంతా? నీకేమన్నా పిచ్చా యేమిటి?" అన్నాడు.

"నిజమే! పిచ్చి పట్టింది" అన్నాడు రామయ్య కండ్లలో నీళ్ళు పారాడిస్తూ; మళ్ళా అన్నాడు:

"మీరెట్లయినా ప్రయత్నించి, రాజీ కుదుర్చాల్సిందే! మీపైన భారం వేస్తున్నాం. పాలముంచినా నీటముంచినా మీదేభారం!"

"కొంచెం చూడాలీవిషయం మీరు" అన్నాడు రెడ్డి.

"ఆలోచిస్తే బాగుండు" అన్నాడు శాస్త్రి.

"మావల్ల యేమవుతుంది? మేంచెప్పితే వాళ్ళు వినరు."

"మీరు చెప్పితే వినకుండా వుంటారా? వాళ్ళింత స్థితికి రావటానికి కారణం మీరేగదా?" అన్నాడు శాస్త్రి, అన్నిటికీ సరిపోతుందిలే అనుకొని.

"నిజమేనండీ! వాళ్ళు బాగా రెచ్చిపోయారు. కోపం, ఉద్రేకం యింకా అణిగివుండలేదు. మేమేమీ వాళ్ళతో చెప్పలేం యిప్పుడు. ఇంకా కొన్నాళ్ళుగడిచినాక చూడగలం."

ఇంతలో వచ్చాడు సబ్ యిన్స్పెక్టరు పోలీసులతో. రామయ్య తప్పించుకోదలచుకున్నాడుగాని, మళ్ళా ఏదో తొందర్లో నిర్ధారించుకున్నట్లు నిలబడ్డాడు. చేతులకు బేడీలు పడ్డాయ్. దీనంగా చూచాడు రామయ్య అందరివైపూ. అయ్యవారు శాంతంగా అతని మొగంలోకి చూచాడు పొగరెంత కరిగిపోయింది అనుకుంటూ. శాస్త్రి గుండెపైన చెయ్యేసి "నేనున్నాలే" అనే అర్థమిచ్చేటట్టు తల ఎగరేశాడు.

సుబ్బారెడ్డిని రిపోర్టిమ్మంటే, అంతకుముందే ఆలోచించిన తప్పుడు రిపోర్టు వారి స్వాధీనం చేసి తప్పుకున్నాడు. ఊళ్లో కొంతమందిని విచారించగా సరైన సాక్ష్యం లభించలేదు. శాస్త్రులు నడిగితే దెబ్బ చూపిస్తూ

"కొట్లాట మాన్పడానికిపోతే, 'ఛేయ్‌రా శాస్త్రిగాణ్ణొక దెబ్బ' అంటూ నన్ను గూడా కొట్టారు" అన్నాడు. కరణం అంతే చెప్పాడు.

"అయితే యల్లప్పను చంపిం దెవరంటావు?'' అన్నాడు ఇన్‌స్పెక్టరు శాస్త్రితో.

''మాలవాళ్ళే ఆ మబ్బులో తెలీక కొట్టి చంపి వుంటారు.''

"పున్నమ వెన్నెల్లోగూడా మబ్బేనటయ్యా!"

శాస్త్రులు గడ్డు మిణుకరించి "అబ్బే! అదిగాదు. ఆ దొమ్మిలో ఎవరు కొట్టారో అని" అన్నాడు.

మధ్యాహ్నం కేశవరావు దగ్గరే భోంచేశాడు ఇన్‌స్పెక్టరు. భోంచేస్తూ చాలా చాలా విషయాలు చెప్పాడు కేశవరావు. తర్వాత అన్నాడు - "పాపం! తప్పించుకోబోయి చిక్కుకున్నాడే రెడ్డి?" అని.

"పల్లెటూళ్ళంతా యిట్లాంటి దౌర్జన్యపు మనుషులతో నిండి, నాశనమై పోతున్నాయి; ఇట్లాంటివాళ్ళకే అసలు పూజ కావాల్సింది" అన్నాడిన్‌స్పెక్టరు తృప్తిగా.

హరిజన వాడంతా చందాలు వేసుకొని, నూరు రూపాయలు ప్రోగుచేశారు వ్యవహారానికి. ఈ వ్యవహారంలో ఎట్లయినా గెలిచి రైతులకు బుద్ధి చెప్పాల్సిందే అని పట్టు పట్టారు వారు. రాజీ కేమాత్రమూ ఉన్ముఖులుగా లేరు.

శాస్త్రిలీ కేసు విషయంలో గట్టిగా పట్టుపట్టాడు - రామయ్య మీది ప్రేమ చేతగాదు - మాలలపై గల ద్వేషంచేత, అయ్యవార్లపై గల కోపంచేత! రామయ్య కెంతగావాలన్నా అప్పిస్తానన్నాడు. ప్రస్తుతం జామీనుపై వదిలించారు రామయ్యను. లంచాలు బాగా పోశారు. సూపర్నెంటుకూ, లాయర్లకూ - ఒకరికేమిటి? ఎవరికంటే వారికి లంచాలు పోస్తున్నారు. రామయ్య డబ్బులెమ్మని శాస్త్రిలూ, శాస్త్రిలది లెమ్మని

రామయ్యా కర్చుపెట్టేస్తున్నారు ధారాళంగా. వాయిదాలకు పొయ్యే టప్పుడంతా సెకండు క్లాసులో ప్రయాణం అందరూ. "నీ పుణ్యాన సెకండు క్లాసులో ఎక్కుతున్నా నబ్బా!" అని అనేవాడు శాస్త్రి లానందంగా!

"దర్జాగా అనుభవించాల్సిందే గదండీ!" అనేవాడు రామయ్యా, నాదేం పోయిందిలే అనుకుంటూ.

ఇంత డబ్బూ కర్చుపెట్టి యింత అవస్థ పడినప్పటికీ, లక్ష్మి సాక్ష్యంవల్లా- కొన్నికొన్ని క్రాసు పరీక్షలవల్లా, గంగయ్యా గుండయ్యా తప్పులన్నీ ఒప్పుకొని రామయ్యపైకి కేసు త్రోసివెయ్యటం వల్లా- యల్లప్ప వాఙ్మూలంవల్లా - రామయ్యకు ఉరిశిక్ష పడింది. గంగయ్యా, గుండయ్యలకు ద్వీపాంతరవాసం పడింది.

చాలా భయపడ్డా రందరూ. సుబ్బారెడ్డి యిపుడు పూర్తిగా పట్టు పట్టాడు కేసు విషయమై. హైకోర్టుకు అప్పీలు చేశారు.

ఒక చిన్న సంఘటన జరిగింది. కరణాన్ని రోడ్డుపై నిలేశారు హరిజనులు. ఏదో వాదోపవాదాలు జరుగుతున్నాయ్.

కరణం పెద్ద లంచగొండి. గొప్ప దురాశాపరుడు. అన్యాయాలు చెయ్యటంలో యేమాత్రమూ తీసిపోడు. అందరు కరణాల్ని చూచి నేర్చు కున్నాడు. వాళ్ళందరికంటే మించిపోయాడిపుడు మోసంలో- అన్యాయం చెయ్యడంలో. ఎవరన్నా భూములకు దరఖాస్తు పెట్టుకుంటే-ఆ భూమికి తానే నాయకుడైనట్లుగా మాట్లాడి, పట్టా తెప్పించడానికి లంచం తీసి కొంటాడు. తీసికొని, వచ్చేటట్లు చేస్తే మంచిదే! అదే భూమికి అదేవిధంగా మరికొందర దగ్గర డబ్బుడుగుతాడు. కడకు ఎవడు డబ్బు దండిగా యిస్తే వాడికొచ్చేటట్లు వ్రాస్తాడు. ఎవరన్నా తానేదయినా అడిగినపుడు యివ్వకపోతే, వాళ్ళభూములు కొలిచినట్లు నటించి, నంబరురాళ్ళు పీకి,

అని తెగేసి చెప్పిన కవివరుడు సోమనాథుడు జన్మించినది తెలంగాణంలో. 'అచ్చతెనుంగు గబ్బమున కాదిపదంబయి పొల్చు భాగ్యమున్ హెచ్చగ గన్నదేశము' తెలంగాణమే. స్వమతాభిమానులూ, పరదేశీయులూ అయిన ముస్లిం పాలకులు పరమతాలను గౌరవించి, పరభాషను- ముఖ్యంగా తెలుగును ఆదరించినది తెలంగాణంలోనే. ఈ మునల్మానుల ఆదరంలో అచ్చ తెనుగు కబ్బము వెలసిందంటే ఆశ్చర్యం కదూ! శతాబ్దాల రాజకీయ తమో యవనికలు వీడి మనమంతా ఏకమౌతున్న ఈనాడు, మన పలుకును ఆదరించిన, ఆలకించిన, ఆలపించిన తురుష్క ప్రభువులను సంస్మరించుకొని, పరభాషను, పర సంస్కృతిని మన్నన చేయడం నేర్చుకుందాం.

గోలకొండ రాజ్యం ఏలిన కుతుబ్‌షాహీ ప్రభువులకు స్వమతాభిమానం గాఢమే. కాని, అది బహమనీ సుల్తానులలో ఉన్నట్టు పరమత విద్వేషంగాను, పరమత విధ్వంసకంగాను పరిణమించలేదు. వీరికీ రాజ్యకాంక్ష మెండే. కాని అది బహమనీ సుల్తానులకున్న రక్తపిపాస మాత్రం కాదు. కుతుబ్‌షాహీలు స్వభాషను బహమనీలవలె ప్రేమించారు. అప్పుడు దక్షిణాపథంలో శైశవావస్థలో ఉన్న ఉర్దూకు ఊత ఇచ్చారు. ఉర్దూకవితలు చెప్పారు- "తెలుంగాధీశులు" కావడం వల్ల తెలుగునూ పోషించారు. తమ రాజ్యకార్యాలను పార్సీలోను జరిపారు; తెలుగులోనూ జరిపారు; తెలుగులో కవిత చెప్పారు.

కుతుబుషాహీ పాలకులలో విశేషంగా కీర్తించదగినవాడు మొదటి కుతుబుషా మూడవ కుమారుడు మూడవ కుతుబుషా ఇబ్రహీం. నిజానికి ఇతడు తెనుగువారికి గర్భశత్రువు. ఇతడు, ఏడేండ్ల పాటు విజయనగరంలో తలదాచు కొన్నప్పుడు తెలుగు చక్కగా నేర్చుకున్నాడు. సలక్షణంగా మాట్లాడగలిగాడు. తను గోలకొండ పట్టానికి వచ్చినమీదట, అహమ్మద్‌నగర్ సుల్తానుతో కలిసి అళియ రామరాజుతో కత్తికట్టి తల్లికోట పోరులో అతనిని తుదముట్టించి, విజయనగరాన్ని తుంగభద్ర పాలుచేసిన దుర్మార్గుడు. ప్రాణాలరచేత పెట్టుకొని పారివచ్చి పంచజేరి కొడుకువలె కుడిచి రక్షకునే భక్షించిన ఇబ్రహీమును మన వారు తరతరాలకూ క్షమింపకపోవలసిందే. కాని, అలా

వాడికి కోపం పట్టకుండా వచ్చింది. ఛెళ్‌మని కొట్టాడు చెంపకేసి. తిరిగి పడ్డాడు కింద కరణం. ఇంతలో అయ్యవార్లొచ్చారు.

కరణం కోల పెట్టాడు కోపంగా.

అయ్యవార్లకంతా తెలుసు. అయ్యవార్లే దరఖాస్తు ఫారం వ్రాసింది. దొంగరసీదులు యిచ్చినవాటి కాపీలు తమ దగ్గర వుంచుకున్నారు. ఆ విషయాలు చెప్పి ఛీకొట్టారు కరణాన్ని. కరణానికి యింకా మండింది. కేసు పెడతానని బయలుదేరాడు.

యల్లప్ప చచ్చి యిప్పటికి యిరవై రోజులుకూడా కాలేదు. కరణం కేసు పెట్టబోతే సుబ్బారెడ్డి, శాస్త్రిలు వారించి యిప్పటికి అయిదురోజు లయింది. అయ్యవార్లకు తెలుసు కరణం కేసు నెగ్గుతుందని. మాలవాళ్ళు రాజీపడితే బాగుండునని అనుకున్నారు. అయితే రాజీమాటలు రైతుల నుండే వచ్చేటట్టు చేయాలని వారి సంకల్పం. చేయకపోతే హరిజనులు ఇంకా నీచంగా చూడబడతారు. ఈలోగా మాలవాడలో ఒక పరిణామం వచ్చింది. రైతులు కూలికి పిలవకుండా బాలించుకోడం వల్ల అందరూ వస్తులుంటున్నారు. ఇరుగుపొరుగు పల్లెలవాళ్ళు గూడా పిలవడం లేదు. ఏదో వున్నవి నాన్నాళ్ళు తిన్నారు. తర్వాత యెండజొచ్చారు. ఇంకేం జెయ్యడం? అప్పు తెచ్చుకుందామన్నా దొరకదు. ఇట్లా ఎన్నాళ్ళు పేగులు పీకుతూ వుంటే కూర్చుంటారు? ఎన్నాళ్ళని వుండగలరు? ఉండలేక పోయారు. బిర్రు తగ్గింది. మొదట్నుండీ వ్యవహారం వద్దు అంటూన్న ముసలి దీర్ఘదర్శులతో కలిశారు కొంతమంది క్షుధార్తులు. రాజీ మంచి దనుకున్నారు. అయ్యవార్లు రాజీ విషయంలో చాలా ఉపాయాలు పన్ను తున్నారు ఊళ్ళోవాళ్ళు గూడా చాలా విసిగిపోయి వుండడంచేత వీళ్ళ ఉపాయాలు ఫలోన్ముఖానికొచ్చాయి! ఈ సమయంలో జాగ్రత్తగా పని చేశారయ్యవార్లు. "హరిజనులు రాజీకొస్తారనీ- వారు రాకముందే రైతుల చేత రాజీమాట పలికించాలనీ- అట్లయితే హరిజనులకు గౌరవదాయంగా

వుంటుందనీ" అభిప్రాయపడ్డారు. రాజీ కోసం రామయ్యా, సుబ్బారెడ్డి యెక్కువగా ప్రాకులాడారు. శాస్త్రులు మధ్యవర్తిగా అయ్యవార్ల దగ్గరి కొచ్చాడు. అయ్యవార్లు మాలవాళ్ళను పిలిపించి, రాజీ చెయ్యించారు. రాజీ కుదిరింది. ఇన్నీ జరిగినాక కడపటికి, రామయ్యకు ఉరిశిక్ష తప్పి, ద్వీపాంతర వాసం తప్పి, కారాగృహవాసం పడింది కొద్దిమాసాలు. ఆ కాస్తకాలం గడిచినాక ఒక దినం శాస్త్రులు-

"రామయ్యా, లెక్క జూచుకుందాం రా నాయనా!" అన్నాడు.

"ఏమి లెక్కండీ?'' అన్నాడు రామయ్య.

"మన కేసుబాపతు తండ్రీ! మరిచావా?

"ఓహో! అదా? చెప్పం డెంతయిందో?

"అయిదువేలా నాలుగువందలయింది."

"ఎక్కడిదంత? అయినా నువ్వే ఖర్చుపెడుతూ వుంటివే? నేనెక్కడ ఖర్చుపెట్టాను?"

"అయితే నాకోసమంట్రా నాయనా?"

''ఎవరికోసమో?'' అన్నాడు లేచిపోవడానికి ఉంకిస్తూ.

శాస్త్రులకు దుఃఖం వచ్చింది. భయంతో కాస్త వొణుకుతున్నాడు. తల ఒక మోస్తరు ఊచుతూ-

''అయితే నేనిచ్చిందంతా వట్టిదేనా?" అన్నాడు.

"నీవెప్పుడిచ్చావయ్యా?" అంటూ బయలుదేరి వెళ్ళాడు రామయ్య-

గుండెలు చల్లబడ్డాయి శాస్త్రులకు. 'ఓరి పీనుగా!' అంటూ కూర్చోబడ్డాడు. యేడుస్తూ.

## ౧౧

లక్ష్మి విధవయింది. అన్నగార్లొచ్చి పిలుచుకుపోయారు పుట్టింటికి. కొన్నిదినాలు అయ్యవార్ల దగ్గరే వుండి, తర్వాత స్కూల్లో చేరినాక తల్లి దగ్గరి కెళ్ళింది సుజాత. రెండవ ఫారంలో చేర్చారా పిల్లను. శ్రీనుకు, సుజాతకు గుడ్డలు, మొదలైన కర్చులకు అయ్యవార్లిస్తున్నారు. శ్రీనుకు పది రూపాయలు స్కాలర్‌షిప్ వస్తూవుండేది. అంతా మామ గారింట్లో యిచ్చేవాడు. ఇపుడు ఆ పది రూపాయల ఆదాయానికి ముగ్గురు భోక్తలయ్యారు. అందుచేత మొదట మొదట అంతగాకున్నా తర్వాత తేలికై పోయింది లక్ష్మి యింట్లో. వదినలకు పడ దీమంటే. ఈమె ఊహలే వారికి నచ్చవు. చాలా సార్లు "మీ సుజాతను మా వెంకడి కీవూ?" అంటూండేవారు. "ఇప్పుడేమొచ్చిందమ్మా తొందర?" అనేది ఒకసారి. "నా యిష్టమేమీ లేదమ్మా, ఆ పిల్ల పెద్దదై యెవణ్ణి చేసుకుంటా నంటే వాడికే" అనేదింకొకసారి. "అంతా వాళ్ళయ్యవార్లది. వాళ్ళే దీన్ని సాక్కున్నారు. చదివిస్తూన్నది గూడా వాళ్ళే" అనేది మరొకతూరి.

ఈ జవాబులు వింటే వాళ్ళకు మండుకొచ్చేది. "అయితే తిండి గూడా ఆ అయ్యవార్లే పెట్టకూడదంట్నా?" అని దెప్పేవారు. పైగా ఆ పిల్లను చూచి అహంభావం అనుకొని, తిట్టేవారుగూడా. తన అసహాయ స్థితి ప్రబలేకొద్దీ - వాళ్ళపై ఆధారపడి అస్వతంత్రగా జీవించేకొద్దీ- ఆమె స్థితి నీచంకాజొచ్చింది. ఎన్నిసార్లో మనసులో నొచ్చుకుంది లక్ష్మి. లోలోపల దుఃఖించింది. అంతకంటే చేసేదేముంది? తనకు వేరే దిక్కు లేదు. అయ్యవార్లకు చెబితే, ఏదో ఉపాయాన్ని చూస్తారు. ఇప్పుడే వాళ్ళు వీళ్ళపై చాలా కర్చు పెడుతున్నారు. ఇంకా యెందుకు వాళ్ళపై భారం అనుకొనేది. అయినా ఒక్కొక్కసారి భరించలేక చెబుదామనుకొనేది. తీరా కేశవరావో, నారాయణో వచ్చినపుడు చెప్పలేక పోయేది. ఏదో

ఒక విధంగా సహించుకొనేది. కాలం గడిచేకొద్దీ దుర్భరమై పోయింది జీవనం. తన అసహాయతను పురస్కరించుకొని, తన దౌర్భాగ్యాన్ని తల్చుకొని చాలాసార్లు కుళ్ళికుళ్ళి యేడ్చేది. ఎన్నోసార్లు దేవుడికి నివేదించుకుంది. కష్టాలెప్పటికీ కాపురాలుంటాయా? సుజాతకు గూడా నెలకు పది రూపాయల స్కాలర్ షిప్ వచ్చింది. అంతా ఒక్కసారే ఆరునెలల మొత్తం వచ్చింది. సంసారాన్ని ప్రత్యేకంగా జరుపుకోవచ్చుననుకుంది లక్ష్మి. ఇంతలో కేశవరావు వచ్చాడు రాజంపేటకు. అప్పుడు చెప్పిందామె కన్నీరుమున్నీరుగా కార్చి కష్టాలన్నీ. అన్నల సాయంతో, ఒక పాడుపడిన కొంపను చక్కజేయించి కాపురం పెట్టింది. బిడ్డలకు లక్షణంగా స్నానం, భోజనం చూచుకుంటూ వుంది.

రామిరెడ్డి, నాగలింగం ఇపుడు శ్రీనింటికి రాసాగారు. రామిరెడ్డి చాలాసార్లు శ్రీనింట్లోనే భోంచేసేవాడు. శ్రీను, రామిరెడ్డి ఎక్కడ యిష్టపడితే అక్కడ భోంచేస్తూ వుండేవారు. నాగలింగం యిటీవల చాలా ఆకర్షింపబడి వస్తున్నాడు. సుజాత అనసూయ బసలోనే పగలంతా వుండేది. ఎప్పుడయినా ఒకపూట కనిపించకపోతే నాగలింగం బయలుదేరేవాడు. ఆ సంవత్సరం ఒక మోస్తరుగా గడిచింది. శ్రీను, సుజాత తప్ప, తక్కిన వారంతా కోట చేరారు.

ఒక సాయంకాలం - అప్పటికి దాదాపు అయిదు గంటలు దాటి వుంటుంది-బయలుదేరారు-నాగలింగమూ, రెడ్డీ కాలువగట్టుకు.

అది వసంత కాలం. చెట్లన్నీ చిగిర్చి ప్రకృతిని శోభింపజేస్తున్నాయ్-పల్లవభక్షకాలైన కోయిలలు-ఆ సాయం సూర్యుని చల్లని పచ్చని కిరణాలు మీదపడి ఆనందాన్ని కలుగజేస్తుండగా, కుహూకుహూరావాలు చేస్తున్నాయానందంగా. కాలవ ప్రవహిస్తూంది బిలబిల ధ్వనితో. నీళ్ళలో కాళ్ళు విడిచి కూర్చున్నారు గట్టున నాగలింగం, రెడ్డి. రామిరెడ్డి యేదో ఆలోచిస్తున్నాడు.

"రెడ్డీ! శ్రీన్ను విడిచిపెట్టి నెల గావస్తుంది. వాడు నా కళ్ళలో మెదిల్నట్టుంది" అన్నాడు నాగలింగం.

"వాడేనా నిజంగా!" అని నవ్వాడు రెడ్డి.

"నిజంగారా!" అని భుజంపై చెయ్యేసి, అట్లాత్రోసి, "నీవాలోచించేది దేన్నిగురించో చెప్పవూ?" అన్నాడు.

"అదే, దాన్ని గురించే ఆలోచిస్తున్నా, వెళ్దామా ఒకసారి?"

"అఁ, వెళ్దాం. వివాహాలకెంత కట్టుబాటు చేశార్రా?"

"ప్రేమించినవాళ్ళను చేసుకోడమే కష్టం."

"కష్టమెందుకు?" అన్నాడు రెడ్డి నవ్వుతూ.

"ఇంకొకకులంలో ప్రేమిస్తే అది అంతేగా?"

"అదెవరికోలేవోయ్, మనగ్గాదది."

"మనకేనోయ్, మన హిందువులకే. వీళ్ళలోనే లక్షలాది కులాలుండటం! పాడుకులాలూ వెధవభేదాలూ!"

"ఇపుడెవ్వడా అవన్నీ పాటించేదీ? మన యిష్టమొచ్చిన పిల్లను చేసుకోవచ్చు. ఏ కులమైనాసరే!"

"పాటించేదెవరంటావా? నీకేం కళ్ళుపోయాయా?"

"మన చదువుకుంటున్న వాళ్ళెవర్రా అంత పాటించేదీ?"

"అబ్బా! వీళ్ళేనోయ్ అన్నీ చెయ్యడం! మొన్న చూచావుగా వాడు, సుబ్బానాయుడు, కమలను ప్రేమించి, కాలేజీలో చదివేటప్పుడు ఏమేమో ప్రమాణాలు పలికి, కడపటికి ఎవరో ఒక మొద్దమ్మాయి పటివేలిస్తానంటే చేసుకున్నాడు. ఇంకొకటి తెలుసా? నెలనాళ్ళక్రితం జరిగిందే! నళిని అనే అమ్మాయి బి. ఎ. చదివేటప్పుడు తన క్లాసుమేటును ప్రేమించి, తప్పక చేసుకుంటానని, ఏమేమో వాడికి చెప్పి, బాగా తిరిగి, అన్నీ అను

భవించినాక-వాడిపై మోజుతీరినాక తర్వాత కులంవేరైనందువల్ల తలిదండ్రులు అడ్డుపడ్డారనీ-అట్లా జరిగితే బావిలో దూకి చస్తామన్నారని చెప్పి, వీణ్ణి మోసగించి, ఎవడో ఒకణ్ణి చేసుకొంటదట! ఇట్లాంటివి ఎన్నో జరుగుతున్నాయి. నీకేమో చదువుకున్నవాళ్ళంటే బలే నమ్మకం! వాళ్ళు చాలా నాగరికులనీ-కులవిషయాలలో ఏమీ పాటింపులుండవనీ-ఏమేమో అనుకుంటావు. అసలు వెధవ ఊహలంతా వుండేది వాళ్ళల్లోనే. మరీ బ్రామిన్, నాన్‌బ్రామిన్ ఫీలింగు ప్రబలమైంది వీళ్ళలోనే. అబ్బా! ఎంతగా విజృంభించిపోతుందోయ్ అది!"

"అయితే తప్పెవర్దిరా?"

"తప్పు యిరువైపులా వుంది."

"ఎట్లా?"

"వీళ్ళేదో ఆకాశంలోంచి పుట్టుకొచ్చినట్లు కొంతమంది భావిస్తారు. సమత్వం తెలుసుకొన్న వాళ్ళకది కిట్టదు. మంటెత్తుతుంది పైగా - అది తెలిసికొని, కారణమేమిటా అని వీళ్ళు ప్రయత్నించి, ఏదో బాగా ప్రవర్తించుకోకుండా ప్రత్యామ్నాయంగా వాళ్ళను ద్వేషిస్తున్నారు. ఎవరో పాతకాలంలో, ఏదో తప్పు చేశారని, వీళ్ళపైన కసి తీర్చుకోవాలంటారు వాళ్ళలో కొందరు తీవ్రవాదులు. మమ్మల్నిట్లా అంటున్నారా అని వీళ్ళు ఆందోళనపడుతున్నారు."

"అయితే నిజం చెప్పరా! తప్పెక్కువ ఎవర్లో వుందో, ఎట్లా చేస్తే దీనికి విరుగుడో?" అన్నాడు రెడ్డి ఏం చెబుతాడో చూద్దామని.

"బాగా ఆలోచిస్తే, తప్పు కాస్త యెక్కువ చదువుకుంటూన్న బ్రాహ్మణుల్లో వుందిరా! ఎందుకంటే, ఒక నాన్‌బ్రామిన్ యింటికొక బ్రాహ్మణుడు పోతే, వాడింట్లో భోంచెయ్యవచ్చు. బాగా తిరగవచ్చు. ఏమీ అభ్యంతరంలేదు. కులంరీత్యా పీడికేమీ అవమానం జరగదు.

వాళ్ళు తినేది వీడూ తింటాడు. ఇంట్లో అందర్లాగానే వీడికి మర్యాద జరుగుతుంది. కాని బ్రాహ్మడింటికి నాన్‌బ్రామిన్ పోతే అట్లా జరగదు.

"అసలు వాణ్ణి వీడు ఆహ్వానించలేడు. ఒకవేళ ఆహ్వానించినా, తన కెక్కడ అవమానం జరుగుతుందో అని భయపడ్తాడు. అందుచేత బ్రామిన్‌తో స్నేహం చెయ్యడానికి జంకుతాడు. దీనికి బ్రామిన్ విద్యార్థు లంతా సిగ్గుపడాల్సిందే! వీళ్ళు వాళ్ళ మర్యాదకు భంగం జరగబోదని అభయం యిస్తే - వాళ్ళకు వీళ్ళ యిండ్లలో సమానమైన మర్యాద జరిగే టట్లయితే, ఒక క్షణంలో సమన్వయం కుదిరి మనమందరం గూడా చక్కని జాతిగా బతుకుతాం!"

"అయితే సమత్వాన్ని పాటించే బ్రామిన్స్ లేరా?"

"లేకేం, ఉన్నారు. కాస్త యువకవర్గం ముందడుగు వేసింది. అయితే అది గూడా ఏ కొద్దిమందో. వాళ్ళుగూడా ప్రత్యేకంగా సంసారాలు నిర్వహిస్తూ వుంటేనే! అప్పటికీ ఎప్పుడైనా తలిదండ్రులొస్తే, నాన్‌బ్రామిన్ అతిథులకు కాస్త దెబ్బతగుల్తుంది. దీన్నిగూడా మించిన మన అయ్యవార్లబోటి, మనబోటివాళ్ళూ వున్నారు!"

"పోనీగాని, నీ ఆశయ సిద్ధికి ఏ మార్గం అవలంబిస్తావు?"

"వేరే మార్గమేముంది? మన అయ్యవార్లు చెప్పిందే మార్గం. ఈనాడు చదివిన, చదువుకుంటున్న ప్రతి యువకుడు, యువతి తమ కులాన్ని విస్మరించి, యితర కులంలో పెండ్లి చేసుకొని, ఒక్కొక్కడు కనీసం, ఒక్కొక్క హరిజనుని ఉద్ధరిస్తే, కులభేదాలు అనతికాలంలో అణగారి పోతాయనీ - సంఘం సర్వవిధాలా అభ్యున్నతి పొందుతుందనీ - అంతే___"

"అయితే దీన్ని తప్పక ఆచరణలో పెడతావా?"

"ఓ, పెట్టితీర్తాను" అన్నాడు నాగలింగం ధీమాగా.

"సంఘం చాలా యెదిరిస్తుంది గదూ అపుడు?"

"ఎదిరించనీ - దాన్ని లెక్కించకుండా కూర్చుంటే?"

"సంఘాన్ని వదిలిపెట్టు. ఇంట్లో తలిదండ్రులను ఒప్పించ గలవా?"

"ప్రయత్నిస్తాను. ఒప్పుకోకపోతే వదిలేస్తాను!"

"అంతేనా? వట్టి కోతలు!"

"ఛ! అంత పిరికితనమైతే మనం యేంజేస్తాం?"

"అంత్యంలో తలిదండ్రులను నొప్పించడం బాగుంటుందా? కష్టపడి కని, పెంచి, చదువు చెప్పించి, యింతవాళ్ళను చేసినాక, విరుద్ధంగా ప్రవర్తిస్తే కృతఘ్నత అనుకోదూ లోకం?"

"అదెప్పటికీ కాదు. వాళ్ళకు, ప్రతిగా వృద్ధాప్యంలో అన్నం పెట్టి పరామరిక చూపకపోతే కృతఘ్నతకాని, ఒకానొక ధర్మం కోసం, సంఘాభ్యుదయంకోసం ఏదైనా చేస్తూవుంటే, వారి అమాయకత్వంవల్ల అది తప్పుగా దోచి అడ్డినా, లెక్కించగూడదు."

"లెక్కించకపోతే, నీ తిండెందుకని పారిపోతారేమో!"

"అంత స్థితికొస్తే పోనీ! మనం మాత్రం వాళ్ళను పొమ్మనం. అంటే, అదీ కృతఘ్నత. బతికినన్నాళ్ళూ లక్షణంగా తినమందాం ఇంట్లో కూర్చొని. ఉండబట్టకపోతే మనమేం చేస్తాం? మన ఆదర్శాలకు స్వస్తి చెప్పాల్సిందేనా?"

"తల్లిదండ్రుల్ను కష్టపెట్టే ఆదర్శ మేం ఆదర్శం?"

"ఆదర్శం లోక కళ్యాణం కోసమయితే, తలిదండ్రుల్ను కష్టపెట్టినా పర్వాలేదు. మనసులో బాధపడేది ఒకరు అయితే, ఆదర్శం వల్ల బాగుపడేది లోకం! లోక కల్యాణానికి ఇంతమాత్రం స్వార్థం

వదలుకోవాలి. అంతమాత్రం త్యాగం చేస్తేనే గాని మనం యీ ప్రపంచంలో యేమీ చెయ్యలేం. ఈ దినం తలిదండ్రులు విరుద్ధంగా వున్నారనుకుంటే - రేపు భార్యబిడ్డ లట్లాగే తయారవుతారు. ఈ విధంగా సాగిపోతాయ్ మన్వంతరాలు గూడా. ఇట్లా అనుకుంటే రాజా రాంమోహన్‌రాయ్ దమ్మిడీ యెత్తు పని గూడా చేసివుండలేడు. వీరేశలింగం ఒక్క వితంతువుకుగూడా పెండ్లిచేసి వుండలేడు. సంఘం అంతే. మంచి కార్యాలకూ, మహత్కార్యాలకూ యీ విధంగా జంకడం చేతగానితనమని మన అయ్యవార్లు లక్షసార్లంటూ వుండేవారు. ఇన్నెందుకురా, మన అయ్యవార్లు చాలరూ మన ఆదర్శానికి? వాళ్ళు చేసిన ప్రతి పనికీ గూడా యెంత ప్రతిఘటనో చూశావా? మా నాయ నేమనుకుంటాడో - మీ నాయ నేమనుకుంటాడో-కరణం యేమనుకుంటాడో - వూరివారంతా యేమనుకుంటారో అని జంకే వుంటే మన మీ స్థితిలో వుండేవాళ్ళం కామని దృఢంగా నమ్ము. లోక కల్యాణం కొరకు చేసే పనులకు మూఢ సంఘంతో ఏం పనోయ్?"

"అయితే వివాహంలో తలిదండ్రుల ప్రమేయం వద్దా?"

"ప్రమేయం వుండవచ్చు. వాళ్ళు న్యాయంగా వున్నంత వరకూ ఫరవాలేదు. అన్యాయానికి తిరిగితే మనం లెక్కించ గూడదు. అయినా, లక్షణంగా ప్రేమించిన వాళ్ళను వదిలి, ఎవరో చీపిరికళ్ళ దద్దమ్మను చేసుకోమంటుం దీ సంఘం!"

"ఎందుకు మొదలు పెట్టావోయ్? ఏదో వుంది! యెవర్నన్నా ప్రేమించావా యేం, నీ కులం గాని పిల్లను?"

"కులం గాని పిల్లేమిటోయ్? నాకు కులం వుంటే, నేను ప్రేమించిన పిల్లగూడా నా కులానికే చెందదూ?"

"సరే, యెవరా పిల్ల యింతకూ?"

"ఎవరున్నారురా, ఊరికే అట్లన్నాగాని వాదానికి?"

"ఊరికే యెందుకొస్తుందిలే యింత గొడవ?"

"ఆఁ-రాగూడదా? పిల్ల యెదురుగా వుంటేనే?"

"చెప్పవోయ్ నాకు తెలుసు గాని."

"తెలిస్తే, నే చెప్పడ మెందుకు?"

ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు.

"పిల్లి కండ్లు మూసికొని పాలు తాగుతూ, తన్నెవరూ చూడ్డం లేదనుకుంటుందట."

నాగలింగం సంభాషణ మార్చదలచుకొన్నాడు.

"శ్రీను కేం మార్కు- లొస్తున్నాయోయ్! అన్నిట్లోను ఫస్టు. మొన్న నీవు రాలేదు గదూ? ఆనాడు అన్నిట్లోనూ ఫస్టు వచ్చినందుకు బహుమాన మిస్తూ, హెడ్ మాష్టరు వీపుతట్టి బాగా చదివి యింకా మంచి మార్కు-లు తేవాలోయ్ అన్నాడు.

"మాలవాడు సరస్వతినే ముట్టగూడదని మా నాన్న, మీ నాన్న అందరూ అన్నారే. ఇపుడు సరస్వతి బెదర్లేదే వాణ్ణి చూచి! మైలపడి పోతుందట! మాలవాళ్ళు చదవనే కూడదట! వాళ్ళకు జ్ఞానమే వుండదట! మనం యింతగా చదువుకున్నాం గదా! ఒక్కడన్నా - ఒక్కనాడన్నా - ఒక్క మార్కన్నా. వాడి కంటే యెక్కువ తెచ్చామా? మనవాళ్ళన్న ప్రకారం మాలలకంత తెలివిలేదా?"

"మనవాళ్ళకు లేదు, వాళ్ళకు బాగానే వుంది; తెలివొకరి సొమ్మా బెస్త గుర్రమ్మా అన్నారట! మనం యెంత తపస్సు చేసినా శ్రీనుతోపాటు రాలేం. మొన్న మనం ముగ్గురం కలిసి, మా బసలో భోంచేశేటప్పుడు...." అని అంటూండగా, ఎపుడొచ్చాడో శాస్త్రులు-

"ఓరి భ్రష్టముండా కొడకల్లారా! ఏమన్నారా? ఏమన్నారా? మాకు బుద్ధిలేదా? చాతగాని వెధవలై మాల ముండాకొడుకును పొగుడు తున్నారా? ఛా! లే, యిక్కణ్ణుంచి! కులభ్రష్ట ముండాకొడకా! శూద్ర కూడు మాల వెధవతో కూడా తిన్నావా? ఇంకేముంది? అన్యాయం చేశావు గదురా! వంశాన్ని చెడగొట్టడానికి పుట్టావురా ముండాకొడకా!" అని విలపిస్తూ పోయాడు కర్ర ఊత బొడుచుకుంటూ.

కొంత సేపటికి సుబ్బారెడ్డిల్లు చేరాడు. రామిరెడ్డి మొగసాల్లో కూర్చుని పేపరు చదువుకుంటున్నా డప్పుడే వచ్చి. సుబ్బారెడ్డి లెక్కలు చూచుకుంటున్నాడు. అక్కణ్ణుంచే,

"అయ్యో, ఇంకేముంది?" అంటూ వస్తున్నాడు శాస్త్రిలు. ఆయన్నూ - ఆయన వాలకాన్నీ చూడగానే, లెక్కల పుస్తకం కింద పెట్టి అదరాబాదరా లేచి "రాయ్యా, కూర్చో" అన్నాడు రెడ్డి. రామిరెడ్డి లేవ కుండానే కూర్చున్నాడు చూచీ చూడనట్టు. అతనివైపు కొరకొరా చూచి, మొగసాల అరుగుపైన చదికిలబడి,

"సుబ్బారెడ్డీ! మన పిల్లవాళ్ళు చదువుకొని బాగుపడతారనుకు న్నాను. బొత్తిగా చెడిపొయ్యేటట్లుంది. నందిని చేయబోతే పందయిం దన్నట్టుగా వుంది. కులభ్రష్టులై, అవివేకులై, మర్యాదరహితులై నాశనమై పోతున్నట్టుంది! మా నాగలింగడూ, వీడూ యింతకుముందు కాలవ గట్టున కూర్చొని, నన్నూ నిన్నూ ఎంతగ్గాకుండా మాట్లాడేస్తున్నారు. ఆ మాల వెధవను గూర్చి తెగ పొగుడుతున్నారు. వాడి ప్రక్కన కూర్చొని వీళ్ళిద్దరూ గతికారంట! అయ్యో, యెంత స్థితిలో కొచ్చిందిరా నాయనా? నాకు చావన్నా వస్తే యివన్నీ చూడకుండా పోదునూ. మీకంటే అంత బాధలేదు రెడ్డీ, మా బాపన కులంలో యింకేముంది? యిక వాడికి పిల్ల నెవడిస్తాడు? యింతకూ మా వాణ్ణి చెరిచింది వీడేనయ్యా! మీ వాడితో చేరక ముందు మా వాడికా గుణాలుండేవి కావు. బాగానే వుండేవాడు

వెధవ. నా మాట దాటేది లేదు. వీడితో చేరేటప్పటికి చెడిపోయాడు. పెద్దోళ్ళు వూరికే చెప్పారా సావాసం సరైన వాడితో చెయ్యాలని! అసలు మర్యాదలు గూడా మానుకున్నారిపుడు. చూశావా? ఇంత రెడ్డివీ-ఊరికంతా గొప్పవాడివీ-నీవే లేచి నిలబడితే-అంతగద్దు వీడు లేస్తాడేమో చూడు! ఇట్లా పెంకి వెధవలకు చదువెందుకు? ఇంకా చదివితే మనల్నూ తన్నేస్తారో యేమో! నేను మా వాణ్ణి చాలించేస్తున్నా. నీవూ చాలించెయ్. శని విరగడౌతుంది" అంటూ దగ్గుతూ, కట్టె పొడుచుకుంటూ వెళ్ళాడు శాస్త్రిలు. అయన వెళ్ళగానే-

"ఏరా, రాముడూ! పెద్దా చిన్నా లేదట్రా? ఆయనొస్తే లెయ్యవేం?" అన్నాడు రెడ్డి.

"ఆయన్ను గౌరవించాల్సిన గుణాలు నాకేమీ ఆయనలో కన బడలే."

"ఇదేందిరా యీ తెలివితక్కువ మాటలు? అయినా మాలోణ్ణి ప్రక్కలో కూర్చోబెట్టుకోని యెట్లా తిన్నవురా?"

"నీవు తిన్నట్టే! కొర్కోన్లుగా, మేస్త్రీట్లుగా వస్తే వాళ్ళతో తిన వచ్చు. తక్కినవాళ్ళు మాత్రం మనుషులు కారు" అంటూ బుర్రున బైటి కెళ్ళాడు రామిరెడ్డి.

సుబ్బారెడ్డింట్లో నుండి, యేవేవో బుర్రపట్టనన్ని ఆలోచన్లతో-పొర్లుకొస్తున్న దుఃఖంతో - శరీరాన్ని వుడికిస్తూన్న కోపంతో - పీట్లవల్ల రెచ్చగొట్టబడిన దగ్గుతో - దాని మూలాన వచ్చిన జ్వరంతో - నిదానంగా, వణుకుతూ వచ్చాడు శాస్త్రిలింటికి. కొద్దిగా చీకటిపడి వుందప్పటికి. ఏదో ఆకలవుతున్నదని నాగలింగం పెందలకడే భోంచేస్తూన్నాడు, నాయనొచ్చేప్పటికి ముఖం తప్పించాలని. నవ్వుతూ, సంతోషంతో వడ్డిస్తూంది కామాక్షి. ఏవేవో కబుర్లు చెబుతున్నాడు నాగలింగం.

కామాక్షంటే నాగలింగానికి బలే ప్రేమ,గౌరవమూను. తన చదువు విషయంలో - దుస్తుల విషయంలో - భోజన విషయంలో - యింకా మిగిలిన విషయాలలో ఆమె చూపే శ్రద్ధా - ఆసక్తి - అతన్ని సంతోష పెట్టినాయ్. కాబట్టే, సెలవులలో వచ్చినపుడంతా, యేవేవో ఆమెకు చదివి చెబుతూ వుంటాడు. ఉత్తమ నవలలూ, కథల పుస్తకాలూ తెచ్చి యిస్తూవుంటాడు. ఇంగ్లీషుగూడా నేర్పేవాడు.

ఇపుడు నాగలింగం భోంచేస్తూ యేదో చెబుతూంటే ఆమె నవ్వుతూంది తలుపు ఆనుకుని. ఇంతలో,

"న్నాగలింగా!" అనే శాస్త్రిల శబ్దం, యెద్దు అంకెమాదిరిగా వినిపించింది. అదిరిపోయింది కామాక్షి. ఉలిక్కిపడ్డాడు నాగలింగం. చేతిలో పిడచ అట్లానే జారిపోయింది. తన్నుతాను సంబాళించుకొని "అన్నం తింటున్నాడండీ!" అంది కామాక్షి.

"ఆ మాలవెధవకు ప్రాయశ్చిత్తమన్నా చెయ్యండే యింట్లోకెందుకు రానిచ్చావే?"

"ఏఁ, ఏమయింది?" అంటూ దగ్గిరికొచ్చింది కామాక్షి.

"యింకేముందే పిచ్చిదానా? మన కులాన్ని నాశనం చేశాడే! బంగారం వంటి వంశాన్ని బూడిదపాలు చేశాడే! శూద్రకూడూ, మాలకుడూ తింటున్నాడు. రామిరెడ్డిగాడూ, శీనిగాడూ తింటూంటే వీడూనంట! శూద్రకూడు! మాలబంతి? ఇంకేముంది? ఒరే సుబ్బా! కరణాన్ని పిల్రా."

"అదేందావని నాగలింగం? ఎంత చదువుకుంటే మాత్రం మాల బంతిలోనా?" అంది కామాక్షి. మళ్ళా అంది యిటుదిరిగి: "అయినా, యిపుడింగ్లీషు చదువుకున్నవాళ్ళు కులాల్నెవరు పాటిస్తున్నారు? యిపుడు

కొలువుల్లో వుండేవాళ్ళంతా సగంపైగా బ్రాహ్మలే గదా! వాళ్ళంతా పాటిస్తున్నారా?" అని. "ఛా! నోరుముయ్! ఆ వెధవ ముండాకొడుకులు పాటించకపోతే మనంగూడా వాళ్ళతోపాటేనా? కొలువుల్లో వుండేవాళ్ళు మాత్రం యెవరే అంత చెడిపొయ్యింది? మనకంటే బాగానే పాటిస్తున్నారు. వాళ్ళు యింగ్లీషు చదువుకున్నా, మనవాడికంటే లక్షసార్లు మేలు. అయినా అవన్నీ మనకెందుకే! మన కులం కత, మన ఆచారం కత, మన యింటి కత చూచుకోకుండాను?"

"సరే, యేమన్నా చేసుకోండి, నాకు పనుంది" అంటూ కామాక్షి తొలగింది.

ఇంతలో అడుగులో అడుగేసుకుంటూ నాగలింగం వచ్చాడక్కడికి. అతన్ని చూస్తూవుండగానే మృగంపైకి లేచే రేచుకుక్కలాగా లేచి హుంకరిస్తూ "నా కడుపున చెడబుట్టావురా! బంగారం వంటి వంశాన్ని చెరచడానికి పుట్టావు. నీవేదో చదువుకొని కులాన్ని ఉద్ధరిస్తావనుకున్నా. చెరిచేదానికే బయలుదేరావు కేశవరావుమాదిరిగా. సావాస దోషంరా, సావాస దోషమూ!" అని తలపంకించి నాగలింగంవైపు అట్లాచూచి, పండ్లుకొరుకుతూ "రెండింగ్లీషు ముక్కలు రాగానే అంతగా హద్దుమీరి పోతావట్రా లమ్డీకొడకా? ఫో, ముందూ, నా యెదుట్నుంచీ. ఫో! ఊఁ, నడుబయటికి· కులభ్రష్టవు వెధవా! నీ మొగం చూస్తేనే పాపమొస్తుంది" అంటూ అరుగు పైన చదికిలపడ్డాడు ఆయాసపడుతూ. నాగలింగం వెళ్ళగానే కరణం వచ్చాడు.

"చూచావా కరణం, ఎంతపని జరిగిందో!" అంటూ చెప్పాడు విషయమంతా వాపోతూ. "మా పిల్లగూడా ఇట్లాంటి మాటలే మాట్లాడుతూ వుంటుందండీ" అని సానుభూతి చూపించాడు కరణం.

మామూలు దగ్గు కొంచెం బలమయింది మరునాడు. జ్వరం బాగా వచ్చింది. తన కొడుకిట్లా అయెనే అనేది ఆ జ్వరాన్ని రెట్టింపు చేసింది.

రామయ్య డబ్బంతా ఎగగొట్టేనే అనేది జ్వరాన్ని మరీ బలం చేసింది. వీటన్నిటికీ వార్ధక్యం తోడయింది. పోయిన సంవత్సరం కొట్లాటలో తిన్న దెబ్బ గూడా అందులో కలుసుకుంది. చాలా తబ్బిబ్బు చేసింది శాస్త్రులకు. మెదడంతా కుతకుత వుడికిపోయింది. కాస్త పట్టుతప్పింది.

"రామయ్యా, బాండు రాసీరా నాయనా" అనీ - "కరణం, వానికి ప్రాయశ్చిత్తం చెయ్యించు" అనీ, "కామాక్షీ - ఆ కులభ్రష్టుడితో మాట్లాడకే" అనీ- "కేశవరావ్! జందెం వేసుకోరా నాయనా" అనీ- యీ విధంగా వెర్రివెర్రిగా అరవడానికి మొదలుపెట్టాడు మూడోనాటికి.

"అదిగో బండి! నన్ను రమ్మంటున్నారు. అహాఁ, నేను రాను! అమ్మో! కొట్టొద్దు. వస్తా. ఊహుఁ, వస్తున్నా" అని యీ విధంగా కలవరించాడు. ఏదేదో మందులిచ్చారు. జ్వరం నిలవలేదు గాని, కలవరింపులూ, బెదురుచూపులూ తగ్గాయి. అందర్నీ కనుక్కొని మాట్లాడుతున్నాడు. ఏవేవో బలే బాగా మాట్లాడుతున్నాడు. అందరికీ ఆశ్చర్యం వేసింది. చావుతెలి వనుకున్నారు. కేశవరావును పిలవమన్నాడు. దగ్గిరకొచ్చాడు కేశవరావు. కేశవరావును చూస్తూనే కండ్లనిండా నీళ్ళునింపి "కేశవరావ్! నేను చాలా తప్పులు చేశాను. అవన్నీ తప్పులని నాకిపుడు తెలుస్తూ వుంది. నిన్నటి రాత్రంతా చాలా ఆలోచించాను. నీవాదినం చెప్పిందంతా నిజం. పుట్టుకలూ చావులూ అందరికీ ఒకటే. అందర్లో వుండేదీ ఆ పరమాత్మే. అదే శాశ్వతం. అందరి దేహాలూ మట్టే. అజ్ఞానంలో పడ్డానిన్నాళ్ళూ. యల్లప్ప చచ్చాడు. పూడ్చారు. నేనూ చస్తా, నన్నూ కాలుస్తారు. రెండూ బూడిద. దానికి వివక్షలు లేవు. కులమతాలు లేవు. అవన్నీ శాశ్వతమని మిడిసిపడ్డాను. ఆ రోజు నువ్వన్నావు, త్వరలో దేవుడు శిక్ష విధిస్తాడని! అక్షరాలా నిజం! శిక్ష అనుభవించాను. ఇంకా అనుభవించాలి కాసేపు. పశ్చాత్తాప పడుతున్నా. పాప పరిహారానికి దేవుణ్ణి వేడుకుంటున్నా. భగవంతుడు సర్వాంతర్యామి

అందర్లోనూ వాడే వున్నాడు. మీరందరూ క్షమిస్తే దేవుడు క్షమించినట్టే. అబ్బా! అయ్యో!

"కామాక్షీ, ఇటురా," అని యేడ్చే దిక్కులేని పక్షిని దగ్గరికి బలమంతా ఉపయోగించి లాగి, తలనిమురుూ, కన్నీళ్ళు రాలుస్తూ గాద్గదిక స్వరంతో "నీ జీవితాన్ని నాశనంచేశానేమో! నిన్ను చేసుకొన్నది మొదలు ఒకనాడూ సుఖపెట్టి యెరుగను. నా కూతురుగా భావిస్తున్నా. నీవొక కూతురు. వాడొక కొడుకు. నీపేరట సగం ఆస్తిని యిదివరకు చాన్నాళ్ళ నాడే వ్రాసివుంచా - ఆ ఆస్తి నీ యిష్టం. మీరిద్దరూ అన్యోన్యంగా ఒకటిగా జీవించావచ్చు, లేకపోతే వేరే వేరే అయినా జీవించవచ్చును.

"నాగలింగా! మీ పిన్నిని కష్టపెట్టకు. బాగా చదువుకో. నీకెక్కువ చెపాల్సినంత పనిలేదు. కేశవరావు అడుగుజాడల్లో నడు.

"కేశవరావ్! నీపైన నాకు పూర్తి నమ్మకం, వీరి ఆస్తుల విషయంలో - సర్వాధికారాలు నీవి. కామాక్షి చదువుకుపోతే - నాగలింగమూ పోతే - ఆస్తి నీవు చూచుకుంటూ వుండాల్సొస్తుంది. మీ ఆశయసిద్ధికి దేవుడు మేలుచేయుగాక! ఇక సెలవు . నారాయణ!" ప్రాణం పోయింది. అందరూ దుఃఖ సముద్రంలో మునిగిపోయారు. ఆయనలో కలిగిన మార్పును చెప్పుకుంటూ - ఆనందించుకుంటూ - ఎంతవాడురా అనుకుంటూ వెళ్ళారు.

## ౧౨

కేశవరావు కామాక్షిని రాజమండ్రి వితంతు శరణాలయంలో చేర్చాడు. శాస్త్రిలు చనిపోతూ చదువుకోవచ్చన్నాడు. అతనిలో కలిగిన ఆ పరిణామానికెంతో ఆనందించిందామె. ఇపుడామె వొక స్వేచ్ఛాజీవి. ఆమె శిరోముండనం చేయించి, విధవ జీవితాన్ని గడపాలనే ఆదేశాలు

ఆమెకు రాకపోలేదు. కరణమూ, మరి కొంత మంది బంధువులూ పట్టు పట్టకపోలేదు. అటువంటివన్నీ కేశవరావు, నాగలింగం మూలాన తప్పించుకొని,రాజమండ్రి చేరిందామె. ఇపుడామె బాగా చదువుకోవచ్చు, బాగా జ్ఞానా న్నార్జించవచ్చు. తర్వాత ఉద్యోగం చేసి సంపాదింపవచ్చు. అస లామెకు దాదాపు యాభై వేల రూపాయల ఆస్తి వుండనేవుంది - అయితే ఎందుకామె కసంతృప్తి? ఏదో ఒక కోణాన అసంతృప్తి ఆమెను బాధిస్తూనే వుంది. ఆమె మనోనేత్రాలముందు నారాయణెప్పుడూ సంచరిస్తూ వుంటాడు చిరునవ్వుతో. ఒక్కొక్కసారి అనుకుంటుంది : "ఆ నారాయణ నన్ను చేసికొంటాడా? యెందుకు చేసికొంటాడు? కులం వేరాయె. తన కులంలో డబ్బిచ్చే పిల్లలు - చదువుకున్న పిల్లలు - అందమైన పిల్లలు దొరకరా? అందులో నేను విధవను" అని నిరుత్సాహ పడేది. మరలా "ఫరవాలేదు, వారు సంఘాన్ని సంస్కరించాలన్నారు. అందులో వితంతు వివాహాలు మంచివే నన్నారు. వాటి కెక్కువ ప్రోత్సాహం కావాలన్నారు. వర్ణాంతర వివాహాలు జరగందే సంఘం అనైక్యతతో నాశనమౌతుందన్నారు - అతని చర్యచూస్తే నాపైన అతనికి అభిప్రాయమున్నట్లు తోస్తుంది" అని సంతోషపడుతుంది. "అతనికి నాపైన అభిలాషవున్నా పెండ్లి చేసుకొనేంతవరకూ రాడేమో!" అని అనుకొనేది మళ్లా.

కామాక్షిని రాజమండ్రిలో వదలివచ్చి ఒక వారం రోజులయింది. ఆనాడు సాయంకాలం. ఏదో నిరీక్షిస్తున్నట్లు కూర్చున్నాడు కేశవరావు. ఇంతలో పోష్టు ప్యూన్వచ్చి ఒక కవరిచ్చాడు. దానికోసమే ఎదురు చూస్తున్న వాడులాగా ఆతురతతో చించి చదివాడు. తృప్తిగా నారాయణ వంకచూస్తూ "అట్లా షికారు వెళ్దాం పదవోయ్!" అన్నాడు. మూడవ అయ్యవారుతో "ఇక కాసేపుండి యెక్కాలు చెప్పించి పంపించెయ్యండి" అని చెప్పి ఇద్దరూ బయలుదేరారు. కాలవ గట్టు కెళ్ళారు. కాలవ గట్టున

ఒక పెద్ద అత్తిచెట్టు వుంది. చుట్టూరా యీత చెట్లున్నాయి. అది యీత వండ్ల సమయం. పక్షులా యీతపండ్లను కొరికి తింటూ కిచకిచలాడు తున్నాయి. కాకులు పడదోసే అత్తిపండ్లు నీళ్ళల్లో పడి ఒక విధమైన "బుడింగ్" శబ్దాన్ని కలుగజేస్తున్నాయి. వేడిగాలులు నీళ్ళపైబడి చల్లనై, మెల్లగా వారివైపు వీస్తున్నాయి. యిసుకతిన్నెలపై కూర్చొని, రెండు కాళ్ళు మడిచి, వాటి మడతపైన్నే రెండు చేతులతో బంధించి వూగుతూ, చిఱునవ్వుతో నారాయణ మొగం చూశాడు కేశవరావు.

"ఏమిటోయ్?" అన్నాడు నారాయణ మందహాసంతో.

"ఏమీలే" దన్నాడు కేశవరావు. అధోముఖమైవున్న చూపులు కనుమలెత్తి చూస్తూ.

"పోనీ, ఆ జాబెక్కణ్ణుంచి?" అనడిగాగు నారాయణ.

"ఎక్కణుంచో వచ్చింది."

"ఆ యమ్మాయేనా?"

"ఏ యమ్మాయి?"

"నీవు డబ్బు పంపిస్తూవుంటివే, కమల. ఆ యమ్మాయి."

"కాదు."

"అయితే పోనీగాని, ఆ యమ్మాయి విషయం చెప్పలేదెందుకు? నా దగ్గర దాచేవిషయాలు నీ దగ్గర యింకా యెన్ని వున్నాయో?"

"ఛాఛా! ఇదొక్కటే. దాచవలసివచ్చి దాచాను. గత విషయం అది. దాన్ని విస్మరించడానికి బాగా ప్రయత్నించి, ఇప్పటికి గెలువ గలిగాను. కొంతవరకు మీ మనసులు కష్టపడతాయని చెప్పలేదు. అయినా యింకోసారి చూచుకోవచ్చు. ప్రస్తుతం ఈ జాబు చూడు."

జాబు చదివాడు నారాయణ. కడపటి నాలుగు పంక్తులూ నారాయణను గురించే. లోపల అణుచుకుంటున్నా గూడా సంతోషం మొగంలో

వికసిస్తూంది. లోపల గలిగిన ఆనందాన్ని అతి బలవంతాన అణిచిపెట్టి, సీరియస్‌గా, గంభీరంగా కూర్చున్నాడు నారాయణ-యేముందిలే దాంట్లో అన్నట్టుగా. దాన్ని చూచి-

"పాపం! ఎంత సీరియస్‌గావుందో జాబు!!" అన్నాడు కేశవరావు. పక్కున నవ్వాడు నారాయణ. ఇద్దరూ నవ్వుకొన్నారు.

కేశవరావన్నాడు.... "నారాయణా! నేనొక టడుగుతాగాని చెప్తావా?"

"నాకు తెలుసులే నీవేమడగబోయేదీ."

"అయితే అడగనక్కర్లేదులే."

"అయినా ఏమిటో చెప్పుచూద్దాం."

"అక్కర్లేకపోతే, చెప్పి మాత్రం ప్రయోజనం?"

"చెప్పవోయ్ శాండితసం పడకుండాను."

"తెలుసన్నావుగా, చెప్పుమరి."

"వితంతు వివాహం చేసుకోమంటావు!"

"అరె! నీవు జ్యోతిష్కుడులాగా వున్నావే. చూడు నారాయణా! ఎంత చక్కనమ్మాయోను! ఎంత బాగుంది! మంచి తెలివైంది గూడాను."

"అయితే?"

"తర్వాతేముంది! తర్వా తేమడుగుతానో నీవే ఆలోచించు."

"నీ వెందుకు చేసుకోవూ?"

"ఛా! చెల్లెల్ని చేసుకోమనే బుద్ధిమంతుడివి! ఒక విషయం యేమిటంటే నాకు చాలా పనుంది. నా జీవితాన్నంతా సంఘ సంస్కరణానికీ, సంఘ సేవకూ అంకితం చేశాను. వివాహం, ఇవన్నీ - ఆ మార్గానికి నిరోధకాలని నా భావన."

"నేను మాత్రం సంస్కార దృష్టిలోని వాణ్ణేగా! నాకు మాత్రం వివాహం బంధం గాదా?"

"నేను కాదనను. మనం ఆదర్శంగా బతకాలి కాబట్టి మనం ముందు చేసి చూపాల. అదే, ఆదర్శాన్ని ఆచరణలో పెట్టడమంటే, వెయ్యి ఆదర్శాలు కలిగి వుండటం కంటే ఒక ఆదర్శాన్ని ఆచరిస్తే ఘనతగా వుంటుంది. మన దంతా గాంధీ మార్గం! అంటే ఆచరణ ప్రాధాన్యంగా వుండాలి మన ఆదర్శాలు. నీ వామెను చేసుకో! నేను ఒంటరిగా వుండి, మన ఆశయసిద్ధి కొరకు, సంఘౌన్నత్యం కొరకు, నా సర్వస్వమూ వినియోగించి పనిచేస్తా. ఇంతవరకూ అవివాహితులం కాబట్టే యింతమాత్రమన్నా పని చెయ్యగలిగాం. లేకపోతే సంసారాన్ని చూచుకుంటూ, యేడ్చుకోడంతో సరిపోయేది, కాలమూ, సంపాదనా. నేను గూడా బ్రహ్మచారిగా వుంటానంటావేమో! వుండవచ్చు. అయితే మార్గదర్శకత్వం యేదీ? ఆమెను చేసుకోడంలో నీకు చాలా మేళ్ళున్నాయి. బాగా ప్రేమించి చేసుకుంటుంది గాబట్టి నీ ఆదర్శాచరణంలో తోడునీడై వుంటుంది. అట్టి వివాహం ప్రతిబంధకము అంతగా కాదు. మీ వివాహంలో మూడు ఆశయాలు సిద్ధిస్తాయ్. మొదటిది వర్ణాంతర వివాహం. రెండవది వితంతు వివాహం. మూడవది ప్రేమించి చేసుకోడం. ఇంకా ముఖ్యమైం దేమంటే, ఒక అభాగ్య జీవిని ఉద్ధరించడం. అసలు యెందు కింత యిదిగా అడుగుతున్నానంటే, ఆమెకు నీ పైన యిష్టముంది! నేను మొదట్నుంచీ కనిపెడుతున్నా. నీవు చాలా సార్లు ఆమె విషయం యెత్తావు. ఆమె విషయంలో యెక్కువ సానుభూతి చూపిస్తూ మాట్లాడినావు. ఆమె రాజమండ్రిలో గూడా నీ విషయం చాలాసేపు మాట్లాడింది. నిన్ను గురించి యేమేమో ఉత్సాహంతో అడిగింది. నీ వింకా చదివితే బాగుండునంది....మరి యింకొక సంగతి. మనం యీ వూళ్ళో చెయ్యాల్సిన పని చాలవర కయింది. వూళ్ళో వయోజనులకు గూడా విద్య

నేర్పడం మొదలుపెట్టిం తర్వాత మనల్ను అపార్థం చేసుకోడం చాలిం చారు. హరిజనులకూ, వీరికి పొత్తు కుదిరింది. మామూలు రైతుల యిండ్లలో గూడా వీళ్ళు దూరి అన్ని పనులూ చేస్తూ కుండలు తాకుతూ వున్నారంటే - మనం అంత కంటే యెక్కువ యెక్స్పెక్టు చెయ్యనక్కర లేదు. ఒక్కొక్క వ్యక్తినే బాగుచెయ్యాలని వూనుకుంటే మన పని యీ పల్లెలోనే సరిపోతుంది. మన ఉద్యమం గడప దాటదు. కాబట్టి మనం ప్రపంచంలోకి బయలుదేరాల్సిందే! ఈ సంవత్సరం నేను మాత్రం బయలుదేరుతున్నాను. ప్రస్తుతం రాజంపేటలో స్కూలులో చేరి మన పిల్లవాళ్ళని చదివించుకుంటూ యీ సంవత్సరమే యం. ఎ. పరీక్ష పూర్తిచేస్తాను.

"నీవు మాత్రం యీ సంవత్సరం యిక్కడుండు. వచ్చే సంవత్స రమే యేదైనా కాలేజీకి వెళ్ళవచ్చు. ప్రస్తుతం నాకు బదులు మరొక అయ్యవారొస్తున్నాడు. ఈ సంవత్సరం ఉంటే చాలు నువ్విక్కడ."

నారాయణ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. అపుడు చూపించాడు కేశవరావు జిల్లాబోర్డువారి ఆర్డరు.

ఆ మూడోనాడు బయలుదేరాడు కేశవరావు, ఊళ్ళో వాళ్ళంతా పెద్ద విందు చేశారు. హరిజనవాడలో ప్రత్యేకంగా ఒక సభ జరిపారు. చాలామంది సంతోష సమయం అంటూ సంతాపయుతంగా ఉపన్య సించారు. తనవంతు ప్రకారం - తాను వాళ్ళలో ఒకడనీ - ఆ వూరు తనదిగానే భావిస్తున్నాననీ - ప్రతి సెలవుల్లోగూడ యిక్కడికే వస్తూ వుంటాననీ - ఇంకా చాలా చాలా విషయాలు చెప్పాడు కేశవరావు.

ఈ విషయం ముందే తెలిసింది మన శిష్యబృందానికి. శ్రీను, రెడ్డి, నాగలింగం యస్.యస్.యల్.సి. చదువుతున్నారు. అంతా పది నాళ్ళ ముందూ తాము రాజంపేటకు వచ్చేటప్పుడు వాళ్ళకు తెలియదీ

విషయం. తమ హైస్కూలుకు, ఉపాధ్యాయుడుగా వస్తున్నందు కెంత మహదానందం పొందారో చెప్పనలవికాదు. అప్పటికే పిల్లలకంతా వ్యాపించిపోయిం దెవరో బలే అయ్యవారొస్తున్నారని. మన పిల్లవాళ్ళు ఇతన్ని గురించి పొగుడ్తూ - మా అయ్యవారు - అని చెప్పుకోడంవల్లా - వీళ్ళపైన స్కూలు పిల్లవాళ్ళకంతా గౌరవం ఉండడంవల్లా - పిల్లల కంతా కేశవరావంటే - అపరిచిత వ్యక్తి అయినప్పటికీ - అవ్యాజ ప్రేమ కలిగింది. ఆ దినం బండికొస్తాడని తెలిసి, పూలమాలలు తీసికొని బయలుదేరారు. రాజంపేట స్టేషనులో రైలాగడమే ఆలస్యం, రామిరెడ్డి పరుగెత్తుకుంటూ వచ్చి పూలహారం వేశాడు వద్దంటున్నా. దాన్ని తీసేయ డానికి పట్టుకొని తలవంచేటప్పటికి శ్రీలక్ష్మి మరొకటేసి చప్పట్లు కొట్టింది నవ్వుతూ. అందరూ నవ్వుకున్నారు. ఆనందంగా బసకొచ్చారు.

బస మార్చారు. సరస్వతీపురంలోనే వేరే యింకొక పెద్ద యింటిని తీసికొన్నారద్దెకు. నాగలింగం గూడా అందులోనే అన్నిటికీ. శ్రీనుకు గూడా యీ యిల్లే అసలిల్లయింది. ఎపుడో సాయం కాలమో, రాత్రో, సుజాతను వదిలిపెట్టి రావడానికి మాత్రం యింటికి పోతూ వుండేవాడు. శ్రీ లక్ష్మి, సుజాతలు భోజనా లెక్కడ చేసినా రాత్రి పూట మాత్రం తమ నిర్ణీత స్థలాల కెళ్ళేవారు.

అనుకరణవల్లనే కావచ్చు. మరేదైనా కావచ్చు - శ్రీనుకు కేశవరావు ధోరణి పట్టు వడింది. చర్చా సంఘాలలో గంభీరంగా నిలబడి, తొణక్కుండా, తడుముకోకుండా, అంత వేగంగా కాకున్నా - కొతుకుల్లేకుండా మాట్లాడేవాడు. ఈ సంవత్సరం దానికతనే సెక్రెటరీ.

కొన్నిదినాలు గడిచినాక, ఒకదినం కొంతమంది ఫెడరేషన్ వాళ్ళు వచ్చారు. వారంతా అంబేద్కరు అనుయాయులు. శ్రీను కాస్త ప్రతిభగల వాడని తెలిసి, అటువంటివాడు తమ సంఘంలో వుంటే దాని అభివృద్ధికి ప్రాపకంగా వుంటాడని, వచ్చి మాట్లాడారు. వా రేదేదో

చాలా చాలా చెప్పారు. ఎంతో ఉద్రేకంతో చెప్పారు. శ్రీనుకి నచ్చిందది. అయితే తన అయ్యవారితో మాట్లాడందే అందులో దిగనని వాళ్ళను పంపించి వేశాడు. చాలా ఆలోచించాడు : "మేమూ మనుష్యులమే. హిందూమతంలో చేరిన వాళ్ళమే. అయితే హిందువులే మమ్మల్ని నీచంగా చూస్తారు. అసలు తాకనే కూడదంటే అంతకంటే నీచంగా చూడడ మేముంది? వాళ్ళు తిరిగేచోట మేం తిరగకూడదు, వాళ్ళు నీళ్ళు తెచ్చుకొనేచోట మేము నీళ్ళు తెచ్చుకోకూడదు. వాళ్ళ తీర్థాల్లో మేము స్నానం చెయ్యగూడదు - వాళ్ళ దేవాలయాలలోకి మేం పోగూడదు. అసలు యెంత చదువుకొని, బయట గొప్పకీర్తి నార్జించిన హరిజనుణ్ణయినా, పల్లెకుపోతే ఒక చదువూ సంస్కారంలేని యానాది స్త్రీ గూడా నన్ను ముట్టకు అంటుంది - ఛీ - ఎందుకొచ్చిన హిందూమతం? కాబట్టే అందరు క్రైస్తవ మతంలో చేరడం!" ఇటువంటి భావాలతో బుర్ర వేడెక్కింది శ్రీనుకు. నేరుగా వచ్చా డయ్యవారిదగ్గరికి. వాడివాలకంచూచి కేశవరావేదో అయిందని గ్రహించాడు. అప్పటికది మధ్యాహ్నం. ఆదివారం. అందరూ వున్నారు. కేశవరా వడిగేటప్పటికి శ్రీనంతా చెప్పాడు. తానేమి భావిస్తున్నదీ చెప్పాడు. పైగా తన వేహ్యాన్ని వెళ్ళబుచ్చాడు.

కేశవరావు మాట్లాడుతున్నాడు. కొన్నికొన్ని విషయాలు మాట్లాడినాక గాంభీర్యం దాల్చాడు. మరల అన్నాడు : "అది పామరులలోనే గాదు, ప్రస్తుతం విద్యాధికులుగూడా అందుకుకారకులే. వీళ్ళలోగూడా చాలా లోపాలున్నాయి. తెలిసిగూడా - యీ భేదాలన్నీ యేమీ లేవని తెలిసిగూడా - సమత్వాన్ని పాటించి - కళంకితమై వున్న హిందూ సంఘాన్ని దిద్దాలని అనుకోరు. అంతకుముందెట్లా జీవించినా - సంసారానికొచ్చినాక, మనకెందుకొచ్చిం దిదంతా, నలుగురితోపాటు నారాయణా అని పోతున్నారు. ఆ నలుగురిలో వీడొకడయింది తెలియదు! ఒకవేళ యేకొద్దిమందో దిద్దవలెననుకున్నా బుద్ధిపూర్వకంగా పాటుపడరు

విద్యాధిక బ్రాహ్మణు లిప్పటికి గూడా, గూఢ మూఢాచారాలను పాటించి యితరవర్గాలకు కాస్త అవమానాన్ని ప్రసాదిస్తూనే వున్నారు. ఆ విధంగా అమర్యాద చూపబడే బ్రాహ్మణేతరులు వారి అధఃపతన మెపుడా అని అర్రులు చాచుతున్నారు. సవర్ణ హిందూ వర్గమంతా హరిజనులను నీచ జంతువుల కంటే, రాయిరప్పల కంటే నీచంగా చూస్తూ వుంది. వారు వీరందరి పైనా పగబూనారు. అంటే సవర్ణ హిందూజాతి నంతా పాముని చూచినట్టు చూచి 'దీని నాశన మెప్పుడ్రా' దేవుడా అని దేవుణ్ణి ప్రార్థిస్తారు. ఇంకా కొద్ది దినా లీసవర్ణ హిందూ సర్పం యిట్లాగే ప్రవర్తిస్తే చీమల మాదిరి పట్టి చంపేస్తారు. ఈ ఉద్యమమే అంబేద్కరుది. అతన్ని ఈ దుష్ట సవర్ణ హిందూ సంఘం చాలా హింసించింది. ఎంతో న్యూనత పరిచింది. ఎంతో చదువుకున్న అంత వాడికి బరోడాలో యిల్లు అద్దెకివ్వలేదంటే యెంత దౌష్ట్యమో చూడండి! ఇక తన మతస్థులే అంత దారుణంగా ప్రవర్తిస్తున్నారంటే అతని గుండె లెంతగా మండి మసీభూత మౌతాయో ఆలోచించండి. అదే! అందుకే అతను గూడా లేవదీశాడు ఉద్యమాన్ని. ఉద్యమాలెప్పుడూ ఒక దౌష్ట్యాన్ని నిరసిస్తూనే పుడతాయి. బ్రిటిషువారు దేశంలో చేసే అవమానాలను సహించలేకనే దేశీయులు స్వరాజ్యోద్యమాన్ని లేపారు. జార్ చక్రవర్తుల క్రూరపాలన క్రింద జీవించలేకనే రష్యాలో విప్లవోద్యమం లేవదీశారు. ఫ్రెంచి భూస్వాముల దౌర్జన్యాన్ని ఓర్చుకోలేకనే ఫ్రెంచి విప్లవోద్యమం బయలుదేరింది. మతాచారుల చండశాసనాలను ఓర్చుకోలేకనే ఇంగ్లాండులో దాన్ని కూల్చడానికి ఉద్యమం బయలుదేరింది. అంతే! ఎప్పటికీ, దౌష్ట్యాన్ని కూల్చడానికే ఉద్యమాలు బయలుదేరేది! అయితే దాన్ని ఎట్లా ఎదుర్కోవాలి? దౌష్ట్యానికి దౌష్ట్యం పనికిరాదు. 'ఉష్ణం ఉష్ణేనశీతలం' అంటారు కొంతమంది. అది యథార్థం కాకపోదు. ప్రతిఘటించిన ఉష్ణంతగ్గగానే మొదటిది మండుతూనే వుంటుంది. అట్లాగే, దౌర్జన్యంతో, క్రౌర్యంతో బయలుదేరిన విప్లవ

ఫలితం అంతే.అంబేద్కర్ దారివేరనుకోండి!సవర్ణులహింసించి,హరిజనులు మత సమత్వం బడయలేరు. సవర్ణహిందువుల హృదయాలకుఅప్పీలుచేసే ప్రవర్తనతో-సామరస్యంతో-ఈ మచ్చను శాశ్వతంగా మాపుకోగలం కాని, దౌర్జన్యంతోగాదు. పోనీ, అట్లాగయినా ఒక మూకగా బయలుదేరి ఒకముఖంగా పోరాటం జరుపుతారా అంటే అదీ కానిపని. అవిద్య తాండవ మాడుతూన్న హరిజన బృందంలో అంత సంచలనం రావడానికి వీలేదీ? ఆర్గనైజేషన్ బ్రతకడానికి వీలేదీ? ఇవన్నీ తెలిసే గాంధీజీ ఆ దారి తొక్కింది! ఆయన ముప్ఫైయేండ్ల తపశ్శక్తివల్లే హరిజను లిపుడీ మాత్రమైనా ఒక విధమైన స్థానాన్ని విద్యాధికులలోనైనా కలిగివున్నారు. దీనికి సవర్ణులే గాదు, హరిజనులు గూడా ఇతోధికంగా సాయం చేస్తేనే సామరస్యం సత్వరం స్థాపించబడుతుంది."

పై విషయాన్ని మరునాడు స్కూలులో చర్చా సంఘం తరఫున మాట్లాడాడు. అతడు తన శిష్యవర్గానికి ప్రతిదినమూ ఏదో వొక కొత్త విషయాన్ని గురించి చెప్పేవాడు. తర్వాత ప్రతి వారం టౌనులోనో, ప్రక్క పల్లెలోనో ఉపన్యసించేవాడు. హిందూమతాన్ని గురించో-యితర మతాలను గురించో - కులతత్త్వాల గురించో - గొప్ప నాయకులు సంఘ సంస్కర్తలూ మొదలగు వారిని గురించో - ఉపన్యసించేవాడు. అతని ఉపన్యాస ధోరణి చాలా బాగుంటుంది. అతడు మాట్లాడేటప్పుడు ముఖంలో వుండే గంభీరత, చూపులలో వుండే చురుకుదనం - అతని విషయ పరిచయజ్ఞానం - పైపెచ్చు వాగ్ధోరణి - నిలబడ్డ వాలకం-చాలా ఆకర్షణీయంగా వుండేవి. ఈ పద్ధతిలో చాలామంది హృదయాలలో కుల మనేదే లేకుండాచేసి, యేండ్ల తరబడిగా వారి రక్తంతో కలిసి, కరిగి పోయి మాంసానికి పట్టిపోయిన కులమనే మలినాన్ని కడిగి, వారి రక్తాన్ని శుభ్రం చేసేవాడు. ప్రేక్షకవర్గానికి నచ్చేటట్టు సంస్కృత శ్లోకాలను, గొప్ప గొప్ప ప్రమాణాలనూ వల్లించేవాడు. ఈ విధంగా యువజనులలో

చాలామంది బాలబాలికల హృదయాలను-కులరహితాలుగా భేదరహితా లుగా అతినిర్మలమైనవిగా తయారుచేశాడు.

కేశవరావాస్కూలులో వున్న సంవత్సరం, విద్యార్థి విద్యార్థినులలో గొప్ప సంచలనం వుండేది. ఎవరినోటబట్టినా వర్ణాంతర వివాహ విష యమే-హరిజనోద్ధరణ విషయమే. ప్రతి బాలిక, ప్రతి బాలకుడు కులాం తర వివాహాలు చేసుకోవాలని ఉవ్విళ్ళూరేవాడు. కొంతమంది చాటుగా ప్రతిజ్ఞలుగూడా తీసుకున్నారు. వారిలో ముఖ్యులు రెడ్డి-శ్రీలక్ష్మి-శ్రీను- అనసూయ-శాస్త్రి-సుజాతలు. మరికొందరు అదేగాకుండా సంఘోన్నతి కెంతవరకైనా పాటుపడాలని స్థిరసంకల్పు లయ్యారు. ఈ పిల్లలకంతా వయసొచ్చిందనీ, పెళ్ళి అవసరం అయిందనీ అనుకోగూడదు. పెళ్ళి అంటే ఆదర్శ వివాహమనీ, పెళ్ళియీడు వచ్చాక ఇలా చేసుకోవాలనే నిర్ణయించుకున్నారు. లేకపోతే ఆ పిల్లలకు ఇపుడు పెళ్ళితొందరా?

కేశవరా వక్కడున్న సంవత్సరం పిల్లవాళ్ళ చదువు, క్రమ శిక్షణ, ప్రత్యేక పంథా తొక్కాయి. ఎంతో బాగా చదివేశారు. ఫస్టు, సెకండు మార్కు లెప్పుడూగూడా కోటగడ్డ వారివేనని ప్రతీతి పొందారు. వీళ్ళంతా కోటగడ్డవారనీ-కోటగడ్డవారి యిల్లు అనీ-కోటగడ్డవారిస్నేహం అనీ-యీవిధంగా కోటగడ్డ అన్నది వారందరికీ ప్రత్యేకనామం అయి పోయింది. మార్కులెక్కువ వచ్చేవాళ్ళు గర్వపడటం సహజం. అటువంటి వాళ్ళనిజూచి కొంతమందయినా అసూయపడడం సహజం. అయితే కోట గడ్డవారి ప్రవర్తన నిరాడంబరంగానూ, నిష్కపటంగానూ ఉండటం వల్ల వారందరికీ స్నేహపాత్రులయ్యారు.

శ్రీలక్ష్మికంటె అనసూయ అందకత్తె అని పేరు తెచ్చుకుంది. ఇపుడు సుజాత ఆమెను మించిపోతూవుంది అందులో. సుజాతకిపుడు రుతుమతి సమయం. శరీరం గోధుమరంగును మించిన రంగుతో నిగ

నిగలాడుతూ వుండేది. ప్రతి అవయవం గూడా యెట్లావుంటే చూవరులకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంతో - అట్లా వుంది. పుట్టుకతోనే మంచి చక్కనిపిల్ల. ఇపుడు పైకొంటున్న యౌవనం, ఆమె అందాన్ని సోయగాన్నీ ద్విగుణీకృతం చేసింది. ఈమె ఎవర్తో గూడా ఎక్కువ మాట్లాడేదిగాదు. శ్రీలక్ష్మి వీళ్ళందర్నీ ఎగతాళి చేస్తూ నవ్విస్తూ వుండేది. ఒక్కొక్కసారి వీళ్ళందరికీ పేర్లుపెట్టి ఏడ్పించేది. లేకపోతే, అనసూయ చెవిలో శ్రీనుపేరు వూదో- సుజాత చెవిలో శాస్త్రి పేరు వూదో-యేడ్పించేది. వాళ్ళు మూతిబుడ్డగించి, ముకిపెంగా ఏడ్పినట్టు మూతిప్రక్కకు త్రిప్పితే - రెండుచేతుల్తో రెండుబుగ్గలూ వత్తుతూ - పండ్లూ, పండ్లపైన పెదవులూబిగించి 'ప్చ్' అంటూ ముద్దుపెట్టేది. ఒక్కొక్కసారి ఇంకా యెక్కువ గోలచేసేది శ్రీలక్ష్మి. ఎక్కువగోల అనసూయ సహించుకోగలదేమోగాని, సుజాత సహించుకోలేదు. ఇక నీతో మాట్లాడనంటూ లేచి యింటికివెళ్ళిపొయ్యేది. పోయేది పోయినట్లుగా పోక, వెంటనే వచ్చి, శ్రీలక్ష్మివైపుచూస్తూ, ఆమె యీమెవైపు చూచినపుడు చూపులు ప్రక్కకుమళ్ళించి సీరియస్‌గా కూర్చొనేది. కాసేపు యిద్దరూ అన్యాపదేశంగా మాట్లాడుకొనేవారు. ఈమాటలలో సుజాతను నవ్వించేది శ్రీలక్ష్మి. నవ్వి, శ్రీలక్ష్మిపైన పడేది సుజాత. శ్రీలక్ష్మి మెడకు చేతులుచుట్టి ఆమె వొళ్ళో తలపెట్టి ఆమె మొగంలోకి చూస్తూపడుకొని,

"యెందుకే యింతల్లరిదానివయ్యావు?" అనేది సుజాత.

"యెందుకవుతారేంటి? అయినా, నా అల్లరి మిమ్మల్నేం చేస్తుంది?"

'మమ్మల్నేం చెయ్యదుగాని, దీర్ఘకాలం నీతో కాపురం చేసేవాడు చస్తాడు."

"నిజమేనే, ఆ చేసుకొనేవాడికి ముందే మనం హెచ్చరించాలి, ఓర్పు వుంటే చేసుకొమ్మని" అంటుంది అనసూయ.

"అటువంటివాడు దొరకబట్టే దీని ఆటలిట్లా వున్నాయి" అనేది సుజాత. అనసూయ, సుజాతా యిట్లా అని విరగబడి నవ్వేవారు. "ఛా పోండి" అంటూ అక్కణ్ణుంచి లేచి పారిపోయేది శ్రీలక్ష్మి.

కేశవరావు మొదట హైస్కూల్లో ఉపాధ్యాయుడుగా చేరుతూనే అతని కులాన్ని గురించి త్వరగా తెలియలేదు చాలామందికి. కొంత మంది మాటలపరాకున "కులమేమండి" అనేవారు ఏదో అట్లా అడిగి నట్టుగా. "ఎందుకండీ దానిమాట?" అనేవాడు కేశవరావు. "అబ్బే! అదిగాదండీ, దాందేముందిలెండి. ఊరికే మామూలుగా అడిగాను.అంతే" అనేవాడు పృచ్ఛకుడు తనకేమీ అంతగా కాబట్టనట్లుగా. కొన్నాళ్ళు సాగినాక తెలిసింది అతడు బ్రాహ్మణుడని. బ్రాహ్మణ ఉపాధ్యాయులు దగ్గరికి చేరసాగారు. బాగా పలకరించి స్నేహాన్ని నెరపుతున్నారు. బ్రాహ్మణేతరోపాధ్యాయులు మొదట అంత దగ్గరగా చేరేవారు కారు. "ఎన్ననా్న బాపనోడు బాపనోడేరా" అనుకొనేవారు మంచివాడని విన్న పుడు. తర్వాత తర్వాత, అతని నిరాడంబర నిష్కపట స్నేహ ప్రవ ర్తనవల్లా, కులం తెలుసుకోకుండానే అందరితోనూ ఒకే మర్యాదతో మాట్లాడి సన్మానిస్తూ వుండటంవల్లా, ఎపుడుగూడా, ఏకోశానగూడా తాను కులాధిక్యాన్ని ఊహించి, కులవ్యత్యాసాలకోసం ప్రాకులాడే వాళ్ళతో చేరి మాట్లాడకుండా పోవటంవల్లా, అందరూ బ్రాహ్మణేతరులు ఎక్కు వగా ప్రేమించసాగారు.

సుజాతను గురించి నారాయణ పూరికే జాబులు వ్రాసేవాడు. ఆమె అతని విద్యార్థిని. ఆమెపై తన శ్రద్ధ అంతా కేంద్రీకరించాడు. ఎన్నిసార్లో అనేవాడు: "మా అమ్మాయి హైస్కూల్లో ఒక మణిలాగా వెలుగుతుంది. చూడండి" అని. ఆ విధంగా కావాలని పట్టుదలతో, దీక్షతో తయారు చేశాడు కాబట్టి - సుజాత అలాగే అయింది. ఆమె మార్కులు చూచి, సవర్ణ హిందూ బాలబాలికలకు-అయ్యవార్లకు గూడా అసూయగానే వుండేది.

ఒకనాడు రామశర్మ అనే అయ్యవా రన్నాడు:

"ఒరేయ్! ఆడపిల్ల - అందులో మాలపిల్ల, ఆవిధంగా మార్కులు తెస్తూవుంటే - సవర్ణ హిందువులుగా వుండి, మీరంతకంటే మార్కులు యెక్కువ తేకపోతే అవమానంలేదూ? రేపట్నుండీ పావళ్ళు కట్టుకొని, గాజులు తొడిగించుకొని, గౌనులేసుక రండి బడికి" అని కొంతమంది పిల్లల్ని ఉద్దేశించి అంటూంటే మన నాగలింగం విన్నాడు. శ్రీనుకూ, రెడ్డికీ చెప్పాడు - "రేపట్నుండీ మనం పావళ్ళు కట్టుకొని బడికి పోవలసి వస్తుందేమోనోయ్!" అని.

"ఏమిటోయ్?" అన్నారు నవ్వుతూ.

"సుజాత అన్నన్ని మార్కులు తెస్తూవుంటే మనం మగవాళ్ళం గాదూ?"

"ఆ పిల్లకూ మనకూ పోటీయేమిట్రా?"

"ఆ పిల్ల నారాయణ శిష్యురాలోయ్!" అన్నాడు కేశవరావు.

"మరి మన రామశర్మగారు అట్లా అన్నారే!" అన్నాడు శాస్త్రి, అంతా తెలిసింది కథ. మరునాడు ఉపాధ్యాయులగదిలో కేశవరావు ఆ అయ్యవార్ని చూచి,

"ఏమయ్యా, ఇంతచదువూ చదివి, ఇంత పెద్దవాడవై నలుగురికీ బోధించే స్థితిలో వుండి, పిల్లల్ని మంచిదార్లో పెట్టవలసిన వాడవు అట్లా అనవచ్చునా?" అనేటప్పటికీ,

"అబ్బెబ్బే! అదిగాదండీ. అట్లంటే బాగా చదువుతారని" అన్నాడు నీళ్ళునమ్ములూ తప్పించుకొనేందుకు. పిల్లల్ని బాగా చదివేటట్లు చెయ్యడాని కిదిగూడా ఒక మార్గమేమో!

మార్చి ఆఖరుకంతా బాలికలూ, కేశవరావూ తప్ప, మిగిలిన వారంతా కోట చేరారు. శ్రీను అయ్యవార్ల దగ్గర భోంచేస్తున్నాడు. స్వగృహాన్ని పచ్చింది పోయింది చక్కజేస్తున్నాడు తాత్కాలిక నివాసానికి.

ఏప్రిల్ అంతానికంతా దిగారు. లక్ష్మి సుజాతతోగూడా సొంత యింట్లో దిగింది. భర్త పోయింది మొదలు లక్ష్మి ఆ వూరికి రావడం అదే మొదటిసారి. గంగన్న అదరాబదరావచ్చి "ఎన్నాళ్ళకు కనబడ్డావమ్మా! బాగున్నావా? ఇటీవల నాకు వొళ్ళంతా సచ్చుగావుంటబట్టి రాజంపేట తట్టన్నా రాలేదు" అన్నాడు.

అతనికి జవాబిచ్చేలోగా —

"ఎన్నాళ్ళ కొచ్చినావే తల్లీ!" అని కొందరు,

"ఏం వొదినా, ఒక్కసారన్నా రాకపోతివే యిట్ట" అని కొందరూ,

"ఏం అత్తా, మా వూరి పైన అసహ్యమేసిందా యేం"అని కొంతమందీ, ఏమేమో యింకా ప్రశ్నింపసాగారు.

ఆప్యాయంగా వాళ్ళు వేసే ప్రశ్నలకూ, చూపే గౌరవానికీ, దయకూ లక్ష్మి ముఁసిపోయి, యల్లప్ప చావు సంగతి జ్ఞాపకమొచ్చి కండ్లనిండా నీళ్ళు నింపి బావురుమని యేడ్చింది. అందరూ వోదార్చారు. సాయంకాలం పొలాలకు వెళ్ళిన వాళ్ళు, పొలమరి పనికి అడివి కెళ్ళిన వాళ్ళూ-మాలా మాదిగ అంతా వచ్చారు లక్ష్మిని చూడ్డానికి. ఆ యిల్లొక దేవాలయమైం దానాడు. లక్ష్మి క్రమేణా వాళ్ళ కన్ని విషయాలూ, వింతలూ చెప్పేది. అక్కడి కతలు, పిల్లల చదువు విషయాలూ, ఇతర విషయాలూ అన్నీ చెప్పేది. "నువ్వెంత అదృష్టవంతురాలి వమ్మా!" అని అందరూ అనేవారు. ఆడపిల్లలంతా సుజాతను చుట్టుకున్నారు. చాలా మంది యిపుడిపుడే చదువుకుంటున్నారు. పిల్లలు రోతగా వుండ

బట్టి, రోతంటే యేమిటో తెలియని వాతావరణంలో పెరిగిన పిల్ల సుజాత కాస్త అసహ్యించుకొంది. మరలా అనుకుంది. "నా పరిస్థితి వీళ్ళలాగే వుంటే" అని.

అప్పట్నుంచీ, అందర్నీ దగ్గర కూర్చోబెట్టుకొని ఏమేమో చెప్పి, "మనం అందరం గూడా చదువుకోవాలి" అని వాళ్ళ మనస్సులలో ఉవ్విళ్ళూరేటట్టు చేసేది. శ్రీన్ను చుట్టుకొనేవారు మగపిల్లలంతా, కాలవ గట్టుకో, పొలాల్లోకో - ప్రక్కనున్న చిట్టడివిలోకో లాక్కొనిపోయేవారు. ఏమేమో అడిగేవారు. సమాధానం పొంది తృప్తిచెందేవారు. రెడ్డి, శాస్త్రి, శ్రీను మాలవాడ కొస్తే, వీళ్ళ వెంట తిరిగే బాలబృందం గూడా చిన్న దొకటి తయారైంది.

కామాక్షికి సుజాత అంటే బలే యిష్టం. ఎందుకంటే శాస్త్రి ఆమెను గురించి తెగ పొగుడ్తూ వుంటాడు గనుక. సుజాత చురుకుదనాన్ని గురించీ, మార్కుల గురించీ చెబుతూ ఆవేశంతో యింకా యేమేమో చెప్పేవాడు. ఇదే గాకుండా. ఆడవాళ్ళను గూడా మొహ పెట్టే అందం, సోయగం - సుజాతలో వున్నాయి. ఆమె మాటలు గూడా నెమ్మదిగా, పొందికగా, తియ్యగా, తెలివిగా వుంటాయి. మన బాలికలలో కల్లా మించిన విద్య ఒకటి వుంది సుజాతలో. తాను పేటలో చేరినప్పట్నుండీ, సంగీతం ప్రైవేటు పెట్టించారు వీళ్ళ ముగ్గురికీ. సంగీతం బాగా నేర్చుకున్నారు. అందరికి ముప్పయి కృతులకు పైగా వచ్చు. అయితే సుజాతది వాళ్ళకు మించిన శారీరం. చాలా శ్రావ్యంగా, హాయిగా వుంటుం దామె పాడుతూ వుంటే. అస లామె మామూలుగా మాట్లాడ్తూ వుంటేనే శ్రావ్యంగా వుంటుంది గదా! ఇక స్వరంవేసి పాడితే చెప్పాలా? కామాక్షికి సినిమా పాట లంటే బలే యిష్టం. అంచేత సుజాత చేత పాడించుకుంటూ వుండేది. వీళ్ళ దగ్గరి బాంధవ్యాని కింకొక కారణం గూడా వుంది. ఇద్దరూ ఒకే క్లాసు. వయో భేదం వున్నందు వల్ల చాలా

గౌరవంగా సంబోధించి మర్యాదగా చూచేది కామాక్షిని సుజాత. సుజాత యింటికొస్తే నాగలింగం వచ్చినా బయటికి పోడు. ఎంత పనివున్నా లక్ష రూపాయ లిస్తామన్నా బయటికి అడుగు పెట్టడు. రెడ్డి, శ్రీనులు వచ్చి పిలిచినా గూడా, బలవంతంగా ఒకసారి వెళ్ళినా, రెండోసారి ఏదో పనిమీద సాకుపెట్టి తప్పించుకు కూర్చొనేవాడు.

సుజాత శ్రీలక్ష్మి యింటికి గానీ, అనసూయ యింటికి గానీ పోదు. వారే వచ్చి రోజూ కామాక్షి యింట్లో కూర్చుని మాట్లాడిపోతూ వుండే వారు. వీరంతా యౌవనవతులు, ఒక విధమైన విద్యా వ్యాసంగంలో వుండేవారు, ఒకానొక, అభ్యుదయ, ఆశయ, ఆదర్శాలలో నమ్మకం గల వారూ కాబట్టి, వారిలో నీ, నా అనే భేదాలు లేనేలేవు. ప్రతిదినమూ వారంతా నాగలింగం యింట్లో ఒకపూటైనా భోంచెయ్యాల్సిందే! ఏదో చేసుకొని అంతా కలిసి తింటూ పాడుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ వుంటారు. సుజాత వచ్చినప్పుడు నాగలింగం బయటికిపోడుగదా! ఈ సమయంలో శ్రీలక్ష్మి అనసూయలొస్తే చక్కా బళ్ళోకి వెళ్ళి కూర్చుం టాడు. అసలు శ్రీలక్ష్మిని చూస్తే ఆ సమయంలో మళ్ళా వుండడు. ఎందు కంటే యేడిపిస్తుందని!

మే నెల మధ్యలో యం. ఎ. ఫలితాలొచ్చాయి. కేశవరావు ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. ఊరి వారంతా కేశవరావు చాలా గొప్పవా డన్నారు. హరిజనవాడలో అతనికి బ్రహ్మరథం పట్టారు. సుబ్బారెడ్డి ఆనాడు పెద్ద విందు చేశాడందరికీ.

ఆ దినం జూన్ పదవతేదీ. పన్నెండవ తేదీ హైస్కూలు తెరుస్తారు. ఆ పిల్లలు రేపే వెళ్ళాలి. యస్. యస్. యల్. సి. పరీక్షా ఫలితాల కోసం యెదురుచూస్తూ కూర్చున్నారు. ఆ దినం మధ్యాన్నానికి పేపర్లో వచ్చాయి ఫలితాలు. మనవాళ్ళు ముగ్గురు ప్యాసయి వున్నారు. ఆనాడు

బళ్ళో ఒక అల్పాహార విందు జరిగింది శ్రీనివాసుడి పేరిట. అందులో అనసూయ గానం. ఆరాత్రి సుబ్బారెడ్డి యింట్లో భోజన విందు. శ్రీలక్ష్మి గానం. మరునాడుదయం నాగలింగం యింట్లో పెద్ద విందు. సుజాత సంగీతం!

అకస్మాత్తుగా ఏదో పనిమీద సుబ్బారెడ్డి రాజంపేటకు వెళ్ళంవల్ల, వీళ్ళ ప్రయాణం కాస్త వెనకబడింది. పిల్లలు గూడా పోవచ్చులే అనుకున్నారు. అది సాయంకాలం. ప్రొద్దప్పుడే కుంకుతూ ఉంది. కొండల చాటున దాగబోయే సూర్యుని పల్చని మేఘా లావరించాయి. ఆ అరుణ కిరణాలు వాటిపై ప్రతిఫలించి, ఆ పడమటి దిక్కంతా ఆవరించాయి. ఆ పడమటి కొండపై వరుసలు దీరినట్లున్న చెట్లూ- వాటివెనక యెర్రని కాంతీ- అక్కడక్కడా బాగా నల్లగా కనిపించే చిన్న మేఘాలూ- యివన్నీ చూస్తే ఒక చిత్రపటం మాదిరి వుంది. వేడిగాలులు కొద్దిగా చల్లబడి, వసంతలక్ష్మి నిట్టూర్పులా అన్నట్లు వీస్తున్నాయ్. వసంతలక్ష్మి, తన సౌరభాన్ని ఆ గాలుల ద్వారా వెదల్లుతూ వుంది. "శుభం శుభం" అంటూ ఆహ్లాదంగా శకుంత సంతానము కలకలారావం గావిస్తున్నది. అప్పుడే స్నానం చేసివచ్చి, మిద్దెక్కి, ఆ ప్రకృతిశోభను గాంచి, ఆనందిస్తూ, ఆ మారుతాన్ని సేవించి, తన్మయత చెందుతూ వుంది అనసూయ. నల్లని, చక్కని, పొడవైన కురులు గాలికి రెపరెపలాడుతున్నాయ్. ఆమె మనసు నిర్మలంగా - ప్రశాంతంగా వుందిపుడు. ఏదో అర్థంకాని ఆనందం - వ్యక్తంకాని సుఖం హృదయంలో అనుభవిస్తూంది. శ్రీను గెలుపు తళుక్కుని మెరిసిందామె కండ్లముందు. ప్రెసిడెన్సీఫస్టు వచ్చి వుంటాడనుకొంది. ఎందుకో ఆమె తానే గర్వించింది. అమ్మ అపుడపుడూ గింజలమ్మి యిచ్చిందీ - నాన్న అపుడపుడూ రాజంపేటకు వచ్చినపుడిచ్చిందీ - అంతా కలసి ప్రస్తుతం నలభై రూపాయలుంది. ఒక నూరు రూపాయలన్నా జమచేసి శ్రీను కివ్వాలని ఉబలాటపడింది. మిగిలిన

అరవై యెట్లా సంపాదించడం అని ఆలోచించింది. ఏదో నగ చెయ్యించుకోవాలనో - మంచిగుడ్డలు కుట్టించుకోవాలనో-అమ్మ నడిగితే-యిస్తుందా? అంత ఆమె కెక్కణ్ణుంచి వస్తుంది? మీ నాన్న నడగమంటే? అయినా ఇటీవల గింజలమ్మిన డబ్బుందిగా! అయితే అది నాకెట్లా వస్తుంది? అని యిట్లా ఆలోచిస్తూండే సమయంలో, ఎపుడూ తన యింటికిరాని శ్రీను, ఎపుడో చిన్నప్పుడు సుబ్బారెడ్డి కొట్టిన తర్వాత, దాన్ని పురస్కరించుకొని కొన్నాళ్ళవరకు ఆ యింట్లోకే రాను అని శపథం చేసిన శ్రీను, ఆ దినం రెడ్డికోసం వచ్చాడు. లోపల లేకపోతే, మిద్దెపై నున్నాడేమో అని పైకివచ్చాడు. చూచాడు. ఆమె నల్లని కురులు, తెల్లని చీరపైన వ్రేలాడ్తూ వున్నాయి, వెడల్పుగా గాలికెగుర్తూ. అతని భావాలు పరుగెత్తాయామె వైపుకి. ఆ విధంగా పరుగెత్తిన భావాలామె కురుల్లో జొరబడి, పెనవేసుకొని యేమేమో చేసి ముఖంవైపు తిరిగాయ్ తనివిదీరనట్టు. అరుణకాంతులామె చెక్కులపైబడి ఆ నునుచెక్కుల సోయగాన్ని రెట్టింపు చెయ్యడమూ, ముంగురులు గాలికి కదుల్తూ ఉంగరాలవలె ఆమె నొసటిపైన వయ్యారంగా ఆడుతూ వుండటం చూచాడు కుడివైపు నుండి - హెచ్చరిక సూచకంగా దగ్గాడు. టక్కని తిరిగిచూచింది. ఆశ్చర్యంగా 'శ్రీనూ!' అంది ఉత్కంఠతో. మామూలు కాని అదొక రకం బొంగురు గొంతుకతో, తడబడుతూ,

"మీ యన్నేడీ?" అన్నాడు శ్రీను.

"తెలీదు" అంది అందంగా పెదవులు తెరచి.

శ్రీను వెళ్ళేందుకొక అడుగు వెనక్కేశాడు.

"శ్రీనూ!" అనేలోపల రెండు మెట్లు దిగాడు.

"అవునా? నీవు కాలేజీకి పోవూ?"

"ఎవరన్నారు?"

"నీవే అన్నావటగా, ఎక్కడన్నా గుమాస్తాగా చేరి మా యమ్మను పోషించుకుంటూ సుజాతను చదివించుకుంటానని."

"అదెప్పటిమాటో?"

"అయితే ఖాయం?"

"తప్పక."

"అయితేవుండు" అని మహడీలోని తన రూంలోకెళ్ళింది. నలభై రూపాయలూ తీసింది. ఆలోచించింది. అమ్మ ట్రంకు అక్కడే వుంది. తెరిచింది. ఒక యాభై రూపాయలు మాత్రం వున్నాయి. తీసుకొంది. అదంతా చూస్తున్నాడు శ్రీను. వచ్చింది అనసు తృప్తిగా. అంతవరకూ నోట్లు యెంచుకుంటూ వచ్చి, శ్రీను దగ్గిరికి రాగానే రెండుచేతులూ వెనక్కి పెట్టి నిలబడి,

"ఒకమాట చెప్పేదా?" అంది వయ్యారంగా.

"నాకు తెలుసు" శ్రీను ముఖం అంత కళగా లేదు.

"తీసికోవూ?" అని చూపింది.

తటాలున కోపంవచ్చింది శ్రీనుకు. కొంచెం నిబ్బరించుకొని,

"ఎక్కడిదీ?" అన్నాడు.

"నాదే!"

"నిజంచెప్పు" అని సూటిగా కండ్లల్లోకి చూచాడు. కొద్దిగా తప్పు చేసిందానిమాదిరిగా అవుతూ,

"ఇందులో నా డబ్బు ఎక్కువ వుంది, అన్నది."

"మిగిలింది?"

"అమ్మది."

"ఆమె పెట్టెతెరచిచూచుకొని, డబ్బేదీ అంటే?"

"ఏదో చెబుతాను."

"ఇంతకూ డబ్బు పెట్టెలోనుండి మాయమైందని తెలుస్తుందా?"

"..............."

"నీవాపనిచేసినట్లు రుజువౌతుందా?

"అవుతుంది"

"తర్వాత నాచేత అంతడబ్బుండటం మీయన్నకు తెలీదా?"

"..............."

"అపుడు నాగతేమిటి? ఆనాటివిషయం మరిచావా? ఏదో చెయ్యాలని ఉబలాటేగాని, వితర్కబుద్ధి గూడా వుండాలి" అంటూ బిరబిర దిగ మొదలుపెట్టాడు.

"శ్రీనూ!" అంది ఆదొక మోస్తరుగా, ప్రార్థనార్థంగా నిలబడి కంఠ్లనిండా నీరునించి. కిందికిదిగి వెనక్కితిరిగిచూచాడు గుడ్లు పెద్దవి చేసి. అతని కండ్లలో తాను అనుమానించిన అవమానమూ, దానితో మిళితమైన కోపమూ ప్రస్ఫుటంగా కనిపించాయి అనసుకు.

మరునాడందరూ పేటకు బయలుదేరారు. ఈ సంవత్సరం వీళ్ళెవరూ వుండరుగాబట్టి అనసూయ ఒకతే ఉండవలసివస్తుందని వాళ్ళ తల్లి గూడా బయలుదేరిం దీసంవత్సరమేగదా అని. వచ్చాడుగాని, శ్రీను అనసూయ కంట బడలేదు. అదేమిటో అతను బిర్రుబిర్రుగా తిరుగుతున్నాడు. దాన్ని పెద్ద తప్పుగా తీసికొని పలకరించకుండా పోతున్నాడే అని పరితాపపడింది. చిన్నకోపంకూడా వచ్చింది. ఆ మరునాడే వీళ్ళ రిజిష్టర్లు గూడా వచ్చాయి. రామిరెడ్డికి అయిదువందలా రెండు మార్కులు వచ్చాయి. శ్రీనుకు అయిదువందలా ముప్పై యెనిమిది, శాస్త్రికి నాలుగువందలాయిరవై. అందరూ శ్రీను మార్కుల రిజిష్టరు ఎగబడి చూస్తున్నారు. అనసూయ సంతోషం కంఠాన్ని తన్నుకొని

లోపలికి పోకుండా బయటికి రాకుండా వుంది. శ్రీలక్ష్మి మోచేత్తో పొడిచి కొంటెగా నవ్వింది. ఇంతలో శ్రీను, రెడ్డిచేతిలోని రిజిష్టరు తీసికొని పోబోతున్నాడు. "ఏమిటోయ్" క్రొత్త మనిషి లాగా తిరుగుతున్నావ్ నిన్నటి నుండి? భోంచేసి పోదూ వుండు" అన్నాడు. "పనుందోయ్. అమ్మ యెదురుచూస్తూ వుంటుంది" అంటూ బయలుదేరాడు. అనసూయ మనసులో ఏదో ఒక మోస్తరుగా వుంది. మాట్లాడాలని వుంది. ఏం మాట్లాడడం? పారిపోతున్నవాణ్ణి ఏమని పలకరించడం? మార్కుల నెపంతో మాట్లాడాలనుకుంది. అడగబోయి, సంకోచించి, మరలా ప్రయత్నించి, వెనుదీసి, కడకు,

"శ్రీనూ, ఏదీ రిజిష్టరు? 538 వచ్చాయా?" అంది ఆనందంతో.

శ్రీను విని విన్నట్టుగా, దాన్ని బిగించి చంకలో పెట్టుకొని, "వస్తా రెడ్డీ, నీవు భోంచేసి త్వరగా రా అట్లా. ఇద్దరం కలిసి పోస్టాఫీసుకెళ్ళి పోస్టల్ ఆర్డర్లుకొని, అప్లై చేద్దాం" అంటూ బిరబిరా నడిచి వెళ్ళాడు. అనసు మూతిముడుచుక పోయింది. ముఖమంతా, అంతై పోయింది.

## ౧౩

లయోలా కాలేజీలో లెక్చరరుగా రమ్మని అంతకుముందే వచ్చింది కేశవరావుకు. మనవారు గూడా లయోలాకు అప్లై చేశారు. అందరికీ సీటొచ్చింది. యెప్పటిమాదిరే ఒక లాడ్జి తీసికొని, అందరూ దానిలో చేరారు. క్రొత్త వాతావరణంలో, క్రొత్త మార్గంలో పడ్డారందరూ అయ్యవారితోసహా.

చేరిన పదిరోజులకు ఒక కవరొచ్చింది శ్రీనుకు. అప్పటికంతా భోంచేస్తున్నారు. వీళ్ళు ముగ్గురే. "ఇదోవోయ్ జాబు" అన్నాడు శాస్త్రి నవ్వుతూ. అనసు నుండేమో అని ఆతురతో అందుకున్నాడు చాలా

సంతోషంగా. అడ్రసు అక్షరాలు చూస్తే అనసూయవి కావు. నిరుత్సాహ పడ్డట్లుగా కూర్చున్నాడు.

"ఎక్కడిదోయ్, అక్కడిదేనా?" అన్నాడు శాస్త్రి నవ్వుతూ.

"అక్షరాలు చూస్తే నా జాబులాగా ఉందోయ్" అన్నాడు రెడ్డి.

"పై అక్షరాలు చూస్తే నీ జాబులాగా వుంది. అడ్రసు చూస్తే శ్రీనుది. లోపలి జాబు నాకేమో!" అన్నాడు శాస్త్రి మళ్ళా. అందరూ ఒక్కసారిగా ఒకరి తొడ ఒకరు కొట్టుకుంటూ కడుపుబ్బా నవ్వుకున్నారు. శ్రీను దాన్ని జేబులో పెట్టుకొని నిరుత్సాహంగా బయటికొచ్చి, చెయ్యి కడుక్కొన్నాడు. ఇంతలో శాస్త్రి, రెడ్డి వరండాలో కూర్చున్నారు. శ్రీను తన స్టడీ రూంలో కెళ్ళాడు. వెనకవైపు నాగలింగం నడుస్తూండటం గమనించలేదు. జాబు చించాడు. ఎత్తుకుంటూనే "నా శ్రీనూ" అని వుంది. అంత్యంలో 'నీ అనసు' అని వుంది. ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయి, అట్లానే ఆ జాబును హృదయానికి హత్తుకొని, కొన్ని సెకండ్లు గడిచినాక, తలుపు గడియవేసి చదువుకుందామని వెనక్కితిరిగాడు. తటాలున నిర్ఘాంతపోయి వేలుకొరుక్కున్నాడు. శాస్త్రి నవ్వుతున్నాడు. శ్రీనట్లాగే నిలబడ్డాడు నిశ్చలంగా.

"చిక్కావులే," అన్నాడు శాస్త్రి వాడి భుజాలురెండూ పట్టుకొని

"శ్" అంటూ వాని నోరుమూశాడు శ్రీను.

ఇంతలో రెడ్డి లోపలికొచ్చా డేమిటోయ్ అంటూ.

"యేంలేదోయ్! ఊరికేఅన్నాను" అన్నాడు శాస్త్రి.

"ఎక్కణ్ణుంచి జాబు శ్రీనూ?"

"ఒక ఫ్రెండ్" అంటూ సున్నుమిఞకరించాడు.

"ఎవరోయ్ ఆ ఫ్రెండు, మాకు తెలీకుండా?" అనేటప్పటికి,

"వస్తావుండూ" అంటూ గబగబా బైటికివెళ్ళబోతూవుంటే అయ్యవారొచ్చాడు విక్టోరియా హాస్టలునుండి. సరే యెవరిపాటికి వారు సద్దుగాకుండా పెద్దమనుష్యుల్లాగా కూర్చున్నారు. శ్రీనివాసుడికి సందుదొరికింది. జాబు చేతికి తీసుకొన్నాడు.

"నా శ్రీనూ!

జాబు వ్రాయడం యిదే మొదలునీకు. అసలు ప్రేమ జాబులకిది పునాది కాబోలు! సాహసించి తొలిసారిగా నేవ్రాస్తున్నందుకు క్షమిస్తావు గదూ? నీవా నాడంతకోపంగా కనబడడం నేను సహించలేకపోయాను. రాజంపేట సంఘటనవల్ల కలిగిన అవమానాన్ని భరించలేకపోయాను. ఆ చిన్న తప్పుకే యింత శిక్షా? చిన్ననాటి విషయం జ్ఞప్తికి వుండిగూడా, ఆనాడేదో అవ్యక్తావేశంతో మరిచాను. నీవే, యేదో పెద్దవాడివి. మంచిదనో చెడ్డదనో చెప్పొచ్చుగా! అంతగా కోప్పడతావెందుకూ? ఆ కోపాన్నే మనసులో పెట్టుకొని కూర్చుంటావని నేను అనుకోలేదు. అదేనా మనయ్యవార్లు మనకు నేర్పింది?

శ్రీనూ, నన్నింతగా యేడ్పించడమెందుకు? ఏదో తప్పు మన్నించి, త్వరగా ఒక జాబన్నా వ్రాస్తావనుకున్నా. ఈనాటి వరకూ అర్రులు చాచి కూర్చున్నా. చదవడానికి బుద్ధి పుట్టదు! అసలు భోజనంగూడా సరిగా సహించదు! నన్నింకా యెందుకేడిపిస్తావు? నాపైన కక్షయెందుకు? నేను సహించగలనా? ఇంతవరకూ మీ అందరిలో ఉన్నదాన్ని ఇపుడేకాకినయ్యాను. వారానికొక జాబయినా వ్రాస్తావనుకున్నాను. అసలు మొదటికే మోసమొచ్చింది! నా తప్పులు క్షమించి, తక్షణం వ్రాయవూ?

ఇట్లు, నీ అనసు."

చదివేటప్పటికి అతని జీవితమంతా ఒకసారి గిర్రున తిరిగింది బుర్రలో. సానుభూతి హృదయంలోనుండి పొర్లుకొచ్చింది. తక్షణం వ్రాశాడు జాబు తన్ను క్షమించమని వేడుతూ.

కేశవరావుకు మద్రాసు జీవితం యింకా ఉత్సాహవంతంగానూ విజయప్రదమైనదిగానూ అయింది. తనకిపుడు ఇదివరకు వ్రాసిన చిన్న చిన్న కతలు, నాటికలు మొదలైనవి అచ్చువేయించుకోడానికీ-రేడియో ప్రోగ్రాముల్లో పాల్గొనడానికీ - ఏదో ఒక క్లబ్ తరఫున ఉపన్యాసం యివ్వడానికీ - అవకాశాలు కొల్లలుగా లభించేవి. అతని ఆశయాలు-ఆదర్శాలూ, కాలేజీపిల్లలు గూడా బాగా రుచి చూడసాగారు. ఎక్కడయినా ఉపన్యాసానికిపోతే, ఎంతో ప్రోత్సాహం దొరికేది ప్రేక్షకుల చప్పట్లవల్ల. అసలలాంటి ఊహలకూ, ఉద్యమాలకూ, ఆశయాలకూ-ఆదర్శాలకూ-కాలేజీలే పట్టుగొమ్మలని ఎరిగిన కేశవరావు కీనూత్న వాతావరణం మరింత ప్రోత్సాహకరంగా కన్పించింది. విద్యార్థులుగూడా, అసోసియేషన్లలో బాగా పాల్గొని పేరుపొందేవారు. సంవత్సరాంతంలో ఇతర కాలేజీల పోటీలలో పాల్గొని కప్పులు సంపాదించేవారు.

మదరాసునుండీ, పేటనుండీ, అంతా వచ్చారు వేసవికి. కోటకు వెలుపల ప్రత్యేకంగా, ఒక యిల్లు కట్టడానికి పునాదులు వేశారు. అంటే శాస్త్రి ఆరంజితోటదగ్గర. అక్కడ దాదాపు యిరవై యెకరాల భూమి తయారుచేశారు. అదంతా నారాయణ పట్టా. దానిలో రకరకాల చెట్లు అంతకుముందేనాటారు. పెద్దబావిగూడా తవ్వించి పంపుపెట్టారు. కాలవ నీరుపారడానికి వసతిగూడా కల్పించుకున్నారు. ఆ యింటికి పెట్టుబడి కామాక్షి.

ఒక చిన్న విషయం. నారాయణ విషయం అది. నారాయణ యిపుడు కోటలో పంతులుకాదు, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషు ఆనర్సు చదువుతున్నాడు. పీట్నున్న బసకూ అతని కాలేజీకి సరైన రాకపోక వసతులు లేక విక్టోరియా హాస్టల్లో వుంటున్నాడు. చదివిస్తూన్నది కామాక్షి పైకి అందరికీ తెలిసిందేమిటంటే, కామాక్షి అతనికి అప్పుగా యిస్తున్నదనీ-చదివి యెక్కడన్నా చేరి సంపాదించేటప్పుడు, వడ్డీతోసహా కట్టేస్తాడనీ.

కోటప్రక్కన చిట్టడవి. దాన్ని దాటితే చిన్నగుట్టలు! వాటిని దాటితే, శేషాచల పర్వతాలు! కోటచుట్టూవున్న చిన్న అడవిలో కలివె, ఊటి, బిక్కి, పాల బీర, అల్లి యిటువంటి చెట్లున్నాయ్.

అది వేసవి అవటంవల్ల పాలపండ్లుమాత్రం దొరుకుతాయి. కలివె పూలు తెల్లగా విరగబూశాయ్ ఆ ప్రదేశమంతా. ఒక విధమైన ఘాటైన సువాసన ఆ ప్రాంతమంతా వ్యాపించి వుంటుంది. కొన్ని పుష్పాలు సాయంకాలానికి వాడి వత్తలైపోయుంటాయ్. చాలా పుష్పాలప్పుడే విచ్చి నట్లుగా వుంటాయ్. వాటినంతా పీకి నోట్లోవేసికొని చప్పరిస్తే మకరందం కొంత తీపుగా, పూలు నలిగి వాటిపసరుకాస్త వగరుగా-నాలుకకు తగు ల్తుంది. చాలా చాలా లేతపిందెలుగూడా వుంటాయ్.

సాయంకాలం మనగ్రూపంతా షికారు వెళ్ళారట్లా చెరువువైపు. ఆ నీరెండలో తమాషాగా చెట్లల్లో తిరుగుతున్నా రందరూ. కలివెపూలు కోసి కొందరు నోట్లోవేసుకొని చప్పరిస్తున్నారు. కొంతమంది జడల్లో పెట్టుకుంటున్నారు.

కేశవరావు, కామాక్షి మాత్రం కట్టపై కూర్చున్నారు. చెరువులో కొంచెం నీరుంది. గాలి ఆ నీరుతాకి చల్లారి వస్తూంది. అలలు చిన్న చిన్న విగా అందంగా కదులుతున్నాయి. కామాక్షి ఆ అలలవేపే-ఆ అలల కదలికలలో తేలియాడే సూర్యబింబంవైపే-చూస్తూంది.

"అమ్మా!" అన్నాడు కేశవరావు.

"ఏమన్నయ్యా?"

"బాగా చదువుతున్నావా? పాఠాలు కఠినంగావున్నాయా!"

"ఊఁహుఁ, చాలా తేలిగ్గా వున్నాయ్! అన్నీ తెలుగులో వుండటం వల్ల ఒక్కసారి చదువుతూనే మనసుకు పట్టిపోతూ వుంది.''

"ఎన్నన్నా మాతృభాషతో సమానమా? మేం చదివేటప్పుడు నాలుగోఫారంనుండి అన్నీ యింగ్లీషులోనే. యెంత కష్టంగా వుండేదను కున్నావ్? ఎన్నోసార్లు చదివితేగాని విషయం జ్ఞాపక ముండదు. ఎందు వల్లంటే చిన్నప్పటినుండీ నలిగిన భాషకాదు కాబట్టి ధారణ వుండదు."

"నిజమే. నాకు సులభంగానేవుంది! ప్రాణానికి గూడా హాయిగా వుందిపుడు! ఏదో మీపుణ్యాన చదువుతున్నా. లేకపోతే ఆనాడు వాళ్ళంతా పట్టిన పట్టుకు, మీరు లేకపోతే........"

"దానికేముందమ్మా? యేమన్నా చేసివుంటే అది నా ధర్మం, నీవొక చెల్లివి, నేనన్నను. నీక్షేమంకోసం యేమన్నాచేస్తే అదేమీ పొగడ దగిందికాదు."

"కృతజ్ఞురాల్ని."

"సరేగాని, నీవేమీ అనుకోవుగదా?"

"ఏమిటన్నా?"

"నీకు పునర్వివాహం చేసికోవాలనివుందా?"

"........ ..............."

"చెప్పమ్మా, నాదగ్గర బిడియమెందుకు?"

నారాయణను చేసుకోవాలని వుందని తనకూ తెలుసు. నారాయణ చేసుకుంటాడనీ తెలుసు. అయినా అడిగాడు ఎపుడు చేసికొంటుందో తెలుసుకోవాలని. ఆ విషయంయెత్తడం యిదే మొదటిసారిగాబట్టి యింత ఉపోద్ఘాతం కావాల్సొచ్చింది. ఆమెగూడా,

"ఉంటేమాత్రం?" అంది తలవంచి సిగ్గుతో.

"తర్వాత కానీమ్మా!"

"వుంటేమాత్రం యెట్లా కొనసాగుతుంది? నన్నిష్టపడి చేసుకొనే వాడెవడు? సాధారణస్త్రీనే, మానవతియైన పెండ్లాన్నే నీచంగా చూచే యిప్పటి మగవాడు, వితంతుపెండ్లాన్నింకా నీచంగాచూడడూ?"

"నీ విషయంలో అట్టిభావాలులేనీ-నీపైన సానుభూతి ప్రేమ వున్నటువంటీ-పురుషుణ్ణి చూపితే చేసుకుంటావా?"

"అటువంటి భావాలుండి, నన్ను ప్రేమించి చేసికొనేవాడుంటే గదా?"

ఉన్నాడమ్మా, ఉన్నాడు."

ఆమె కర్థమయింది. పెండ్లి మాటలంతా ఆయనచేత అనిపించాలని,

"యెవరన్నయ్యా?"అంది మోకాలు ప్రక్కకు తలవంచి సిగ్గుతో.

"యెవరో యెందుకమ్మా, యిక్కడేవున్నాడు."

"ఎవరబ్బా!" అందిమళ్ళా.

"నారాయణ."

ఆ మాట వినేప్పటికామె గుండెల్లో చక్కిలిగింత పెట్టినట్లయింది. ఇక పెండ్లిచేయబోయే పెద్దే ఆమాటంటే అమెకింకేం కావాలి? అయినా తన యిష్టాన్ని సత్వరం వెళ్ళబుచ్చితే, తన స్త్రీ నైజగుణానికి విరుద్ధమనేమో-

"అదెట్లా సాధ్యమౌతుందన్నయ్యా" అంది?.

"ఎందుక్కాదమ్మా?"

"కులాంతరుడు, ఒకవేళ పరస్పరం యిష్టంవుండి చేసుకున్నా, విధవకు స్వకులంలో యెవడు దొరుకుతాడు లేరా అని నన్నూ-కులాంతర వివాహం కావాలంటే విధవకాబట్టి దొరికింది అనీ మంచి పిల్లవాడికెట్లా దొరుకుతుందీ అని, తననూ, ప్రపంచం అంటుంది."

"అనసీమ్మా, దానికతంతే."

"నిజమే. మనమూ ఆ ప్రపంచంలో జీవించాల్సిన వారమేగా! అయినా నాగలింగం వొప్పుకుంటాడా?"

"వాడు మనకంటే వొకడుగు ముందు కేస్తాడు."

"పొరపాటన్నయ్యా! ఈ కాలం అందరూ - అంటే చాలా మంది సంఘసంస్కర్తలం అనీ - రాజకీయవేత్తలమనీ బయలుదేరి, కులభేదాలు కూలిపోవాలనీ - సంఘవ్యత్యాసాలు నమసి పోవాలనీ - వర్ణ వ్యవస్థను వర్జించాలనీ - హరిజనోద్ధరణకు కృషి చేయాలనీ - మానవ సమత్వం రావాలనీ-స్త్రీలకు పురుషులతో పాటు హక్కులు కావాలనీ ఉపన్యాసాలు దంచేస్తారు. తమ విషయాలలో కొచ్చేటప్పటికి, ఉల్లిపాయలు తినవద్దని ఉపన్యాసం దంచిన బ్రాహ్మడుడిలాగా తమ నీచ గుణాల్ను బయట పెడ్తారు. ఇపుడు మనం చూస్తున్నాంగా! కాంగ్రెసని చెప్పుకొనే పెద్ద లెంతమంది హరిజనుల్ను ఇండ్లలోనికి రానిస్తున్నారో! తమ స్త్రీలనెంత సమత్వంతో చూస్తున్నారో!

కాబట్టి, నాగలింగానికి నాపైన, గౌరవ భావం, మాతృ భావం వుండొచ్చు. అన్నీవున్నా తన తండ్రి భార్యనుగా వుండి, తన వుపాధ్యాయునికే భార్యనయితే, వానికి కించగా తోపవచ్చు. వంశ మర్యాద మట్టి గలిసిందే అని సంఘం అంటే, అంతేనేమో అని వాడనుమాన పడవచ్చు. ఫీలు కావచ్చు."

"అందుకేనమ్మా, సంఘం అంటూ వుంటుందని, అట్లాగే సాగి పోతూవుంటే సంస్కరణలుజరిగి బాగుపడే దెప్పుడు? సంఘం సక్రమంగా వుంటే సంస్కరణెందుకు? అది చెడిపోయినపుడే సంస్కరణ కావల సొస్తుంది. దాన్ని చక్కచేయ్యడానికి పూనుకున్నపుడు, అభిమానమూ కోపమూ వచ్చి ప్రతిఘటిస్తుంది."

"నిజమే! యీ ప్రపంచంలో బ్రదకదలచుకొన్నపుడు, సంఘానికి దూరంగా వుండలేంగా? ఆ సంఘం వేలు పెట్టి చూపినపుడు నాగలింగాని కెట్లా వుంటుందో!"

"పరవాలేదు వాడేమీ అనుకోడు. అసలు వాని విషయం వదిలెయ్."

"కావచ్చు. మీ సేవవల్ల గొప్ప గొప్ప ఆశయాలుండవచ్చు. ఆదర్శాలుండవచ్చు. ఆచరణ, దక్షతకు తగిన సంస్కార బలం వాని హృదయానికి రాలేదని నా నమ్మకం! ఇంకా కొన్నాళ్ళు జరిగినంత వరకూ వానికివిషయం తెలియకుండావుంటే మంచిదనుకుంటా!"

ఆమె వాదన కేశవరావును ఆశ్చర్యపెట్టింది. ఆమెను ప్రశంసించ కుండా వుండలేకపోయాడు.

"చాలా తెలివిగా మాట్లాడావమ్మా! యింత నిదానంగా తూచి తూచీ, విమర్శించీ - మాట్లాడ్తావని నే ననుకోలేదు. సరే, వానికి తెలియ కుండా వుంచుదాం."

"అయితే అతను నీతో చెప్పాడా ? లేక నీవే అంటున్నావాన్నా?" అంది కామాక్షి చిరునవ్వుతో.

"రెండూ."

"నిజంగానా?" అనేటప్పటికి వెనకాల నారాయణ వచ్చి నిలబడ్డాడు. చూచింది. సిగ్గుచేత మొగమంతా య్రెరనైంది.

"అమ్మో!" అంటూ లేచివెళ్ళింది.

౧౪

ఇరవై వొకటోయేడు పూర్తయేటప్పటికి శ్రీను బి. ఎ. ప్యాస య్యాడు. యూనివర్సిటీ ఫస్టు. డిప్యూటీ కలెక్టర్ పోటీ పరీక్షలో నెగ్గడం

వల్ల వెంటనే మధుర జిల్లాలో డిప్యూటీ కలెక్టర్‌గా వేశారు. అప్పటికి సుజాత యింటర్ జూనియర్ ప్యాసయి వుంది. సీనియర్ చదువుతూ వుంది. పనిలో చేరేముందు కోటలో పెద్ద విందు చేశారు. దాని కందర్నీ ఆహ్వానించారు. కేశవరావు, నారాయణ, కామాక్షి, సుజాత అంతా వచ్చారు. శ్రీలక్ష్మి పాపం యింటి దగ్గిరే వుంది. యస్. యస్. యల్. సి. అయిన తర్వాత, వాళ్ళ నాన్న కాలేజీ వద్దన్నాడు. ఎంతో బ్రతిమలాడింది. వీలులేదన్నాడు. ఇంకా చదివితే చెప్పినమాట వినకుండా పోతుందేమో అని కూచున్నాడు. అయ్యవార్లు జోక్యం కల్గించుకోడం వల్ల మరీభీష్మించు కున్నాడు. నా అదృష్టం యింతే లెమ్మని దుఃఖిస్తూ మిత్రములకు జాబులు రాసుకుంటూ కూర్చుంది. అప్పట్నుండీ పెండ్లి ప్రయత్నాలు చేయ సాగాడు కరణం! ఏదీ పడనీ లేదీమె! ఇంట్లో రోజూ రభసగానేవుంది! అయితే ఇపుడు హైస్కూల్లో చదువుతున్న ఆమె తమ్ముడు ఆమెకు సాయం మాట్లాడుతూ వుంటాడు. వాడు నారాయణ క్రింద మెదిగినవాడు.

ఇపుడు రెడ్డి, నాగలింగం వూళ్ళోనే వున్నారు. అందుకే వాళ్ళు తమ గ్రామంలోనే పెద్ద విందు ఏర్పాటు చేశారు. ఆ విందులో ఊరి వారు, హరిజనులూ, ఎంతో స్నేహంతో, సామరస్యంతో పాల్గొని, చక్కగా నిర్వహించారు. శ్రీనాపదవి కంత త్వరలో వచ్చినందుకు అసూయపడకుండా గర్వపడ్డారు అందరూ.

శ్రీలక్ష్మి యిటీవల కాస్త కులాసాగా వుంది. రెడ్డి వూళ్ళో వున్నందువల్ల ఆమె కెంతో బలమున్నట్లు భావిస్తూ వుంది. నాగలింగం పైగా ప్రోత్సహిస్తూ మాట్లాడుతూండటం వల్ల, ఇంకా బలం. అంచేత ఆమె గూడా విందు విషయాలలో బాగానే పాల్గొనింది. విందు తర్వాత అందరూ కామాక్షి యిల్లు చేరారు. కామాక్షి, సుజాత ఉయ్యాల మంచంపై కూర్చున్నారు మాట్లాడుతూ. వారిద్దరూ చేరితే ఎపుడూ మాటలే! ఏదేదో మాట్లాడుతూ వుంటారు. కొంతసేపు వాళ్ళ మాటలలో పాల్గొని, అనసు,

శ్రీలక్ష్మి మిద్దెక్కారు. ప్రొద్దిక కాస్త వుంది. ఆ వెన్నెల వంటి యెండలో అటూయిటూ తిరిగి,

"శ్రీలక్ష్మీ!" అంది అనసు భుజంపై చెయ్యేసి సూటిగా మొగంలోకి చూస్తూ, చిరునవ్వుతో,

"ఏఁ" అంది శ్రీలక్ష్మి.

"నీవు వివాహం యెక్కడ చేసుకుంటావ్?"

"అందరూ చేసికొనేచోటే, పందిట్లోనే, లేకపోతే దేవళంలో" అంది శ్రీలక్ష్మి నవ్వకుండా.

'అదిగాదే, యెవర్నో" అంది అనసు గట్టిగా నవ్వి.

"ఒక మగవాణ్ణి."

"భలే! ఒక పేడిని చేసుకోవూ?"

"మరి నీవడగడమో!"

"ఊఁ, చెప్పవే యెవర్నో?"

"యెవర్నో ఒకర్ని చేసుకోవద్దటనే."

"అదేగదూ అడగటం!"

గంభీరంగా కూర్చుంది శ్రీలక్ష్మి. అంతకంతకూ ముఖం గాంభీర్యమై పోతూవుంది. చూపులు నిశ్చలంగా పారుతున్నాయ్. శూన్య దృష్టితో కూచుంది. అనయాయ తటాలున ఆ స్థితిచూచి ఏమిటా అని ఆలోచించి,

"లక్ష్మి, ఏమిటే అది" అంది.

ఆ ప్రశ్నకు జవాబుగా రెండుకండ్లనుండీ రెండశ్రుకణాలు రెండు చెంపలమీదా దిగజారాయి. పెదవులుగూడా కదిలాయి.

"ఏం చెప్పమంటావు అనసూ?" అంది దీనంగా చూస్తూ. అనసు కండ్లలోగూడా నీళ్ళు మెదిలాయి. తన పైటచెరుగుతో శ్రీలక్ష్మి కన్నీళ్ళు తుడుస్తూ,

"నీలో ఇంత ఆవేదన యెన్నాళ్ళనుండిదాగివుందేలక్ష్మీ?" అంది.

"ఇది ఇప్పటిదికాదు అనసూ, మూడేండ్లనుండీ పెరుగుతున్నది."

"అబ్బా! ఎంతగడుసుదానవే, యిన్నిసార్లు కలుసుకున్నాంగదా, యేనాడూ చెప్పలేదు."

"అప్పట్లో ఫలమేమిటీ కనిపించలేదు."

"అయితే నాకు చెప్పవూ?"

"వొద్దు అనసూ, నా కత విని నీమనసు పాడుచేసుకోకు."

"చెప్పవూ" అంటూ గడ్డంపట్టుకొంది గద్గద స్వరంతో కన్నీళ్ళు రాలాయి తనకు తెలీకుండా.

శ్రీలక్ష్మి చూచిందాకన్నీరు. "అనసూ!" అంటూ ఆమెవొళ్ళో వాలి ఏడ్చింది. కాసేపటికంది!

"అది నీ అన్న విషయమే అనసూ! నీవింకా పాతధోరణిలోనే భావిస్తున్నావు. మా స్నేహంలో కొన్ని అపార్థాలు బయలుదేరాయి. మొదట మేమిద్దరం, ఒకరికొకరికి యెంతగా ప్రాణాలర్పించుకొనే వాళ్ళమో- ఒకరి విషయంలో ఒకరు ఎంతగా జోక్యం కల్గించుకొనే వారమో-ఏవిషయమైనాగూడా యిద్దరిదీగా యెట్లా భావించేవారమో-అంత దూరమయ్యాం చాలాకాలం. అదంతా మీకు తెలీదు. తప్పు మీయన్నలో యేమీలేదు. నాదే. కొంత అజ్ఞానంగానే ప్రవర్తించాను. తర్వాత తెలిసి కొన్నా. ఎంత గోలచేసినా ప్రయోజనం కాకపోయింది."

"అదంతా చెప్పవూ" అంది అనసు.

"ఏమీలేదు, దాచవలసిందేమీగాదు. అందులో నీదగ్గర. మనం యస్. యస్. యల్. సి. ప్యాసయిన సంవత్సరం నన్ను మా నాన్న చాలించమన్నాడు. నేను పోట్లాడాను. కడకు బ్రతిమాలాను ససేమిరా అన్నాడు. నేను నిజంగా నోటికొచ్చినట్టు తిట్టేశాను- 'ఇదేనా నీవు మీ అయ్యవార్ల దగ్గరనుంచి నేర్చుకుంది' అని అన్నారు అమ్మా నాన్న. నిజమే! అట్టి ధిఃకరణనేను అయ్యవార్ల దగ్గర నేర్చాను. అయితే దాన్ని ప్రయోగించేపద్ధతి తప్పు. అంతే! వాళ్ళామాటనగానే నాకు మనసు చివుక్కుమంది. నేను నాతలిదండ్రులకు ద్రోహం చేస్తున్నానేమో అనే బావంతట్టింది! ఇట్లావుండగా ఒకనాడు మీఅన్న నాకు జాబువ్రాశాడు. 'తలిదండ్రులను ఎదిరించైనా చదువుకు రావాలి. మన ఆదర్శాన్ని కొన సాగించాలంటే ఎవర్నీ లెక్కించగూడదు' అని. ఇల్లాంటి ధోరణిలో వ్రాశాడు. ముందే కాస్త తెలిసి అనుమానిస్తున్న మా నాన్నకు ఆ జాబు చేతికి చిక్కింది! దాన్ని చేతబట్టుకొని నా దగ్గరి కొచ్చి మా అమ్మకు చూపి, కండ్లనిండా నీళ్ళు నింపి 'ఇట్లా చేస్తావనుకోలేదమ్మా! వంశానికి కీర్తి తెస్తావని చదివించాను. ఇదీ మాకు వ్రాసిన బ్రహ్మరాత' అని తల మొత్తుకుంటూ వెళ్ళిపోయాడు. మా అమ్మ ఏమీ మాట్లాడకుండా కాసేపు ఏడ్చి వెళ్ళిపోయింది. నేనా గదిలో భోజనానికి గూడా లేవకుండా ఆలో చిస్తూ కూర్చున్నా. ఆ విధంగా జాబు వ్రాసినందుకు-నా తెలివి మండి పోనూ-మీ అన్న పైన కోప మొచ్చింది. అదే సమయంలో మా యింటికి ఒక పండితు డొచ్చాడు. ఆయన వేద వేదాంగాలూ. ధర్మ శాస్త్రాలూ అన్నీ బాగా చదువుకొన్నాడని ప్రతీతి. అతనికి మా నాన్న నా చర్యలు నివేదించాడో యేమో ఆయన నాకు హితబోధ చేయసాగాడు.

ఏమేమో చెప్పాడు. మనం మన అయ్యవార్లు చెప్పిందంతా నిజ మనుకొని, ఆదర్శ ప్రపంచంలో, ఎట్లా స్వేచ్ఛగా విహరిస్తూ వచ్చామో వాస్తవిక ప్రపంచంలో అవన్నీ కాని పనులనీ - తప్పులనీ - అనర్థాలనీ

రుజువు చేశాడాయన. యథార్థ, వాస్తవిక జీవితంలో అవి సత్యమే అని తోచాయి నా కానాడు.

అసలు బ్రాహ్మణాబ్రాహ్మణ భేదాలను, ఎన్నో ఉదాహరణల క్రింద నిరూపించి చెప్పాడు. అవే గాదు, ఇంకా ఎన్నో చెప్పాడు. నేను ఎంతో ఆలోచించాను. మన అయ్యవార్లు మనకు చెప్పేటప్పుడు, నేనే ముందు తల ఊచేదాన్ని. నేనే ముందుగా దాన్ని ఆచరణలో పెట్టే దాన్ని. నాలో అట్టి ఉద్రేకం వుండేది. మీ అన్న ఎంత శాంతుడో, ఎంత నెమ్మదిగా వుంటాడో నే నంత ఉద్రేకిని. అయితే నా ఉద్రేకం మంచి వాట్లకే అని నీకు తెలుసు. మీ అన్న కేవలం కార్యవాది.

తాను నెమ్మదిగా వుంటాడు. కార్య విషయంలో మాత్రం పట్టుదలగా చేసేస్తాడు. అన్ని యేండ్ల సహవాసం గూడా నన్ను ఆ గుణాన్ని అలవరచుకోనీలేదు.

ఇంట్లో మా వాగ్వాదాలు, పైవారంతా వచ్చి నాకు బుద్ధిచెప్పడాలూ యివన్నీ చూచి అసహ్యించుకొనేదాన్ని. ఎవరెవరికో యిస్తామంటూ అంటూండే వారు. నాకు చాలా అసహ్యం వేసేది. ఒకర్ని చేసుకుంటా నన్న తర్వాత, ఇంకొకర్ని చేసుకుంటా నని అనడం తప్పు. అసలు ఊహలోకే రాగూడ దని నా అభిమతం. తర్వాత గూడా ఈ రెండు సంవత్సరాలూ మీ అన్నకూ నాకూ ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయ్! ఒకసారి అతడు కొన్ని బ్రాహ్మణుల మూఢాచారాల్ని నిరసించి మాట్లాడాడు. నేను దాన్ని బాగా ప్రతిఘటించాను. అప్పుడు నా వాదమే రైటనుకున్నా, మనయ్యవా రంతకంటే ఘాటుగా అనేవారు. అప్పు డింకా నేను కూడా కలిసి అనేదాన్ని. రెడ్డి ఒకనా డనగానే నాకు ఎందుకో కోపమొచ్చింది. నీవు బ్రాహ్మణద్వేషి వని తిట్టాను. అతను ఏమీ అనుకోలేదు. దాన్ని గురించి కోప్పడలేదు గూడాను. అయితే ఒక

బడింది. ఇక్కడ ఎక్కడో ఖుఫూ సూర్యనౌక వున్నట్టు అంతకుముందు రెండు సంవత్సరాల క్రితం ఒక రాతిపై కనిపించిన జంతులిపి మూలంగా శాస్త్రజ్ఞులు ఊహించారు. కాని, ఖచ్చితంగా ఇక్కడేనని తెలీలేదు. మలఖ్‌కు ఆ నౌక ఇక్కడే వుందని ఎందుకో స్ఫురించింది.

ఈ సున్నపురాతి నడవకప్పు ఖుఫూ పిరమిడుకు దక్షిణాన 25 అడుగుల దూరాన పూర్వ పశ్చిమంగా ఉన్నది. మలఖ్ దానిపై పేరుకొని ఉన్న ఇసుక, మట్టి తీయించగా కప్పు ఉత్తరపు కొస కనిపించింది. ఈ నడవ మధ్యకు సరిగా ఒకగోడ ఉన్నట్లూ కనిపించింది. నడవకు పిరమిడ్‌కు మధ్యన దక్షిణోత్తరంగా ఒక బండరాయి పెట్టడంవల్ల నడవ వేరై పోయింది. నడవ తూర్పుభాగం మధ్యకు మెట్లు రాతిలో తొలచబడిఉన్నాయి. రాతిని తొలిచి రెండునావలు వాటిలో భద్రపరిచినట్టు స్పష్టమైంది. మలఖ్ ఈ రాతి కప్పులో ఒకరాతిని తొలిపించి, తలమాత్రం దూరదగినంత సందుచేసి, అద్దం తెప్పించి లోపలికి వెలుతురు ప్రతిఫలింపజేసి తొంగి చూచాడు. మలఖ్ సంతోషానికి మేరలేదు. "ఐదువేల సంవత్సరాలనాటి ఖుఫూరాజు పరలోకయాత్రకు భద్రపరచిన సూర్యనౌకలలో ఒకదానిని తొలిసారిగా చూచే భాగ్యం నాకు కలిగింది" అని ఆనందించాడు. ఆయన మాటలలోనే ఓడ సంగతి వినండి:

"తొంగిచూడగానే గుప్పుమని సుగంధం-బహుశా ఐదువేల సంవత్సరాలనాటి ధూపధూమ సుగంధం-మా నాసాపుటాలకు సోకి ఆనంద పరవశుల మయ్యాము. ఈజిప్టు ప్రాచీనులు పవిత్రంగా భావించే ఉదుంబర దేవదారు వృక్షత్వక్కుల కమ్మనివాసన వచ్చింది. మొట్టమొదట సూర్యోదయానికి ముందున్న ఆకాశం లాగ అంతా తెల్లగా కనిపించింది. తర్వాత ఏదో గోధుమ రంగువస్తువు సరిగా అట్టడుగున కనిపించింది. కళ్ళు మరింత పెద్దవి చేసుకొని చూచాను; లోపల ఏమైనా కనిపిస్తుందా అని. కింద కనిపించిన గోధుమరంగు భాగంనుంచి కోలగా వున్న ఆకారం కనిపించింది. కోలగా ఉండే ఆకారం ఓడతెడ్డని తోచింది. ఓడ! ఓడ! ఎందుకలా నిలుచుకొని ఉన్నారు, ఫ్లాష్‌లైట్ తీసుకొనిరండి, లేకపోతే అద్దమన్నా తెండి - అని కేకలు వేశాను. మొదటకాంతిలో

లకు ఆన్సరు చెప్పారు. నా అజ్ఞానం పటాపంచలయింది. అప్పట్నుండీ మీ అన్న కోసం ఎదురుచూస్తున్నా. జాబులు రాశాను. జవాబులే దు. సెలవులలో వచ్చినపుడు మాట్లాడ్డానికి వీలుపడేదికాదు. వీలుదొరికి నపుడు మీ అన్న దొరకడు. తీవ్రవేదన అనుభవిస్తూ వచ్చాను. ఈ సెలవులలో మీ అన్నను చూస్తే కాస్త ధైర్యం వచ్చింది. అయ్యవారేమన్నా చెప్పా దేమో! మీ అన్న కాస్త ప్రసన్నుడుగా వున్నాడు. ఈ దినం విందులో గూడా ఏదోకాస్త మాట్లాడడానికి ప్రయత్నించాను. అతను మాట్లాడ లేదు. నా జీవితం యిట్లానే వృధాఅయిపోతుందేమో!" అని యేడ్చింది గట్టిగా శ్రీలక్ష్మి.

అనసు ఆమెను పట్టుకొని, తొడపై ఆమె తలపెట్టుకొని, కన్నీళ్ళు తుడిచి, బుగ్గలు నిముర్తూ, "లక్ష్మి, నీవు తప్పక నా వదినె వౌతావు" అంది.

"నిజంగానా, కాగలనా?" అంది శ్రీలక్ష్మి ఆతురతతో.

"తప్పక. రేపే మాయన్నతో మాట్లాడేట్లు చేస్తా."

"చేతిలో చెయ్యివెయ్యి"అంది శ్రీలక్ష్మి ఆనందంగా రెప్పలారుస్తూ.

"ఊహుఁ" అంటూ పరుగెత్తింది అనసు. ఒకర్నొకరు తరుము కుంటూ కిందికి దూకారు. తపీమని ఆగారు ఒక క్షణం.

సరిగ్గా అప్పుడే క్రింద కామాక్షి సుజాతతో వివాహవిషయమై సంభాషిస్తూవుంది. కామాక్షి అంది "ఎవర్ని చేసుకుంటావ్‌సుజా" అని

ఏమీపలకలేదు సుజాత. మళ్ళా అడిగింది.

"నన్ను ప్రేమించినవా డెవరన్నావుంటే, తిరిగి నేనూ అతనిని ప్రేమించి వుంటే........"

"ఎవర్నన్నా ప్రేమించావా?"

"అవును."

"ఎవరు?" పేరుచెప్పలేక పోయింది. కామాక్షి నిలదీసి అడిగింది. ఆమె వయసులోనూ, అనుభవంలోనూ పెద్దది. చెప్పకపోతే అవిధేయత అనుకుంటుందేమో! చెప్పబోతే సిగ్గు. చాల సిగ్గుపడింది. కామాక్షి కుచ్చి కుచ్చి అడగటంవల్ల, చెప్పలేక చెప్పలేక అవస్థపడి "సీ కా........"అంది. అని గుడ్డ మొగానికి కప్పకుంది గట్టిగా. అమ్మ దొంగా అంటూ అనసూయ శ్రీలక్ష్మి వచ్చి సుజాతమీద పడ్డారు గోలచేస్తూ.

అపుడు వచ్చాడు నాగలింగం యింట్లోకి. కడపటి మాటలు విన్నాడు చాటుగా నిలబడి. శ్రీలక్ష్మి, అనసూయలను చూచి గబగబా బయట కెళ్ళిపోయాడు యేడిపిస్తారని భయపడి.

"యేం జేస్తున్నావు కామాక్షీ?" అన్నారు. గబగబా వంటగది లోకి పరుగెత్తి. కామాక్షి లోపల్నుండే,

"పాలను భద్రంచేస్తున్నా" అంది పారిపోతున్న నాగలింగాన్ని ఉద్దేశిస్తూ.

"అయ్యో! పిల్లి కండ్లు మూసుకొని పాలు తాగుతూందే" అంది శ్రీలక్ష్మి. అప్పటికే శాస్త్రి వీధిలో పడ్డాడు. "రామరామ, ఈ శ్రీలక్ష్మి, యీ యింట్లో వుందంటే రాకుండానే వుండేవాణ్ణి" అనుకుంటూ వెళ్ళి పోయాడు బళ్ళోకి. సుజాతను కాల్చుకతిన్నారు ఇద్దరూ.

౧౨

ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు. ఇక కోటలో మిగిలినవారు రామిరెడ్డి, నాగలింగం, శ్రీలక్ష్మి- అంతే. రెడ్డీ, నాగలింగం వుద్యోగా లలో చేరదలచుకోలేదు. బోలెడు ఆస్తి వుండగా దానిని సక్రమంగా చూచుకుంటూ, యాచించిన వారికింతవేసి బాగా తింటూ వీలయితే సద్వినియోగం చేస్తూ వుండవచ్చనేది వీరి ఆశయం. చదువు కాస్త

వస్తూనే పట్నవాసం మరిగి, పల్లెలలో వుండానికిష్టపడక ఎంత ధన మున్నా, కడకు నలభై రూపాయల గుమాస్తాగిరికన్నా వెళ్దామనుకొనే బుద్ధిమంతులుగాదు వీరు. ప్రతిదినమూ ఇంట్లో భోజన సమయా లలో వుంటారేమో గాని, ఎపుడు గూడా బళ్లోనో - పొలాలలోనో - తోటల్లోనో - వినోదంగా చిట్టడవిలో తిరుగుతూనో - గుట్టయెక్కి- భావి కార్యక్రమాన్ని గూర్చి ఆలోచిస్తూనో - వుంటారు. వాళ్ళకు గూడా విద్యార్థిదశ వదలి పల్లెటూరు చేరినాక, జీవితం వారనుకునే పద్ధతిలో నడవటంలేదు. గ్రంథాలయం, పఠన మందిరం, ఆటలాడు కొనే స్థలాలు లేకపోలేదు. అయినా అభిరుచి భిన్నం అయినందువల్ల అవి వీళ్ళ నెక్కువ ఆకర్షించలేక పోయాయి. వాళ్ళ హృదయాలకు తృప్తి నీలేకపోయాయి. వాళ్ళయ్యవా ర్లాదేశించిన ప్రకారము-ఇవుడేమీ సాగటంలేదు. ప్రతి దినమూ యిద్దరికీ యిదే ఆలోచన. కడపటికి రాజం పేటలో ఒక ముద్రణాలయం పెట్టి, ఒక పత్రికను నిర్వహించాలనే నిర్ధారణకు వచ్చారు. దానికి పెట్టుబడి ప్రస్తుతం నాగలింగమే. ఎందు కంటే రామిరెడ్డి మాదిరిగాగాక, తన ఆస్తికంతా సర్వాధికారి గనుక. ఇద్దరూ చాలా సంతోషంగా, త్వరగా స్థాపించి, సాగించాలన్న కుతుహ లంతో - తగిన ప్రయత్నాలు సాగింప మొదలుపెట్టారు. ఆదర్శాచర ణకు అది పునాది కావాలనుకున్నారు.

ఇందు జరిగిన ఒక నెలనాళ్ళకు నాగలింగం అడ్రసుకు ఒక కవరొచ్చింది. అంత బరువైన జాబు ప్రేమ జాబే అయివుండాలని తెలివిగానే వూహించాడు. ఆత్రంతో, ఆనందంతో, పరిశీలించా డడ్రసును. అక్షరాలు తాననుకున్నవారివిగావు. పోస్టాఫీసు ముద్ర మాత్రం మద్రా సనే వుంది. కాస్త పరిశీలన తర్వాత, అక్షరాలు అనసూయ వైనట్లుగా తట్టింది. పై అక్షరాలు అనసువీ, లోపల విషయం సుజాతదీ అనుకున్నా డానాటి జాబులాగా. చించాడు. లోపల ఒక చిన్న జాబు తనకుంది.

రెండవది మళ్ళా కవరులో వుంది. దానిపై శ్రీలక్ష్మికి అని వుంది. కాస్త నిట్టూర్చి సాయంకాలం వీలు చూచుకొని ఆ జాబు జేబులో పెట్టుకొని శ్రీలక్ష్మి యింటి కెళ్ళాడు. నాగలింగం మాత్రం కరణమింటికి పోతూ వస్తూవుంటా డప్పుడప్పుడూ. వెళ్ళి కాసేపందరితోనూ బాతాఖానీ వేసి వస్తూ ఉంటాడు. ఒకప్పుడు గాకపోయినా, మరొకప్పుడైనా శ్రీలక్ష్మి వీలు చూచుకొని, తన విషాదాన్ని చెప్పుకొని దుఃఖించేది. నాగలింగం జాబివ్వగానే చించి చూచింది. అనసు దనుకొని సంతోషించింది. ఆ దినం వాళ్ళ నాన్న వూళ్ళో లేడు. అమ్మ వంట పనిలో వుంది. ఎటువంటి పనిలో ఉందంటే దాదాపు ఒక అరగంట అక్కణ్నుంచి, కదలగూడని పని. జాబు తర్వాత చదువుకోవచ్చు లెమ్మని మాటలకు కూర్చుంది.

"అయితే యేమంటాడన్నా?" అంది కాస్త విషాదంతో.

"నేనెంతో చెప్పానమ్మా! మన ఆదర్శాల్నీ. స్నేహాల్నీ పురస్కరించుకొని ఆలోచించమని ఎన్నిసార్లో చెప్పాను. ఇక అతకడం కష్టం అంటున్నాడు."

"నా అవస్థను గురించి బాగా చెప్పావా?"

"అన్నీ చెప్పానమ్మా. తొక్కని మార్గమే లేదనుకో - మొత్తాని కతన్ని బాగా బెదరగొట్టావు. చాలా వేధించావు. అతని మనసు తెలిసి గూడా యెందుకు చేశావోగాని, బాగా కష్టపెట్టావు. ఎన్నిసార్లో అతనికి కన్నీళ్ళ పర్యంతం తెప్పించావు. అతను నీకు అవకాశమిచ్చి ఎన్నెన్నో చెబితే, అప్పుడంతా పెడచెవిని పెట్టావు. నీ కులాధిక్యంవల్ల అతనంతగా ప్రాకులాడుతున్నాడనే నీచత్వం ఆనాడు నీ హృదయంలో దాగివుండకుండా బయటికి గూడా వచ్చింది. అది విన్న తర్వాత తానెంతగా దుఃఖించాడో తెలుసా? తనను ఓదార్చడానికి, విషయాన్ని సమర్థించి చెప్పడానికి నాకు వీలే లేక పోయింది. అతను నీ కోసం ప్రాకులాడి,

నిన్ను మంచి దార్లో పెట్టడానికి ప్రయత్నం చేసినన్నాళ్ళూ అతన్నొక పురుగులాగా చూచావు అతనికి పూర్తిగా అసహ్యంపుట్టి విసర్జించుకున్నాక మళ్ళా గొంతు కోసుకుంటానంటూ ప్రాకులాడుతున్నావు. ప్రేమతత్వం ఇంతేనేమో! ప్రేమించి బ్రతిమాల్తూ వెంటదిరిగినన్నాళ్ళూ చులకనగా చూడటం! అదికాస్త తిరగబడితే, మళ్ళా వాళ్ళవెంటబడి అంతకంటే మిక్కుటంగా దుఃఖించటం! ఇంతకూ అతనుమాత్రం చాలా బెట్టుసరిగా వున్నాడు. ఒకసారి చీలిం తర్వాత అతకడం కష్టం అంటున్నాడు"

శ్రీలక్ష్మికి కన్నీళ్ళు ప్రవాహంగా పారుతున్నాయి. ఏదీదారి కనిపించ నట్లుగా మనసు తహతహ లాడుతూ వుంది. ప్రయత్నాలిక ఫలించ వేమో అనే నిస్పృహ కలిగింది. దానికి నిరాశ తోడైంది. కన్నీటిని తుడుచుకుంటూ,

"ఎంతకోతగాయమైనా, గాయపాకువేసి కట్టి నీళ్ళుపోస్తే అతుక్కుంటుంది. చీలిపోయిన చెక్క అయినా వజ్రం వేస్తే అతుక్కుంటుంది. అయితే అతికించే వైద్యుడుమాత్రం మంచి ఫలితాల్ని కాంక్షించి కృషి చేయాలి" అంది.

"నిజమేనమ్మా! నేను కృషిచేయకపోలేదు. అసలు నీవుపయోగించిన వుపమానమే వుపయోగించాను నిన్న. దానికేమన్నాడో తెలుసా? 'వజ్రంవేస్తే, చెక్కలు అతుక్కుంటాయన్నమాటనిజమే! అదిప్రాణంలేని యెండుకొయ్యలవిషయం. జీవించినవృక్షంలో ఒకవేళ చీలిక తటస్థిస్తే, ఎంతమంది వైద్యులూ నిపుణులూ వచ్చి ఎంతెంత వజ్రం వేసినా అతకదు' అని ఆ చీలికలు చీలికలుగనే ఎదిగిపోతాయి అని."

శ్రీలక్ష్మికి దుఃఖం పట్టకుండా వచ్చింది. శాస్త్రిప్రయత్నంలో లోపం కనిపించడంలేదు. అంతకంటే తానేమీ చేయలేదు. తానుమాత్రం అతన్ని నిర్బంధించగలదా? నిర్బంధించడంవల్ల ఒకచోట చేరినా మనసు కలవకపోగా-ఒప్పనిపిల్లకు తాళిగట్టి యింటో వేసుకున్నట్లు - చీలడం

మళ్ళా సంభవింపక తప్పదు. చీలిక చీలికగానే వుండిపోతుంది. శాస్త్రి మళ్ళా అన్నాడు:

''పాలు ఎంత యెక్కువగానైనా కాచవచ్చు, పర్వాలేదు. దాంతో జున్ను చేసుకోవచ్చు. మరికొన్ని అనుపానాలు కలిపి ఐస్‌క్రీమ్ చేసుకోవచ్చు. పాలకోవా చేసుకోవచ్చు. ఇంకా యెన్నెన్నో చేసుకోవచ్చు. అయితే మజ్జిగమాత్రం వేశావో విరిగిపోతాయి. ఇంకది నీవెంతహరించినా పెరుగు కావల్సిందే! దాన్ని మళ్ళా జున్ను చేసుకోడానికి ఉపయోగించుకోలేవు. ఒకవేళ ప్రయత్నించావా, అది జున్ను ఆకారంలో వుండదు. ఆ రుచీ వుండదు."

ఇంతవఱకూ బిగబట్టిన దుఃఖానికి, ఈ నిరాశా వాక్కులు తోడయ్యాయి, అంతవఱకూ లోపల తొక్కితొక్కిపట్టివుంచిన దుఃఖాగ్ని జ్వాలలు ఇక వుండలేకపోయాయి. పెల్లుబికిపైకొచ్చాయి ధ్వనిచేస్తూ. "ఏమిటే' అంటూ అమ్మపరుగెత్తుకుంటూవచ్చింది. అప్పటికేరూంలో పడిపోయింది శ్రీలక్ష్మి బోరగిల పరుపుపై. నాగలింగం గుమ్మం దాటాడు.

చాలాసేపుదుఃఖించాక-పైగా ఆలోచించినాక, జాబుచదువుదామనుకొంది. దాంట్లోమాత్రం యేముంటుంది? రెడ్డిహృదయంలో నాగలింగానికి లేనిస్థానం అనుకుందా? ఆ జాబుగూడా నిరాశనే తనపైకి తోలేదయితే? తన పరిస్థితుల నెవరూ చక్కబెట్టే స్థితిలో లేరు. ఆనాడయ్యవారు ఎన్నివిషయాలో మాట్లాడాడు! బాగా ఛీకొట్టాడంతే! తన అజ్ఞానాన్ని తనకు చూపి, తన కండ్లు తెరిపించేటట్లు చేశాడంతే. తర్వాత ఆ మాటే అనుకోలేదు. ఆయనకూ యెన్నో వ్యాసంగాలు! రెడ్డి పట్టుదల అయ్యవారికి తెలిసినట్లు లేదనుకొంది. అందుచేత ఏకోణాన్నో ఒక ప్రోత్సాహకిరణం కనిపించినట్లయింది. అప్పటికి కొద్దిగా తృప్తిజనించింది. లాంపు దగ్గిరగా జరిగి, జాబు తెరిచింది. తన అనుమానం నిర్ధారణ అయింది. అనసూయ రెడ్డితో మాట్లాడిందట. స్త్రీ హృదయం తెలుసుకో

లేకున్నావన్నయ్యా అని, అట్లాంటి నవలా సాహిత్యం కొంత వాడిందట! 'నేనందర్నీ స్టడీ చెయ్యకపోయినా, అయిదారుగుర్ని వేర్వేరుమార్గాలలో బాగా స్టడీ చేశానమ్మా' అన్నాడట. ఇంకా ఏదో అని కథకామె తన ప్రాణాలర్పించాల్సిందేనా నిష్ఫల ప్రేమకు అనికూడా అందట : "తన ప్రేమకు కృతజ్ఞత చూపలేని, ఒకానొక వ్యక్తికోసం ప్రాణ త్యాగం చెయ్యడమెందు కెవరైనా? కృతఘ్నతను తెలుసుకొని, ప్రేమను మార్చుకొని, మరెవర్నన్నా నవ్వుతూ చేసుకోవచ్చు,"అన్నాడట! తర్వాత కాసేపటికి నిరుత్తరను చేయడమే కాకుండా, ప్రశ్న గూడా వేయలేని స్థితికి తెచ్చాడట అనసును. అనను వ్రాసిందాట్లో కడపటి విషయం ఇది : "లక్ష్మీ! ఇంతవరకూ యే పొరపాటు వల్లనో వచ్చింది యీవిధంగా పరిణమిస్తుందని యింతవరకూ ఊహించను గూడా లేదు. అయినా దీనికి దారి లేకపోలేదు. ఇక పరీక్షలు మూణ్ణెల్లే వున్నాయి. వస్తూనే మిమ్మల్నిద్దర్నీ ఒకచోట కలిపే ప్రయత్నం చేస్తా. అస లప్పటికి కామాక్షి గూడా యింటరు పరీక్షలకు వ్రాసి వస్తుంది. ఆమె వుంటే, ఆమె యింట్లో మనం కలవడానికి మీ నాన్న గూడా అనుమానించడు. కామాక్షి మాటంటే మా అన్నకే గాక, అయ్యావార్లకు సహితం గౌరవం వుంది. ఆమెకు మన విషయం యావత్తూ దాచకుండా చెబితే సరిపోతుంది. అవీ గాక, మనయ్యావార్లకు, ఇన్ని విషయాలు తెలిసినట్లు కనిపించదు. అప్పుడయితే అన్నీ పరిష్కార మవుతాయి."

అనుకున్న ప్రకారం మార్చి నెలాఖరుకు సరిగ్గా అందరూ దిగారు. లెక్చెరర్ల వుద్యోగంలో వున్న అయ్యావా ర్లిద్దరూ కాలేజీలు మూసినంతవరకూ రావటానికి వీలులేదనీ - ఆపైనగూడా పనికాస్త వుండటం వల్ల మే నెలాఖరుకుగాని రామనీ-వ్రాసినప్పటికీ - శ్రీలక్ష్మి మొత్తుకుంటూ వేడుకోడంవల్ల ఏప్రిల్ మొదటివారాంతానికైనా రాక తప్పిందిగాదు. వచ్చిన మరునాడే శ్రీలక్ష్మి కేశవరావును కామాక్షింటికి రమ్మని బ్రతి-

మాలింది. వచ్చిం తర్వాత యెంతగా యేడ్చి చెప్పాలో అంతగా యేడ్చి చెప్పింది. అయ్యావారెంతగానో ఆశ్చర్యపడ్డాడు. ఏదో చిన్న అగ్గిలే, చల్లారిపోతుందీ అనుకున్నాడు. అంతగా రగుల్కొని యింతగా మండుతుందని తాను భావించలేదు. సానుభూతి హృదయం పట్టకుండా వచ్చింది. "ఫరవాలేదమ్మా! ఏడవకు, నేచెప్తాలే, ఏదోవిధంగా రేపు నెల జరకముందే నీవివాహమయ్యేటట్లు చూస్తాను. అయినా నావరకూరాకుండా నీవే యీపని చేసుకోవచ్చు. నీవు ఏకాంతంగా అతనితో మాట్లాడు. అన్నీ అక్కడ విరగడై పోతాయి. అప్పటికీ కాకపోతే, నేను చూస్తాను. చూడడ మేమిటి, పెండ్లే చేసేస్తాను" అన్నాడు. అప్పటికి కాస్త శాంతించింది.

మరునాడు అయ్యావార్ల ఆదేశంవల్లా - కామాక్షి, అనసూయల ప్రోద్బలంవల్లా - శాస్త్రి నిష్ఠూరంవల్లా - రామిరెడ్డి శ్రీలక్ష్మితో మాట్లాడ డానికి ఒప్పుకున్నాడు. అది మిట్టమధ్యాహ్నం. కామాక్షియింట్లో యెవరూ లేనట్లుగా వుంది వాతావరణం చూస్తే- అందరూ బళ్ళో వున్నారు. అక్క ణ్ణుంచి రెడ్డి బయలుదేరాడు. అక్కడున్న ఆడవాళ్ళు కొత్త యింటి కెళ్ళారు. రామిరెడ్డి ఏదో ఒకవిధమైన భావాలతో - తెగని ఆలోచనలతో వచ్చాడక్కడికి. శ్రీలక్ష్మి మాత్రం ఒంటరిగా అటువైపుతిరిగి కూర్చొని వుంది. అతనికాలిచప్పుడు వింటూనేవుంది. ఈ సమాగమం ఎట్లా పరిణ మిస్తుందో అనే దిగులు గుండెలను ఉద్వేగంతో నడిపిస్తూంది. రెడ్డి దగ్గర కొచ్చాడు. ప్రక్కనే కాస్తయెడంగా కూర్చొని 'లక్ష్మి' అన్నాడు ప్రశాంతంగానే. ప్రక్కకుతిరిగి మొగంలోకి చూచింది. అవి యెంత చల్లారినచూపులో చెప్పడం కష్టం! దుఃఖాగ్నివల్ల కండ్లలోకి వచ్చిన నీరంతా అవిరై పోగా, నీరసించిన చల్లని, పొడి చూపులతో దీనంగా చూచిందతనివైపు. ఆమెముఖం చాలా కళాహీనమైవుంది. ఏ ఉపమానం చేతా పోల్చలేని దీనత్వాన్ని ఆమెలో ఆ క్షణం చూశాడు రెడ్డి. అయితే తన మనోనేత్రాలముందు ఎన్నోసార్లు తనను నిరసించి, అవమానించిన

శ్రీలక్ష్మి నిలబడింది. పొర్లుకొచ్చిన సానుభూతి దారిలోనే అణిగి పోయింది. ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు. శ్రీలక్ష్మికిగూడా యేమి మాట్లాడాలో తోచలేదు. మాట్లాడితే మళ్ళా యెక్కడ తప్పుజేస్తానో అని భయపడుతూవుంది. మాట్లాడకపోతే లేచిపోతాడేమో! అతనికి అక్కర్లే నట్లుగా కనబడుతున్నాడు అక్కరవున్న తానన్నా యేదోచేయాలి! ఏం చేయాలి! మనసంతా ఒకసారి పరిభ్రమించింది. పాతవన్నీ ఒకసారి గిర్రున తిరిగాయి మనోనేత్రాలముందు. రామిరెడ్డి నిదాన, నిష్కపట, నిరాడంబర చేష్టలూ-అన్నీ ఒక్కసారి కనిపించాయి. తనతప్పు కర్కశత్వం, అవిధేయత, కృతఘ్నత, ఒక్కసారి కనిపించి వెక్కిరించాయి. తన అహంకారం అణగారిపోగా, రెడ్డివైపు పొంగి ప్రవహించింది నిర్మల ప్రేమ. ఇక వుండలేకపోయింది. వివశయై పోయింది. అమాంతంగా లేచింది. తటాలున కాళ్ళపైబడి రెండుకాళ్ళనూ తాను పెనవేసుకుంటూ "క్షమించవూ?" అంటూ స్వరహీనమైన దుఃఖంతో ఏడ్చింది. ఒక నిమిషంపాటు నిశ్శబ్దం. ఆ ఉయ్యాలమంచంపైనుంచి లేచాడు రెడ్డి. నిశ్చలంగా నిలబడ్డాడు. శూన్యదృష్టి గోడపై కేంద్రీకరింపబడివుంది. తల కాస్త యెత్తింది శ్రీలక్ష్మి. సజలనేత్రాలతో అతని మొగంలోకి చూచింది.

"నీవు చేసిన తప్పేముంది?" అన్నాడు నెమ్మదిగా గాంభీర్యంతో.

"తప్పులేకపోతే యింత శిక్షయెందుకు?"

"ఎవరు వేశారు?"

"నీవే. నీవే వేశావు. పరోక్షంగా నీవే వేశావు. రెండేండ్లకు మించి అనుభవించింది చాలు. ఇక నేను భరించలేను. క్షమించు నన్ను."

"వద్దు లక్ష్మి, నీవే నన్ను క్షమించు. ఇంతటితో మరచిపో మన సాంగత్యం. ఉభయులకూ తృప్తిగా వుంటుంది."

దుఃఖం ఆపుకుందామన్నా ఆగటం లేదు. ఆ ప్రయత్నంవల్ల యెక్కిళ్ళుగూడా కలుసుకున్నాయి యేడుపుకు. వెక్కి వెక్కి యేడుస్తూ "ఇంకా వేధించకు రెడ్డీ, గతాన్ని మర్చిపో" అంది.

"ఏదో జరిగినవాటిని మరచిపోవటం మంచిదే లక్ష్మీ! కొన్ని కొన్ని జీవన్మరణ సమస్యలు మరిచిపోవడానికి వీలుపడదు. అటువంటివి మరిచిపోవాలనేది కేవలం ఆదర్శం. దాన్ని ఆచరణలో పెట్టడం కష్టం. అసలది కానిపని. ఎందుకంటే అది మనసుకూ, దాన్ని ధరించివుండే యీ దేహానికీ చెందిందిగనుక. ఈ దేహం వున్నంతకాలం యీ మనసు వుంటుంది. మనసున్నంతకాలం మరవడం కష్టం."

"అంతేనా, మరవవా?" అంది ఎగతోసుకొస్తున్న దుఃఖంతో నిరాశగాచూస్తూ.

గాంభీర్యందాల్చాడు రెడ్డి. గోడపై దృష్టిని మరల్చనేలేదు. ఒక విధమైన నిర్ధారణ గొంతుకతో అన్నాడు.

"అంతేలక్ష్మీ! అది అంతే! ఒకవేళ బలవంతంగానైనా మన మిద్దరం కలుసుకున్నా, ఇక అతకదు. నీకు దృష్టి భేదం కలిగింది. ఆ దృష్టితో అందర్నీ చూడడం మొదలుపెట్టావు. నీ అజ్ఞానంతో అందర్నీ తూచడం మొదలుపెట్టావు. ఇతరెవరు ఏమిమాట్లాడినా, యేమి చేసినా, నీవాదృష్టితోనే చూడసాగావు. నీ మెదడులో ప్రత్యేకంగా కొన్ని అరలు నిర్మించుకున్నావు. నీవనుమానింప మొదలు పెట్టిన వ్యక్తుల చేష్టలకూ, మాటలకూ, ఒక రూపాన్నిచ్చి, ఒకే రంగు పూసి, ఆ అరల్లో వేస్తూ కూర్చున్నావు. నీవు చేస్తూన్న ఆపని, నీ ఆదర్శానికి విరుద్ధమైందని నీవ్వు భావించలేదు. ఒకప్పుడు నీవే యేమన్నావో అదే అన్నటువంటి వ్యక్తుల్ని తప్పుపట్టసాగావు. నీ అజ్ఞానం నీవు తెలుసుకోలేకపోయావు. కడపటికి

హెచ్చరిస్తే గూడా తెలుసుకోలేకపోయావు. అసలు హెచ్చరించిన వారిని అనుమానించి అవమానించావు. ఒకవేళ తల్లిదండ్రులవైపూ, నీ కులం వైపూ అభిమానం ప్రవహిస్తే మాత్రం ఇతర్లను అనుమానించి నీచంగా యెందుకు చూడాలి? నీవసలు విషయాల్ని ఆలోచించడమే వదిలేశావు. ప్రత్యక్షంగా నిలబడి తప్పనిచూపిస్తే గూడా లెక్కచేయకపోయావు. పైగా నిర్లక్షించావు. నిరసించావు. అపార్థం ఎక్కువై దుర్భాషలాడావు. అసలు నీకెందుకొచ్చిందా దృష్టి? గ్రుడ్డివారికి లోకమంతా గ్రుడ్డిగానే కనిపిస్తుందట. నీ కులాన్ని నీవు స్ఫురణకు తెచ్చుకున్నావన్నమాట! కులతత్వం నీలో చొరబడిందన్న మాట! ఆ మార్పు తెలుసుకోకుండా ఇతర్లలో ప్రవేశించినట్లు అనుమానించావన్నమాట! నిన్నుజూచి నేనెంతో సంతోషించేవాణ్ణి. గర్వించేవాణ్ణి. సంఘానికి మేలుచేసేవ్యక్తి ఎవరంటే, స్వకులంలో, స్వవంశంలో, స్వకుటుంబలోవున్న లోపాలు లోపాలుగా ఒప్పుకొని, నిరసించేవారన్నమాట. ఆ గుణం మొదట నీలో కాస్త కనిపించింది. అది నేర్చుకున్నదే కావచ్చు. అంచేత నాకు చాలా సన్నిహితులవయ్యావు. నీవే యెన్నెన్నో, యెవరెవర్నో దూషించే దానవు. తప్పు తప్పే. ఎవర్లోవున్నా, ఏ సంఘంలో వున్నా, అదితప్పే! దాన్ని బయట పెడితే అంత ఉలుకెందుకు?

ఈనాడు గూడా అతిథిగావచ్చిన బ్రాహ్మణేతరుణ్ణి బ్రాహ్మణుడు సమానమర్యాదతో చూడటంలేదూ అన్నది సత్యమైనపుడు, అది తప్పని దాన్ని నిరసించినపుడు, ఎవడికో బ్రాహ్మడికి కోపమెందుకు రావాలి? ఒక హరిజనుణ్ణి, సవర్ణుడొకడు యింట్లో అన్నపానాదుల విషయంలో. సమమర్యాదతో చూడక అవమానించినందులకు, హరిజను డా తప్పును నిరసిస్తే దానికొక సవర్ణుడెందుకు ఉలికిపడాలి? కోపపడి వాణ్ణి నానా మాటలంటే మాత్రం అది తప్పుకాక మరేమయినా అవుతుందా? వాడు బ్రాహ్మణేతరుడైనందువల్లనే అట్లా అన్నాడని యెందుకనుకోవాలి? వాడు

హరిజనుడైనందువల్లనే అట్లా అన్నాడని ఎందుకనుకోవాలి! అనుకొనే వాడిదోషమే అది. ఏడిలో అట్లాంటి మనస్తత్వమే లేకపోతే - అసమత్వ భావాలే లేకపోతే - వాడాదృష్టితో అన్నాడని ఏడి కనుమానం యెట్లా వస్తుంది? గుమ్మడికాయలదొంగా అంటే భుజాలుతవుళ్ళాడుకున్నట్లుందిది! దృష్టి యెవరికి లోపమో తెలుస్తూనే వుందిగా! ఎవడో పల్లెటూరి, అవిద్యాపరుడైన మూఢుడంటే పరవాలేదు గాని చదువుకున్నటువంటి- ఈనాడు నాగరికులమని గర్వించే టటువంటి- దేశ భవిష్యత్తంతా వీళ్ళ పైన్నే ఆధారపడి వున్నదని భ్రమిస్తూన్న టువంటి- ప్రస్తుతపు యువతీయువకులే యిట్లాంటి నీచమైన, నికృష్టమైన, నిరభ్యుదయమైన భావాలు గలిగి, యేం చేస్తున్నామో- యేమంటున్నామో- ఆశయమేమిటో- ఆదర్శమేమిటో గమ్యమేమిటో- పంథాయేమిటో తెలియక, అసమర్థులై, అజ్ఞానులై పోతున్నారంటే, దేశ దౌర్భాగ్యాన్ని తల్చుకొని యేడవాలో- సంఘ దుస్థితిని చూచి పరితపించాలో అర్థం కాకుండా వుంది. ఒకప్పుడు మనం, సందర్భానుసారంగా తమాషాగా అనుకున్నవే, నీవు నాకు వ్రాసిన జాబులో నేరారోపణ క్రింద రికార్డు చేయబడ్డాయి. అందులో సత్యమెంతో నీకు బాగా తెలుసు! నీవేదో నిరూపించాలని వ్రాశావు గాని, నీ ఆదర్శాని కెంత దూరమై, నీ నైతికాని కెంత పాతాన్ని ఆపాదించుకుంటున్నావో నీకు మాత్రం తెలిసినట్లు కనిపించదు. నీవే అట్లా వ్రాస్తే యిక నా గుణాల గురించి వేరే నిరూపణ కావాలా? ఇంత సన్నిహితంగా వుండిన నీవు ఎంత మాటంటే అంతే అని లోకం నమ్మదూ? ఇదేనా నీబోటి చదువుకున్న పిల్లలు చేయాల్సిన పని! విద్యాధిక యువతీలోకానికే తల వంపులిది! నీవంటివారే యిట్లాంటి అవివేక ప్రవర్తనలు గలిగి వుంటే కులాంతర వివాహాలు జరుగుతాయా? అవి జరగకపోతే మనలో సమైక్యత వస్తుందా? సమైక్యతా, సామరస్యం లేకపోతే, సంఘం ఔన్నత్యాన్ని పొందుతుందా? ఒక్కడన్నా, ఒక్కతెన్నా, పేరుకు పెద్ద చదువులేగాని,

జాతీయతను గురించి ఆలోచిస్తారా! దేశాన్ని గురించి చింతిస్తారా! యెందు కొచ్చామో, యేం చదువుతున్నామో, యెందుకు చదువుతున్నామో- యెవడికేం బట్టింది? దేశం దౌర్భాగ్యం వల్ల నాశనమైపోతేయేం? సంఘం స్వార్థలతో నశించిపోతేనేం? వీళ్ళ కులాలు పట్టుకొని యిగ్గులాడితే చాలు! వీళ్ళ జమీనును పట్టుకొని కూర్చుంటే చాలు! సంఘంలో తావులేని నిర్ధనుణ్ణి, అనుదినమూ, వేలుపెట్టి చూపిస్తూ, వాణ్ణి వేపుకు తింటూంటే చాలు! పైగా మన జాతికి మర్యాద గావాలట" అన్నాడు రెడ్డి. కొన్ని సెకండ్లు ఆలోచించాడు. మళ్ళా అన్నాడు:

"అవన్నీ యిపుడెందుకు లక్ష్మీ! నీ దగ్గిర యింతగా వాగి నా శక్తిని నాశనం చేసుకోపడమెందుకు? ఇవన్నీ అంటే మాత్రం ప్రయోజన యేమిటి? ఎక్కడన్నా ఉపన్యసిస్తేనో- లేకపోతే ఏ కథగానో వ్రాసి ప్రచురిస్తేనో- యెవరన్నా మేలు పడేవాళ్ళు మేలు పడతారు గాని, నీ కెందుకింత?"

శ్రీలక్ష్మి యింత సేపూ వింటూంది. అతని కాళ్ళనింకా బంధించే వుంది. కాళ్ళవైపు ముఖాన్ని అదిమి అంతా విన్నది. పశ్చాత్తాపం, నిరాశ, ఒకవైపు పౌరుషం లోలోపల ఒకదాని వెనుక ఒకటి పుట్టుకొచ్చాయి. ఏదో నిర్ధారణకు వచ్చిన దానిమాదిరిగా తటాల్న లేచింది. పెదవులు వెనక్కి బిగించి, సూటిగా చూపులు పఱచి, చటుక్కున లాగింది పిడిబాకు మొల్లోనుండి.

"హాఁ," అంటూ వెనక్కి తగ్గాడు రెడ్డి.

"ఆశ్చర్యపడవద్దు, భయపడవద్దు, ఇదో" అంది.

"ఎందుకు?" అన్నాడాత్రంతో.

"నన్ను చంపు. తర్వాత నీవు హాయిగా బ్రతుకు. నేనుంటే నీ కెపుడుగూడా మనసులో బాధగా వుంటుంది. నాకు మాత్రం జీవించాలని

లేదు. ఒక పురుషుడికి నా హృదయాన్నిచ్చాను. అతన్నే చేసుకొని జీవించాలనుకున్నాను. లేకపోతే అతనికోసమే ప్రాణాన్నర్పిస్తానని ప్రతిజ్ఞ తీసుకున్నాను. ఆ ప్రతిజ్ఞ ఇవుడావ్యక్తి యెదుటే నెరవేర్చుకుంటాను" అన్నది. కన్నీరు పటపట కార్తున్నది. గంభీరవదనంపై నిరాశా పిశాచం తాండవిస్తూ వుంది.

సానుభూతి ప్రవహించిం దశ్రురూపంగా, రెడ్డికి. 'లక్ష్మీ' అంటూ కౌగలించుకున్నాడు. ఇరువురి కండ్లూ ఎంత నీరు కార్చాయో! ఇరువురి వీపులపైనా అశ్రుజల ప్రవాహం సాగింది. అయితే అవి ఆనందాశ్రువులు! వా రానందోదధిలో ఓలలాడుతున్నారు.

వారు కౌగిలి వదలటమే ముందో - లేక కరణం రావటమే ముందో - చెప్పటం కష్టం, కాని యిటు చూచేసరికల్లా ఉగ్రనరసింహావతారంలాగా తండ్రి కనిపించాడు.

కెవ్వున కేకపెట్టి, అక్కడే పడిందాపాళంగా.

"ఏమిటిది?" అన్నాడు కరణం రొప్పుతూ. చూపులు అగ్నిజ్వాలల కక్కుతున్నాయి. ఉద్రేకంతో వదురుతున్నాడు కరణం.

పలకలేదు రెడ్డి.

"చేసినవి చాలక నా కొంపకే యెసరుపెట్టావా?"

"నీకేమీ ద్రోహం చెయ్యలేదు."

"ఇంతకంటే ద్రోహమంట్రా గాడ్దికొడకా?" అన్నాడు కరణం పండ్లు కొరికి.

"మాటలు జారవద్దు."

"జారితే యేంజేస్తావురాలమ్డీకొడకా!" అంటూ చెంపన ఫెళమని వేశాడు కరణం.

"జాగ్రత్త!" అన్నాడు రెడ్డి అప్పటికీ తొందరపడకుండా.

"నా వంశాన్ని నాశనం చెయ్యడానికొచ్చి పైగా మాట్లాడ్తా వంట్రా! జాగ్రత్త అని బెదిరిస్తావా?" అంటూ కిందవున్న పిడిబాకు తీసి యెత్తాడు చెయ్యి. అసలు దెబ్బపడినప్పుడే లేచి అడ్డుపడాలనుకొన్న శ్రీలక్ష్మి యిప్పటికి పూర్తిగా రెడ్డి కడ్డంవచ్చింది. భయంగా కత్తివైపు చూస్తూ 'నాన్నా' అంది. కరణం చెయ్యి వేగంగా ముందుకు వాలటం, శ్రీలక్ష్మి అడ్డుపడటం ఒకేసారే జరిగాయి. కూతురిని చూచింది నేత్రాలే అయినా, చెయ్యికాస్త జంకింది. "చచ్చేగదరా శ్రీలక్ష్మి" అనే భయంతో బలంగా చేతిపైన కొట్టాడు రెడ్డి. అయినా బాకు తనపని నెరవేర్చింది. 'అమ్మా' అంటూ నేలవాలింది శ్రీలక్ష్మి. 'తల్లీ' అంటూ కరణం ఆ పిల్లపై పడ్డాడు. రక్తంచిమ్మి కొడుతూవుంది. రెడ్డి తటాలున తాను కట్టుకున్న పంచె చించి, తడిపి గాయంపై కట్టి నీళ్ళు చల్లాడామె మొగాన. అపాయకరమైన ప్రదేశాన్ని తప్పింది గాయం. నొసట లోతుగా చీల్చుక పోయింది. రక్తమాగేటప్పటికి శ్రీలక్ష్మి కండ్లు తెరిచింది. రెడ్డి అత్యానందం పొందాడు. చిఱునవ్వు చిలకరించింది శ్రీలక్ష్మి.

## ౧౯

మరునాడు రాత్రి యెనిమిది గంటలై యుంటుంది. ముందే భోంచేసి వాళ్ళ నాన్నకోసం కూర్చున్నాడు రామిరెడ్డి. కాసేపటికి త్రేపుకుంటూ వక్కాకు చేత పట్టుకొచ్చి కూర్చున్నాడు సుబ్బారెడ్డి.

"అయితే ఆ విషయాన్ని గురించి ఆలోచించావా?" అన్నాడు రామిరెడ్డి.

"మీకు తిని యేదిక్కూ తెలీలేదురా" అన్నాడు తలవూపి.

"తెలిసే మాట్లాడుతున్నా."

"ఇదేనంట్రా తెలసిందానికి గుర్తు? చూచిచూచీ వాడికిమ్మంటావా?"

"ఇంకా ఆలోచించు.కోరినవాళ్ళను పెండ్లాడటమే సంసారం సుఖంగా నడవటానికి మార్గం. కోరినవారికిచ్చి చెయ్యకపోబట్టే యెక్కడ బట్టినా ఆత్మహత్యలూ, భ్రూణహత్యలూ, వ్యభిచారమూ విస్తారం కావటం. చదువూ సంస్కారమూ లేని తలిదండ్రులు, విషయాల్ని తెలుసుకోకుండా యీ విధంగా కులాల పేరుతో నియంతృత్వాన్ని చలాయించి ఆడవాళ్ళ గొంతులు కోస్తూవుండడం వల్లనే అట్లాంటివి ప్రబలమై పోతున్నాయి."

"సరేరా. చూచిచూచీ మాలవాడికెట్లా యిచ్చేది?"

"మాలవాడేమిటి నాన్నా? ఏదో ఒక పదాన్ని పట్టుకొని పీకులాడ్తావెందుకు? నీ కులంవాడి కివ్వడానికి యేవిధంగా అయితే భావిస్తావో, ఆ భావనే యితనియెడ వుంచు అపుడు వ్యత్యాసం కనబడదు. అతడే యేదో దూరప్రదేశాన్నుంచి వచ్చి, తాను రెడ్డినని చెప్పి నలుగురిచేతా నిరూపిస్తే నీవు యిస్తానంటావా లేదా? అపుడిదేవ్యక్తి అవుతాడా కాడా? మారడుగదా - అవన్నీ భావంపై నాధారపడి వున్నాయ్ నాన్నా! అసల్లో యేమీలేదు. భావాన్ని మార్చుకోవాలి అంతే. అయినా కులాలలో అంత పట్టుదల లేదన్నావుగా!"

"అవున్నా! చూచిచూచీ మన సేద్యగాడి కొడుక్కెట్లా యిచ్చేది? రేపు మిగిలిన సేద్యగాళ్ళంతా మనమాట వింటారా? వాళ్ళూ మంచమెక్కి కూర్చోరూ వాడితోపాటు? నలుగురూ సరికులస్థులు యెవరికిచ్చావు పిల్లనంటే యేం చెప్పేది? వంశానికి చెడ్డ పేరుగదంట్రా!"

"ఇవన్నీ అనుకోబట్టే యిట్లా అయినాం."

"ఏమయ్యాం?"

"నిజమే, నీకెట్లా అర్థమవుతుందీ దేశవిషయం మాట్లాడితే"

"మాకు కానక్కర్లేదు. మేం ఎట్లాగో గడుపుకొని పోతాం. మమ్మల్ని రెచ్చగొట్టకుండా కాస్తగుట్టుగా వుండండి."

"అట్లాంటి అధికారపు మాటలే అన్ని విషయాలలో వద్దంట."

"ఛా! నోరుమూయ్! నీవు చెప్పినట్లు చెయ్యమంటావంట్రా? ఒక వేళ దాని కిష్టమయితే మాత్రం నేనెట్లా యిచ్చేది? నలుగురు కాపోళ్ళల్లో తలెత్తుకోనెట్లా తిరిగేది? ఏమన్నా బుద్ధివుండే మాటలేనా అవి? ఒకవేళ వాడు కలెక్టరయితే మాత్రం మాలవాడౌతాడా మరేమన్నా నా?

"కులమేమిటి నాన్నా మధ్య? స్త్రీ పురుషుణ్ణి చేసుకుంటుందిగాని, కులాన్ని చేసుకుంటుందా? అయినా అట్టి వివాహాలు ఎన్నో జరుగుతున్నాయి! మనమే మొదటివాళ్ళం గాదు."

"అవును. శాస్త్రిలకొడుకు యల్లప్పకూతుర్ని చేసుకుంటాడంటావు గదూ?"

"అదిగూడా మనకాదర్శమే! బ్రాహ్మణుడుగా వుండి మాలపిల్లను చేసుకోడం యెంతయిదో చూడూ!"

"అవున్రా, మీరు చేసుకోండి. నా ఆక్షేపణే లేదు. ఆ శాస్త్రిల మాదిరి నేనూ చచ్చింతర్వాత, అట్లాంటివి వెయ్యి చేసుకోండి. నా కేమీ చింతలేదు. నా ప్రాణముండగా మాత్రం జరగనివ్వను."

కరణం గోడప్రక్కన నిలబడి కడపటిసంభాషణ విని, లోపలి కొచ్చాడు. రామిరెడ్డి, కరణం ఒకరిమొగాలొకరు చూచుకున్నారు. లేచి బయటికి వెళ్ళాడు రామిరెడ్డి. కరణం కూర్చున్నాడు. కరణం ద్వైదీభావంలో వున్నాడు. చావు తప్పింది గదా కూతురికి అనే ఒక తృప్తి, తన కాఠిన్యాన్ని కదలించి వేసింది. కులాన్ని విస్మరించలేని భయం ఒకవైపు పీడిస్తూనే వుంది. అయినా అనిష్టతే ప్రబలం కాగా రెడ్డితో చెప్పడాని కొచ్చాడు. ఇదే మంచి సమయం అనుకొని అంతా

చెప్పాడు. ఇంత సేపూ, కొడుకుతో ఒద్దుకొని, మెత్తగా మాట్లాడుతూ వుండిన సుబ్బారెడ్డి ఉగ్రుడై "ఇంత అసహ్యంగా ప్రవర్తిస్తున్నారా?" అన్నాడు.

"అవున్రెడ్డీ! మా బ్రతుకే చాలా నీచపు బ్రతుకైంది. నేను ఒంటి గాణ్ణయ్యాను. నన్నయ్యో అనేవాడులేడు. బ్రాహ్మడనే మర్యాద గూడా లేకుండా పోతూ వుంది. మీ బోటివారన్నా కాస్త ఆధారంగా వుంటారను కుంటే, మీనుండే యిట్లా జరుగుతూ వుంది. కంచే చేన్ను మేస్తే రక్ష ఔవరు? మమ్ముల్ని ఇంతగా హింసించి, ఇంత అమర్యాదగా ప్రవర్తిస్తా రనుకోలేదు." అని యింకా యేమేమో చెప్పి గోల పెట్టాడు. మండి పడుతూ సేద్యగాణ్ణి ఒకణ్ణిపిలిచి "వాణ్ణి పిలుచుకు రారా!" అన్నాడు.

అంతవరకూ రామిరెడ్డి గోడప్రక్కనే వుండి, పరుగెత్తి ఇళ్ళోకి వెళ్ళాడు. "నిద్రపోతున్నాడ"ని అందరూ చెప్పగా వెళ్లాడు సేద్యగాడు.

మరునాడిది వూరంతా పొక్కింది. అంతకంతకూ పొరుగూళ్ళకు గూడా తెలిసింది. పెదవిదాటాల్నేగాని, పెన్నదాటకుండా వుంటుందా? అందరూ ఆ విషయమే అనుకోసాగారు. అందరూ రెడ్డినీ, కరణాన్నీ అడిగేవారే. కుల వ్యత్యాసాలపైనా, అస్పృశ్యత పైనా అంత పట్టింపు లేకున్నా, యిట్లాంటి వివాహా లనేటప్పటికి, అదేదో ఒకవిధంగా అయిం దందరకూ. ఏదో వాఖ్యానించలేని అపచారం చేస్తున్నట్లుగా భావించారు.

"ఇంకొక కులంలో పెండ్లి చేసుకొని, వాళ్ళు మన బంధువులే అనుకుంటే సరిపోతూ వుండ్లేదా?" అనే వీళ్ళ పలుకులకు-

"అదెట్లా అనుకుంటాం, వాళ్ళ కులం బాగా తెలుస్తూ వుంటే" అనే అనుమాన విమర్శనలు బయలుదేరాయి.

బళ్లో వీటిని గురించి బాగా చర్చించుకున్నారందరూ. ఊళ్ళో ఏదో అలజడి తప్పితే ఆందోళనగానీ, అసహ్యభావంగానీ లేదని తెలుసు

కున్నారు. ఆ దినం హరిజనులకూ, ఊరివారికీ రాజీ కుదిర్చినప్పటినుండీ, రామయ్య తన రౌడీలతో గూడా అయ్యవార్లపై బలే గౌరవం చూపు తున్నాడు. "మీరు కానీండి, ఎవడన్నా అడ్డమొస్తే మేమున్నాం" అంటున్నాడు. హరిజనులు రక్షకభటులమాదిరి వుండనే వున్నారు. వీరికీ శిష్యగణం గూడా యెక్కువయిందిపుడు. యువక వర్గమంతా వీరి పక్షమే. ఇక మిగిలింది ముసలివాళ్ళూ, ఆడవాళ్ళూ. వారి అలజడి మామూలే.

మరునాడుదయం సుబ్బారెడ్డికీ, కొడుక్కూ పెద్ద వాగ్యుద్ధం జరిగింది. సుబ్బారెడ్డి ఉగ్రుడై మాట్లాడుతున్నాడీనాడు. కోపం వార్ధక్యంలో దుఃఖంగా పరిణమించింది.

"ఇదేందిరా, మన పిల్లలను మాలవాడి కిమ్మంటావు; నీవు బాపన పిల్లను చేసుకుంటా నంటావు?"

"బాపన పిల్ల వద్దురా. నా మాట విను?"

"అయితే యేం నాన్నా?"

"వంశం నాశనమౌతుందిరా నాయినా, వద్దూ."

"ఏం, రాక్షసులా? మిమ్మల్నందర్నీ తినేస్తారా? మీ ఆడవాళ్ళ మాదిరి వాళ్ళు గూడా ఆడవాళ్ళేలే."

"అదిగాదురా!"

"ఇంకేమిటి?"

"పెద్దోళ్ళు తెలీక పెట్టలేదురా నాయినా! నా మాట వినూ."

"అవునవున్లే. మీ నోటితో ఆ విధంగా అనిపించిందీ వాళ్ళేలే."

"ముసలితనంలో యెందుకురా యేడిపించేది? ఇంకెవర్నన్నా చేసుకో, బాపన పిల్ల తప్ప యింకెవర్నన్నా చేసుకో."

"ఇంకెవర్నన్నా నేనెట్లా చేసుకొనేది?"

"యేం. యెందుకు చేసుకోగూడదు?"

"అది నీ కర్థం కాదు. నేను ప్రేమించినదాన్ని చేసుకుంటాగాని, ఇంకెవర్నో ఎట్టా చేసుకుంటాను?"

"యేం ప్రేమరా ప్రేమ?"

ఇంకా యెన్నెన్నో వాదాలొచ్చాయి. కడపటికి బిర్రుగా వెళ్ళాడు రామిరెడ్డి. బళ్ళో యెన్నెన్నో మాట్లాడుకున్నా రందరూ. అయ్యవార్లు పూర్ణంగా యీనాడు కలుగజేసుకున్నారు. ఒక ఉపాయం చెప్పారు. అందరూ తల వూచారు.

శ్రీలక్ష్మి గాయం వల్ల కాస్త ఆగాల్సొచ్చింది. ఒక వారం రోజులు ఆగారు. ఆనాడు శుక్ల యేకాదశి. కరణం యింట్లో ఆ రాత్రి ఫలహారం తిని అందరూ బాగా నిద్రపోయారు. తెల్లవారే టప్పటికి ఆదుర్దాగా పరుగెత్తుతున్న కరణాన్ని వాళ్ళూ వీళ్ళూ చూశారే గా ఎవరూ ప్రశ్నించలేదు. నేరుగా శాస్త్రి లింటికి పరుగెత్తాడు. ఇంటి తాళంవేసి వుంది. అక్కణ్ణుంచి సుబ్బారె డ్డింటికి దౌడు తీశాడు "మా శ్రీలక్ష్మి వచ్చిందా?" అన్నా డాతృతగా. "మా అనసూయ ! యింటి కొచ్చిందేమో అడుగుదా మనుకుంటున్నా" అంది పార్వతమ్మ యేడుపు మొగం పెట్టి.

ఊరంతా అలజడి యెక్కువయింది. గుంపులు గుంపులుగా చేరి చర్చించుకుంటున్నారు. ముసలివాళ్ళు విసుక్కుంటున్నారు. ఆడవాళ్ళు శపిస్తూ మెటికలు విరిచారు. అందరూ ఒక్కసారిగా మాయమై యెక్కడకు వెళ్ళారా అని అందరూ ఆలోచింపసాగారు. యువక బృందం నిరుత్సాహపడి వుంది. కరణం కొడుకు గూడా వెతుకుతున్నట్లు నటిస్తున్నాడు. అసలు విషయం చెప్పకుండా, యువక బృందానికి మాత్రం

ధైర్యం చెబుతున్నాడు. కరణమూ, రెడ్డి అంతా వెతికించ సాగారు. ఒకరోజు గడిచింది. రెండు రోజులు గడిచాయి. మూడునాళ్ళు కూడా గడిచాయి. వెళ్ళినవాళ్ళ గురించిన కోపం కంటే దుఃఖం యెక్కువయింది తలిదండ్రులకు.

"లక్షణంగా యిచ్చిచేసినా కండ్లెదురుగా బాగుండేది గదా!" అని యేడ్చాడు కరణం. "నా కతా అంతే అయిందయ్యా! అంటూ బావురు మన్నాడు సుబ్బారెడ్డి.

నాలుగోనాటి కంతా శ్రీలక్ష్మి తమ్ముడు, చాలా మంది యువకులూ, నారాయణ యింటి దగ్గర సైన్యంలాగా నిలబడి వున్నారు. శ్రీలక్ష్మి తమ్ముడికి తప్ప యెవరికీ యే రహస్యమూ తెలియదు. అందరికీ అపుడు చెప్పాడు రహస్యాన్ని. అందరూ ఆనందంతో ఎదురుచూస్తూ కూర్చున్నారు. సరిగా మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఒక పెద్ద కారు వచ్చి ఆగింది. కేశవరావు తప్ప అందరూ జంటలు.

మద్రాసునుండి సంస్కరణ వివాహాలు చేసుకొని అందరూ దిగినారంట అని ఊరంతా క్షణంలో తెలిసింది. పారిపచ్చినవారి తలిదండ్రులంతా బావురుమంటూవచ్చి వాళ్ళపైబడి యేడ్చి, "మేంచేస్తాం తల్లీ పెండ్లి-దాండి?" అన్నారు.

వాతావరణం క్షణంలో మారింది. సుబ్బారెడ్డి, కరణం, కేశవరావు ఒకచోట కూర్చొని సంతోషంగా మాట్లాడి, ఆహ్వానపత్రికలు తక్షణం కొట్టించేటట్లు తీర్మానం చేశారు. దాంట్లో దేశానికి సుభిక్షాన్ని-మానవులకు మంచి హృదయాన్ని-వధూవరులకు మంగళాన్ని కోరుతూ శ్లోకం వ్రాసిన తర్వాత వధూవరుల పేర్లు వరుసగా వ్రాశారు.

నాగవరం నారాయణ. యం. ఏ. లెక్చరర్ — కామాక్షి
శ్రీనివాసులు, బి. ఏ. డిప్యూటీ కలెక్టర్ — అనసూయ, బి. ఏ.
నాగలింగశాస్త్రి, బి. ఏ. — సుజాత, బి. ఏ.
రామిరెడ్డి, బి. ఏ. — శ్రీలక్ష్మి.

కార్యనిర్వాహకులు : 1. కేశవరావు, యం. ఏ. లెక్చరర్
2. సుబ్బారెడ్డి గ్రామ మునసబు
3. మల్లంభొట్లు, గ్రామకరణం.

వివాహప్రయత్నాలు విరివిగా సాగుతున్నాయి. అందరూ అత్యుత్సాహంతో పనులు సాగిస్తున్నారు. చాలా వైభవంగా జరపాలని పెండ్లి పెద్దల పట్టుదల. ఆ కొత్తయింటిముందుగా పెద్దయెత్తైన పందిరివేశారు. పందిరిగుంజలకంతా ఆకులతో, గెలలతోవున్న పెద్ద పొడుగాటి అరటి చెట్లుకట్టారు. పైనంతా టెంకాయమట్టలతో కప్పి, అరటిమండలుచీల్చి, తోరణాలు తోరణాలుగా వ్రేలాడగట్టారు. పందిరిచుట్టూ ఎత్తైన తడికలు కట్టారు. గ్రామఫోనులూ రేడియో హరికథలూ ఫోటో కేమరా యేర్పాటు చేశారు.

ఆ సాయంకాలానికంతా రావలసిన వారంతా దిగారు. రెండు బస్సులను బాడుగ తీసుకున్నారు. స్టేషన్నుంచి ప్రతి బండికి వచ్చే మనుషుల్ని వేసుకొనిరావటమే. ఈ కొత్తరకం పెండ్లిచూడ్డానికి జనం లెక్కలేకుండా వస్తున్నారు. బంధువులుమాత్రం వచ్చినవారు వచ్చారు, లేని వారులేదు. ఎంతోమంది ఆఫీసర్లూ-డాక్టర్లూ-చిన్నచిన్న వుద్యోగులు-లెక్చరర్లు-ఆడవిద్యార్థులు-మగవిద్యార్థులు-రైతులు, నానారకాల వారూ వచ్చారు. ఆ గృహప్రాంగణమంతా జనంతో క్రిక్కిరిసి, ఆనంద కోలాహలంతో మారుమ్రోగిపోతూవుంది.

మరునాడు ఉదయం పదిగంటలకు ముహూర్తం. పందికిందంతా చక్కగా అలికి ముగ్గువేశారు. ఒకచోట మాంచి వెలగల జమఖానాలు వేశారు. చుట్టూరా చాపలువేశారు. జమఖానాల వెనక భాగాన, కొన్ని కుర్చీలూ, బెంచీలూవేశారు. జమఖానాలపై ఒక చిన్న ప్లాట్‌ఫారం మాదిరి కట్టారు ఒకడుగు యెత్తుండేటట్లు. అక్కడ ఒకే కుర్చీవేశారు. సరిగ్గా సమయం అయ్యేటప్పటికి, మంగళ తూర్యనాదం మ్రోగింది. వధూవరులంతా సిద్ధంగావచ్చి కూర్చున్నారు. కేశవరావు ఆకుర్చీలో కూర్చున్నాడు. కలకలలాడే వదనాలతో కొంతమంది కూర్చున్నారు. వెనకాల చాలామంది నిలబడ్డారు. ఇంతలో అందరు జనంలోనుండీ, నడుస్తూ ఒకవ్యక్తి గబగబా కేశవరావు దగ్గరికొచ్చి ఒక పత్రాన్ని ఆయన చేతికందిచ్చాడు. చూచాడు. నవ్వుకున్నాడు. అందరూ కొశ్చెన్ మార్కుల్లాగా కూర్చున్నారు. కేశవరావు తర్వాత చెప్తానన్నాడు. సాంగాలన్నీ ఒకదానివెనుక ఒకటి అయినాయ్. తర్వాత కేశవరావు లేచాడు. అందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. జగద్గురు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యులు గారినుండి, నాగలింగాన్నీ, కరణాన్నీ వెలివేస్తూ వచ్చిన పత్రాన్ని గురించీ-ఆదర్శవివాహాల అవసరాన్ని గురించీ-ఇంకా మరి కొన్ని విషయాలగురించీ అతిక్లుప్తంగా మాట్లాడి కూర్చున్నాడు. ఇంతలో ఇంకొక పత్రమొచ్చింది. దాన్నిట్లాచదివాడు-

"భార్యపేరిట ఆస్తివున్నప్పటికీ, అట్టిగట్టి ఆస్తిగలభార్యను వెతికి వెతికీ చేసుకున్నట్లే అని అవుతుందిగనుక, అదిడౌరీకి మారుపేరే గనుక, కామాక్షి పేరిటవుండే యావదాస్తినీ యిపుడు రామిరెడ్డి. నాగలింగం స్థాపించిన ముద్రాక్షరశాలలో ప్రకటింపబడు "ఆదర్శం" అనే వార పత్రికా నిర్వహార్థమై యేర్పడిన ట్రస్టీకి దత్తముచేయబడినది. ఇది మా హృదయపూర్వకంగా యిస్తున్న ధనము.

ఇట్లు,

**నారాయణ-కామాక్షి."**

వివాహాల రిజిష్ట్రారు వచ్చాడు. రిజిష్టరు జరిగింది.

ఆ మధ్యాహ్నం విందు చాలా చక్కగా జరిగింది. కేశవరావెంతో తెలివిగా కొన్ని శాఖలను విభజించి, ఒక్కొక్క శాఖకు అధికారిగా తన విద్యార్థులలో ఒక్కొక్కణ్ణి నియమిస్తూ మిగిలిన యువకుల్ని వారివారి బాధ్యతలు తెలిపి, వాళ్ళకుసాయంచేసేటట్లు ఏర్పాటుచేశాడు. చాలా మంచి క్రమశిక్షణలో జరిగాయన్నీ. విందు చక్కగా జరిగింది. అందులో యే వివక్షతలూ లేవు. ఆఫీసరు, కూలి- బ్రాహ్మణ, మాలమాదిగ అనే వివక్షతలు లేకుండా ఒకేచోట కూర్చొని, ఏకంగా, తృప్తిగా భోంచేశారు. ఎంతో ఆదర్శమైన వివాహాలని అందరూ పొగుడుకుంటూ వెళ్ళిపోయారు. ఇక యిట్లాంటివి లెక్కకుమిక్కిలిగా జరుగుతాయనుకుంటూ వెళ్ళారు విద్యార్థినీ విద్యార్థులు.... అందరి ఫోటోలు లఘువ్యాఖ్యానంతో పేపర్లకు పంపించారు.

## ౧౭

చుట్టాలూ, స్నేహితులూ అంతా వెళ్ళారు. కేశవరావు బ్రతిమాల దంవల్లనే గాదు, కావాలనే కాంతం, శాంతం అక్కడే వున్నారు.

హడావుడంతా తగ్గింది. మరునాటి రాత్రి పెందలకడే భోంచేశారు. అలిసివుండిన కేశవరావు ప్రక్కరూంలో పడుకున్నాడు విశ్రాంతి కని. తక్కినవారంతా హాల్లో కూర్చున్నారు మాట్లాడుతూ.

"అబ్బా! ఆదర్శాల్ని ఆచరణలో పెట్టడం యెంతకష్టం!" అంది శ్రీలక్ష్మి.

"అవును. దానికెంతో త్యాగశక్తి వుండాలి. దానికి సత్యం, రుజువర్తన, నిదానము, దీక్ష- ఇవన్నీ తోడిసఖులుగా వుండాలి" అన్నది కాంతం.

"అన్నిటికీ మించింది త్యాగమంటుల్లో" అన్నాడు నాగలింగం.

"త్యాగానికి ఫలితంగూడా వెంటనే వుంటుందిగా!" అన్నాడు రామిరెడ్డి, భార్యనొనటివైపు చూస్తూ. అందరు భార్యాభర్తలూ ఒక్క మాటు ఒకరిమొగా లొకరుచూచుకొని తృప్తిపడ్డారు. ఒకరి త్యాగఫలితం మరొకరైనట్టు.

"త్యాగమే శీలంగా - సత్యమే వ్రతంగా-విదానమే స్వభావంగా వుండిగూడా యింతమాత్రం ఫలంగూడాపొందని వ్యక్తులున్నారు" అంది కాంతం.

"ఎక్కడో వుంటారట్టి మహాత్ములు గూడా."

"ఎక్కడో యెందుకు? అన్నయ్యే అందుకు తార్కాణం."

నారాయణ, ఆనాటి అమ్మాయి కత మరిచాడిటీవల గొడవలలో. అదేదో తెలుసుకోవాలనుకున్నాడు.

"ఎట్లా తార్కాణం? అన్నాడు.

"మీ ఆదర్శాలను మీరు చాలావరకూ నెగ్గించుకున్నారు. కులాంతర వివాహమన్నారు. హరిజనోద్ధరణ అన్నారు. సర్వమానవ సమత్వం అన్నారు. దాన్ని వ్యాప్తిచెయ్యాలన్నారు. అన్నీ గూడా - ఆయన సాయంతో చెయ్యగలిగారు, అయితే ఆవ్యక్తి మాత్రం అన్నీ చేసిగూడా తన ఆదర్శవివాహంలో నెగ్గలేకపోయాడు. అదే మమ్ములను ఎన్నిసార్లో బాధపెడుతూ వుంటుంది. నేను వైవాహిక జీవితాన్ని గడుపుతున్నాను గనుక నాకర్థమయింది. మీరుగూడా దంపతులు గాబట్టి, ఆదర్శప్రేమ, ఆదర్శవివాహం, ఆదర్శదాంపత్యం అంటే - యెట్లావుంటుందో అర్థమయిందనుకుంటాను. ఇప్పుడాయనను గురించి ఆలోచించినట్లయితే మనకు అర్థమవుతుంది. ఎన్నిసారులో నేనర్థించేదాన్ని ఆ అమ్మాయినే చేసుకొమ్మని. దాన్ని చూస్తూ మనసులో యెందుకు బాధపడతావు అని

ఎన్నిసారులో అడిగాను. దానికంతా - "నాకేమీ బాధ లేదు. మనసులో ఏలాటిబాధ పడటమూ చాలించుకున్నా, అవివాహితుడుగా వుండటమే నాకు చాలా మేలు. "ఏ వ్యాసంగమూలేకుండా, స్వేచ్ఛగా, ఇంకా దేశం కోసం కృషిచేయగలడట! సంసారం వుంటే అది బంధంగా వుంటుందట! మేమూ ఆయనతో వాదించి ఒప్పించే సాహసంలేక వూరుకుండేవారం"- నారాయణ అడ్డుపడ్డాడింతలో:

"నాకు చాలా ఆనందంగా వుంది మీరీవిషయం యెత్తడం. నేనే అడగాలనుకుంటున్నా. ఇతని హైస్కూలు జీవితమంతా నాకు తెలుసు. కాలేజీ విషయాలన్నీ గూడా చాలా వరకూ తెలుసు. ఎన్నిసారులో అడిగాను ఆ విషయాన్ని గురించి. గమ్మగా తప్పించుకొనేవాడు. తరువా తెప్పుడో చెప్పుతానని తాత్కాలికంగా అనేవాడు. మాకుగూడా పిర్రమీద తంతే పండ్లూడేటట్లు పనులు! అటువంటి చర్చలకే పిలులేకపోయేది. మొదట్నుంచీ చెప్పాలిమీరు" అన్నాడు. అందరూ చెవులు నిక్కబొడుచు కొని, కిక్కురుమనకుండా కూర్చున్నారు. ఉచ్ఛ్వాస నిశ్వాసాల శబ్దం గూడా వినిపించడంలేదు. ఆశ్చర్యంతో, నోరుతెరుచుకొని, ఉత్సుకతతో గ్రహణేంద్రియాలను కేంద్రీకరించారు. కాంతం అంది :

"అది 1946 ఆ రోజులు తలుచుకుంటే మాకిపుడు ఒక విధమైన ఉద్రేకం- ఒకవిధమైన ఆనందం - మితిలేనితృప్తి - కలుగుతాయి. అదే రకమైన జీవితం, జీవితాంతం వరకూవుంటే యెంతో బాగుండునని పిస్తుంది. ఆ రోజులువేరు! ఆనాటి జీవితపంథావేరు! ఆనాటి అభిరుచులు వేరు! అసలు మాకాలేజీ తొలిదినాలగురించి తల్చుకుంటే ఒళ్ళుగగుర్పొడు స్తుంది! మా ప్రథమ పరిచయదినాలనూహిస్తే ఆనందంతో హృదయం ఉప్పొంగిపోతుంది. ఆనాటి మా ఉద్యమాలను గురించీ ఊహించినట్లయితే ఉద్వేగంతో ఉక్కిరి బిక్కిరయిపోతుంది హృదయం!

A 14

మేము కాలేజీలో చేరి అప్పటికి మూడుదినాలు మాత్రమే అయింది. అంతా కొత్తగా వుంది. తూర్పుపడమరలే సరిగ్గా తెలేవా మద్రాసులో ఎక్స్ప్రెషించొచ్చామో గాని, ఆ మూన్నాళ్ళకే మేమ్ముగ్గురం యెంతో మిత్రులమయిపోయాం ఒకరి కొకరం. నేనూ, శాంతం, కమలం, మౌంట్ రోడ్డులో సినిమా కెళ్ళాలని బయలుదేరాం. బస్సు స్టాపింగు దగ్గర నిలబడ్డాం. ఇంతలో యిద్దరు అపరిచిత వ్యక్తులొచ్చారక్కడికి.

"ఎక్కడికండీ?" అన్నాడొక వ్యక్తి ప్రసన్నవదనంతో.

నేను పలక్కుండా నిలబడ్డాను. శాంతి శాంతంగా నిల్చుంది. ఇటు వంటి వాటికంతా జవాబు చెప్పేది మా కమలమే. కొద్దిగా ఉద్రేకి. ఆ పృచ్ఛకుడి వైపుకూడా చూడకుండా ఒక విధమైన నిర్లక్ష్యంతో "ఎక్కడికో!" అంది కొద్దిగా తల యెగురవేస్తూ. మా కందరికిగూడా హృదయాలు అనుమానపూరితాలయ్యాయి. మద్రాసు గురించీ, మద్రాసు మోసాల గురించీ చూచినవారూ, అనుభవించినవారూ చెబుతూవుంటే వినే వాళ్ళం. మోసం చేసేవాళ్ళూ, దొంగతనం చేసేవాళ్ళూ, మామూలు మన లాగే వుంటారనీ - మనకంటే యింకా నాజూగ్గా కనిపిస్తారనీ - ఏమర్చి దొంగిలిస్తారనీ - వినేవారం! ఈ అనుమానాలకు తోడు ఒక నిరసన భావంగూడా కలిగిందప్పుడే. కొంతమంది కాలేజీ విద్యార్థులు, పిల్లలగు పిస్తే పోజులెయ్యడం అలవాటు. ఏదో సాయం చెయ్యటానికి వచ్చినట్లు వచ్చి మాట్లాడిస్తారు. అటువంటివాళ్ళను చూస్తే ఆడపిల్లల్లో చాలామందికి అసహ్యం వేస్తుంది. వారేఖాహాలూహించి, కలుగజెయ్యాలని పోజులేస్తారో తప్పకుండా అంతకు వ్యతిరేక భావాలు బాలికలలో కలుగుతాయి! ఇట్లాంటి భావాలన్నీ దొర్లుకొచ్చాయి మాకాక్షణం. అతనావిధంగా అడగడం అధనప్రసంగితనమే అనుకున్నాం. కమలం యిచ్చిన జవాబుకు నోరు మూసుకొని, మొగం ముడుచుకొని, తన దారిన వెళ్ళిపోతాడను కున్నాం. అట్లాకాలేదు. అతను మరింత ప్రసన్నవదనంతో,

"మీరు సిటీవైపు వెళ్ళే బస్సెక్కాలి కాబోలు!" అన్నాడు. ఇంత వివరా లితనికెందుకు చెప్పాం, అనుకుంటూ,

"బాగా జోస్యం చెప్పేవారులాగున్నారే!" అన్నా నేను కాస్త వెటకారంగానే.

"మైలాపూర్ కెళ్లేవాళ్ళు లాగున్నారే అంటే జోస్యం కరెక్టుగా వుండేది" అంది కమల కాస్త పెదవులు బిగించి వెక్కిరింపుగా, తలా గుడ్లా ఆడిస్తూ. అతను శాంతంగా, సహించుకుంటున్నట్లుగా, అదే ప్రసన్న వదనంతో వున్నాడు. కమలం నా వెనుకచేరి, తన గడ్డం నా భుజంపై పెట్టి "మీరు చెయ్యి చూస్తారా?" అంది వెటకారంగా, గేలిగా. అతను చిరునవ్వు నవ్వాడు.

"మీరిక్కడ గాదు నిలబడాల్సింది. పొరపాటుగా నిలబడ్డారిక్కడ. ఇది సిటీవైపు, అంటే జార్జిటౌను వైపు పొయ్యే బస్సు స్టాపింగు కాదు. యెడమవైపు నిలబడాలి" అని అవతలవైపు యిరవై గజాల దూరంలోవున్న స్టాపింగు చూపించాడు. ఇంతలో ప్యారిస్ కార్నర్ అనే బోర్డు శిరోభాగంలో తగిలించుకొని, ఒక బస్సు బుర్రున వచ్చింది. మాకంటే వాళ్ళు ముందు పరుగెత్తారు బస్సు వెంట. తర్వాత మేము రోడ్డు దాటాము, బస్సక్కడాగి, ఒకర్ని దింపి, మరొకర్ని ఎక్కించుకొని, ఫుల్ అంటూ వెళ్ళిపోయింది మేమక్కడికి చేరేటప్పటికి.

"కాసేపుండండి, ఇంకొక బస్సొస్తుంది" అన్నాడదే ముఖధోరణిలో. మా నోళ్ళు మూతలుపడి, మెదడు కవాటాలు తెరుచుకున్నాయ్. పొరపాటుపడ్డాం అనుకుంటూ మాలో మేము ఒకరి మొగాలొకరు చూచుకుంటూ లోలోపల క్షమాపణలు చెప్పుకుంటూ నిలబడ్డాం. వాళ్ళు గూడా కాస్త దూరం జరిగి, అంతకుముందు మాట్లాడుకుంటున్న విషయాన్ని మా వల్ల ఇంతకుముందు అంతరాయం కలిగినట్లుగా - ఇపుడు సాగిస్తు

నట్లు, సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు. మా వైపుగూడా చూడటం లేదు. 'తక్షణమే వెళ్ళాలి. తప్పదు" అన్న అతని నిర్ధారణ పలుకులు మాకు వినిపించాయి. ఇంతలో కేకలు వేసుకుంటూ మరొక బస్సొచ్చింది. ఆగింది. మమ్మల్ని ఎక్కమన్నారు. ఎక్కి నిలబడ్డాం తావులేక. బస్సు కదుల్తాంది. వాళ్ళక్కడే నిలబడ్డారు. "మీరు రావడం లేదూ" అంది శాంత శాంతంగా ఇంతసేపూ ఊరికేవుండి అంతా గమనిస్తూ.

"రావటం లేదండీ, చైనా బజారెళ్ళాలి అర్జెంటుగా" అన్నారు. అప్పటికే కదలింది మా బస్సు. మేం టికెట్లు పుచ్చుకొని స్థిమితంగా కూర్చున్నాం,ఎవరో మగవాళ్ళు లేచి తావు చూపించగా, ఆడవాళ్ళని చూస్తే యీ మర్యాద వుందే అనుకుంటూ. ప్రక్క స్టాపింగు వెళ్ళేటప్పటికి ఒక ముసలామె యెక్కింది. ఆమెనందరూ చూచీ చూడనట్టుగా కూర్చొన్నారు. ఏ మగవాడూ లేవలేదు. కడపటికి మా కమలం లేచి ఆ ముసలామెను కూర్చోమంది! అయితే లేచిన కమలానికి మరొక యువకుడు లేచి తావిచ్చాడు. బలేవుంది! పయనించిన పది నిమిషాలూ మేము ఒకర్తో ఒకరం మాట్లాడుకోలేదు. దిగి కాసినో హాలు కెళ్ళాం. ఇంకా బుకింగ్ టైం కాలేదు. కమలం అంది :

"నేనేదో పోజురాయిళ్ళనుకున్నానే" అని.

"నేనూ అట్లాగే అనుకొని పొరపడ్డాను."

"అది నిజమే! అట్లా అని అందర్నీ అనుమానించలేం మనం. పోజులు వేసేవాళ్ళు యిట్లాగే చేస్తారు. కొంత మంది విశాలహృదయులూ వుంటారు. వారికి ఆడా మగా - కొత్తా పాతా - ఏమీవుండవు. ఏదైనా తరుణం వస్తే యితరుల సాయం చెయ్యాలనే వారి ఆశయం" అంది శాంతి.

"ఇంతకూ చాలా పొరబడ్డామే" అన్నా నేను ఆలోచిస్తూనే.

"నేనే ఏగతాళిగా మాట్లాడానే పాపం! ఇంతకూ అతనెవరో?" అంది కమలం జిజ్ఞాసతో.

మాకు రెండు మూన్నాళ్ళు మనసులో మెదుల్తానే వుండిందా విషయం. అతను గానీ అతని మిత్రుడుగానీ మాకు కనుపించలే దెవరికి గూడా. అదేమో ఒక అప్పుడు కనబడి, దేశాంతరవాసం వెళ్ళినట్లుగా ఫీలయ్యేవాళ్ళం మేము. ఇట్టి హఠాదాగత సంఘటనలు, హృదయాన్ని పూర్తిగా లోబరచుకుంటాయి.

ముచ్చటగా మూన్నాళ్ళు గడిచాయి. సాయంకాలం కాలేజీ అయి పోయింది. ఇక వెళ్ళాలి. ఆడపిల్లల గది, సాయంకాలం యీత చెట్లగుమి లాగా రొదగా వుంది. కమలం కోసం చూస్తూ కూర్చున్నాం. ఇంతలో గంపంత మొగంతో, ముందుకోపున పరుగెత్తుకుంటూ వచ్చి, పుస్తకాలు శాంత వొళ్ళో విసిరిపారేసి, నన్ను కరుచుకొని "దా! ఒక రహస్యం చెబుతా" అంది.

బయటికెళ్ళాం.

"అతను కనబడ్డాడే" అంది ఆనందంతో కండ్లారుస్తూ.

"ఎవరూ?"

"మన ప్రసన్నం" అంది నవ్వుతూ.

"ఇంతలోకే మన ప్రసన్నం యెట్లా అవుతాడే"అన్నాను కొంటెగా దానివైపు చూచి.

"ఛీ! పోవే, నీకేది చెప్పినా ఇంతేనూ! నిన్నగూడా అట్లానే అన్నావు" అంది మురిపెంగా,

"ఎక్కడే అయితే" అన్నాను.

"ఎక్కడేమిటి, మన క్లాసుమేటు! నా గ్రూపుమేటు! ఈ దినం మా గ్రూపుక్లాసులో ఎందుకో అట్లా చూశాను. అతను కనిపించాడు. ప్రక్కన మిత్రుడుగూడా!"

మరునాడు తెలుగుక్లాసు జరుగుతూవుంది. కమలం ముందే చెప్పి నందువల్ల మేము అట్లా చూశాం. గ్యాలరీలో అందరికంటే వెనక కూర్చొ నున్నారు. క్లాసువదుల్తానే మేం ముగ్గురం బయట నిలబడ్డాం. అందరూ వెళ్ళాక వాళ్ళిద్దరూ వచ్చారు. ఏదో మాట్లాడుకుంటూ వస్తున్నారు. "అవు నోయ్, అది మన మాతృజాతి కాబట్టి" అని అంటూన్న అతనిపలుకులు స్పష్టంగా వినిపించాయ్. అప్పటికే మా ముందు కొచ్చారు. మమ్మేలను చూశాక తప్పక మాట్లాడిస్తారనుకున్నాం. నిర్వికారంగా వెళ్ళిపోతు న్నారు. మేము నాడావిధంగా చేసిందానికి కోపమొచ్చిందేమో అనుకో డానికి ఆస్కారం లేదు. ఎందుకంటే, ఆ నిరసన భావాలేమీ మొగంలో కనిపించలేదు. అపుడు గూడా అదే ప్రసన్న వదనం. కొంతదూరం వెళ్ళాక మేము నడుస్తూ,

"పలకరిస్తాడనుకున్నానూ" అన్నా నేను.

మనల్ని గుర్తుపట్టలేదేమో!" అంది కమలం.

"మమ్మేల్ను గుర్తుపట్టకుంటే ఏమో అనుకోవచ్చు గాని, నిన్ను గుర్తు పట్టలేనంత గుడ్డివాడా?" అంది శాంతి చిరునవ్వుతో. ముగ్గురం నవ్వుకున్నాం.

"ఏమండీ, అని మనమే పలకరించుంటే బాగుండేది" అంది కమలం ఏదో పోగొట్టుకున్నట్టుగా.

మరునాడు యింగ్లీషు క్లాసయ్యాక అదేచోట నిలబడ్డాం, ఎట్లయినా మాట్లాడించాలని. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ వస్తున్నారు. "ఆడవాళ్ళు మనవల్లనే పిఱికయి పోయారోయ్" అంటూ వస్తున్నాడు. తటాలున మమ్మేలచూచి, నాలుక కొరుక్కున్నాడు. కమలం నావెనకాల నిబడింది గడ్డం భుజంపై పెట్టి. ఎవరూ మాట్లాళ్ళేక పోయారు మాలో. మా మొఖాలుచూచి మా కత అర్థంచేసుకున్నట్లుంది.

"ఏమ్మా, బాగున్నారా?" అన్నాడు చిరునవ్వుతో.

హెచ్చరించింతర్వాత మాట్లాడ్తాడను కున్నాను. నేరుగా వెళ్ళి పోయారు మాట్లాడుకుంటూ.

"మనం నిజంగా పిచికేగదూ" అన్నా నేను నవ్వుతూ.

"నిలబడి మాట్లాడ్తారనుకున్నాను" అంది కమలం, మోసపోయి నట్లుగా.

"అవసరమొస్తేగాని మాట్లాడే రకం కానట్లుంది" అంది శాంత.

"ఈమె గూడా అవసరమొస్తేగాని మాట్లాడేటట్టు లేదే" అన్నాడు నారాయణ శాంత వైపు చూచి.

"జాగ్రత్తగా వింటూ, కొద్దిగా మాట్లాడే రకం లాగుంది" అంది కామాక్షి.

"ఎదుటి వ్యక్తి తత్త్వం కనిపెట్టే పద్ధతదే" అన్నాడు రామిరెడ్డి.

"కానీండి. తర్వాత చెప్పండి" అంది శ్రీలక్ష్మి అందర్నీ వారిస్తూ.

అందరివైపూ ఒకసారట్లా చూచి తృప్తిగా యిట్లా అంది కాంతం మళ్ళా:

"ఇంగ్లీషు సమితి ప్రారంభోత్సవం నాడు మేమెంతో ఆనందించాం. అది జయావహంగా నెరవేరింది. ఆ జయం మాదే అన్నట్లుగా మేం గర్వించాం. ఎవరో బి. ఎ. ఆనర్సు చదివే అబ్బాయి ప్రెసిడెంటు. మా ప్రసన్నం శెక్రటరీ. ఎంత బాగా నిర్వహించాడనుకున్నారు? ఇటువంటి వాటిలో ఇప్పటికే బాగా తర్ఫీదు పొందిన వ్యక్తిలాగా, అన్నీ చేశాడు. ఇతని ఉత్సాహం చూచి ప్రిన్సిపాలు సంతోషపడి సహాయం చెయ్యటం వల్ల, ఏర్పాట్లన్నీ ఒక నూత్న పద్ధతిలో చేశాడు. చాలా బాగా జరిగింది. మంచి పొగడ్తలే లభించాయి. ఆనాడు డ్రామాలూ అన్నీ అయ్యేటప్పటికి, రాత్రి 9-45 అయింది. అందరూ కార్లలోనూ, జట్కాల్లోనూ, సైకిళ్ళ

లోనూ వెళ్ళిపోయారు. మేం ముగ్గురం అదరాబదరా బస్సుకోసం వచ్చే టప్పటికి అన్నీ నిలిచిపోయాయి. అప్పటికి 10 గంటలయింది. ఇంతలో ఒకటి రెండు బస్సులొచ్చాయి. బతుకు జీవుడా అంటూ సిద్ధంగా నిలబడే టప్పటికి, 'షెడ్' అనే బోర్డు తగిలించుకొని, బుర్రున వెళ్ళిపోయాయి.

"ఎట్లా?" అంది కమలం కంచెం భయంగా.

"నడిచేపోదాం," అన్నా నేను నిబ్బరంగా.

"ఏమిటే, బీచివొడ్డున యిపుడు యెట్లా? ఆడ పిల్లలం! ఎవరన్నా దొంగలు వస్తే..........." అంటూండగా.

"భయమేమిటే పిరికిదానా?" అంది శాంత.

ఇంతలోకే యెగిరి నా మెడ కరుచుకొని,

"అడుగోనే ప్రసన్నం" అంది ఎగుర్తూ.

మేం పిలుద్దామనుకున్నాం. అతనే యిట్లా వస్తున్నాడు. వెంట మిత్రుడు! "ఏమ్మా మౌంటురోడ్డా?" అన్నాడు నవ్వుతూ. అంతమాత్రం ప్రసన్నతలో యీ మాత్రం హాస్యం వుంటుందని నేను బాగానే వూహించా నంతకు ముందే. అందరం పక్కన నవ్వాం. అంతవరకూ నా వెనుక వున్న కమలం ముందుకొచ్చి.

"ఏమండీ, బస్సులన్నీ వెళ్ళిపోయాయ్" అందొక మోస్తరుగా చేతులు విదిలించి.

"పరవాలేదమ్మా, యెక్కడి కెళ్ళాలి?" అన్నాడు.

మా హాస్టలు కన్నా. "పదండి విడిచిపెట్టి వస్తాం" అని బయలు దేరారు. దారిలో జరిగిన సంభాషణ యిది :

"మమ్మల్ని క్షమించాలి అంది కమలం.

"ఫరవాలేదు లెండి కాసింత దూరమేగా"

"అదిగాదు" అంది మావైపు సిగ్గుతో చూస్తూ

"ఇంకేది" అన్నాడాయన చిరునవ్వుతో.

"మొంటురోడ్డు" అంది చిలిపిగా నవ్వుతూ. అందరం నవ్వుకున్నాం.

"దానిలో క్షమించడాని కేముంది? మీరు భావించిన ప్రకారం వ్యక్తీకరించారు."

"భావించుకోడాని కెవరూ ఆక్షేపించరుగాని, వక్తీకరించేటప్పుడే కాస్త జాగ్రత్త పడాలి" అంది శాంత మెల్లగా. సాశ్చర్యంగా, సాదరంగా సవ్వేకండ్లతో అట్లా చూచాడు శాంతవైపు. శాంత ప్రశాంత దృష్టితో మామూలుగా చూచిందాతనివైపు.

"చాలా బాగా అన్నావు తల్లీ!" అన్నాడు. మళ్ళా - "తొందరపడితే నష్టమే" అంటూ కమలంవైపు చూచాడు.

"అయితే మొన్న మేంచేసిన గొప్ప తప్పును క్షమించరన్న మాట?" అంది కమలం కొంటెగా చిరునవ్వు నవ్వి.

"అబ్బే! మేమెపుడో మరిచామండీ!" అన్నాడు. ఇంతలో,

"మీదేవూరండీ?" అంది శాంత.

"కడపజిల్లా -"

ఇంతలోకే కమలం అడ్డొచ్చి,

"ఏమేయ్; ఇతనిది గూడా కడపజిల్లాయేనట" అంది ఏమో తన వూరైనట్టుగా.

"మీ వూరు?" అన్నాడు కమలంవైపు చూచి.

"మాది బళ్ళారిజిల్లా - మరి, శాంతది అనంతపురంజిల్లా."

ఇంకా యిట్లా యేమేమో మాట్లాడుకుంటూ మా హాస్టలు సమీపించాం. 'అప్పుడప్పుడు మా హాస్టలు కొస్తూ వుండండి' అంటూ సెలవు తీసికొని లోపలికెళ్ళాం. "ఎక్కడికెళ్ళారు?" అని మా వార్డను గద్దించింది. ధైర్యంగా నిజం చెప్పి గుట్టుగా వెళ్ళిపోయాం లోపలికి.

కమలం ఆర్థిక పరిస్థితులు మా కంతగా తెలీవు మొదట. మేం బజారుకెళ్తే తాను గూడా మాతో వచ్చేది సావాసంగా. అంతేగాని యేమీ కొనదు. మేం సినిమాకు బయలుదేరుతూ రమ్మంటే రాదు. తనకు సినిమాలంటే బహు యిష్టం అని చెబుతుంది. అయితే రాదు. నేనే బలాత్కారంగా లాక్కెళ్ళి యెవరి చేతికో 'మూడు టిక్కెట్లు మాకు'అని దబ్బిచ్చేసేదాన్ని. అటువంటప్పుడు చీకాగ్గా వుంటున్నట్లు ఆమె ముఖంపై ప్రస్ఫుటంగా కనిపించేది. ఆలోచించుకుంటూ వుండేది. ఆనాడంతా యెక్కువ మాట్లాడదు. ఒకనాడేదో డబ్బు కట్టాల్సొచ్చింది. ఆమె చేత డబ్బు లేదు. అది కట్టకపోతే వీల్లేదు. కట్టవలసిన గడువు గూడా సమీపించింది. నేను తనతో మాట్లాడుతున్నప్పుడల్లా కాస్త పరధ్యానంగా వింటూ, ఏదో చెప్పడానికి ప్రయత్నించి విరమించుకుంటూన్నట్లు గమనించాను. ఒక విధమైన అసహాయత గూడా ఆ మూర్తిలో అప్పుడు ప్రతిబింబిస్తూ వుండింది. నేను బాగా గమనించాను. "ఎందుకు కమలం అట్లా వున్నావు?" అని అడిగాను దగ్గరగా కూర్చొని.

"ఇంటికి జాబు వ్రాశాను. జవాబు రాలేదింకా. ఒక అయిదు రూపాలుంటే యిస్తావా, త్వరగా యిస్తాను మళ్ళా" అంది అడగలేక అడగలేక న్యూనతాభావంతో. ఎంతోమంది నా దగ్గర బదుళ్ళు తీసికొనేవారు. నేనూ అడిగి అక్కడక్కడా తీసుకొనేదాన్ని. వాళ్ళల్లోగానీ నాలో గానీ, ఇటువంటి భావం కనిపించలేదు. ఎందుకంటే డబ్బులేని తనం మేం ఫీలుకాము. డబ్బులేనివాళ్ళు అట్లా తప్పక ఫీలవుతారు! అదే.

తప్పంటాను. అదొక పిశాచం. అది అన్నిట్లోకి వ్యాపించి. జీవితాన్ని నాశనం చేస్తుంది. ఆ స్థితి గమనించి వెంటనే.

"ఓః దానికే యింత ఉపోద్ఘాతమా? యింత వెనుక తొక్కిళ్లూ ముందు తొక్కిళ్లూ యెందుకు కమలం? బాగానే అడుగుతూ వుండు. నీ కేమి కావాలన్నా అడుగుతూ వుండు జంకుగొంకూ లేకుండా" అన్నా. దాని మొగం గంపంత అయింది. కృతజ్ఞతతో చూస్తూ "త్వరలో యిస్తాను" అంది.

"యిద్దూగానిలేవే అబ్బా! అవన్నీ యిపుడెందుకు?" అన్నాను.

నాకు సుమారుగా అర్థమయింది తన ఆర్థిక పరిస్థితి. తన దుస్తుల ధారణ - తన ముఖంలో కనిపించే అసహాయత - యివన్నీ ఆమెను నా హృదయానికి చాలా దగ్గరగా తెచ్చాయి. ఆమెపై సానుభూతి హెచ్చిం దెందుకో. అంతకు ముందే నన్నాకర్షించిం దామె బాగా. నా కదేమో ఆ పిల్లంటే ఐతే వాత్సల్యం. తన్ను చూస్తే యావత్తూ యిచ్చేద్దాం అన్నంత త్యాగ బుద్ధి కలుగుతుంది. తనకూ అంతే నన్ను చూస్తే. తన ప్రాణాల్ని నా హృదయంలోకి పంపి, శరీరాన్ని నా వొళ్లో వేసి పడుకుంటుంది, పసిపిల్లలాగా బుగ్గలు నిమురుస్తూ. అట్లా పడుకొని, తన విషయాలు ఒక్కొక్కటే చెప్పేది. ఆ సమయంలోనే డైరీలో ఒక పేజీలో నన్ను గురించి వ్రాసింది. దాన్ని చెబుతాను. నన్ను పొగడ్తూ వ్రాసినందువల్ల మీకు చెప్పడంలేదు. వెనక అది పనికివస్తుంది. అందుకు చెబుతున్నా. "అబ్బా! నీ వెంత దయామయుడవోయ్ భగవాన్! ఎటు వంటి మిత్రరత్నాన్ని ఒసగావోయ్! నా తల్లి గర్భంలో పుట్టింది గూడా యింత దయగా నా పైన వుండదేమో! హృదయాలు కలిస్తే, కులాలూ, పైపై వ్యత్యాసాలూ యేమీ వుండవు గదా! అబ్బా! కాంతి ఎంత ప్రేమ హృదయం గలది? ఆజన్మాంతమూ కృతజ్ఞురాలిని తనకు!" ఇదీ ఆమె వ్రాసింది.

గూపుమేటు కాబట్టి అతనితో ఎక్కువ మాట్లాడ్డానికి కమలంకు అవకాశా లుండేవి. ఎందుకో అతన్ని చూచిన మరుక్షణమే తనలో ఒక విధమైన భావం పుట్టింది. ఆ భావం పెరుగజొచ్చింది. నానాటికీ అతను తన హృదయాన్ని సర్వస్వమూ హరించివేస్తా డేమో అన్న సందేహము తనకు కలిగించె. ఎప్పుడు గూడా తనతో మాట్లాడుతూ వుండాలన్న ధ్యాస ఎక్కువైంది. అందుకు తనకు పాఠాలు సరిగ్గా అర్థ మవటం లేదనీ - ఈ దినం నోట్సు రాసుకోలేదనీ-నోట్సు యివ్వాలనీ ఒకమాటు తనకు ఈ దినం పాఠం చెప్పాలనీ - యిట్లా అనేది. ఇట్లా యేదో ఒక విధంగా మాట్లాడుతూవుండేది. అతనుగూడా యెందుకో యీ అమ్మాయి పైన యెక్కువ మక్కువ చూపేవాడు. ఎప్పుడన్నా మేమందరం కలిసి నప్పుడు ఆయమ్మాయినే యెక్కువగా ప్రశ్నించి మాట్లాడేవాడు. 'బాగా చదవాల' అని ఆశతో హెచ్చరించేవాడు. ఆ అమ్మాయి ఎట్లాగో బ్రామిన్ అని తెలిసిందట అతనికి మొదట! ఒకనాడు తానూ కమలం మాట్లాడుతూవుంటే, ఏదో కులప్రసంగం వచ్చిందట! అందులో ఆ అమ్మాయి నాన్‌బ్రామిన్ అని తెలిసిందట! అతను ఆశ్చర్యాన్ని వెళ్ళ బుచ్చి ఆనందపడ్డాడట! అంతకుముందూ పెండ్లేవద్దనుకుంటూండినవాడు "యీ అమ్మాయిని చేసుకుంటే కులాంతర వివాహమూ, ప్రేమించి పెండ్లిచేసుకోడం-అన్న ఆదర్శమూ నెరవేర్తాయి! గదా" అని అనుకున్నట్లు తర్వాత చెప్పాడు నాకు.

ఆగష్టు ఒకటవతేదీ నాడు, హాస్టల్లో బిల్లు బోర్డుపై వేశారు. యెనిమిదవ తేదీ జరిమానా లేకుండా కట్టవలసిన ఆఖరు తేదీ. కమలం బిల్లు యిరవై మూడు రూపాయలు. తక్షణమే యింటికి వ్రాసి ఆలోచిస్తూ కూర్చుంది. మూడు దినాల వరకూ యెదురుచూడలేదు గాని, తర్వాత యెదురుచూస్తూ కూర్చుంది. నాలుగోనాడు జాబొచ్చింది మనియార్డరుకు బదులు, ప్రస్తుతం డబ్బులేనట్లు - తాను జ్వరంలో వున్నట్లు - జ్వరం

నెమ్మదిస్తూనే ఎక్కడన్నా సరిచేసి పంపుతానన్నట్లు, తండ్రి వ్రాశాడు. ఆ జాబులోని విషయం మాకు చెప్పలేదు. అయితే తక్షణం మళ్ళా జాబు వ్రాయడం మాత్రం చూచాను. అప్పట్నుండీ ఆలోచనగా, విషాదంగా కూర్చుంది. యెనిమిదవ తేదీగూడా వచ్చికూర్చుంది. అందరూ బిల్లు చెల్లిస్తున్నారు. అంతసేపూ నేను శాంతరూములో కూర్చొని మాట్లాడుతూ వున్నా, అందరితోపాటు కట్టేద్దామని లేచాను రూంకు రావడానికి.

"మళ్ళా నీరూంకెందుకూ ? నాదగ్గరవుందిగా - కట్టేసిపోదాం. తర్వాత తీసుకుంటాను" అన్నది శాంత. మా బిల్లు చెల్లించి రసీదు తీసుకున్నాక, కమలం విషయం జ్ఞాపకమొచ్చింది. అక్కడ కనిపించలేదు ఆదరా బదరా రూం కెళ్ళాం, తన స్థలంలో కనిపించలేదు.ఎక్కడెళ్ళిందా అని "కమలం" అంటూ కేకేసి అటూయిటూ చూశాం. ఒకమూల తన ట్రంకుపైన కూర్చొనుంది. ఆ వాలకంచూచి మేమిద్దరమూ స్టన్ అయిపోయాం. పరుగెత్తుకుంటూ దగ్గరికెళ్ళి, ముందువైపు మోకాటి తుండేసి కూర్చొని వేడికోలు ధోరణిలో, "కమలం!" అంటూ మోకాళ్ళపై అదిమి వున్న తన తలను ఎత్తాను. ముఖమంతా కమిలినట్లుంది. కండ్లు యెర్రగా వున్నాయి. నీటిగుండాల్లాగా వున్నాయి. దుఃఖమూ, అసహాయతా హృదయంలో విజృంభించి, ఎగతోసుకొస్తున్నట్లుగా, హఠాత్తుగా నన్ను కౌగలించుకొని యేడ్చింది. శబ్దంరాకుండా బిగబట్టి యేడవడం వల్ల ఎక్కిళ్ళు పుట్టి, వెక్కివెక్కి యేడ్చింది. నాకు కాస్త అధైర్యం వేసింది. డబ్బు విషయంకాక మరేదైనా కారణం వుందా అనే జిజ్ఞాస కలిగింది!

"ఏమిటి కమలం! పసిపిల్లలాగా యేడుస్తావ్?" అంటూ తల నిమిరి బుజ్జగిస్తూ, తల లేపాను. ఒకవిధమైన న్యూనత మొగంలో తాండవిస్తూవుంది. ఆమె కన్నీటిని నా పైట చెరుగుతో తుడుస్తూ "చూడు..

కమలం, నాకు చెప్పవూ? నీకు నేను అక్కయ్యనుగా! నీ కష్టాలెన్ని వున్నా నాకు చెప్పు, చెప్తావుగదూ?" అని అర్థించాను చిరునవ్వుతో.

ఆ కన్నీళ్ళ వేడి కాస్త పోయేటప్పటికి, మెదడు చల్లబడింది. తేలికయింది. శరీరం గూడా తేలికయినట్లయింది. అదొక విధమైన కృతజ్ఞత, మురిపెము కూడుకున్న చూపులతో చిరునవ్వుతో, మావైపు చూచి అట్లా ఊపిరి పీల్చింది విశ్రాంతిగా.

"శాంతీ! ఇదో, ట్రంకు తెరచి, నూరు రూపాయల నోటుందిగాని, తీసుకెళ్ళి కమలం బిల్లు చెల్లించి, మిగిలింది నీదగ్గరవుంచు. త్వరగా రా" అన్నాను.

"కాంతీ!" అంటూ అట్లా సోలి నాపైనపడి, ఆనందబాష్పాలు రాల్చింది నావొళ్ళోపడుకొని. నాకూ ఆనందబాష్పాలుప్పతిల్లాయి. ఒకరి బాష్పాలొకరు తుడుచుకుంటూ అట్లా వుండిపోయాం ఆనందంగా, తృప్తిగా.

ఆ సాయంత్రమే, కాలేజీనుంచి వచ్చేముందు, నోటీసు బోర్డు చూచి ఎంత ఆనందించామో చెప్పటం కష్టం, శాంతకుకూడా స్కాలర్ షిప్ వచ్చిందిగాని.కమలానికి రావడం యెంతో ఆనందమిచ్చింది. నెలకు పది రూపాయలు.ఆ ఆనందంతో హాస్టలుకెళ్ళాం. అప్పటికి సాయంత్రం ఆరుదాటింది. దాదాపు ఏడై వుంటుంది.

ఏదో ఆదుర్దాగా వచ్చారా యిద్దరూ, యింకా కొంతమంది మిత్రులూ. మేం సంతోషంగా ఆహ్వానించాం. వాళ్ళునిలబడ్డవారు నిలబడే "మాకు టైంలేదు. తక్షణం వెళ్ళాలి. ఇంకా చాలా తిరగవలసిన చోట్లు న్నాయి. రాత్రి పదిగంటలకులోగా మా పని ముగించుకోవాలి. రేపు సమ్మె! మీలో యెంతమంది పికెటింగుకు వస్తారో పేర్లివ్వండి" అని సమ్మెకు కారణం చెప్పారు.

"నేనొస్తా" అంది కమలం.

"మేం ముగ్గురం వస్తామనుకోండి. యింకా యెవరన్నా వస్తారేమో కనుక్కోవాలి" అన్నా నేను.

కమలం సగర్వంగా నా వెనుక నిలబడి, గడ్డం నా భుజంపై పెట్టి అతనివైపు చూస్తూవుంది.

"మీలోమీరు మాట్లాడుకొని సిద్ధంగా వుండండి. రేపు ఉదయం వస్తాం" అంటూ బరబర వెళ్ళిపోయాడు. అందరూ ఆయన్ను అనుగమించారు. నాకప్పటికే కాస్త వణుకుబడి యేర్పడిందని చెప్పవలసి వస్తున్నది కాబట్టి చెబుతున్నా, క్షమించాలి, మేము చెప్పడంవల్ల, చాలా మంది బాలికలు పోమన్నారు కాలేజీకి. మా హాస్టలులో పదహారుమంది పికెటింగుకు వస్తామని సిద్ధమయ్యారు. సమ్మె యెందుకో చెప్పి ఒప్పించేటప్పటికి తలప్రాణం తోకకొచ్చింది నాకు.

ఉదయం మళ్ళావచ్చారు. ఫలితం చూచి సంతోషించి ఒక చిన్న లెక్చరుకొట్టి, అందరూ తొమ్మిది గంటలకే కాలేజీ దగ్గర సిద్ధం కావాలని చెప్పి వెళ్ళిపోయారు. ఉదయం యెనిమిదిన్నరకు బయలుదేరాలి. అప్పటికన్నం పెట్టరు. భోజనం లేకుండానే బయలుదేరాం మేం పదహారుమందిమీ. మా కమలం ఎంతో సంతోషంతో బయలుదేరింది. దాన్ని పట్టపగ్గాలు లేవు. మేమెంతో చెప్పాం. తాను కాలేజీకి వెళ్ళాలని కూర్చున్నా నేను. ససేమిరా అంది తాను. "స్కాలర్‌షిప్ పోతే పోనీ లేవే" అంది. దానికి ఉద్రేకంవస్తే అవతలా యివతలా యేమీ కనిపించవు. యేమి మాట్లాడేదీ తెలీదు. ఇట్లాంటి ఉద్రేకమే తన జీవితాన్ని నాశనం చేసుకొని యింకొక హృదయానికి చిచ్చుపెట్టడానికి కారణమైంది గూడా కడకు. తాను మావెంట వచ్చేసింది.

పికెటింగుకొచ్చిన వాళ్ళల్లో సుమారు నలభై మందున్నారు బాలురు. మేమొక పదారుమంది. అక్కడక్కడా ఒక్కొక్క సెంటరులోనూ,

కొంతమంది బాలురు, కొంతమంది బాలికలు ఉండేటట్లు నిర్ణయింప బడింది. ఒకాయన చిన్న లెక్చరు కొట్టాడు నాలుగు నిమిషాలు. నాయుడొచ్చి మరికాసేపు మాట్లాడాడు. తొమ్మిదిన్నర అయ్యేటప్పటికి, మాకు నిర్దేశించిన సెంటరులకు వెళ్ళిపోయేందుకు బయలుదేరాం. నా వెనకాలేవుంది కమలం. నేను అతన్ని పిలిచి "కమలానికి మీరన్నా చెప్పండి, స్కాలర్‌షిప్ వచ్చే అమ్మాయి" అన్నాను, కాసేపు యోచించి "సరే, వెళ్ళాల్సిందే, వెళ్ళండీ" అన్నాడు. "నేవెళ్ళను" అంది పెంకిగా అతని ముఖంలోకి చూస్తూ.

"నేనాలోచించి చెబుతున్నాను, తప్పక పోవాలి" అన్నాడు.

"ఇంక తప్పుతుందా?" అంటూ వారగా చూచి ప్రక్కకు తప్పు కుంది.

ఇంతలో కొంతమంది వచ్చారు విద్యార్థులు. చెప్పాం సమ్మె అని. కొంతమంది వెనక్కి వెళ్ళారు. చాలామందే వెళ్ళారు. ఒకరిద్దరు మాత్రం స్కాలర్‌షిప్‌వాళ్ళు తోసుకొని పరుగెత్తారు. ఇంతలో మెయిన్‌గేటు దగ్గ రున్న వాళ్ళను తోసుకొస్తున్నారనీ, తప్పక రావాలనీ వార్తవచ్చేటప్పటికి నన్ను రమ్మంటూ బయలుదేరాడు బిరబిర. కమలంగూడా వెంటబడింది. మెయిన్ గేటుదగ్గర పెద్ద గుంపు నిలిచివుంది. వాగ్వాదాలు జరుగు తున్నాయి. తోసుకొని వస్తున్నారు. చాలామంది అప్పటికే లోపలి కొచ్చారు. వాళ్ళంతా కాలేజీలోకిపోతే నిరుత్సాహం ప్రబలిపోతుంది. సమ్మె వ్యర్థమైపోతుంది. బిరబిర పరుగెత్తుకుంటూవచ్చి ఉచ్చైస్స్వనంతో "ఆగండి! ఆగండి!" అన్నాడు. అందరూ అదేమో మంత్రముగ్ధులుగా నిలబడ్డారు.

"ఈ సమ్మె చెయ్యటం మాకోసంగాదు. మేమేమీ తమాషాకు పికెటింగు చెయ్యటంలేదు, ఇదంతా మీపనిగూడా. మీకు సమ్మెవిషయం

తెలియజెయ్యడానికి పికెటర్సుగా వచ్చాంగాని, మీతో వాదించి, పోట్లాడి నిలపాలనిగాదు. ఆవిధంగా భావించి పొరపడకండి. మీరు తోసుక పోతామంటే మేమేమీ చెయ్యలేం. అయితే మీ హృదయానికీ మీ మనస్సాక్షికీ చెప్పుకుంటున్నాం. బాగా ఆలోచించండి! మీరంతా మాకంటే బాగా తెలిసిన వారు. అనుభవంగలవారుగూడా. ఆలోచించండి! ప్రపంచంలో మాన వుడుగా బ్రతకాలంటే స్వేచ్ఛ గావాలి. స్వేచ్ఛ అన్నది మానవుడి జన్మహక్కు. పైన్నుంచి దిగి వచ్చేదిగాదు! ఒకడు ప్రసాదించేదిగాదు! స్వప్రయత్నంతో సంపాదించుకొనేదది!! ఒకసారి స్వేచ్ఛ పోగొట్టు కొన్నాక, తర్వాతింకేమీ వుండదు మానవుడికి పోగొట్టుకోడానికి! మాన వత్వంతో జీవించా లంటే స్వాతంత్ర్యాన్ని కలిగి వుండాలి. ఎవడి హృదయం స్వతంత్రతా పూర్ణమో, వాడు సరైన మానవుడు. అట్టి స్వాతంత్ర్యం కోసం పోట్లాడేవారే సరైన మానవులు! వ్యక్తి స్వాతం త్ర్యాన్ని అరికట్టే వారూ, స్వాతంత్ర్యం కోసం పోట్లాడే వాళ్ళను హింసించేవారూ, కేవలం రాక్షసులు. వ్యక్తి స్వాతంత్రం కోసం - జాతి స్వాతంత్ర్యం కోసం - ధన, మాన, ప్రాణ, సర్వస్వాలనూ అడ్డుతున్న మహనీయుల్ని హింసిస్తూ వుంటే - చంపుతూ వుంటే - మనం-యెవరి కోసం వాళ్ళంతా ప్రాణా లర్పిస్తున్నారో అట్టి మనం - స్వాతంత్ర్యం అంటే తెలియకుండా గుడ్డిగా బ్రతుకుతూన్న మనం- నిరసన చూపిస్తూ, అసమ్మతి తెలియజేస్తూ - ఒక పూటైనా సమ్మె చెయ్యవద్దా? మనకోసం మన భవిష్యత్తు కోసం - మన అభ్యుదయం కోసం వాళ్ళంతా త్యాగాలు చేస్తూ వుంటే వాళ్ళను తల్చుకొని, మన అసమ్మతిని - మనం చేయగల్గిన ఒక సమ్మె ద్వారా నయినా చూపవద్దా? ఆ విధంగా చూపిన విద్యార్థుల తలలు పగలగొట్టడమా? అందుకు సానుభూతిగా నైనా చెయ్యవద్దా? - మనమే చెయ్యటంలేదిది. సిటీలో, అన్ని కాలేజీలలో జరుగుతూ వుంది.

విద్యార్థిలోక మంతా యీ చర్య ద్వారా నైనా కృతజ్ఞత తెలియపరచాలి" అన్నాడు.

అందరూ ఆలోచనా నిమగ్ను లయ్యారు. ఉద్భ్రతం తగ్గి నిల బడ్డారు. కమలం అమితంగా ఉద్రిక్త అయిపోయింది. అందులో ఆనందం ప్రవేశించింది. వివశయైపోయింది. ఉపన్యాసం మొదలు పెట్టింది. గుక్క తిప్పకుండా యేక ధారగా అయిదు నిమిషాలు మాట్లాడింది. ఒక అమూల్యమైన విషయం అంది - "సోదరులారా! ఒక విషయం గమనించాలి. కష్టాలూ, సుఖాలూ, దెబ్బ తగిలితే యేడవడాలూ అందరికీ ఒకటే. దెబ్బయెవడికి తగిలినా చురుకే! అది మనకే తగిలితే ఆ చురుకుదన మేమిటో ప్రత్యక్షంగా బోధపడుతుందీ. బాధకలుగుతుంది. అపుడెవరూ సానుభూతి చూపకపోతే దుఃఖిస్తాం, ఇతర్లకు తగిలినపుడు గూడా మనకు తగిల్నట్టే భావిస్తే, మనం సాను భూతి తప్పక చూపుతాం. వాళ్ళకు తగిలిన ఉరిశిక్షలూ, లాఠీలు, మనకే తగిలివుంటే మనం ఎంత ఉద్రేకులమౌతామో ఆలోచించండి!" ఒక్క సారిగా, అమాంతంగా, కాంగ్రెసుకూజై, గాంధీకిజై అనే నినాదాలు మిన్ను ముట్టాయి! అందరూ! యిండ్ల ముఖం పట్టారు. కాలేజీ వదిలి నట్లుగా, గుంపులు గుంపులుగా వెళ్ళిపోసాగారు.

కమలం అతను మాట్లాడుతూన్నంత సేపూ, అతని వైపూ, నా వైపూ చూచి, సగర్వంగా, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ నిల బడింది మొదట. అందర్నీ అమాంతంగా నిలేసి, ఆకర్షించి మాట్లాడు తూన్నది తానే అయినట్లు కనిపించింది. తాను గూడా అతను తలపెట్టిన సర్వ కార్యక్రమాలలో భాగస్వామిగా వున్నట్లు తాను తెలుసుకోవాలని దాని ఉబలాట. అందుకే తర్వాత అట్లా మాట్లాడింది. మధ్యాహ్నం గూడా కాలేజీకి యెవరన్నా వస్తారేమో అని చూశాం. కొంతమంది సైన్సు

విద్యార్థులొచ్చారు. వాళ్ళను గూడా వెనక్కి తరిమేశాం! అక్కడ క్లర్కు లను అడిగి తెలుసుకుంటే నూటికి అయిదు మంది గూడా క్లాసులకు వెళ్ళనట్లు చెప్పారు. ఇంకేం! మేం జయించాం. మా ఆనందానికి అంతు లేదు. ఒక విధమైన ఠీవి ప్రవేశించింది హృదయాలలో. అప్పటికి సాయం కాలం మూడు దాటింది. బయలుదేరాం వెళ్ళడానికి, అప్పుడు జ్ఞాపకం వచ్చింది మేం భోంచేయనట్లు. బాలికలందరమూ కలిసి హోటల్ కెళ్ళి బాగా టిఫిన్ మెక్కి హాస్టల్ కెళ్ళాం నిదానంగా విజయగర్వంతో.

కమలాన్ని పట్టలేకుండా అయింది నా పని. కూర్చోలేదు. నిల్చో లేదు. ఏదేదో మాట్లాడుతుంది. మాటిమాటికి "చూడే, ఎంత బాగా మాట్లాడాడో. అంతమందిని అడుగు కదల్నీకుండా చేశాడు" అంటుంది. మరికాసేపటికొచ్చి, "అతను మాట్లాడుతూవుంటే, అతని చూపులెంత సూటిగా వుంటాయనుకున్నావ్" అనేది. కడపటికి నేను విసిగిపోయి, నీవు నోరు మూసుకుంటావా లేదా అని గద్దించి, శాంతి రూం కెళ్ళాను.

భోజనం టైం వరకూ అక్కడే కూర్చున్నా శాంత రూములో. గంట కాగానే భోజనాని కెళ్ళాం. మామూలు ప్రకారం. మా మధ్యన సీటువదిలి కూర్చున్నాం కమలానికి. ఎంతసేపటికీ రాలేదు. అందరూ దానిమాటే మాట్లాడుకుంటున్నారు. చాలా బాగా మాట్లాడిందట అని విన్న మా వాలంటరీర్లు అనగా, అందరికీ తెలిసి, "అమ్మో, అంత బాగా మాట్లా డుతుందా?" అన్నారు, నేనేదో ఆ గౌరవమంతా నాదే అయినట్లుగా "మీకేం తెలుసు దాని కత? హైస్కూల్లో వక్తృత్వ పోటీల్లో యెన్ని పుస్తకాలొచ్చా యనుకున్నారు?" అన్నాను.

త్వరగా భోంచేసి రూంకొచ్చాను. కమలం లేదు. ప్రక్క రూంలో లేదు. రెండో పంక్తి భోజనాని కెళ్ళిందేమో అని చూచాను. లేదు. పైకెక్కాను, 'కమలం' అంటూ కేకేసి. నా కేక విని గూడా సముద్రం తట్టు చూస్తూ నిలబడివుంది.

"ఏమిటే యిట్లా తయారయ్యావు? ఏదన్నా ఒక మాటంటే అంత రోషమయితే యెట్లా?" అన్నాను. నన్ను కౌగలించుకొని-

"లేదే. నువ్వేమన్నావు? సంతోషంపట్టలేక ఒంటరిగా అనుభవిద్దామని పైకొచ్చా" అంది ఆనందంతో. నా భయంకాస్త తగ్గింది. మళ్ళా, "కాంతీ! నీకు చాలా విషయాలు చెప్పాలే" అంది.

"ముందూ నీవువెళ్ళి భోంచేసిరా పో, మళ్ళా చెప్పుదూగాని," అన్నాను,

"పోవే, యేంభోజనం?" అంది నిరసనగా, మురిపెంతో.

నేను యీడ్చుకపోయాను. అన్నంముందు కూర్చుంది. యేడెనిమిదేండ్లపిల్ల పెట్టించుకొనేంత పెట్టించుకొంది. నెయ్యితెస్తే వద్దంది. ఏదో కూరలువేస్తే, వేలితోతాకి నాలుకపైపెట్టి రుచిచూచి తోసేసింది. పచ్చడి కలిపిన కొంచెం అన్నం ప్రక్కకుతోసేసి పులుసు తెమ్మంది. దాన్నీ ఒకప్రక్కకు తోసేసింది సగంఅన్నంతో. ఇంకేమీవద్దు మజ్జిగ తెమ్మంది. ఆ మిగిలిన అన్నం మజ్జిగతో కలిపి, కాస్తలో కాస్తతిని లేవబోయింది.

"ఏయ్! తింటావాలేదా?" అంటూ వంటమనిషిని యింకా కాస్త అన్నంతెమ్మన్నాను. "అమ్మో! ఇంకొద్దుతల్లీ!" అంటూ లేచింది. నేను పట్టుకొని, లాగికూర్చోబెట్టాను. మురిపెంగా సణుక్కుంటూ కూర్చుంది. తింటూన్నట్లు నటించింది. నన్నేమార్చి పారిపోయి చెయ్యికడుక్కొంది.

"ఏమిటే నీ కత? అన్న మెందుకు తినవు?" అన్నాను, పైకెక్కిన తర్వాత.

"అది చాల్లేవే యీనాటికి! అసలు దిగందే! హృదయం యెందుకో ఉబికిఉబికీ పోతూవుంది. అది ఉబ్బి కడుపు నాక్రమించిందేమో. తినబోతే వెగటు గావుంది. హృదయంలో ఉబ్బునుకాస్త వెళ్ళగొడితేగాని....

....కాదు" అంది. ఇట్లా అని, నారెండుచేతులూ పట్టుకొని, కాసేపుఊచి, తర్వాత దానిచెంపలకేసి వొత్తుకొని, తర్వాత నా చెంపలపై ఒత్తుతూ

"ఒకమాట చెబుతానూ" అంది.

"ఊఁ, చెప్పు" అంటూ ప్రక్కకు జరిగాను. పై అంచుగోడ పట్టుకొని సముద్రాన్ని తిలకిస్తూ,

"అతనిపైన నా అభిప్రాయాన్ని మార్చుకున్నా" అంది.

"ఎవరిపైన? ఏ అభిప్రాయం?"

"ప్రసన్నంపైన."

"మార్పేమిటి?"

"అన్న, అని మొదట పొరపాటుగా అన్నాను."

"అంటే?"

"మరొకతీరుగా భావిస్తున్నా. అదేమో అతనంటే నా కదొక విధంగా అయిపోతూవుంది. ఎపుడూ అతన్ని గురించే ఆలోచనలు. క్లాసులోగూడా ఎంతవద్దనుకున్నా అతనివైపే పీకుతాయి చూపులు. ఒక వేళ బాహ్యనేత్రాలింకొకదిక్కు చూస్తున్నా, మనోనేత్రం మాత్రం అతన్నే చూస్తూవుంటుందెపుడూ! అతడు నా హృదయంలో సతతమూ తిష్ఠవేసివుంటాడు.అబ్బా! అతనిదెంత మంచి హృదయం! ఎంత సాయం చేసే గుణం! ఎంత దేశభక్తి! ఎంత నెమ్మదిగా సంభావించి మాట్లాడ్తాడు! ఎంత చక్కని ఉపన్యాసం!"

"ఆపవే నీ కవిత్వాన్నీ" అన్నాను. టక్కున ఆగింది. ఆగి,

"నీకు పరిహాసంగావుందా కాంతీ, యిదంతానూ" అంది ఆదొక మోస్తరుగా నిలబడి.ఆ చంద్రకాంతిలో ఆమె ముఖంలోని ప్రతి భావమూ ప్రస్ఫుటంగా కనిపించకపోయినా, ఆ వాలకం, ఆ పెదవులు, ఆ కను

భామలు పెట్టిన తీరూ చూచి అర్థం చేసుకున్నా తానెంత తీవ్రంగా ఆ విషయాన్ని గూర్చి ఆలోచిస్తూ వుందో, అని.

"అయితే యేమంటావు కమలం?" అన్నాను.

"ఆడితే అటువంటివాణ్ణే పెండ్లాడాలి. అబ్బా! ఒకే తరగతి చదివే వాళ్ళు భార్యాభర్తలైతే- ఒకరు చదువుతూ వుంటే, మరొకరు వొళ్ళో తల పెట్టుకొని వింటూ వుంటే........... ఆహాహా! ఎంత మనోహరంగా వుంటుందీ..........."

"ఏమిటే నీ ధోరణీ నువ్వూనూ? అదెట్లా అవుతుందే? అతని కులం వేరు, నీ కులం వేరు. అనుకోగానే అవుతుందా పెండ్లి?" అన్నా.

"మధ్య కులమేమిటే? కులాన్నా చేసుకోడం!" అంది తేలిగ్గా.

"నిజమే, యిపుడంతే. సమయం వచ్చినపుడు పిల్లుల్లాగా వుంటారు."

"ఛా! ఇది అట్లాంటి ఘటంగాదు. ఏదన్నా తల పెడితే, లక్షలాది మంది వచ్చి, ఎదురుగ్గా నిలబడి అట్లా గొంతులు కోసేసుకుంటామన్నా సరే, నిలవను."

"ఆలోచించు కమలం! కులాంతర వివాహం అంటే ఊరికే అవుతుందనుకున్నావేమో! ఎన్నెన్నో కష్టాలకు లోనుగావలసి వుంటుంది. ఎన్నెన్నో అవమానాల్ని సహించాల్సి వుంటుంది! అందులో మీ లింగాయతలు అందరు బ్రాహ్మణేతరుల మాదిరిగా గాదు. బ్రాహ్మల్ని మీ కులంవారు శత్రువుల కింద పరిగణిస్తారు సంఘ విషయం వస్తే. ఇంకే బ్రాహ్మణేతరుడన్నా అయితే ఫరవాలేదు. అతడు బ్రాహ్మణుడు."

"కులం మాట వదిలెయ్ కాంతీ! అది నాకు వదలిపెట్టు. అది నామట్టుకు నాకడ్డం రాదు. అతను కులాన్ని పాటించేవాడేనా అన్నది విచారణీయం! అతని విషయంలో చిక్కొస్తుందేమోగాని, నా విషయంలో ఏలాటి చిక్కులూ రావు."

"ఇట్లా మాట్లాడే వాళ్ళే కడపట 'పొరపాటు పడ్డాం'అంటూ చింతిస్తారు. వివాహం అంత తొందరతో- ఉద్రేకపు నిర్ధారణలతో- అయ్యేపని గాదు. మన పెద్ద వాళ్ళకు, ఒక పెండ్లి చేసేటప్పటికి యేడు జతల చెప్పులరిగి పొ య్యేవట! అంటే, అయిన వూళ్ళన్నీ, ఎద్దులకోసం ఏది మంచిదో అని తిరిగినట్లు తిరగటం కాదు. అంత కాలం జరిగేదన్న మాట రాకపోకల వల్ల గుణగణాలు పరీక్షించడంలో. పోనీ, అతను సుముఖుడేమో కనుక్కోవద్దూ"

"అవునే అక్కా, అదెట్లాగే?"

"అంతకుముందు మనమింకొక విషయాన్ని చూడాల్సొస్తుంది. ఇంతకూ అతని వివాహం యిప్పటికే అయివుంటే? అపుడింకా కష్ట పడాల్సొస్తుంది. మొన్న అనంతపురంలో ఒకమ్మాయి నీ మాదిరే ప్రతిజ్ఞలు తీసిందట! తీరా తెలుసుకున్నాక ఆమె ప్రేమించిన పురుషుడి కంతకుముందే వివాహం అయినట్లు ఒక మిత్రం వల్ల కనుక్కుంది. దాని యేడుపు యింతంతగాదు. కొన్ని నాళ్ళాకే దుఃఖమట. యిట్లా వుంటుంది అవకతవకలుగా ప్రేమిస్తే."

ఈ విషయం కమలం వీపున దెబ్బ కొట్టినట్లయింది. హతాశగా "అవునే! ఆలోచించాలి" అంది.

ఇంతలో మమ్మల్ను వెదుక్కుంటూ శాంత వచ్చింది. అందరమూ దిగి కిందికి వెళ్ళాం.

మరునాడు బీచిలో మేం ముగ్గురం కూర్చొని మాట్లాడుకుంటున్నాం. కమలమే యేదో తన చిన్ననాటి విషయాలు చెబుతూ వుంది. ఇంతలో వాళ్ళిద్దరూ కొంత దూరంలో మాట్లాడుకుంటూ వస్తున్నట్లు శాంత చూచింది.

"వాళ్ళతో మాట్లాడదామా?" అంది కమలం ఆత్రత చూపిస్తూ.

"మనమ్మొగ్గురం లేచి తిన్నగా మాట్లాడుకుంటూ పోతూవుందాం. ఇంతలో వాళ్ళువచ్చి యెదుక్కుంటారు" అన్నాను.

"నీకు బలే బలే ఉపాయాలు తెలుసుకునే" అంటూ లేచింది. బయలుదేరాం. చూపులు ముందుకున్నా, మనసులు వెనక్కు చూస్తూ న్నాయి. కొందదూరం కెళ్ళాక,

"అయ్యో!" అంటూ నిరుత్సాహంగా కూలబడింది కమలం. వాళ్ళ వెనక్కి తిరిగి పోతూ వుండటం చూశాం. కొంతవరకూ హతాశుల మయ్యాం.

"సరే-లేమరి" అన్నాను దాని భుజం పట్టుకొని.

"ఊఁహుఁ. నే రాను" అంది కమలం మురిపెంగా.

అప్పటికి మాహాస్టలువాళ్ళంతా దగ్గరగానే వున్నారు. చూస్తున్నారు.

"చూశావా! వాళ్ళకోసం లేచి, వాళ్ళ వెనక్కి వెళ్ళారని, మళ్ళా వస్తున్నారు - అని వాళ్ళంతా అనుకుంటారు. మనం యింకా కాస్త ముందుకు వెళ్ళాలి అందుకు కాదన్నట్లుగా" అన్నాను.

మళ్ళా కొంతదూరం యిష్టంలేని నడక సాగించాం. తర్వాత అందర్లో కలుసుకొని హాస్టలుకు పయనించాం.

కాలేజీలో కనిపిస్తాడుగాని మాట్లాడ్డానికి వీలుండదు. రెండునాళ్ళు వరసగా బీచికి వెళ్ళాం. వాళ్ళు కనిపించలేదు. మూడోనాడు మొన్నటి లాగానే వస్తున్నారు. మొన్నటి మాదిరి చెయ్యకుండా, వాళ్ళు మాదగ్గిరి కొచ్చి, దాటిపోయే వరకూ కూర్చున్నాం. తక్షణమే లేచి వారి వెంట వెళ్దాం అనుకున్నాం. కాని, అనుమానంవేసి మళ్ళా కూర్చున్నాం. మా హాస్టలువాళ్ళు మాకొక ఫర్లాంగు దూరంలో యిటువైపున్నారు. వీళ్ళిద్దరూ ఒక ఫర్లాంగు అటు సాగిపోయారు అప్పుడే. ఈ దినం గూడా తటస్థపడ రేమో అనుకుంటూ బయలుదేరాం. మేము రావటం చూచి వాళ్ళిద్దరూ

నిలబడ్డారు కొంతదూరం వెళ్ళాక. మేమూ వెళ్ళాం దగ్గరికి. వాళ్ళు ప్రసన్నవదనం దాల్చారు.

"ఏమమ్మా, బాగున్నారా?" అన్నాడతను అందర్నీ చూస్తూ.

"అవునండీ!" అన్నాం.

"అభినందనాలు" అంది కమలం ఉబ్బుతూ.

"ఎందుకూ?" అన్నాడు చిరునవ్వుతో.

"పెద్దమూకను అమాంతంగా అరెస్టు చేయగలిగిన ఉపన్యాసం యిచ్చినందుకు!"

"అట్లా అయితే, అది మీకే లభించాలి, అందర్నీ తిరగ్గొట్టి నందుకు!" ఇంకా సమ్మెనుగురించీ - ఆ మాటా యీ మాటా మాట్లాడు కున్నాక, కమలంతోనే అతను మాట్లాడుతూ వున్నాడు ఇంకా గ్రూపు విషయాలూ అట్లాంటివి. "బాగా చదవాలి" అంటూ హెచ్చరిస్తున్నాడు. ఇంతలో మేము గవ్వలు ఏరుకుంటున్నట్లుగా నాలుగు గజాల దూరం వెళ్ళి ఏదో పెద్దపని వున్నట్లుగా ప్రక్కనుండే మిత్రుణ్ణి,

"ఇట్లారండీ సుబ్బయ్యనాయుడుగారూ!" అంటూ మరి నాలుగడుగులు ముందుకేశాం. అతను వచ్చాడు.

"ఇన్నాళ్ళూ మీదేవూరో తెలుసుకోకుండా వున్నందుకు క్షమించాలి" అన్నాను.

"దాంట్లో యేముందండీ? మాది ప్రొద్దుటూరు."

"ఆ యగ్నికి మీరు వాయువన్నమాట!" అంది శాంత.

మేం యింకా యేమేమో విషయాలు మాట్లాడుకుంటూ నడుస్తున్నాం. మా వెనకాల వాళ్ళుగూడా మాట్లాడుకుంటూ వస్తున్నారు నెమ్మదిగా. అట్లా చాలదూరం నడిచాక, పొద్దూ కూకింది. మా హాస్టలూ సమీపించింది. వాళ్ళు వెళ్ళిపోయారు.

సమ్మెనాటి ఆనందం మళ్ళా ప్రవేశించింది మా కమలంలో. దానికి ఆనందం కలిగితే ఉద్రేకం దానివక్కనే వుంటుంది. ఇక దయ్యమావేశించినట్టే దాన్ని. ఆ దయ్యంగూడా నన్ను చూచినప్పుడే విజృంభిస్తుంది. మాతోగూడా శాంతవుంటే శాంతంగానే వుంటుంది. ఇంకెవరన్నా వుంటే, "ఎంత నెమ్మదిమనిషి పాపం!" అనుకోవాల్సొస్తుంది.

రెండవబంతి భోజనానికెళ్ళాం. దాని తిండిచూస్తే నాకు బలే కోపం వచ్చింది. నెత్తిన మొట్టి బలవంతంగా తినిపించాను మరికాస్త. ముందే తోస్తే తొంభై ఆరామడలో పడేలాగుంటుంది మనిషి. పైగా పెండ్లిపిచ్చి! అందులో అన్నం తినకుండా వుండటం! తినడం అయిపోగానే నన్ను పైకి లాక్కెళ్ళింది. ఎంతో ఉత్కంఠతో.

"అతనికి పెండ్లికాలేదే!" అంది మళ్ళా.

"నేనతన్ని అడిగాను, కాలేదు అన్నాడు. అంటూ నావైపు అదొక మోస్తరుగా చూచి, నవ్వి, 'మీరు తప్పనుకోకపోతే తిరిగి, నేనూ అదే ప్రశ్నవేయొచ్చా?' అన్నాడు. 'దాంట్లోయేముందే? నేనూ అంతే' అన్నాను. అతనెందుకో చాలా తృప్తిపడినట్లు కనిపించాడు. ఇంకా ఎన్నెన్నో విషయాల గురించి మాట్లాడుకున్నాం. ఎంత బాగా మాట్లాడాడనుకున్నావ్?" అంది. మళ్ళా అంది:

"నీవెంత ఉపాయశాలివే? నాయుణ్ణక్కణ్నుంచి లాగేశావు! మీరేమ్మాట్లాడారేమిటి?" అని.

"అతనిది గూడా మా జిల్లా. ప్రొద్దుటూరట! చాలా సౌమ్యుడు. వీళ్ళంతా చూస్తే, పైకి పటపటలాడేవారు కారు. అంతా కార్యశూరులు! అతన్ని మాట్లాడిస్తే యెంతబాగా విషయాలు మాట్లాడాడు అనుకున్నావ్, ఆయన కన్నివిధాలా తగిన స్నేహితుడు" అన్నాను. అని,

"అయితే అతను అవివాహితుడైనంత మాత్రాన, నిన్ను చేసుకున్నట్టేనా? యిల్లలకుతూనే పండుగయినట్టేనా?" అన్నాను.

కమలం కాస్త ఆలోచనలో పడింది. వెంటనే అంది:

"అతనికి నాపైన ఒక విధమైన అభిప్రాయమున్నదని నాకు బాగా తెలుసు. నేను కనిపిస్తే నాపైన శ్రద్ధ తీసుకుంటున్నట్లు మాట్లాడ్తాడు. ఏమిటో....అంతా చెప్పడానికి మాటలు రావటంలేదు."

"కావచ్చు కమలం! అంత మాత్రంచేత కులాంతర వివాహం వరకూ దిగుతాడని భావించకు. అది సామాన్య విషయంకాదు గూడా! అసలు నీప్రేమ లోతెంతో తెలుసుకో! పట్టుదల యేమాత్రముండో ఆలోచించుకో! అసలు కొన్నాళ్ళయ్యాక, అతను సరియైనవాడు కాదంటూ నీప్రేమ మార్చుకుంటావేమో! ఆలోచించు, లేకపోతే, ఒక జీవిని, నీకొఱకుగా సర్వాన్నీ పరిత్యజింపచేసి, ఆఖరున అన్యాయం చేస్తావేమో!"

"ఇంకా నా హృదయాన్ని తెలుసుకోలేకున్నావా కాంతం?" అంది.

అంతకుముందటిది ఒకచిన్న విషయం చెప్పడానికిమరిచాను. తనకు యింటినుండి పదిహేనురూపాయలే వచ్చింది.అంతా నాదగ్గరికి తెచ్చింది. యివ్వబోతే తీసుకోలేదు నేను. బలవంతం చేసింది. కడపటికి కంటనీరు పెడితే తీసుకోవాల్సొచ్చింది. దాన్ని దేనికీ వాడకుండా భద్రంగా వుంచా. ఇంతలో రెండవ నెల బిల్లులుగూడా పడ్డాయి.నేను శాంతతో ఆలోచించి, ఒక పని చేశాను. నాకు ముఖ్యమిత్రులైన బాలికల దగ్గరికెళ్ళి కమలం విషయం కాస్తచెప్పి, ఒక పట్టీవేసి కొంత డబ్బు రాబట్టాను.రాబట్టి బిల్లు చెల్లించి, రశీదు భద్రం చేశాను.కమలానికి తెలీదీవిషయం. తాను గడువు సమీపించేకొద్దీ ఆదుర్దా పడసాగింది. అపుడే యెదురుచూస్తున్న మనియార్డరుకు బదులు జాబొకటొచ్చింది ఓదారుస్తూ. కాస్తకుంగినట్లు కనిపించింది. మేం మాత్రం ఏమీపలక్కుండా కూర్చున్నాం. జరిమానాతోగూడా గట్టిగడువు ఆనాటితో దాటిపోతుందనగా, తిన్నగా వార్డన్ దగ్గిరికెళ్ళి "ఏమండీ. మనియార్డరుకోసం చూస్తున్నా. వస్తూనే కడతాను. పేరు తీసెయ్యరుకదూ?" అందట! ఆమె "కట్టేసినట్లుందే" అని అకౌంటు

బుక్కు చూస్తే చెల్లించినట్లుండట! పట్టరాని సంతోషంతో బిర బిరా రూం కొచ్చింది. నేనూ, శాంత మాట్లాడుకుంటున్నాం. వాకిట్లోంచి అత్యా నందంతో, ఉత్కంఠతో, పరుగెత్తుకొనివచ్చి, 'కాంతం' అంటూ నా వొళ్ళో వాలి, ఆనందబాష్పాలు రాల్చింది. అదెందుకో నేనూహించుకో గలిగాను.

ఆలోపలనే అతడు చాలాసార్లొచ్చాడు హాస్టలుకు, కమలాన్ని పిలిచి మాట్లాడే వాడెక్కువగా. తర్వాత మాతోనూ మాట్లాడేవాడు. ఒక నాడు నేను,కమలం ఆర్థికవిషయం అతనికి చెప్పాలనుకున్నాను. శాంత త్వరపడవద్దంది. కొన్ని దినాలాగాను. ఒకసారి తానే నన్నడిగాడు "ఆమె ఆర్థిక పరిస్థితులు బాగా లేవనుకుంటాను" అని.

"నిజమే" అన్నాను. ఆమె విషయంలో అతను యెక్కువ శ్రద్ధ వహిస్తున్నవ్యక్తికాబట్టి వరుసగా చెప్పాను. నేను చేసిన పనికి చాలా ఆనం దించి, "చూడమ్మా, ఇతరులకు సాయంచేసి దాని ఫలాన్ని వా రనుభ వించడంచూస్తే యెంత తృప్తిగానో వుంటుందిగదూ? నీకాభాగ్యం లభిం చింది. నన్నుగూడా పంచుకోనీ దాన్ని.నాకుగూడా స్కాలర్‌షిప్ వస్తుంది. అయితే యిప్పటికేమీ యివ్వలేదులే! ఆమెకుగూడా వస్తున్నట్లాదినం బోర్డులో చూచాను. నాకు వచ్చేదంతా ఆమెకిచ్చేస్తా. అయితే ఆమె నందుకు ఒప్పించాలి" అన్నాడు. ఆయన ధార్మికబుద్ధికీ, త్యాగశీలానికీ ఎంతో ఆనందించాను.

మూణ్ణెల్ల పరీక్షల తర్వాత, సెలవులిచ్చారు. అందరం ఊర్లకు బయలుదేరాం. అందరం ఒకేబండికే! సామాన్లంతా వాళ్ళే ప్లాట్‌ఫారం పైకి పట్టుతూవుంటే మేము సాయంచేశాం. బండిలోగూడా మేమే సామాన్లు పెట్టుకున్నాం. కూలీకిగా ఒకదమ్మిడీగూడా కర్చుపెట్టలేదానాడు. మొట్ట మొదట అతనుదిగాడు. తర్వాత నేను, ఆతర్వాత నాయుడు ఆతర్వాత

శాంతం గుత్తిలో దిగుతుంది. పాపం, గుంతకల్లులో రైలుమారి బళ్లారిదాటి పోవాల్సింది కమలం ఒకతే! "అబ్బా! మా వూరు గూడా యీ కడపజిల్లాలో వుంటే యెంత బాగుండేది" అంది నవ్వుతూ ప్రయాణాన్ని గురించిన ప్రసంగం వచ్చినప్పుడు.

"వద్దువుగానిలే మాజిల్లాకు" అన్నా నేనూ భావగర్భితంగా.

ఆయనగూడా చిరునవ్వుకున్నాడట్లా మళ్ళీ.

సెలవులయి పోగానే చిన్న చిన్న మార్పులొచ్చాయి. క్లాసులో లెక్చరర్ ఒకాయన అన్నాడు :

"ఏమోయ్, కేశవరావ్! హాస్టలువదిలేశారటగా, నీవూ నాయుడూ?" ఈమాట కాంతం పూర్తిగా ఉచ్చరించిందో లేదో, శ్రీలక్ష్మి-

"ఆ కేశవరావెవరు?" అంది సానుమానంగా.

"అయితే, యేదో మొదలుపెట్టి యేదో చెప్పకపోతున్నట్లుందే" అంది సుజాత.

"ఆ ప్రసన్నం యెవరు? నాయుడెవరు? అన్నయ్య కత చెబుతానంటూ మొదలుపెట్టి..............." అంది కామాక్షి.

ఇంతలో కాంతం నాలుక కొరుక్కుంటూ నారాయణవైపు చూచింది. అతను చిరునవ్వు నవ్వుతున్నాడంతా తెలుసుకున్నాడు గాబట్టి. శాంతగూడా నాలుక కొరుక్కుంటూవుంది మందహాసం చేస్తూ.

కాంతం మళ్ళా మొదలుపెట్టింది:

"ఆ ప్రసన్నం కేశవరావుగారే! అన్నయ్యే! అసలాపేరు తగినట్లే పెట్లాం మేం. ఇపుడైతే పెట్టేవారంగాము. అపుడు కొత్తగాబట్టి ఉపేక్షాభావంతో పెట్టాం. ఎందుకు పెట్టవలసి వచ్చిందంటే మొదట ఆయన పేరు మాకుతెలీదు కాబట్టి. మాలో తొలినాడే ఒక జిజ్ఞాస బీజం వేశాడుగాబట్టి-అతన్నిగురించి మాట్లాడుకోడానికి మాకొక సంజ్ఞ కావల

సొచ్చింది. ఆయన ప్రసన్నవదనంతో మాకు కనుపించాడు గాబట్టీ - మేము వెటకారంగా మాట్లాడినా ఆ ప్రసన్నతను వదలలేదు గాబట్టీ- ప్రసన్నం అంటూ వ్యవహరించుకొనే వాళ్ళం. ఆ పేరు గూడా ఆ కమ లమే పెట్టింది. ఆ పేరే యెక్కడ గూడా వ్రాసుకుంటూ వుండేది. ఇప్పటికీ, అది ఆపేరుతోనే వ్యవహరిస్తుంది" అంటూంటే నారాయణ నవ్వాడు. తక్కినవారందరూ ఆశ్చర్యపడుతున్నారు మన అయ్యవా రిన్ని ప్రేమ వ్యాపారాలు సాగించి వచ్చారా అని. కుతూహలంగా "కానీండి" అన్నారందరూ.

"ఆయన ప్రసన్నం. నాయుడిపేరు మొదట తెలేదుగాబట్టి మిత్రుడు అని పెట్టేశాం. అప్పటి ఆడపిల్లల బృందంలో ప్రసన్నం మిత్రుడు, అంటేనే అందరికీ బాగా అర్థమయ్యేది. అంతుపట్టించకుండా గుట్టుగా కత సాగించుకపోదాం అని, ప్రయత్న పూర్వకంగా పట్టుక పోతూ తప్పటడుగు వేశాను" అని నవ్వింది కాంతం.

"హృదయ రంజకంగా, ఎదుటివారి హృదయంలో కుతూహ లాన్ని కల్గించే టట్లుగా, కథలు చెప్పడంలో మంచి నిపుణురాలు మా కాంతం" అంది శాంత.

"ఈ కథా కథనం మా కమలం దగ్గిరే నేర్చుకున్నా" అంది కాంతం నవ్వుతూ.

"కానీండి. కానీండి" అన్నారందరూ.

ప్రశాంత ముఖ భంగిమంతో మళ్ళా మొదలు పెట్టింది కాంతం: "ఆ అయ్యవారన్న మాటకు అన్నయ్య లేచి "అవునండీ పరిస్థితులట్లా వచ్చాయి" అన్నాడు. "పరిస్థితు లేమిటా?" అని మాలో జిజ్ఞాస పట్టు కొంది. వచ్చి వారంరోజు లయిందందరమూ. మాతో యిప్పటికి అయిదారు మార్లయినా బాతాఖానీ వేసి వుంటారు. ఒకసారి గూడా

అనలేదు. తర్వాత సాయంకాలం అడిగాం హాస్టలుకు రమ్మని. అన్నయ్య మాత్రం వచ్చాడు.

"నాయుడేడీ?" అన్నాం.

"అన్నం చేసుకోవద్దూ, యిద్దరమూ వస్తే యెట్లా?"

"అన్నం చేసుకోవడమేమిటి? హాస్ట లెందుకు వదిలారు?" అని అడిగాం ఆదుర్దాగా.

"పరిస్థితులట్లా వచ్చాయమ్మా! మా నాయుడికి ఇంటి నుండి వచ్చే ఆదాయం సున్న. మొదట నాకావిషయాలు అంతగా తెలీవు. పోనుపోనూ తెలిసింది. అతనికి వాళ్ళు కొంత, వీళ్ళు కొంతా యిస్తున్నారు. అది చాలదు. అందుకుగా యిద్దరం కలిసి, ఒక చిన్న యిల్లు తీసుకొని వంట పెట్టేశాం. నాకూ, అతనికీ వచ్చేది బాగా సరిపోతుందని నా అభిప్రాయం" అన్నాడు.

మద్రాసు జీవితం యిప్పటి మాదిరి కాదానాడు. రెండవ ప్రపంచ సంగ్రామం అయిపోయిన రోజులవి. అన్నీ అగ్గువగానే ఉండేవి. ఇండ్ల బాడుగలు, హోటల్ ఛార్జీలు, యింకా యేవైనా వస్తువులూ, అన్నీ చౌకగా వుండేవి! ఇపుడు మద్రాసన్ని విధాలా తగలబడి పోయింది. ఊరికే అట్లా వెళ్ళొద్దామనుకుంటే ఒక పెద్దనోటన్నా కావాలి.

సరే, యింకా యేమిటేమిటో మాట్లాడుకున్నాం. ఆదర్శాల గురించీ - మన ధర్మాల గురించీ - అందులో ఆడవాళ్ళ ప్రస్తుత విద్యుక్త ధర్మాన్ని గురించీ - కులాంతర వివాహాల ప్రాముఖ్యాన్ని గురించీ - యెన్నెన్నో విషయాలు ఉత్సాహంగా మాట్లాడుకున్నాం.

విషయాలు తెలిసేకొద్దీ, అతన్ని గురించి ఆలోచించడం ఎక్కువ చేసింది కమలం. ఆయనకొచ్చే పదహారు రూపాయల స్కాలర్ షిప్పు తన కివ్వడమే గాకుండా, ఇంటికేమేమో వ్రాసి, చాలినంత డబ్బుకంటే

యెక్కువే తెప్పించుకుంటూ నాయుడికోసంగా వంట చేసుకోడానికి దిగిన ఆయన చర్యను గురించి చాలా యోచించింది. సాధారణ హృదయం అట్లా ఒకరికోసం కష్టపడదు అనుకొంది. అట్లా అనుకొనేకొద్దీ తన మనసు అతనికి అధీనం కావటం యెక్కువై పోయింది.

క్వార్టర్లీ పరీక్షల్లో కమలానికి మార్కులు తక్కువే వచ్చాయి. చాలా తక్కువే వచ్చాయి. తాను చదివుంటేగా! దగ్గరికెళ్ళి "ఏంటి కమలం? ఇట్లా చేస్తే యెట్లా? నీవు స్కాలర్‌షిప్ తెచ్చుకొనేదానివిగదా, మార్కులు యిట్లావొస్తే కాన్సల్ చేస్తేనో! ఆ వొక్క ఆధారం పోతే కష్టంగదూ?" అన్నాను.

కండ్లల్లో నుండి జలజల రాలా యశ్రువులు. మొగమంతా ఒక మోస్తరుగా నల్లబడింది. యేడుస్తూనే :

"నిజమేకాంతీ, మరి నేనేంచేసేది? మనసు పుస్తకాలపైన నిలవడం లేదు. బలవంతంగా పుస్తకాలు తెరిస్తే ఒక్కొక్కసారి అక్షరాలేమో కనిపిస్తాయి. అవైనా తెలుసుకోడానికి మనసు నిరాకరిస్తుంది. ఆలోచనలు అంతులేకుండా సాగుతూ వుంటాయి. పట్టు దొరక్క రెప రెప లాడటంతప్ప, ఒక గమ్యం లేదు. ఎట్లాగయినా త్వరలో ఒక నిర్ధారణకు రావాలి, ఈ విషయాన్ని తేల్చుకోవాలి" అంది.

మరునాడే వాళ్ళ నాన్న నుండి జాబొచ్చింది కమలకు, దాంట్లో బ్రాహ్మణుల గురించే కాస్త వ్రాశాడు. "సంఘ పతనానికీ, ఇన్ని అనర్థాలకూ, అవకతవకలకూ కారకులు బ్రాహ్మణులు. చదువుకున్నా గూడా వారిలో ఆ ఆధిక్యతాభావం పోవడం లేదు. ఎంత సంస్కారమున్నా ఏదో కాస్తయినా, అది కనిపిస్తుంది. ఒకవేళ యెవరన్నా ఒక వాగ్దానం చేసినా, అది సంఘ మర్యాద విషయమైతే, బ్రాహ్మణ్ణి నమ్మకూడదు" - కమలం సెలవులలో యింటికి వెళ్ళినపుడు, వాళ్ళ నాన్నతో అన్నయ్యను

గురించి తెగపొగిడి చెప్పింది విషయాలెన్నెన్నో, ఎక్కడ పెట్టాల్నో పెట్టే స్థలంగూడా తెలీకుండా పొగిడేసింది. కాలేజీలో జరిగిన ప్రతి విషయంలోనూ అతనికి సంబంధం వుంది కాబట్టి అన్నీ చెప్పింది మెచ్చుకుంటూ. తన నోటికి అడ్డం లేకుండా పొగిడేసింది.ఇంద్రుడు,చంద్రుడు, వీరుడు, విక్రమార్కుడు అని పొగిడేసింది. ఆయనకు అనుమానం వేసింది. అంతా విని కులం యేమిటని అడిగాడట! చెప్పింది. అప్పట్నుండి పట్టుకుంది తెగులాయన మనసులో! ఈ పిల్ల హృదయంలో నాటుకున్నదానిని కూకటి వేళ్ళతో సహా పెళ్ళగించి వెయ్యాలని అతని సంకల్పం! అది యిప్పటికే వృక్షమై, వేళ్ళన్నీ శరీరమంతా వ్యాపించి పోయాయ్ అని తెలీదు. అటువంటి జాబులు వ్రాస్తూ, అపుడపుడూ సలహాలు చెప్పడం సాగించాడు. అవి చూచి, నాన్ననే అపార్థం చేసుకోడం మొదలు పెట్టింది.

"ఈప్సితార్థంబునకుఁ బారుహృదయ రుచియు,

నిమ్నమున కోడిగిలు నీరు నిలుపరాదు"

అని శ్రీనాథకవి చెప్పిందెంతో సత్యం! ఒక విషయమై పారే మనసును ఎవడూ ఆపలేడు. జలపాతాన్ని మధ్యలో యెవడడ్డగలడు కింద పడకుండా, గమ్యాన్ని చేరకుండా? కాస్త ప్రయత్నంతో దేహాన్నయితే ఆపగలంగాని, మనసు నాపలేము! ఒక వేళ ప్రయత్నించామో, అది విజృంభించి, బాహాటంగా పార్తుంది. అంతే.పైగా అడ్డేవారిని అపార్థం చేసుకుంటుంది! ఈ వైపు అపార్థం ఎక్కువైపోయేకొద్దీ, ఆ వైపు ఆకర్షణావేగం హెచ్చిపోతుంది. ఇక్కడే వాళ్ళ నాన్నకూ, కమలానికీ వచ్చిన పోటీ.

ఈ లోగా, కాలేజీ కార్యక్రమమాలలోనూ, మీటింగులలోనూ, ఉభయులూ పాల్గొనటంవల్ల, పరస్పరాకర్షణ ప్రబలిపోయింది. పరస్పరం అడ్మిరేషన్ అతిశయించిపోయింది. కలుసుకున్నపుడల్లా వారు సంఘ సంస్కరణ విషయం, సదాదర్శాల్ని ఆచరించే విషయం ఇట్లాంటి వన్నీ మాట్లాడుకొనేవారు. మాట్లాడిన అనంతరమే పరుగెత్తుకుంటూవచ్చి పూసగ్రుచ్చినట్లు చెప్పేది నాకంతా, ఇవన్నీ జరుగుతూనే వున్నాయి! తమ వివాహ విషయం ఎట్లా మాట్లాడుకోగలరు? ఈమె అతన్ని అతిగా ప్రేమిస్తూంది! అతనుమాత్రం అనుమానిస్తున్నాడింకా.

ఇట్లా కొన్ని దినాలు గడిచాయి. అర్ధసంవత్సర పరీక్షలు జరిగినాక యిండ్లకు వెళ్ళాం. ఆ సమయంలో నాకొక జాబువ్రాసిందా అమ్మాయి. దాంట్లో అంతా తన నాన్న గురించే. ఆయనొక గొప్ప శత్రువుగా వ్రాసిందా అమ్మాయి! ఇంతకూ అనుమాన విషయంపై వాదులాట! అతన్నే చేసుకుంటానని ఆ అమ్మాయి వాళ్ళ నాన్నకు చెప్పలేదు. అతన్ని చేసుకోగూడదని అతనూ వాదించలేదు. అయితే కులాల్ని మధ్య పెట్టుకొని, పరోక్షంగా, విషయంపై వాదించుకొనేవారు.

సెలవు లయిపోయిన కొద్దిదినాల్లోనే స్వాతంత్ర్యదినం వచ్చింది. జనవరి 26 అన్నది ప్రతిజ్ఞాస్వీకార దినంగా కొన్నేండ్లుగా ఏర్పాటై వున్నదేగదూ! ఆనాడు మేమంతా ఒకచోట చేరాం! బాలబాలికలతో నిండిపోయిందా ప్రదేశం. ఆనాడన్నయ్య మాట్లాడాడు! అన్నయ్య మాట్లాడిన చోటల్లా నాయుడు మాట్లాల్సిందే! అన్నయ్య, యెపుడుగూడా మాట్లాడబోయే విషయాన్ని బాగా ఆలోచించి, వ్రాసి చదవుకొని తయారుగా వస్తాడు. ఏమీ కొతుకులేకుండా మాట్లాడేస్తాడు! ప్రేక్షకజనాన్ని ఆకర్షించే ధోరణి అప్పటికే ఆయనకు తెలుసు బాగా! ఆనాడాయన, దేశంలోని అస్వతంత్రతను గురించీ-సంఘపతనమును గురించీ-సంస్కరణ విధానాల్ని గురించీ యెంత బాగా మాట్లాడాడనుకున్నారు! అతను

మాట్లాడుతూ వుంటే కమలం స్థితి, నాగస్వరం ముందున్న నాగుబామే! ఆ వుద్రేకంలో, ఆ ధోరణిలో అన్నాడు: "ఈనాడు చదువుకొన్న, చదువుకుంటున్న ప్రతి యువతి, ప్రతి యువకుడు, స్వకులాన్ని విస్మరించి, పరకులంలో వివాహంచేసుకొని, ఒక్కొక్క హరిజనుణ్ణి చేరదీసి ఉద్ధరిస్తే సంఘం చక్కబడుతుంది-సంఘైకమత్యం చేకూరుతుంది, అదే అన్నిటికీ కీలకమై, దేశాన్న త్యాభ్యుదయాలకు మార్గదర్శక మవుతుంది- ఇట్టిదే ఈనాడు తీసుకోవలసిన ప్రతిజ్ఞ." కమలంకిది ఒక ఊతకర్ర వాక్యమైంది.

ఆనాడానందంతో హాస్టలు చేరుకోగానే, కమలం గంభీరంగా నా దగ్గిరికొచ్చి కూర్చుంది, కాసేపు నిశ్శబ్దంగా కూర్చుని ఆలోచించింది. అంతకంతకూ ముఖంలో ఆనందతేజస్సు అతిశయించింది. ఒక మందహాసం పెదవులపై తాండవించింది. కండ్లు కలకలలాడాయి. తటాలున నా రెండు భుజాలు పట్టుకొని ఊచి-

"నేను ప్రతిజ్ఞ తీసుకున్నా" అంది.

"ఏమిటి?" అన్నా ఉపేక్షగా తెలిసిందేగదా అని.

"నీకుత్సాహం లేనట్లుంది! నే చెప్పడ మెందుకు?"

"ఉత్సాహంకాదే, నాకు తెలీందయితేగా!"

"తెలిస్తే చెప్పు చూద్దాం."

"నీవేచెప్పు వింటాను."

"తెలిసినవాళ్ళకు చెప్పడ మెందుకు? దండుగ!"

అయితే చెప్పింది అంతకంటే కొత్తవిషయంయేమీలేదు. ఈ జీవితంలో-అంటే. ఈ దేహంలో ప్రాణముండగా, నాకు వివాహం అంటూ జరిగేటట్టయితే, అది అతనితోనే! లేకపోతే ఆజన్మాంతం బ్రహ్మచారిణిగా వుంటాను. నా దీక్ష కెవడడ్డొచ్చినా నిలపను- ఇదీ తన ప్రతిజ్ఞ! "ఇట్లాంటి ప్రతిజ్ఞ యెవరన్నా తీసుకుంటారా కమలం?" అన్నా నేను భయంగా.

"ఇం కెట్లాంటిది తీసుకోవాలి?"

"అయితే, అతను నిన్ను వివాహం చేసుకోవాలని వున్నాడా?"

"తెలీదు."

"యేమిటే నీ పిచ్చి! తెలియకపోతే అతని కోసం ప్రతిజ్ఞ తీసుకోడం?"

"ప్రేమించాను గనుక!"

"ఏమిటే నీ ప్రేమ? దానికి అవధులు లేవా యేమిటి? అతను నిన్ను వివాహం కోసం ప్రేమించకపోతే?"

"అయితే యింకెట్లా ప్రేమించాడనీ?"

"అది నన్నడిగితే?"

"అతను ప్రేమించకపోతే బ్రహ్మచారిణిగా వుంటాను."

"నీ మొహం!"

దానికి కోప మొచ్చింది. బుర్రున వెళ్ళి మూల పడుకుంది అలిగి చాప పైన. నే వెళ్ళి దగ్గర కూర్చున్నాను. తన రెండు చెంపలు పట్టి తల యిట్లా తిప్పాను. పద్మాసనం వేసి కూర్చున్నాను ప్రక్కన. నా కుడికాలి మడతంతా దాని కడుపుపైన పడింది.

"చూడు కమలం, నిన్ను నేను తప్పు చేశా వనటం లేదు. పొర పాటు చేశావని మాత్రం అంటున్నా అంతే" అన్నాను.

"ఎట్లా?"

"నీ వేమో అతన్నే చేసుకోవాలని ప్రతిజ్ఞ తీసుకున్నా నంటున్నావు. అతను నిరాకరిస్తే బ్రహ్మచారిణిగా వుంటా నంటున్నావు. అంతే గతా నీ యర్థం?"

"అవును. ప్రతిజ్ఞార్థ మంతే! నా హృదయమూ అంతే!"

"తన కోసంగా అంత ప్రతిజ్ఞ తీసుకుంటున్నా వంటే, తాను నీ ప్రేమ యెడ కృతజ్ఞుడుగా వుండాలి గదూ?"

"తప్పక."

"కృతజ్ఞుడైతే, తాను తప్పక పెండ్లాడ్తాడుగా!"

"నిజం."

"పెండ్లాడకపోతే?"

"అయితే, ఒక కృతఘ్నుడి కోసం, జీవితాన్ని తలక్రిందులు చేసే ప్రతిజ్ఞ తీసుకోవచ్చా?"

"అట్లాంటి మాటెందు కంటావు కాంతీ?"

"నే ననుమానించడం లేదు కమలం. ఆతని సంస్కారాన్నీ, నైతికాన్నీ నే ననుమానించడం లేదు. అతని ఆ గుణగణాలకూ, నిన్ను వివాహం ఆడడానికీ, సంబంధం యేమిటి? వివాహం తన హృదయేచ్ఛను బట్టి వుంటుంది. నిన్నతను భార్యగా స్వీకరించడాని కిష్టపడక పోవచ్చు. ఒకవేళ చేసుకుంటే మహానందం! నా కంత కంటే యేం కావాలి? అయితే, తన హృదయాన్ని తెలుసుకోకుండా, అట్లా చెయ్యడం శ్రేయస్కరం కాదని మాత్రం అంటున్నా. ఇపుడైనా కాస్త మార్చుకో ప్రయత్నించు."

"ఛీ, నాలుక ఒకటా రెండా? నా హృదయం కత నీ వింకా అర్థం చేసుకోలేకున్నావు. నా హృదయంలో ద్వైదీభావం లేదీ విషయంలో. దీనికి తిరుగులేదు."

తాను యింత మూఢురాలుగా యెందుకు ప్రవర్తించిందో నా కర్థంకాలేదు. విషయాన్ని గురించి ఆలోచించడమే నిరాకరించింది.

అతనిచేత ఆకర్షింపబడి, అతన్నే చేసుకోవాలి అన్న ఉత్సాహమూ, ఉబలాటమూ, ఉత్కంఠ, ఆ విషయంలో ముందు వెనుకలు, మంచిచెడ్డలూ, ఆలోచించకుండా చేసేశాయి అపుడు—

ఆనాటి యీమె ప్రతిజ్ఞ తర్వాత కాస్త సడలింది. ఆ ప్రతిజ్ఞే అతని మెడకొక కొక్కెమై తగుల్కొంది."

అని కాంతం అనేటప్పటికి - అత్యుత్సాహంతో,

"ఏమిటేమిటీ - అంత ప్రతిజ్ఞ తీసుకొన్న మనిషే మోసం చేసిందా?" అంది ఆతురతతో శ్రీలక్ష్మి. 'ఛీఛీ' అంది అనసూయ. అయ్యయ్యో అంది సుజాత.

"నిదానించండి! త్వరపడితే యెట్లా? అరే, తొమిదిన్నరయిందే! మీకు నిద్రవస్తుందేమో" అంది కాంతం.

"ఇంకేం నిద్రమ్మా! ఇంతింత విషయాలు విన్నాక, కంటిపై రెప్ప పడుతుందా యీరాత్రి! కానీండి" అన్నారందరూ.

కాంతం మళ్ళా చెప్పుకుపోసాగింది:

"కమలం, తన ప్రేమ నిష్కంటకము - నిష్కపటము - నిష్కళంకము అని వాదింప మొదలుపెట్టింది. ప్రతిఫలాపేక్షలేని ప్రేమ అని వచించింది. ఆమె యెంత పొరపడి, పొరపాటుగా ఆ మాట అన్నదో నేనపుడే గ్రహించాను. ఆదర్శ ప్రేమను, దివ్య ప్రేమను ఆమె తన వివాహప్రేమ కిందికి దింపింది ఏకపక్షంగా.

పొరపాటని చెప్పితే ఒప్పుకోదు. కడకు అన్నాను:

"కమలం ఒక విషయం విను. తల్లిదండ్రుల ప్రేమకూ భార్యాభర్తల ప్రేమకూ భేదం వుందంటావా?"

"భేదమేముందీ?" అంది ఆదర్శంగా.

"తాత్త్వికార్థ విషయం అట్లావుంచు. దాని గురించిగాదు మన యీ ప్రసంగం! లౌకికార్థం ప్రకారం భేదముందా, లేదా?"

"ఉంది."

"అన్నాచెల్లెళ్ళ ప్రేమకూ, భార్యాభర్తల ప్రేమకూ భేదముందా?"

"ఉంది."

"అయితే, నీవు తల్లినీ, తండ్రినీ, అన్ననూ, చెల్లినీ, ఇతరుణ్ణి భర్తనూ - ఒకే దృక్పథంతో ప్రేమించగలవా?

"అదెట్లా అవుతుంది?"

"అయితే నీ ప్రేమ వ్యక్తి స్థానాన్నిబట్టి మార్తుందని తేలిందా?"

"అన్న, భర్త, ఇతరుడూ, ఒక్కటి కాదుగదా?"

"కాదు."

"అందర్నీ ప్రేమిస్తావుగా"

"నిజమే!"

"అయితే, ఆ వ్యక్తినే నీవు వేరేదృష్టితో చూస్తూ, అతని సమాగమాన్నే యెందుకు కోర్తావు?"

"అయితే నీ ప్రేమకు ప్రతిఫలాకాంక్ష వుందని ఒప్పుకుంటావా?"

"అదెట్లా?" అంది ఓడిపోతానేమో అనే భయంతో.

ఇకచాలు, చెప్పేది విను! విశ్వ ప్రేమకూ దీనికీ అంటగట్టకు. విశ్వ ప్రేమ అయితే ఫలానావాడు నాకు భర్త గావాలని ఎందుకు కోరాలి? భర్త ప్రక్కలో పడుకోడానికీ తండ్రి ప్రక్కలో పడుకోడానికీ భేదమేముంది? అసలు వివాహేచ్ఛవుంటే విశ్వప్రేమ యెట్లా అవుతుంది?

కాబట్టి ఇది లౌకికప్రేమ. ఇది కామమోహాలతో సంబంధం గలది. దీనికి ప్రతిఫలాకాంక్ష వుంది. వివాహ సుఖమే దీనికి ప్రతిఫలం. ప్రతి ఫలాపేక్ష లేనినాడు ఆ ప్రేమే వుండదు. ఎదుటి హృదయంనుండి ప్రేమ ప్రవహిస్తేనే యీ హృదయంనుండీ ప్రవహిస్తుంది. ఆ ప్రవాహం ఆగిపోతే యిదీ అగిపోతుంది? ప్రతిఫలాపేక్షతోడి ప్రేమ అంతే. నీవంటే సరిపడనీ - నీ చేష్టలు కిట్టనీ - నీ గాలే సహించనీ - అన్న ఒకడున్నా డనుకో - ప్రేమతో వాణ్ణి వెళ్ళి కౌగిలించు కుంటావా? అతన్ని చూస్తే నీకూ అనిష్టత కలుగుతుంది! అంతే భర్త విషయంగానీ - ప్రియుడి విషయంగానీ. మనకోసం పరితపించే వారైతే, మనం గూడా ఎంతో బాగా ప్రేమించి, భారతాలంత జాబులు వ్రాసుకుంటూ కూర్చుంటాం. ఎపుడూ వాళ్ళ గురించే ఆలోచిస్తూ వుంటాం. వారి సన్నిధిలోవుండి ఆనందింప కోర్తాం. వాళ్ళే కోపిష్ఠులు, అనుమాన పూరితులు, మొగం చిటపటలాడించే పురుషులూ అయితే, మొదటి ధోరణిలో ప్రేమింపలేము.

ఇన్నెందుకు? నిన్నెంతో ప్రేమతో కని, పెంచి, చదువు చెప్పి స్తున్న తండ్రికి నీపైన ద్వేషమెందు పుట్టింది? అతనిమాట వినలేదని గదా! పూర్వం మాదిరే యెందుకు ప్రేమించలేడతను? నీవు ప్రతిగా యేం చేస్తున్నావు? అతన్ని ద్వేషిస్తున్నావు. పూర్వం మాదిరే ప్రేమించ గూడదూ? ఏమయిందా ప్రేమ. తెలిసిందా దాని తత్త్వం? అంతే అనుకో ప్రసన్నం ప్రేమగూడా! ఒకవేళ నీ హృదయాన్ని అతనర్థం చేసుకొని, ప్రతిగా నిన్ను ప్రేమిస్తే నీవు ప్రేమిస్తావుగాని - దానికి మారుగా నిన్ను, ద్వేషించి, మాట్లాడడం చాలించి, పైగా నీపైన దుష్ప్రచారం చేస్తా డనుకో అపుడతన్ని యీ విధంగా ప్రేమించగలవా? అతనికోసం ప్రాణత్యాగ మైనా చేస్తానని ప్రతిజ్ఞ తీసుకోగలవా?"

ఆమేమీ పలకలేదు.

"కమలం, నన్నేమీ అపార్థం చేసుకోకు. నేను బ్రాహ్మణ బాలికను కాబట్టి యిట్లా అంటున్నానని అనుకోకు. నీవనుకోవని నాకు తెలుసు. చూడు! మా బ్రాహ్మణ కుల ఆచారాలకూ బ్రాహ్మణేతరుల ఆచారాలకూ యెంతో తేడా వుంది. అవి మూర్ఖమైనవే అనుకో. మూఢమైనవే అనుకో. కావాలని మొదట్నుండీ అట్లా పట్టుకొస్తున్నవే అనుకో. అయినా ప్రస్తుతం మనం పరికించినట్లయితే, ఎంతో భేదం కనిపిస్తుంది. అసలా బ్రాహ్మణులలోనే యెన్నో తెగలు, బ్రాహ్మణేతరులలో వున్నట్లే! శూద్రాదుల లోనే ఒకరింట్లో ఒకరు భోంచేయని కులాలెట్లయితే వున్నాయో, మాలోనూ వున్నాయి కొన్ని సందర్భాలలో చూస్తే.

అసలు మీ లింగాయతుల విషయం యింకా శోచనీయం! మీకు బ్రాహ్మలూ, యితరులూ, అంతా ఒకటే. బ్రాహ్మణాచారాలకూ, లింగాయతుల ఆచారాలకూ బద్ధ వైరుధ్యం. ఎంత చేసినా యిట్లాంటి వివాహానికి మీ తల్లిదండ్రులు లొప్పుకోరు. ఇటు తలిదండ్రులను ఉల్లంఘించిపోతే అక్కడ మాత్రం సుఖంగా వుంటుందా? ఎపుడైతే తమ యిష్టానికి వ్యతిరేకంగా వచ్చిన పిల్ల యింట్లో వుందో, చీటికి మాటికీ ఏదో కల్పించి అంటూ వుంటారు. అసలు యిండ్లలోనికి రానివ్వరు మొదట! ఇంకా...."

"ఇక చాలు కాంతీ! ప్రస్తుతం నిలుపుదాం యీ విషయం" అని తిరిగి పడుకొంది. నేనూ లేచి శాంతిరూం కెళ్ళాను.

తానతన్ని ప్రేమిస్తున్నట్లు అతని కెట్లా తెలియజెయ్యటం అన్న విషయాన్ని గురించి ఆలోచింప మొదలుపెట్టింది. తనను ప్రేమిస్తున్నాడని యెట్లా తెలుసుకోవాలి? అసలు వివాహం చేసుకుంటాడా? ఇల్లాంటి తర్జనభర్జనలు జరిగా యామె మెదడులో. అతడెపుడూ తనతో ప్రేమ విషయం మాట్లాడలేదు. అయితే తన కోసం అంత శ్రద్ధ యెందుకు వహిస్తున్నాడు? ఆ శ్రద్ధ నా పైన్నే గాదుగా! తన మిత్రుడు నాయుడు,

ఇంకా కొంతమంది మిత్రులు హరిజనులు- అందరిపైనా గూడా శ్రద్ధ చూపుతున్నాడు. కాదు కాదు; నాపైన ప్రత్యేక దృష్టి వుందతనికి. నన్ను చూస్తే యేదో దొరికినట్లుగా ఉబ్బిపోతూ ఉంటాడు. ఎన్నెన్ని విషయాలో ఉత్కంఠతతో మాట్లాడ్తాడు. తన రహస్యాలు, వ్యక్తుల్ని గురించిన తన నిశ్చితాభిప్రాయాలు- ఇల్లాంటివన్నీ మాట్లాడ్తాడు. అతనికి నన్ను చేసుకోవాలనే వుంది. అయినా తానై అడిగితే యెంత బాగుండేది? పోనీ నేనే యెందు కడగ్గూడదు? ఇది స్త్రీ నైజగుణానికి విరుద్ధమేమో! ఇందులో మళ్ళా తేడా యేముంది?- అడుగుతా ననుకో. నిన్ను అన్యథా ప్రేమిస్తున్నానంటే? తర్వాత యీ భూమిపై బ్రతకగలనా? ఇల్లాంటి తర్జనభర్జనలతో బాధపడ జొచ్చింది.

ఇట్లా వుండగా వీళ్ళిద్దరి మధ్యా చిన్న తమాషా జరిగింది. ఆమెతో అతనేదో చెప్పాడు. చేస్తానని మాట యిచ్చింది. చెయ్యలేదు గాబోలు! అతనికి కోపమొచ్చింది. నే ఫలానా పని చేస్తాను అన్న తర్వాత తల ఎగిరి పోతూన్నా దాన్ని నిర్వహించాల్సిందే అనే పట్టుదల మనిషాతను. తన భార్య కాబోయే స్త్రీ గూడా అంత నిజాయితీగా వుండాలిగా! అందుకు కోపమొచ్చిం దతనికి. అందులో ప్రేమికా ప్రేమికుల మధ్య అటువంటి సమయాల్లో అట్లాంటి కోపాలు రావటం సహజమే? ఆమె తన మాటకు ప్రాధాన్యమిచ్చి గౌరవించలేదని కించపడ్డాడు. ఆమె హృదయంలో తన మాటకు విలువ లేదనుకున్నాడు. తనయెడ గౌరవముంటే తాను చెప్పిన మాట ప్రకారం చేసేదనుకున్నాడు. ఈ ధోరణిలో ఆలోచించేకొద్దీ ఆమెకు తనయెడ అంతప్రేమ లేదేమో, అన్నంత సందేహాన్ని తెచ్చిపెట్టింది. తనను ఆటపట్టిస్తూ వుందనుకున్నాడు. ఇట్లాంటి వాళ్ళపైన మన అధికార మేమిటి? అని చాలించుకున్నాడు మాట్లాడ్డం! దాదాపు నాలుగురోజులు మాట్లాళ్ళేదు. రోజూ నాకొచ్చి చెప్పేది- "అతనెంత సీరియస్‌గా వున్నా డనుకున్నావ్? మాట్లాడదామని నేను ప్రయత్నిస్తే, అవకాశ మివ్వ

కుండా పారిపోవడమో, లేకపోతే యెవరన్నా స్నేహితుడి భుజంపై చెయ్యేసి మాట్లాడుతూనో వుంటాడు" అని. ఆ నాన్నా ళ్ళు దానిపని, నీళ్ళలో తల అదిమిపట్టిన ప్రాణిమాదిరే వుండింది.

నాలుగోనాడు తెగించి, అతన్ని నిలవేసి,

"మీతో పనివుంది, మాట్లాడాలి" అంది.

"మాతో యేంపని?" అన్నాడయిచ్చగా.

"చాలా పనుంది, చాలా మాట్లాడాలి."

"సరే."

అవస్నీ యిపుడెందుకు గాని, ఇద్దరూ ఏకాంతప్రదేశాన్నే యెన్నుకొని వెళ్ళారు. ఆమె కథ వ్రాస్తున్నాననో, మరేదో ఆలోచిస్తున్నాననో-యేదో - అట్లా ఇట్లా తిప్పి, కడకు తాను అతన్ని ప్రేమిస్తున్నట్లుగా అర్థమిచ్చేటట్లు చెప్పింది.

వ్యక్తి, యే వస్తువు కోసమై-తదేక ధ్యానంతో నిరీక్షిస్తూ వుంటే-ఆ వస్తువు లభిస్తే యెంత సంతోషపడతాడో-ఏకైక లక్ష్యంగా ఏ వ్యక్తి ప్రేమైతే పొందాలని ఆశిస్తూ, ఆరాధిస్తూంటే, ఆ వ్యక్తే స్వయంగా తన ప్రేమను వచించి, తానే అధీననయిపోయానంటే ఎంత ఆనందపడతాడో చెప్పాల్నా? ఆ సమయంలో అన్నయ్య అమృతోపమానమైన ఆ పలుకులు విని ఆనందోదధిలో ఓలలాడాడు. అటువంటి సమయంలోనే యేదో కవి,

"ఉల్లాసముతో, హృదయ సముద్రము
కల్లోలితమై గగనము నంటగ
అమాంతమ్ముగా ప్రేమసాగరము
పొంగి తుంగమయి అవధులు మీరగ"

అట్లా అయిపోయిందాయన హృదయస్థితి అప్పుడు! తటాలున తన భావసంచారాన్ని ఆపాడు. హృదయం మామూలుస్థితిలో వున్నవాడు లాగా అన్నాడు :

"అవును కమలం. నీవనుకొన్న వ్యక్తి సోదర ప్రేమతో చూస్తున్నా డనుకో." ఆ మాటలంటున్న వ్యక్తి నిర్వికారంగా కనబడటం చూచి, కమలం నిశ్చేష్టురాలైంది. తన చూపులేమి చూస్తున్నాయో తనచెవు లేమి వింటున్నాయో. నిరాశతో, అవమానంతో మిళితమైన భావాగ్ని తన హృదయాన్ని దహించివేయగా, తజ్జనితమైన దాహధూమము మొగాన్ని కప్పేసిందా అన్నట్లయిందామె మొగం. ఎంతెంత తీవ్రభావ ఝంఝూమారుతాలామె హృదయంలో లేచాయో మనం ఊహించాల్సిందే! ఆ స్థితిచూచి లోలోపల నవ్వుకున్నాడు. జాలేసింది. అయ్యో అనుకున్నాడు. స్త్రీ సహజ మార్దవమూ సిగ్గూవిడిచి నేనొప్పుకుంటానో లేదో అనే భయంతో తన ప్రేమను వచించిందే-అని సానుభూతి హృదయంలోంచి పొంగిపొరింది. ఇంతలో కన్నీళ్ళు రాలుస్తూ గద్గదిక స్వరంతో-

"అంతేనా?" అంది కమలం.

"వివాహం చేసుకుంటాడనుకో" అన్నాడు మందహాసం చేస్తూ.

ప్రజ్వరిల్లి పటపటార్భాటంతో దహించివేస్తున్న దావానలం యొక్క, ఉష్ణము, ధూమమూ ఏవిధంగా అయితే మేఘవృష్టికి ఆరిపోయి చల్లబడతాయో, అమృతతుల్యమైన అతని పలుకులనే చినుకుల వల్ల తన హృదయాగ్ని చల్లారింది. మరుక్షణమే, ముఖం తద్ధూమరహితమై కలకలలాడింది. దుఃఖాశ్రువులానందాశ్రువులైనాయ్. ఆశ్చర్యానందోద్భవాలతో హృదయకవాటం తెరుచుకునే టప్పటికి కండ్లుగూడా విప్పారినాయ్. ఆమె ఆనందాన్ని భరించేస్థితిలోలేదు. అమాంతంపణికి కండ్లుమూసుకుంది సోలిపోతూ.

"కమలం! నాకూ అభిప్రాయముండబట్టి సరిపోయింది. కాని, నేను నిరాకరించినట్లయితే నీ ప్రతిజ్ఞ యేమయ్యేది?" అన్నాడు జాలిగా. తనకింకా నోటమాట తెమలడంలేదు. ఏదో మింగుతున్నట్లుగా మింగి, చేయిచాపి, దగ్గరలో కనిపించే సముద్రాన్ని చూపింది.

అతనాక్షణం యెంత సంతోషపడ్డాడో చెప్పడం కష్టం! తన కోసం అంత ప్రతిజ్ఞతీసుకొని, ప్రాణత్యాగంకూడా చేస్తానంటున్న వ్యక్తినిచూచి, అతను, తన అదృష్టాన్ని గురించీ - వ్యక్తిత్వాన్ని గురించీ-ఎంత ఆలోచించివుంటాడో, ఎంత ఆనందపడి వుంటాడో ఆలోచించండి. ఆమె తనకోసమే ప్రపంచంలో సృష్టింపబడినట్లు గర్వించాడు. కాసేపు నిశ్శబ్దంగా కూర్చున్నాక అతనేదో మాట్లాడ్డానికి నోరుతెరిచాడు. కమలం తమకంతో, మొగంపైకెత్తి అర్ధనిమీలితనేత్రాలతో అతని ముఖంలోకి చూస్తూవుంది. అతని ముఖంపై తాండవిస్తున్న ప్రేమప్రకాశాన్ని ఆస్వాదిస్తున్నాయామె చూపులాత్రంగా. అతనన్నాడు :

"బాగా ఆలోచించు కమలం! త్వరపడకు. ఇపు డెంత తొందర పడితే అంతగా దుఃఖించాల్సొస్తుంది వెనక! కులాంతర వివాహాలిపుడెంతైనా ఆవశ్యం, ఆదర్శం గూడాను. అయితే, వీటికి ప్రతి ఘటనవున్న యీ కాలంలో-ఎంతో పట్టుదల గలవారూ, స్థిరబుద్ధి గలవారూ, ఆపని చెయ్యగలరే గాని, చంచల చిత్తులు చెయ్యలేరు. నిమిషనిమిషానికీ చిత్తాన్ని మార్చుకొనేవారు చెయ్యలేరు. తాత్కాలి కోద్రేకులు బొత్తిగా చెయ్యలేరు. ఆలోచించు."

"నేనెంతో ఆలోచించాను; ఆలోచించకుండా యీ నిర్ధారణకు రాలేదు."

"ఇంకా ఆలోచించాలి. ఎన్ని కష్టాలు వెనక వస్తాయో గమనించాలి."

"ఒకవేళ కష్టాలంటూ వస్తే నేనొక్కర్తెనే భరించ బోవడంలేదు. అట్టి కష్టాలకు భాగస్వామిని మాత్రమే అవుతాను. నాకోసం కష్టాలు పడేవ్యక్తియొక్క కష్టాల్ను పంచుకోడంకంటే నాకు సంతోష మిచ్చేది మరేముంది?" అంటూ సగర్వంగా, సూటిగా చూచింది అతని కండ్లల్లోకి.

అతను గూడా తృప్తిపడ్డాడు. మళ్ళా అన్నాడు :

"సరే. నా తత్వం బాగా తెలిసిన తర్వాత గదా నన్ను ప్రేమించాలి? నీకేం తెలిసినట్లు?"

"తెలుసు! తమ తత్వం నాకు తమ కంటే బాగానే తెలుసు."

"పోనీ, ముఖ్యమైన విషయం ఆలోచించావా?"

"అంటే?"

"తలిదండ్రుల విషయం?"

"చాలా బాగా"

"వారు నీపైన ఆధారపడే వాళ్ళన్నావు!"

"అవును."

"అటువంటప్పుడు నీవిట్టి సాహసానికి, వారికివిరుద్ధంగా పూనుకోగూడదు. వాళ్ళ మనస్సు నొప్పించకు,నిన్ను నమ్ముకున్న వాళ్ళ మనస్సు నొప్పించడం మంచిది గాదు."

"వాళ్ళ మనసు నేనేమీ కావాలని నొప్పించను. నా వివాహానికి వాళ్ళిష్టపడితేసరి! లేకపోతే పోనీ! వాళ్ళ మనసు వాళ్ళు కష్టపెట్టుకుంటూ వుంటే నేనేం చేసేది?"

ఆయన సంతోష పడ్డాడు. ఎందుకంటే తలిదండ్రుల్ని వదిలేస్తున్నదని కాదు, ఒక ఆదర్శాన్ని ఆచరించడంలో తన మాదిరే, యెవర్నీ లెక్కించకుండా, ప్రాణాన్ని గూడా యిచ్చే త్యాగం ఆమెలో కనిపించి నందుకు, తనకు తగిన సహధర్మచారిణిని ప్రసాదించినందుకు భగవంతుణ్ణి మనసులో పొగుడుకున్నాడు. ఆమె త్యాగ శీలానికి మురిసిపోతూ-

"అంతే కమలం! ఆదర్శంకోసం, సత్యంకోసం, వాటిని ప్రతిష్ఠించడం కోసం తద్వ్యతిరేకు లెవరన్నా వుంటే వదలబడ వలసిందే" అన్నాడు.

ఆమె ఆనందం చెప్పశక్యం కాదిపుడు. ఆమె యే స్వర్గ సింహాసనం పైన్నో కూర్చున్నట్లుం దిపుడు. కలుషితమైవున్న యింత ప్రపంచం తన మనసుకే రాలేదు. అంతా ఆదర్శ ప్రపంచంలో, తానూ తన ప్రియుడే పరస్పరం పాలక, పాలితులై నట్లుగా కూర్చుంది. ఆ భావావేశంలో ఏమేమో చెప్పింది ప్రియుడికి- తనకున్న ఆదర్శాల గురించీ గాంధీజీ ఆశయాలకు తానెట్లా దాసోహం అని వాటి నాచరించాలని యిదివర కేవిధంగా దీక్ష వహించిందీ - సంఘంలోని లోపాలు చూచి దాని సమైక్యత కెట్టి కృషిచేయ సంకల్పించు కొన్నదీ - అంతా ఒక గంటసేపు చెప్పింది. తన నాన్న పైనగూడా ఎంత అసహ్యంగా చెప్పాల్నో అంత అసహ్యంగా చెప్పింది. దానికతను మందలించాడు గూడా. తొందరపాటు మనిషి అన్న భావలేశం కలిగింది గూడా.

ఆ వేసవిలో కొన్ని చిక్కులొచ్చా యామెకు. ఈమె పలుకులూ- మెచ్చుకోడాలూ, మించి పోవడం చూచి పూర్తిగా అనుమానపడ్డాడు వాళ్ళ నాన్న. ఇద్దరికీ వాదం సంభవించింది. అతనెవరో రెండు సంబంధాలు తెచ్చి పెండ్లి చేసుకొమ్మన్నాడు.

"ఇపుడెందుకునాన్నా పెండ్లి?" అంది.

"ఇపుడు కావాలని గాదు, నీవెవర్ని చేసుకుంటావో చెప్పితే, ఎపుడైనా చేసుకోవచ్చు".

"ఎపుడో చేసుకోడానికిపుడే తొందరెందుకు?"

"తొందరేముందిలే, అయినా చెప్పాలి".

"నాకక్కర్లేదు. నీ నిర్బంధం యెందుకు మధ్య?"

"నిర్బంధం లేదులే. పోనీ నీవే యెవర్ని చేసుకుంటావో చెప్పు చేస్తాను".

"నిజంగానా? నన్నెన్నుకో మన్నావా?"

"అయితే ఒకమాట. అతడు మన లింగాయతుగానే వుండాలి".

"లింగాయ తేమిటి మధ్య?"

"కాకపోతే! యింకెవర్ని చేసుకుందా మనుకున్నావు? కులంగిలం అక్కర్లేదా యేమిటి?"

'కులమేమిటి నాన్నా?" అంది పెంకిగా.

వాదం పెరిగింది. అక్కడొకతాడు కనబడగా గట్టిగా రెండు పీకాడు. "ఇంక నీకు చదువూవద్దు, గిదువూవద్దు, చాలించెయ్! చెంబులు తోంకానే రాత రాసిందిలే నీకు" అంటూ లేచివెళ్ళాడు. ఇటువంటిదే ఏదో ఒక రూపాన, ప్రతిదినమూ సాగుతూనే వుండింది.

కొన్ని దినాలు గడిచాయ్. కాలేజీ తెరిచే గడువు సమీపిస్తూవుంది. ఈదఫా "నీవొక్కతెవే వుండడానికి వీలులేదు; మేంగూడా వస్తాం" అని కూర్చున్నారు తలిదండ్రులు. తండ్రి బలే గడుసు మనిషి! కత బాగా అర్థం చేసుకున్నాడు! ఇక యీ అమ్మాయి వాడితో లేచిపోయి, పెండ్లి చేసుకుంటుందేమో అని బాగా ఊహించాడు. పిల్ల వెంటనే వుండి, వీలు పడినప్పుడు కాస్త విషగుళికవేస్తూ అతనిపై నుండి మనసు మరల్చాలని సంకల్పించుకున్నాడు. "నిన్ను విడిచి మేం వుండగలమా తల్లీ, ఈ సంవత్సరం వుండేటప్పటికి మాకత అయిపోయింది. మేమూ నీవెంటే వుండి సంతోషంతో వుంటాం" అన్నారు, ఈ పిల్లహృదయం గూడా కరిగింది. నాకూవ్రాసింది తలిదండ్రులు మద్రాసు వస్తున్నట్లు. అన్నయ్యకూ వ్రాసింది. అంతేగాదు, తానుముందువెళ్ళి, ఒక చిన్నయిల్లు చూచి పెట్టాలని కోరింది. ఆ అదేశాన్ని శిరసావహించి, నాయుణ్ణి పిలుచుకొని,

పాపం, మద్రాసు ముందేవెళ్ళి, కాలేజీకి దగ్గరగా వుండేటట్లు, మా హాస్టలుకు గూడా దగ్గరగా వుండేటట్లు, ఒకమంచి యింటిని, కొద్దిపాటి బాడుగలో యేర్పాటు చేశాడు. తలిదండ్రులతో సహా కమలం ఆ గృహంలో ప్రవేశించింది.

చేరిన ఒకవారంరోజులలో మమ్మల్నందర్నీ ఆహ్వానించిందింటికి నేనూ, శాంతీ, మరిద్దరమ్మాయిలూ, అన్నయ్యా, నాయుడు వెళ్ళాం. కమలం యెంతోఆనందంతో, తిరుగుతూవుంది తనగృహం కాకపోయినా, అది తాత్కాలికంగానైనా వారిగృహమేకాబట్టీ-ఆ యింట్లో ఆతిథ్యం మివ్వటం మొదటిసారి గాబట్టి-ఆనందంపట్టలేక, యెంతో యిదిగా తిరుగుతూవుంది-అంతా తానే స్వహస్తంతో తయారుచేసినట్లుంది.అది వూరికే అట్లాయిట్లా తిరుగుతూంటే, దానిపొడుగాటిజడ, నితంబాలపై నాట్యంచేస్తూవుంటే అన్నయ్యచూస్తూ ముసిముసి నవ్వులు నవ్వుకునే వాడు. కాసేపట్లో వయ్యారంగా పట్టుకొచ్చిందందరికీ టిఫిన్. మాకందరికీ కాఫీ యిచ్చి - అప్పటికింకా కాఫీ చాలించలేదు మేము - మాకు కాఫీ యిచ్చి, అన్నయ్యకు పాలూ, తనకూ పాలు తెచ్చుకొని కూర్చుంది. మహా తృప్తిపడుతూ, గర్వంగా కూర్చొంది దృష్టిని దాని స్థానంలో విసిరేసి. మేం ఆనందంగా మాట్లాడుకుంటున్నాం. వాళ్ళ నాన్న కులాసాగాలేడు. నన్ను గురించి ఎన్నెన్నో తన కూతురు చెప్పినట్లుగా అని, పై కట్లాపండ్లు యిగిలించి, మళ్ళా ఆలోచిస్తూ కూర్చున్నాడు - మేమంతా తన కూతుర్ని చెడగొట్టే గ్రూపని ఆయన దుఃఖం. ఎప్పుడైతే"ఇతనే నాన్నా, మా క్లాసుమేటు, కేశవరావు" అని అన్నదో, అతనికప్పుడే గుండెలలో ఢఢాల్ మంది.

అన్నయ్య పల్లెటూళ్ళో పుట్టి పెరిగిన వాడవటం వల్లా-అందులో పూర్వాచార కుటుంబంలో పుట్టిన వాడవటంవల్లా - ప్రస్తుత విద్యయం

దంత పట్టుదలలేని తలిదండ్రుడు లవటంవల్లా - కొద్దిపాటి ఆలస్యంగా హైస్కూల్లో చేరాడు. ఇంటరు సీనియర్ చదివేటప్పటికి అతనికి యిర వయి దాటాయి. మనిషి చక్కగా బాగానే వుండేవాడు. కమలానికి బాగా సరిపోతాడు. "ఇక వీణ్ణి వొదుల్తుందా యీ పిల్ల" అనే వ్యసనం పుట్టిం దాతండ్రిలో అతన్ని చూచినప్పటి నుండీ. పాపం! మేము మాట్లాడించి నపుడంతా తెచ్చిపెట్టుకొన్న చిరునగవుతో మాట్లాడేవాడు.

అంతకు ముందు సంవత్సరంలో మొదట్లో కమలం యేమేమో చెప్పేది మాకు. తనను గురించీ - తన తండ్రిని గురించీ - తన ఆస్తి పాస్తుల గురించీ చెప్పేది. తన తండ్రి మంచి కాంగ్రెసువాది అనీ - హరి జనోద్ధారకుడనీ - ఆచరణవాది అనీ - అందువల్లనే తానట్లా తయార యిందనీ - బలేబలే చెప్పేది. ఆనాడు తండ్రీ బిడ్డా పరస్పరం అన్యోన్య ప్రేమతో వుంటూ వచ్చారు గాబట్టి యేమేమో చెప్పింది. పోనుపోనూ తండ్రిపై మమత తగ్గజొచ్చింది. ప్రేమ మారి ఆ స్థానం మరొకరికి అధీనంకాగా, తండ్రిపై కాస్త ద్వేషం ప్రబలింది. ఇరువురి మధ్యవున్న అపార్థాలవల్ల నానాటికీ పెరిగిందది. అంత కంతకూ అది అతిశయించగా కడపటికి తండ్రి సాన్నిధ్యమే తనకు నరకమయి పోయింది.

వాళ్ళ తండ్రి వూరి కెళ్ళాడు. కమలం రమ్మంటే యింటికెళ్ళా డన్నయ్య. "గృహం పావనం" అంటూ ప్రబంధ కన్యలాగా ఆహ్వా నించి వయ్యారంగా చూస్తూ ప్రక్కన నిలబడింది. కూర్చోమన్నాడు. అది ఆ అమ్మాయి స్టడీరూం. వాళ్ళ నాన్నవుంటే అతన్ని అక్కడికి పోనిచ్చి వుండడు. వాళ్ళమ్మ కిట్లాంటి వేమీ తెలీవు. ఆమెతో ఏదో చదువుకుంటాం అని చెప్పింది. ఆమెపాటికామె పనులు చేసుకుంటూ కూర్చుంది. ఇతన్ని గురించి చాలాచాలా చెప్పింది గాబట్టి తల్లికి ఇతనంటే సద్భావం వుంది. ఇంగ్లీషులో నీళ్ళ సంభాషణ మొదలుపెట్టారు.

"నీవు నా భర్తవే గదూ?" అంది పండ్లు కాస్తయిగిలించి,

"సత్యరీత్యా అంతే, లోకం మాత్రం అనదు."

"అవును, మూర్ఖలోకానికి ఆ వివాహముద్ర కనిపిస్తేనే!"

"లోకం అంతే!"

"అవును, మనసున్నా లేకపోయినా, వివాహం అయిందనిపిస్తే ఆమె వాడి భార్యే అంటుంది లోకం. నిజంగా ఆమె వాడికి చెందుతుందా?"

"మనసు కలవకపోతే యెప్పటికీ చెందదు. వివాహబంధం చేత యెంత బంధించినా, ఆ శరీరం మాత్రమే వాడిది అయితే కావచ్చు గాని, మనసు కాదు. హృదయానికి ఎవడు అధినాథుడో వాడే భర్త, తాళి కట్టినంత మాత్రాన కాదు."

"అయితే తాళి వల్ల అధికార మొస్తుంది కదూ?"

"అవును. ఈ తాళి అనే బంధం వల్ల, తలిదండ్రులు ఆడదానిపై తమకు గల అధికారాన్ని, వరుడి చేతులలో కలిపేస్తారు. ఆ బంధం త్వరగా తెంచుకోడానికి వీలు కాదు. అందుచేత గూడా అవసరమే. కాబట్టి అటువంటి దొకటి నీకూ అవసరమే."

"చాల్లెద్దూ!"

"మొన్న ఒక విషయం విన్నావా? ఒక యువతీ, ఒక యువకుడూ ప్రేమించుకున్నారు మనలాగే. ఆదర్శ ప్రేమ అనుకున్నారు. హృదయ బంధంతో వివాహ మైందనుకున్నారు. దేవుని యెదుట వివాహం అయిన తర్వాత, మానవ మాత్రుడు చూస్తే యెంత, చూడకపోతే యెంత అనుకున్నారు. సర్వసాక్షే సాక్షిగా వుండగా, తర్కంతో జీవించే మానవుడు సాక్షిగా లేకుంటే మాత్ర మెంత అనుకున్నారు. కొన్ని దినాలు గడిచాయి. వాళ్ళ ఆదర్శం ఏమయిందో, ప్రేమ యేమయిందో! హృదయం యేమయిందో! సర్వసాక్షి యేమయ్యాడో - విడిపడ్డారు. ఆనాడు హృదయ బంధంతో వివాహం ఆడేనా డెవరూ చూశ్చేదా సర్వమయుడు

తప్ప. ఎవరూ చూళ్ళేదు లెమ్మని సులభంగా తప్పించుకొని, ఏమీ చేయ నట్లుగా వేరే వేరే వివాహా లాడారు. ఎవరికీ కనబడని సర్వమయుడు. ఏమి చేస్తాడు?

"అట్లా వుంటాయి ఉద్రేక పూరిత చేష్టలు! అనాలోచిత కార్యా లంతే!"

"ఇపుడు వారొకర్నొకరు పెండ్లాడ లేదని చూడని మానవ లోకాన్నయితే నమ్మించగలరు గాని, వాళ్ళ హృదయాల్ను పరస్పరావ లోకనం చేసుకుంటే............"

"ఏమో! రేపు నీవూ అట్లాగే చేస్తావేమో? అపు డాసత్యానికీ, ఆ హృదయానికీ ప్రాముఖ్యత యివ్వవేమో!" అన్నాడడ్డొచ్చి.

"ఏమిటా మాటలు ప్రసన్నం?" ప్రసన్నం అని సంబోధించ డానికి ఆమె కొక్కతెకే లైసెన్సు వుంది- "ఏమిటా మాటలు ప్రసన్నం! పైన తథాస్తు దేవతలుంటారు. వూరుకో! అట్లాంటి అమంగళాలు పలకకు! నన్నంత దుర్బలనుగా యెందుకు భావిస్తావు?" అన్నది కాస్త భయంగా.

కాసేపయ్యాక మళ్ళా అన్నాడతను—

"వేసవిలో మీ నాన్న యేమన్నాడు? బాగానే ఉంటూ వచ్చాడా? లేకపోతే అంతకు ముందు మాదిరేనా? నీకు జాబు వ్రాద్దామని యెంతో యిదిగా అనుకొనేవాణ్ణి. వ్రాయలేకపోయేవాణ్ణి! అంత మాత్రం స్వతంత్రం లేకపోయింది మనకు! ఎపుడూ నిన్ను గురించే ఆలోచన. అసలు పిచ్చివాణ్ణయిపోయానంటే నమ్ము."

"వేసవిలో విషయాలన్నీ చెప్పాలంటే రోజులు చాలవు మనకు. ప్రతి దినమూ మా నాన్నకూ, నాకూ యేదో వొకవిషయమై తగువులాట; ఏదో మొదలవుతుంది వాదం. కడపటికది కులాల వాదంగా పరిణమి స్తుంది. అపుడిద్దరికీ వైరం. నన్నత డెంతగా హింసించాడో చెప్పడం

కష్టం. ఎన్నిసారులో ఊరికే దుఃఖించేదాన్ని, చచ్చిపోదామని గూడా అనిపించేది. ఒక్కొక్కసారి పారిపోయి వచ్చి నీ వొళ్ళో పడుకొని ఏడ్చి వేయా లనిపించేది. సెలవుల్లో ఒకవేళ నేను పారిపోయి వచ్చివుంటే నీవు స్వీకరించే వాడివేనా?"

"వచ్చేవుంటే తెలిసేదిగా!"

"ఒకవేళ వచ్చాననుకో! మీ వాళ్ళను చూచి, వాళ్ళకోసమై నన్ను తిరస్కరిస్తే?"

"అపుడు నీ వెక్కడైనా దూకి చచ్చేదానివని నాకు తెలుసు. అయితే, యెవరో తెలియక, యేదో అంటారని, నిన్ను నిరాకరిస్తానా? ఒకవేళ అట్లా చేస్తే నా ఆదర్శాన్ని - ఆశయాలనూ, తిరస్కరించినట్లే గదూ?"

కమలం హృదయం ఆనందంతో ఊగిసలాడిపోయింది.

"నేనిక వాళ్ళదగ్గర వుండలేనోయ్! నాకది యిల్లుగా వుండటం లేదు. యమలోకం అంటే నమ్ము. ఎన్ని రోజులు అసంతృప్త-సంతప్త హృదయంతో, నీ కోసం, అర్రులు చాచుతూ, అతనిచేత అర్రు పగల గొట్టించుకుంటూ వుండేది? మనం తొందరగా వివాహం చేసుకోవాల్సిందే-నా కష్టాలు త్వరగా అంతరించేటట్లు చూడు. లేకపోతే, మా నాన్న ఒక హంతకుడికంటే తీవ్రంగా కనిపిస్తున్నాడు."

"నిదానించు కమలం! అంతగా నిరసించక. వాళ్ళ నింకా బెదిరేటట్లు చేయక. ఎన్నన్నా నిన్ను కన్నవాళ్ళు నీ కోసం బ్రతుకుతున్న వాళ్ళు! మళ్ళా నీవు ఏ ప్రసంగమూ యెత్తకుండా, అన్నిటికీ వూరికే వుండి వాళ్ళ పూర్వపు ప్రేమను మళ్ళా పొందడానికి ప్రయత్నించు. అటువంటి హృదయాలను, సామ మార్గంతో సాధ్యమయినంతవరకూ మనవైపు తిప్పుకొని, గెల్చి పెండ్లాడితే గొప్పగాని........"

"చాలు ప్రసన్నం! అనుభవిస్తే నీకు తెలుస్తుంది. మా నాన్న కత నీకేం తెలుసు?"

"కావచ్చు, అనుభవం లేకుండా నేను మాత్రం చెప్పడంలేదు. నీకు చెప్పలేదుగాని, మన కత యావత్తూ మా యింట్లో తెలిసింది. అంతా గోలగోలయింది! నే నబద్ధం యెట్లా చెప్తాను? నిజమే నన్నా. ఇక చెప్ప శక్యంకాదు! వంశాధిక్యాన్ని నాశం చేస్తున్నాననీ - డబ్బంతా నాశం చేస్తున్నాననీ - ఒకటేమిటి? ఎన్నెన్నో - ఎంతమందో ........ అదంతా యెందుకులే యిపుడు? నీవన్నట్లు మీ నాన్నేగాదు. అందరి నాన్నలూ అంతే. తమ అభిరుచికి భిన్నంగా బిడ్డలు ప్రవర్తిస్తే వాళ్ళు ఓర్చుకోరు. ఆ యెదిరించడం, యెంత ధర్మ కార్యానికైనా . యెంత లోక కల్యాణానికైనా - దాన్ని గురించి ఆలోచించకుండానే - కుల మర్యాదలనీ- వంశ గౌరవాలనీ అడ్డు పడతారు!. నీవన్నట్లు రాక్షసులుగా గూడా ప్రవర్తిస్తారు."

"అందరి నాన్నలవంటివాడుగాదు మా నాన్న."

"కాక యెందుకుపోతాడు?"

"ఇన్నెందుకు? నన్ను కష్టపెట్టటం తల్చుకుంటే వాళ్ళు నా తల్లిదండ్రులే కాదనిపిస్తుంది! అయినా తలిదండ్రు లెవరు? అంతా నిమిత్తమాత్రులు!"

"ఇప్పటి రాజకీయవేత్తలు సాంఘిక సమత్వాన్ని గురించి లెక్చర్లు తెగవాగేసినట్టుగా - నీవూ వేదాంతాన్ని గురించి మాట్లాడవచ్చుగాని - అనుష్ఠాన వేదాంతం కావాలిపుడు మనకు."

''ఇందులో అనుష్ఠానం కాకపోయిందేమిటి? నేను వాళ్ళగురించి అంతగా బాధపడటం లేదిపుడు. నే నింకెవరన్నా దంపతులకు పుట్టివుంటే వాళ్ళగురించే బాధపడేదాన్నిగా! అపుడు వీరు నాకెవరో

అవుతారుగా! అంతే! ఎవరైనా అంతే! ఆ ప్రాపంచిక వాసన అట్లా అనిపిస్తుంది."

అన్నయ్య యేమీ మాట్లాడలేదు. ఊరికే కూర్చున్నా డాలోచిస్తూ. అవన్నీ తన భావాలే - అంతకు ముందంతా మేం కలుసుకున్నపుడంతా యిట్లాంటివే మాట్లాడేవాడు! ఆయన నిజంగా అప్పటికే హృదయాన్ని స్వాధీనం చేసుకున్నాడు! మా తరగతే అయినప్పటికీ, మాకంటే యెన్నో పుస్తకా లెక్కువ చదివి, యెంతో జ్ఞానాన్ని ఆర్జించాడు. మాకంటే వయసులో గూడ పెద్దవాడు! మగవాడు గాబట్టి - ఎక్కడ తిరగడానికైనా తనకు ఫ్రీ లైసెన్సు వుందిగాబట్టి - ఎక్కడ యేం జరుగుతున్నా వెళ్ళేవాడు. రాజకీయ వేత్తలని చెప్పుకొనేవారితోనూ, సాంఘిక వేత్తలమని చెప్పుకొనేవారితోనూ సంపర్కం పెట్టుకొని,వారివెంటతిరిగి,నేర్చుకోవలసినవి వుంటే నేర్చుకొని, లోపాలుంటే జాగ్రత్తగా జ్ఞాపకం పెట్టుకొనేవాడు. మద్రాసులో ఎవరెవరో, యెన్నెన్ని విషయాల గురించో మాట్లాడినపుడంతా - తాను, నాయుడితోసహా హాజరయ్యేవాడు. జ్ఞానపిపాస ఆయనకున్నట్లు ఎవరికీ లేదని చెప్పగలను. ఇట్లా ప్రత్యక్షానుభవాన్ని గూడా గడించాడు. ఆయన మాకు యేమేమో విషయాలు చెప్పేవాడు. అవి వింటూంటే మాకు పుస్తకాల్లో చదివినట్లుండేది. అవన్నీ ఆతనికి అనుభవాలు! మాకు కేవలం కొత్త మాటలు! అంతే తేడా!

ఆమెను గురించీ, ఆమె ధైర్యాన్నీ గురించీ చాలా పొగిడేవాడు. వారి వివాహ విషయాలు నాతోమాత్రమే ముచ్చటించేవాడు. ఇతర్లెవరూ అర్హులుగా తోచలేదిద్దరికీ. ఎందుకంటే, అప్పటికే నేను వివాహితను. వివాహం అయిన రెండవ సంవత్సరమే కాలేజీకి వచ్చాను. ఎన్నెన్నో నాతో మాట్లాడేవాడు. నేనంటే ఆయనకెంత దయా, వాత్సల్యమో, నేను నిర్వచించలేను. కమలంగూడా నన్ను బాధపెట్టేది తన విషయా

లతో. వారి వివాహ విషయం, స్వవిషయం కంటే యెక్కువయి పోయింది నాకు. దాన్ని గురించి నేను తీవ్రంగా యోచింప మొదలు పెట్టాను. ఒక్కొక్కనాడు యేడ్చేది తండ్రి విషయం చెప్పి అమితంగా.

"కాంగ్రెసు వ్యక్తి అంటూ - హరిజన సేవకుడంటూ - అతనే ఆ ప్రకారంగా ప్రవర్తిస్తున్నాడా?" అని నేనంటే, అన్నయ్యన్నాడు -

"కాంగ్రెసు కావచ్చమ్మా! స్వచ్ఛ హృదయం కావాలిగదూ! ఇపుడేకాంగ్రెసువాది సరిగా ప్రవర్తిస్తున్నాడో చెప్పు! వాళ్ళే వాళ్ళ ఆదర్శాలను ఆచరణలో పెట్టి వుంటే- సంఘం కొన్ని దశాబ్దాల క్రిందటే బాగుపడేది. ఇంత ప్రయత్నం అవసరం లేకపోయేది! ప్లాటుఫారం యెక్కి, గాంధీజీ పేరు చెప్పి, పలుకుబడి కోసం ఉపన్యాసాలు దంచేస్తారు. ఆచరణ విషయం వచ్చేటప్పటికి యధాప్రకారం. తన యింట్లో తన కొడుకో- తన కూతురో, కులాంతర వివాహం అంటే, తన యింట్లో హరిజనుడు ప్రవేశిస్తే- అపుడు తెలుస్తుంది వారికత! ఇన్నెందుకు? ఖద్దరు గుడ్డలు వేసుకొనే సిద్ధాంతం వారివరకే. యింట్లో ఆడవాళ్ళు, బిడ్డల వరకూ వ్యాపించదది. వాళ్ళకంతా మంచి మిల్లు సరుకు! యింతే యెవరు గూడా! అంతా స్వార్థం! కుటిలం!" అన్నాడు.

కమలం చెప్పే విషయాలు హృదయ విదారకంగా ఉండేవి. ఒక్కొక్కనాడు నేదూకి చస్తాననేది. అదే విషయం తనతోను అనేది. తాను బహు బాధపడేవాడు. నేను బాధపడేదాన్ని. తానూ బాధపడేది! ఇపుడెవరైతే మాత్రం చేసేదేమిటి? ఎవరో ఒకరన్నా సంపాదించేవారయితే పారిపోయి రిజిష్టరు వివాహమన్నా చేసుకోవచ్చు మొదట. అసలు రిజిష్టరు వివాహం చేసుకోవాలి ముందూ అని కొన్నినాళ్ళు యేడిపించింది కమలం! తీవ్రంగా ఆలోచించి ఆలోచించి, కాస్త ఆగాలి అనే నిర్ధారణకు వచ్చాం.

ఏదైనా ఖర్చుకు కావలిస్తే కమలం నా దగ్గర సిగ్గుపడకుండా తీసికొనేది. మాలో ఆ భేదాలు ఏ కోశానా లేవు. అన్నయ్య దగ్గర తీసుకోడం మామూలే. అతననేవాడు :

"కమలం! నువ్వేమీ న్యూనత భావించకుండా, కావలసినప్పుడు అడిగి తీసుకుంటూ వుండు! భర్త దగ్గర న్యూనతెందుకు?" అని.

"భరించేవాడుగా భర్త! కాబట్టి నన్ను భరించాలి" అని నవ్వేది. అన్నయ్య స్కాలర్‌షిప్ డబ్బు గూడా వాళ్ళ నాన్నకే యిచ్చేది.

"తర్వాత అతని బాకీ చెల్లించవచ్చులే నాన్నా!" అనేది. అతను గొప్ప అభిమాని. ఇటువంటి సందిగ్ధ బాంధవ్యం అతనికి రుచించ లేదసలు! అందులో యిట్లాంటి వంటే బొత్తిగా గిట్టదు. మరి చేసేదేముంది? విధిలేక సరేలెమ్మనేవాడు! ఆనాడు జీవితం గడపటం మద్రాసులో ఎంత చౌక అయినా, ఆ కుటుంబానికి నలభై రూపాయలన్నా కావలసొచ్చేవి. నికరాదాయం యిరవై రూపాయలు! కమలానికి కొన్ని కొన్ని అవసరాలే లభించేవి గావు. అన్నయ్య పాపం, నన్నడిగేవాడు తనకేమి కావాలో బాగా తెలుసుకొమ్మని. నాచేతికి డబ్బు గూడా యిచ్చేవాడు కాస్త తన గుడ్డలకూ మరిదేనికైనా ఖర్చు పెట్టమని. ఒక్కొక్కప్పుడు నాచేతివి యిచ్చేదాన్ని, మరొకప్పుడు నీ భర్త యిచ్చాడు పుచ్చుకో అనేదాన్ని. తాను మామూలుగానే తీసికొనేది. సాధారణంగా సంసార నిర్వహణ కోసం భర్త నడిగి తీసుకున్నట్లుగా తీసుకొనేదామె. నేను తర్వాత తెలుసుకొన్నాను నాయుడి ద్వారా—

"వాళ్ళిద్దరూ టిఫిన్ తినటం బొత్తిగా మానుకున్నారట! కూరలు గూడా ఒకటో, అరో, వేసుకొనేవారట! గుడ్డలు గూడా చాలావరకూ వాళ్ళే వుతుక్కొనే వారట! సినిమాలు, డ్రామాలు కట్టి పారేశారట! దూరం యెక్కువై తేగాని. బస్సులూ ట్రాములూ ఎక్కేదిలేదట! రోజూ

కాలేజీకి రెండుమైళ్ళు నడిచే వెళ్ళేవారట! ప్రైవేటికయ్యే డబ్బంతా యెక్కువ భాగం కమలంకోసమే వెచ్చించే వారట!" ఈ విషయం తర్వాత రెండేండ్లకు నాయుడు చెప్పాడు. అప్పటికి కమలం కాస్త మారింది. ఆనాడు నేనెంతో దుఃఖించాను. ఇట్లా అనుకొనే దాన్ని— "ఒక ప్రేమజీవి తన ప్రియురాలికోసం యెన్నిపాట్లు పడతాడు, పాపం! ఫలించకపోతే............"అట్లా ఊహించేదాన్ని.

అప్పట్లో కమలం యెంత మంచి దనుకున్నారు? ఇప్పటికి గూడా అంతే అనుకోండి. దాని హృదయం నిష్కళంకమైన దర్పణం వంటిది. కల్లాకపటం లేనిది! తిరిగీ అతన్ని యెంతగా ప్రేమించిందంటే-అతనికి తలనొప్పి వచ్చి కాలేజీకి రాలేదంటే యేడుస్తూ కూర్చునేది. ఒకనాడు అన్నయ్యకు కొద్దిగా జ్వరం వచ్చిందని కాలేజీకి రాలేదు. ఆదుర్దాగా నాయుణ్ణడిగింది. "కొద్దిగా జ్వరంగా వుందంతే" అన్నాడు,

"నాయుడేం, అంత తేలిగ్గా చెప్పుతాడే!" అంది నాతో బెంగగా, మరునాడు గూడా కాలేజీకి రాలేదాయన!

"ఏదో కాస్త వేడిగా వుందిలే" అని చప్పరించాడు నాయుడు. నేను వింటూనే వున్నా.

"జ్వరమంటే అంత తేలికెందుకండీ?" అని కోప్పడింది. తర్వాత నన్నేడ్పించింది చూడాలి రమ్మని. నేను దాంతో కలిసి వెళ్ళినంత వరకూ యిక్కడున్నకాలు అక్కడ పెట్టనీలేదు.

ఒక ముఖ్యవిషయం మరిచాను. తాను వున్నయింటి పొరుగున ఒకడుండేవాడు. ఆ అబ్బాయి మరొక కాలేజీలో చదువుతున్నాడు. తొలిసంవత్సరాంతంలో వివిధకళాశాలల వక్తృత్వ పోటీలో కమలం గూడా పాల్గొంది. ఆ సమయంలో ఆ అబ్బాయి చూచాడట! తిన్నగా పరిచయం చేసుకున్నాడు. అంతకంతకూ యింటికే రాసాగాడు. వచ్చి

యేదేదో మాట్లాడేవాడు. మన కమలం గూడా వాడు ఊకొడుతూవుంటే ఏదేదో నేర్చుకొన్న ఆదర్శాల గురించి మాట్లాడేది. అన్నిటికీ బాగా తాళంవేసేవాడు! ఈమె దానికి తృప్తిపడేది. కులాంతరవివాహ విషయాలొస్తే వాడు మరీబాగా తాళం వేసేవాడు. ఇది మరీ ఉబ్బిపోయేది తానొక హీరోయిన్ కాబోతున్నట్లుగా. స్నేహం యెక్కువైనకొద్దీ "అన్నయ్యా" అనేది వాణ్ణి. నక్కవినయాలు చూపేవాడు బాగా. అది వాళ్ళనాన్నకు నచ్చేది. వాళ్ళింటికి రోజూ రమ్మని ఆహ్వానించేవాడు. ఆ అబ్బాయిదిగూడా ఆవూరుగాదు, చదువుకోసం వచ్చిన సంసారమే అది. ఒకనాడు వెళ్ళింది. బాగా మర్యాద చేశారు. ఇంట్లోవుండే వాళ్ళ అత్త బాగా చూచింది. తర్వాత అపుడపుడూ వెళ్ళేది కమలం. వాడపుడపుడూ ప్రేమ విషయాలు మాట్లాడేవాడు. తనకాదృష్టేలేదు కాబట్టి అనుమానించలేదు కమలం. పైగా పాల్గొంటూవచ్చింది చర్చలో. ఆ చేష్ట వాడికి కాస్త ప్రోత్సాహం యిచ్చింది. ఈమె గుణగణాలను వర్ణిస్తూ "నేను పొగుడుతున్నానని అనుకోకండి - ఉన్న విషయాలు చెప్పకపోతే బాగుండదు" అని పొగిడేసేవాడు. పొగుడుతూవుంటే మానవులు సంతోషపడక తిడతారా? ఇదిగూడా సంతోషపడేది. ఇట్లా కొన్ని రోజులు గడిచాయి. ఒకనాడు సంభాషణాక్రమంలో ఏదో చూచాయగా తన వలపును చొనిపాడు మాటలలో. కొద్దిగా అనుమానించిందిగాని ఉపేక్షించింది యేమోలే అనుకొని, వాడట్టి విషయాలు మాట్లాడేటప్పుడంతా, ప్రసక్తివున్నా లేకున్నా 'అన్నయ్యా' అనే పదం వాడుతూనే వుండేది - మరి కొన్ని రోజు లిట్లా గడిచాయి. ఈమెకు గూడా కాస్త మనసున్నట్టుంది అనుకున్నాడు వాడు.

"అన్నా, చెల్లి అని లౌకిక దృష్టిలో సంఘం కోసం, అనుకుంటే మాత్రం, హృదయాలు కలిస్తే పెండ్లెందుకు చేసుకో గూడదు?" అన్నాడొకనాడు. అది ఏదో ఒకరి విషయం వచ్చి, దాన్ని సమర్థిస్తూ డొంక

తిరుగుడుగా అన్నాడు. తన హృదయానికి తాకేట ట్లన్నాడని ఆమెకూ తెలుసు! అయితే దాన్ని గురించి యేమనడానికీ వీల్లేదు. ఎందు కంటే ప్రత్యక్షంగా అనలేదు గనుక. ఆమె దానిపైన యేమీ మాట్లాడ లేదు. అయితే "అదెట్లా అవుతుంది" అని మాత్రం అంది. అని, ఆనాటికి లేచి వెళ్ళిపోయింది. వాడెందు కనుకున్నాడో గాని, నిజంగా యీ అమ్మా యికి తన పైన ప్రేమ వుందనుకున్నాడు. అప్పట్నుండీ, యెప్పుడైనా, ఏదైనా చిన్న పని చెయ్యాలని అడిగితే,

"ప్రియమైన వారి కోసం ఏం చెయ్యమంటే చెయ్యను?" అనే వాడట! అప్పటికి బాగా తెలిసిం దమ్మాయి గారికి వాణ్ణి మందలించా లని. అయితే త్వరపడ లేదు. వాడు మాత్రం తన ధోరణిలో మళ్ళా ఒకనా డన్నాడు—

"మనం వివాహమాడితే బాగుంటుంది. నే నేవుద్యోగంలో చేర్తే బాగుంటుందో చెప్పు! నీ అభిప్రాయం ప్రకారం నడుచుకుంటాను" అని.

అప్పటికీ యీమె మందలించ లేదు. మొదట్నుంచి దీనికి బతే మొగమోటమి. ఎంత చిన్న మాటంటే యెంత నొచ్చుకుంటారో అను కొనే రకం! ఊరికే వైరుధ్యం వస్తుందేమో అనే భయం! ఇన్నాళ్ళూ అంతగా స్నేహంగా వున్నాం గదా, అమాంతంగా దెబ్బలాడితే యెట్లా? అని కాస్త వూరుకుంది. ఇట్లా వుండగా వా డొకనా డింకా ఘోరమైన పని చేశాడు.

'ఏదో మాట్లాడాలి' అని ఈ యమ్మాయిని రమ్మని చెప్పంపిం చాడు. వచ్చింది. యెవరూ యింట్లో లేరు. తలుపులు మాత్రం తెరిచి వున్నాయి. లోపలి కొచ్చింది. కేకేసింది. లోపల పలికాడు. కాస్త బయటి కొచ్చి, కాస్త నీళ్ళు యిస్తారా అన్నాడు. లోపల యేమో పని చేస్తూ వుండి వచ్చిన వాడి మాదిరిగా. వాడి ముఖం యెందుకో గాభరాగ

కనిపించింద టప్పుడు! ఈమె అనుమానించింది కాని, ధైర్యశాలి గాబట్టి, యేముందిలే యిందులో అని నీళ్ళు తీసుక పోయింది. లోపలి గదిలోకి తీసుక పోయింది. నీళ్ళు తీసుకుంటూ చెయ్యి తాకాడట! రెండు చేతులు మాత్రం చాచాడట! తటాలున చేతులు లాక్కొందిట! బయటికి పరుగెత్తుతూ వుందట!

"ఉండండి, ఉండండి. కాస్త మాట్లాడాలి. భయపడ్డా రెందుకు?" అన్నాడట. అంతటితో పరుగెత్తాల్సింది, బయట అరుగుపై కూర్చుంది బుద్ధి చెప్పాలని యోచిస్తూ. వాడూ వచ్చా డింతలో. ఏదో మాట్లాడాడు. తానూ కొన్ని విషయాలు మాట్లాడింది. సమయం రానిచ్చి నిక్కచ్చిగా అంది—

"అట్లా మాట్లాడకు. సరిగ్గా ప్రవర్తించడం దేర్చుకో. నేను ఒకాయన్ను చేసు కుంటున్నా. నా క్లాసుమేటును. నీకంటే యెన్నో లక్షల రెట్లు మేలుగల భర్తను నేచేసుకో బోతూవుంటే, నీవిట్లా నీచంగా ప్రవర్తిస్తావెందుకు?"అంటూ యేం మాట్లాడుతున్నదో తెలీకుండా మాట్లాడి, బిరబిరా వచ్చిందట. వస్తూవుంటే వాడన్నాడట:

"తప్పించుకున్నావ్లే-రక్షించావు గూడా."

ఏడుస్తూ, భయపడుతూ, వదుర్తూ ఆ విషయమంతా చెప్పింది నాకు. నేను ఓదార్చి అన్నాను:

"ఎంత తెలివి తక్కువ దానివే! వాడు వదలంగా సరిపోయింది ఆ యింట్లో నిన్ను బలాత్కరించి, యిష్టపడకపోతే చంపేస్తేనో" అని.

"లక్షణంగా వుండేది" అంది మురిపెంగా మందహాసంచేస్తూ.

మరునాడు అన్నయ్య వాళ్ళింటికెళ్ళాడు. అప్పటికే అతనికీ విషయం తెలిసింది నాయుడివల్ల. ఇతన్ని చూడగానే కండ్లనిండుకు నీళ్ళుపెట్టి కతంతా మళ్ళా చెప్పి, 'క్షమించవూ' అంటూ కాళ్ళపైబడింది.

"దీంట్లో యేముంది! నీ పొరపాటు నీవే తెలుసుకున్నావుగా? యింకేం" అన్నాడు తాను. కమలం అంటే తన హృదయంలో యెంత గౌరవ స్థానాన్ని ఆక్రమించిందో తర్వాత అన్నయ్య నాతో మాట్లాడిన మాటలే తార్కాణం.

వాళ్ళ అన్యోన్యప్రేమ ఆ దినాలలో అనుభవజ్ఞులు ఊహించి కనుక్కోవాల్సిందేగాని, చెప్పడం కష్టం! ఒకర్ని చూడలేకపోతే ఒక రుండేవారు గాదు. శనివారం, ఆదివారంవొస్తే, కనీసం ఒక సారయినా ఆమె యింటికి వెళ్ళేవాడు. చదువుకొనే కాలంలో విద్యార్థులు ప్రేమ వ్యాపారంలో దిగారో - అంతటితో ఆఖరు. అంటే, యెట్లాగో కష్టపడి ప్యాసుకావచ్చు. సమగ్రజ్ఞానం ఆర్జించలేరు. ఏకాగ్రత చెడిపోయిందంటే, చదువు సరిగారాదు. ప్రేమవ్యాపారం ఏకాగ్రతను అన్యాయం చేస్తుంది. వాళ్ళిద్దరూ దానివల్ల నాశనమయ్యారని అనునుగాని, ఎంతో సునిశిత బుద్ధికలవాళ్ళను మందరాశి చేసిందని అంటాను. మందరాశి అంటే మామూలు మందబుద్ధులని అనుకోవద్దు. ఇంతకూ చెప్పవచ్చే దేమిటంటే, ఏకాగ్రత చెడిందని! ద్వ్యవధానం ప్రవేశించింది. బుద్ధిని రెండు విష యాలపై కేంద్రీకరించవలసి వచ్చింది.

ఇట్లా జరిగాయి కొన్ని దినాలు. మాకు పరీక్షలయ్యాయి. అంద రమూ బాగానే వ్రాశాము. మేమందరమూ ఫస్టుక్లాసు వస్తుందనుకున్నాం. 'నాకేమీ రాదని' కమలం గోలపెట్టింది.

మేమిక బయలుదేరాలి. ఇదొక ప్రత్యేకఘట్టం, మా జీవితాంతం వరకూ ఆఘట్టం మరుపుకురాదు. దానికి మా జీవితంలో ఒక విశిష్ట స్థాన ముంది. ఒకర్నొకరు విడవాల్సొస్తుందే అనే బెంగ బయలుదేరింది మా హృదయాల్లో. కొన్నిదినాలు జరిపేశాం ప్రయాణాన్నట్లా. కడపటికి యేడవనాడు బయలుదేరాం. నేనూ, శాంతి, అన్నయ్యా, నాయుడూ బయలుదేరాం. కమలం యింకా నిదానంగా బయలుదేర్తుంది తలిదండ్రు

లతో. అందరమూ స్టేషనుకొచ్చాం. కమలం వీడ్కోల్పడాని కొచ్చింది. వాళ్ళ నాన్నగూడా వచ్చాడువెంట. ఆనాడు జాగ్రత్తగా వుండాలనే వచ్చాడు, కూతురు పారిపోతుందనేమో! కమలం కతచూస్తే మాకంతా దుఃఖం వచ్చింది. అంతకుముందు పరీక్షలయినప్పట్నుంచీ యేడుస్తూ కూర్చుంది. అందరమూ యెంతో ఓదార్చాము. అన్నయ్యగూడా తన విషాదహృదయంతో ఓదారుస్తూనేవున్నాడు. ఆనాడు స్టేషనులో కమలం యెంతగా యేడ్చిందోచెప్పటంకష్టం. ప్రక్కన మొగం నల్లగా బెట్టుకొని నిలబడివున్నాడు వాళ్ళనాన్న. ఇతర ప్రయాణీకులూ వున్నారు. కాలేజీ పిల్లవాళ్ళూవున్నారు. చూస్తూనేవుంది. తన హృదయాన్ని మించి, స్వాధీనంగాకుండా పొర్లుకొచ్చే సంతాపతరంగాలు బయటపడందే ఆగలేదు. అంత యేడుపు అంత ఉద్ధృతంగా వుంటే చూడడం అదే ప్రథమం! అంతగా ఏడ్చింది-ఆదీ ఆనాటి కమలం—"

"చెప్పండి చెప్పండి" అన్నారందరూ.

"మా బండి కదలడానికి "ఝుప్" అన్నది. మా గుండెలు గూడా ఆవిర్లుకక్కాయి! హృదయాలు భారంగా-గాభరాగా వున్నాయి. బండితో పాటు మేమూ పోతున్నాం. మా మనసులు వెనక్కి పరుగెత్తుతున్నాయ్. కమలాన్నిచూస్తూ పోతున్నాం. అదికూడా నిర్జీవంగా, నిలబడి కాసేపటికి కదిలింది శరీరాన్ని మరలించుకొని. ఆ సెలవుల్లో మేం వ్రాసుకున్న జాబులు యెంత కవిత్వాన్ని నింపుకున్నాయో యెవరికి తెలుసు?

అదే వేసవిలో అన్నయ్య కెన్ని చిక్కులొచ్చాయో వర్ణనాతీతం. తాను ఆచారాలు పాటించడని ఆ పల్లెలో అందరికీ అదొక తేలికభావం. మళ్ళా మర్యాదా వుంది. యింట్లో తన చేష్టలవల్ల అంతప్రేమలేకుండా చేసుకున్నాడు. పైగా వివాహవిషయంలో, జందెం విషయంలో, ఇల్లాంటి వింకా యెన్నిట్లోనో చిక్కులొచ్చాయి. ఆ సాంఘిక విప్లవ పురుషుణ్ణి అపార్థం చేసుకున్నారందరూ, తన శక్తి వాళ్ళకేం దెలుస్తుంది!

ఎంత జేసినా, వాళ్ళకు పిల్లవాడులాగనే కనిపిస్తాడు గాని. ఇంత వ్యక్తి అని వాళ్ళ కెట్లా తెలుస్తుంది? తన నెంతగా బాధించారో తెలీదు. తాను "ఫలానా పిల్లను తప్పక చేసుకుంటాను, కులంలో మాత్రం చేసుకోను" అని కచ్చితంగా చెప్పాడు. వాళ్ళు మళ్ళాకాస్త తగ్గి కడపటికి బ్రాహ్మణుల్లో యేశాఖఅయినా చేసుకోకావాలిస్తే అన్నారు. కడకు నియోగుల పిల్లను చేసుకోడానికిగూడా వాళ్ళు ఒప్పుకోరు. వాళ్ళు బ్రాహ్మణులు కాదనే వారి ఛాందసం! అతనెట్లాగూ హృదయం మార్చుకోడని తెలుసు. అధవామారితే అసలు పిల్లనేవదలి, ఇంకొక శాఖకు మారినవాడు, తన శాఖలోనే చేసుకోక పోతాడా పట్టుపడితే, అనేభావం వాళ్ళలో లేకపోలేదు. ఎన్నో సంబంధాలిదివరకంతా రాగా, పోగా, ఆ వేసవిలో వచ్చిన ఒక సంబంధంలో అందరూ ఏకంగా పట్టుపట్టారు. పిల్లవకటేనట సంతానం. ఆస్తి బాగానేవుందట! అంతా తనదే అవుతుంది. పిల్లమొద్దుగావున్నా చింతలేదు. ఇన్ని కారణాలవల్ల ఘట్టిపట్టే పట్టేశారు. ఇట్లాంటి ఆస్తులెన్నయితే మా కమలానికి సాటి అనుకున్నాడాయన. అవన్నీ నాకు వ్రాశాడు. నాకు చెప్పని విషయమంటూ యేమీలేదిప్పటికి. ఇంట్లో ఇతను నిరాకరించి నందువల్ల చాలా కోపం వచ్చి నానా దుర్భాషలాడారు. కడపటికి వాళ్ళే యిల్లు విడిచి పొమ్మన్నారు. అంతే- కట్టు గుడ్డలతో. కోట చేరాడు."

టింగ్, టింగ్ మని పది కొట్టింది గడియారం. శాంత కొద్దిగా తూగుతూ వుంది. కాంతానికి గూడా ఉత్సాహం తగ్గిపోతూ వుంది. ఇక వచ్చేవన్నీ విషాద విషయాలవటంవల్ల ఆమె అంత ఉత్సాహంగా లేదు. "ఇక పడుకుందామా?" అంది కాంతం.

"నో, నో, ఇంకా పడుకోడం యేమిటి?" అంది అనసు

"మీకు నిద్రవస్తుం దేమో!"

"మాకీనాడు నిద్రరాదని చెప్పాంగా!"

కాంతం మళ్ళా సాగించింది :

"పరిస్థితులు కాస్త మారాయి. కాలం చాలా విచిత్రమైన వస్తువు. అది యెపుడూ మారుతూ వుంటుంది. దాంతో పాటు మానవులు మార్తారు. అనుగుణంగా అలవాట్లూ, అభిరుచులూ మార్తాయి. ఈనాడు మనం పొందిన గౌరవం రేపు పొందుతామని గ్యారంటీ లేదు. ఈనాడు ప్రేమించిన వ్యక్తి అదే ఉధృతతో రేపు ప్రేమిస్తాడని చెప్పడం కష్టం! ఈ స్వల్ప కాలం లోనే మానవుని చిత్తవృత్తి ఎంతో పరిణామాన్ని పొందుతుంది. దానికి చుట్టుపట్లవున్న వాతావరణ ప్రాబల్యం ముఖ్య కారణం - వీటన్నిటి వెనుకా వ్యక్తి యొక్క హృదయ సంస్కారం గూడా కారణ భూతమై వుంటుంది.

మళ్ళా కాలేజీలు తెరిచే టప్పటికల్లా యెక్కడి వాళ్ళక్కడ చీలి పోయాం. అన్నయ్య విషయం మీకు తెలిసిందే! తర్వాతేం జరిగిందీ మీకు కొంచెం కొంచెం తెలుసు. చాలా విషయాలు తెలీవను కుంటాను నారాయణగారికి తప్ప. అందులో అతనికి గూడా యీ ముఖ్య విషయం తెలియదు. నేను మద్రాసులోనే యం. యస్. సి. చదవడానికి వెళ్ళాను. శాంత, కమలం వాల్తేరులో చేరారు. నాయుడు గూడా మద్రాసులో చేశాడు. ఆ కొత్తలో మా ఉత్తర ప్రత్యుత్తరాల్లో పరస్పరాకర్షణ ఉద్ధృతం ఇంతా అని చెప్పడానికి లేదు, అది పోనూ పోనూ తగ్గు ముఖం పట్టింది. కాలమహిమంటే అదే. కొత్త మిత్రు లొచ్చి ఆ స్థానాల పూరించ డంవల్ల గూడా కారణం కావచ్చును. అయినా పాత మిత్రుల యెడ వుండే మమత తొలగదు. వ్యక్తులతోడి సన్నిహిత సంబంధము - వాతావరణం మార్పు-ఇవిరెండూ మానవచిత్తప్రవృత్తులనుమార్చడంలో అగ్రగణ్యాలు. కమలం ఒక విచిత్ర వాతావరణంలో పడిందిపుడు. ఎక్కువమంది బ్రాహ్మ ణేతరులూ లింగాయతులూ స్నేహితులయ్యారు. బ్రాహ్మల తప్పులెన్నుతూ

కూర్చుండే వాతావరణం అది. ప్రస్తుతం బ్రాహ్మణ బ్రువులు చేస్తున్న వాటిని నిందించవద్దనిగాదు నా అభిమతం. తప్పులుంటే నిందించాల్సిందే, నిరసించాల్సిందే! ఏవి తప్పులో మాత్రం తెలుసుకోవాలి. అందులో వ్యక్తిగతద్వేషాలుండ గూడదు. అయినా వీళ్ళు వాళ్ళనూ, వాళ్ళు వీళ్ళనూ నిందించుకోడం తప్పితే, బాగుపడేందుకేమన్నా ఆలోచిస్తున్నారా అంటే అదిసున్న. ఇట్లా అయితే సామరస్యం యెట్లా వస్తుంది? మొదట మొదట కమలం కలిసేదిగా దాగ్రూపులో. రాను రాను నిజమే అనుకొనేది. నిజంగా అబద్ధంయేముంది ప్రత్యక్షంగా కనిపిస్తూ వుంటే! వీళ్ళ పూర్వులు చేసిన ద్రోహాలు కనిపిస్తూనే వున్నాయి! అందుకు వీళ్ళ నెందుకుద్వేషించడం? అదొక తప్పు! ఒక వేళ అన్నారే పో! ఈ బ్రాహ్మ లెందుకు పేగులు తెంపుకోవడం? ఎవరో చేస్తే మన కెందుచిక్కొంది రాబ్బా యీ గొడవ అని చేతిలో చెయ్యేస్తే అంతా అరనిమిషంలో తేలిపోతుందిగా! అన్నయ్య నిష్పాక్షిక బుద్ధితో విమర్శించేవాడు. అతననేవాడు:- ఇప్పటికి గూడా బ్రాహ్మణు లనబడేవారు చాలమంది సరిగా ప్రవర్తించడంలేదని. అటువంటి నిష్పక్షబుద్ధి గలవాణ్ణి - హరిజన బంధువుడైన అన్నయ్యను తర్వాత కాస్త అనుమానింప సాగింది కమలం.

కాస్త ముందటివిషయం! మాకు డిగ్రీలో బసవపురాణంలోని ఒక భాగముండేది పరీక్షకు. దాన్ని వ్రాసింది పాల్కురికి సోమన అని మీకు తెలుసుగా! దాంట్లో బ్రాహ్మణుల గురించి 'పచ్చి మాలలు, త్రాటి మాలలు, నీచులు, దురాచారులు........'అని యిట్లాంటి తిట్లు బసవన్న తిట్టినట్లుగా ఉంది. దానిపైన ఒకనాడన్నయ్యకూ కమలానికీ వాద మొచ్చింది సీనియర్ క్లాసు అంతంలో.

"ఇట్లా అనిపించగూడదు" అన్నాడాయన.

"ఎందుకనగూడదు?" అంది.

"మన అన్ని పురాణాలనిండుకూ ఇట్లాంటి అసహ్యమే. ఆ పురాణాలలో యిట్లాంటి అసమత్వాన్నీ, అసహనాన్నీ, ద్వేషాన్నీ పురికొల్పే రచనలుండబట్టే మనం యీవిధంగా తయారై, యీనాడు పరస్పరం ద్వేషించుకుంటున్నాం. అట్టి బ్రాహ్మణ హిందూమతంపై దెబ్బ తీయాలనీ - అందరూ ఒకటే అని చాటాలనీ గదా, వీర శైవమతం బయలు దేరింది? అయితే యిపుడట్లా వుందా?" అని నవ్వాడు.

"ఎందుకు లేదు?"

"ఎక్కడుంది చెప్పు! బ్రాహ్మణులుగా వుండి లింగాల్ని తగిలించు కున్నవారు ఆరాధ్య బ్రాహ్మణు లయ్యారు. వారు నియోగులలో ఒకరే అని చలామణి అవుతున్నారు. కొంతమంది రెడ్లూ, గొల్లూ కొంత అంతస్తులో వున్నారు. గొల్లలు, కురవలు వేరే అంతస్తులో వున్నారు. బోయ లింగాయతులనీ - మేదర లింగాయతులనీ వేరే వేరే వున్నారు. లింగబలిజలు వేరు! లింగధారి కోమట్లు వేరు. లింగధారి కమసాళ్ళు వేరు. లింగధారి మాలలు, లింగధారి మాదిగలు అంతే. మళ్ళా మన చెడిన హిందూమతం ధోరణే!"

"అయినా అందరమూ లింగాయతులమనే ఐక్యబుద్ధి వుంది."

"ఇక్కడమాత్రం వుండ్లేదా, అందరమూ హిందువులమనీ? ఉండ డానికిగాదు. కావలసింది సమత్వం."

ఈ విధంగా యింకా కాస్త జరిగింది వాదం. అతను లింగాయతుల ఆచారాల్ని మామూలుగానే లోపాలు చూపి నిరసించాడు నవ్వుతూ. లోపాలు చూపి, హిందువుల్ని - అందులో ముఖ్యంగా బ్రాహ్మణుల్ని, ఏ విధంగా అయితే నిరసిస్తాడో - అట్లాగే అన్నాడు. ఆమెకు కోపం వచ్చింది. అయితే అపుడేమీ అనలేదు. ఇదెంత తప్పో, ఆలోచించండి! లోపాలు చూపి, అందర్నీ నిరసించినట్లు తన కులం

వారిని గూడా నిరసించినప్పుడు తనకు కోపం యెందుకు రావాలి? తన కులాన్ని గురించి తాను ఫీలవుతున్న దన్న మాట! లేకపోతే గుమ్మడి కాయల దొంగా అంటే భుజాలెందుకు తడువుళ్ళాడుకోవాలి? తర్వాత యీ విషయం నేను తనతో వాదించాను. తనకు తెలుసు- తనలో అట్టి భావం వుండబట్టే అట్లా అన్నాను అని తెలుసు! మేమంటే ఒప్పుకోదు! పైగా అన్నయ్యకే అట్లాంటి భావం వుందని అంది. హరిజనుడి గడప గూడా తొక్కని ఆ కమలం, హరిజనుల పజ్జన పనిచేసి, వాళ్ళ నీరా హారాలను సేవించిన అన్నయ్యను కులవాది అంది. ఆ విషయం నాయుడితో గూడా అంది. దానికి ప్రత్యక్షంగా అన్నయ్యతో వున్న నాయుడి హృదయం యెంత బాధ పడ్డదో ఆమెకు తెలీదు. ఆ విషయం నాయుడు అనలేక అనలేదు. మూడేండ్లకు అన్నయ్యతో అన్నాడు. అతను దానికేమీ బాధపడలేదు.

ఎం. ఎ. జ్యూనియర్ అయిపోయిన సంవత్సరం ఒక తమాషా జరిగింది. అన్నయ్య అప్పుడప్పుడూ నా ద్వారా పంపే వస్తువులు కమలం బాగానే స్వీకరించేది. తాను భార్యమాదిరే అవి స్వీకరించి ధరించేది. అయితే అవి నానుండి అని తండ్రికి చెప్పేది. తండ్రి ఊరికే వుండేవాడు. అప్పటికి సంవత్సరం దాటిందన్నయ్య కమలాన్ని చూచి. ఒక గంటగూడా చూచుకోకపోతే వుండలేనివాళ్ళు ఒక సంవత్సరం పాటు యెలా వుండగలిగారో!

వేసవిలో మా కందరికీ జాబులు వ్రాశాడు. ఏవేవో పుస్తకాలు మా కందరికీ తలా వొక వివేకానంద జీవితం పంపాడు. ఆయన స్వార్థం చూడండి! కమలానికి కొన్ని మంచిగుడ్డలు తీసి, నేను పంపినట్లుగా పంపాడు. పాపం! ఎంత ప్రేమ హృదయంతో తన ప్రియురాలికి పంపాడో అవి! అవి తాననుకొన్నదానికి విరుద్ధ ఫలితాలు తెచ్చాయి! నాలుగో నాటికల్లా ఒక పెద్ద జాబొచ్చింది కమలంనుండి తన్నవమాన

పరచినట్లుగా! ఆ జాబుచూస్తే అతనెంతగా ఫీలవుతాడో ఆలోచించండి! పోనీ, తన తండ్రే అన్నాడనుకో! యేమిటమ్మా యిది బాగుందా? అని. తన తండ్రి ఫీలయ్యాడంటే అర్థముంది! తానెందుకు ఫీలు కావాలి? తన కది కొత్తకాదుగా! తన తండ్రి విషయంలో పరాయివాడు పంపాడను కోవచ్చు. తన విషయంలో తన భర్తేగా! తనకు కోపకారణం గానీ, దుఃఖకారణం గానీ యేమీలేదు! తన తండ్రియెదుట తాను వాటిని వాడు కోకపోతేపోనీ, ఫరవాలేదు. తాను అది తప్పనడానికి వీలులేదు. ఎందు కంటే అతనూ - అతను పంపిన వస్తువులూ తనవేగాబట్టి. తా నన్యధా భావిస్తే సత్య విరుద్ధంగా సంచరిస్తూన్నదన్నమాట! ఈ విషయంలో వాళ్ళ నాన్న జాగ్రత్తగా పనిచేశాడు! అదే సందనుకొని గాద్గదికంగా అన్నాడు:

"నీవు చదువుకున్నావమ్మా! మన వంశాన్ని నిలబెడతావను కున్నాను. కీర్తి తెస్తావనుకున్నాను. అందుకే కష్టపడిచదివించుకున్నాను. కడపటికి మాతూ కాకుండా పోవాలని ప్రయత్నం చేస్తున్నట్లున్నావు." ఇట్లాంటివెన్నెన్నో మాట్లాడినాడు. నిజంగా కమలానికి మనసు తిరిగి పోయింది. నాకుకూడా జాబు వ్రాసింది. అన్నయ్యకు వ్రాస్తూ, దాంట్లో "మా నాన్న గొప్ప అభిమాని. అతనికి కిట్లాంటివి సరిపడవు. తాను ఒకప్పుడు రెండు చేతులా ధనాన్ని కొల్లగా వెదజల్లాడు. అతని బిడ్డకా, యీ అవమానం?" అని వ్రాసింది. ఇట్లాంటి మాటలు యెన్నిసారులో అంది. తన కదొకరకం బేల హృదయం! పాతవి తవ్వుకుంటూ వుంటుంది. ఎన్నిసారులో తన తండ్రి చాలా ధనాన్ని దుర్వినియోగం చేసినట్లు చెప్పింది. కడకిట్లాంటి స్థితికొచ్చినట్లుగా దుఃఖించింది. నేనపు డంతా ఓదార్చేదాన్ని. ఇపుడిల్లా వ్రాయటంలో అర్థమేమిటి? ఎంత తెలివితక్కువ వ్రాత! అతనేదయినా, ఏ దేశ సౌభాగ్యంకోసమో వినియో గించి, ఏ పాఠశాలోద్ధరణమో, మరేదైనానో చేసివుంటే, చాలా

ఖర్చుపెట్టాడు పాపం, అనగలం గాని, దుర్వినియోగం చేసుకున్నది చెప్పుకోడం యెందుకు? అట్లా యెందరు చెయ్యలేదు? ప్రతివాడూ యిపుడు బీదగావుంటే పూర్వం మహరాజుగానో - ఇపుడు మహరాజుగా వుంటే పూర్వం బీదగానో - వుండేవుంటాడు. దాన్ని గురించి యింత ఆలోచన లెందుకు? ఇంత బేలతనపు పలుకులెందుకు?

"అటువంటి వాని బిడ్డకా యిట్టి అవమానం" అన్న వాక్యమే మమ్మలందర్నీ కలతపెట్టింది. అట్లా అయితే స్వీకరించిన వన్నినో! ఏదైనా తెచ్చిచ్చి నపుడంతా "నీవు కాబట్టి తెచ్చిచ్చావ్, మా నాన్న చూశావా యెన్ని రోజులు చెప్పినా తేలేదు" అని అన్న మాటలో? ఎంత స్వవచో విఘాతము! తాను సత్యం అని యిదివరకు యేదైతే అన్నదో, యిపుడు దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నదన్న మాట! శాంతి వ్రాస్తూనే వచ్చింది అది కాస్త మారిపోతూ వుందని - దాని మాటలు నమ్మవద్దంటూ తానూ వ్రాసేది. మాటలంటే నమ్మకపోతే, తన చేష్టలూ, తన వ్రాతలే ఇట్లా వున్నాయిగా!

యెవరన్నా చూస్తే యేమనుకుంటారు? — ఇదివర కంతా యెవరికి తెలిసింది? కడకు పార్సల్ పైన గూడ నా పేరు వ్రాయవల సొచ్చిందందుకేగా! కడకు పోస్టుమాన్ గూడా తెలుసుకో గూడదని, ఆడదాని పేరు వ్రాశాడు పైన, ఇంకెవరు చూస్తారు? ఎన్ని సారులో తన స్వగ్రామం నుండి, ఎన్నో పండ్ల బుట్టలను, పార్సల్ చేశాడుగా? ఆ అడ్రసు చూచి యెవరూ, యేమీ అనుకోనివారు ఈ దినం, లేని అడ్రసును గురించి ఏమను కుంటారు? భావమే ప్రధానమనీ - భావం మారిం దనీ, తేలిపోయిందిగా; ఇట్లాంటి భావం తన కెందుకు కలగాలి? అది వింటే తానేవిధంగా భావిస్తాడో అని భయపడడానికి బదులు తెలివి తక్కువగా వ్రాయనే వ్రాసింది. అతనెంత చింతిస్తాడో తనకేం తెలుసు? అసలు విషయం యింకా తెలీదన్నయ్యకు. తనకు పంపిన వస్తువులు,

ఆజన్మాంతం తన దగ్గర వుంచుకోవాలిగా! అదేకదా ప్రేమ చిహ్నం? ఎవరో బంధువులు వచ్చితే యిచ్చివేసిందట! ఇంతకంటే అవమానం యేదైనా వుందా? ప్రేమను తృణీకరించి నట్లేగదూ! ఇది వింటే అతను క్షమిస్తాడా?

ఇన్ని యిట్లా జరుగుతూనే వున్నాయి. తన కష్టాలు తాను పడుతూ, ఆ పంతుల పనిలోనే మిగిల్చి, నెలకు పది రూపాయలు పంపుతూనే వుండేవాడు. వాళ్ళు తీసుకుంటూనే వున్నారు. మళ్ళా యిట్లా ఫీలవుతూనే వున్నారు. ఆమె హృదయం కులతత్వ మయమై పోయింది. దాదాపు నాలుగేండ్లపాటు బాగా విన్నది. చూచింది. హృదయం నిజంగా మారజొచ్చింది. మా పాత మాటలను, వ్యక్తుల్నా, ఆ రంగద్దాలతో చూడసాగింది. అన్నీ గూడా తాననుకొన్న దృష్టిలో సరిపోయాయి! తన హృదయాన్ని కొంచెం కొంచెమే మానుండి ఉపసంహరించుకోడానికి మొదలు పెట్టింది. మేమంతా ఒకే చోట చదివేటప్పుడు అట్లాంటి మాటలు అనుకోక పోలేదు. అయితే వాటికానాడు అపార్థం లేకపోయేది - కలుషిత హృదయంతో అట్టి మాటలు పరిశీలిస్తే తప్పుడర్థాలు గోచరిస్తాయి. ఆనాడామెలో ఆ కలుషిత భావం లేదు. ఆ స్థానంలో ప్రేమ వుండేది. సమతాభావం వుండేది. అతనెన్నిసారులో అనేవాడు తనతో "కమలం! కులతత్వం వాళ్ళు పాటించడం లేదా? వీళ్ళు పాటించడం లేదా? అని ఎందుకంటావు? వాళ్ళతో నీవు పోటీ పెట్టుకుంటావా? వాళ్ళకుంటే, నీకూ అట్టి హృదయం కావాల్నా? మనం అట్టి దానికి దూరమై, దాన్ని దెబ్బగొట్టడానికి గదా యీ ప్రయత్నం! మనకట్లాంటివి రానీకుండా చేసుకోవాలి!"

ఇట్లాంటి వెన్నెన్నో చెప్పేవాడు. ఎన్ని చెప్పినా ధోరణి మారలేదు. అయిచ్చను బయటికి మాత్రం యేనాడూ చూపలేదామె! తన ప్రేమ కొద్ది కొద్దిగా చ్యుతమౌతున్నప్పటికీ, అతనికి అంతు చిక్కనివ్వ

లేదు. ఇతనది గ్రహించలేదు. అట్లాంటి అనుమానాలకే తావివ్వదతను. ఎంత తేడా వుందో చూడండి ఆ ప్రేమ హృదయాల్లోనే!

తన హృదయంలో మా స్థానం నానాటికీ దిగుముఖం పట్టే కొద్దీ, నాయుడి స్థానం యెక్కువైంది. నాయుడు కమలానికి మొదట్నుండీ ప్రీతిపాతుడే! అతడు బ్రాహ్మణేతరుడని అయినా కావచ్చు- మంచి గుణాలున్న వాడని అయినా కావచ్చు- లేకపోతే అన్నయ్య స్నేహితుడని అయినా కావచ్చు- అతనిని 'అన్నా' అని సంభావించి, సుఖదుఃఖాలు చెప్పుకుంటూ వుండేది. తన వర్ణంలో వాడు గదా అని యేమేమో చెప్పేది. బ్రాహ్మణులను బాహాటంగా విమర్శించేది. ఆ విమర్శన ఇదివరకు మాదిరిగా కనిపించడంలేదు. తన వర్ణంవాడు గదా అని ఆమె ధైర్యంతో అంటూ వుంటే, అట్టి భావాలకు విరుద్ధభావం వున్నవాడైనప్పటికీ నాయుడేమీ అనలేక భేదిమాత్రలు మింగినట్లు మింగి ఊరికే వుండేవాడు. "కొత్త విషయాలు యేం మాట్లాడుతున్నావమ్మా" అని మాత్రం అనేవాడు. వర్ణాన్ని పురస్కరించుకొని నాయుడామెను మాకంటే భిన్నంగా చూడడు. మమ్మల్నందర్నీ తోడబుట్టిన వాళ్ళకంటే యెక్కువగా మన్నించి మర్యాద చేసేవాడు- ఆ నాయుడితో యింకా కొన్ని విషయాలు చెప్పసాగింది. బ్రాహ్మలింట్లో పెండ్లి చేసుకుంటే యెన్నో కష్టనష్టాలొస్తాయనీ, పిల్లలు పుడితే సంఘంలో వాళ్ళకు అవమాన కష్టాలు ప్రాప్తిస్తాయనీ- ఇట్లాంటి వన్నీ అనేది! నాయుడట్లాంటి విని నిర్విణ్ణుడయ్యేవాడు. చూడండామె ధోరణి!

ఇట్లాంటి ప్రశ్నలన్నీ తాను ప్రేమ వ్యాపారంలో దిగిన తొలి దినాల్లో నేను ప్రశ్నించేదాన్ని. ఎంతగానో నిరుత్సాహపరిచాను గూడా! అనాడు "ఇవొక లెక్కా" అంది. సంతాన విషయమై నేను ప్రశ్నించి నపుడు, అసలు కులాంతర వివాహమే అటువంటి వాటి కయినపుడు సంతాన విషయం మాట్లాడ్డా మెందుకు? అని నన్నే మందలించింది.

నాయుడు ఊరికే ఉండటం చూచి, ఎన్నయినా అతను తన పక్షమే గదా అని, తన తెలివితక్కువ నింకా ప్రదర్శించింది. కడకు అన్నయ్యపైన నేరారోపణలు చేయసాగింది. ఈ పని మొదలుపెట్టడం తాను ఉద్యోగంలో చేరిన తర్వాత. నాయుడు యిరుకు పరిస్థితిలో పడ్డాడు. ఎటు జోక్యం కలుగజేసికొన్నా బాగులే దనుకొన్నాడు. తనకు మాత్రం బాగా తెలుసు కమలం చాలా తప్పుదార్లో నడుస్తున్నదని. ఇవన్నీ యిట్లా వున్నాయి గదా!- ఆమె అన్నయ్యకు ఎట్లాంటి జాబులు వ్రాస్తూ వచ్చిందో తెలుసా? తియ్యటి భావాలను తన ఉత్తరాల ద్వారా రవాణా చేసేది; చూడండి దాని వ్యవహారం? ఇతర్లతో అంతా తనపైన నేరాలుమోపి చెప్పేది. పైకి అతనికి ఇట్లా వ్రాసేది! ఇంత హృదయ భేదంతో అట్లా ప్రేమ జాబులెట్లా వ్రాశావని నిలదీసి అడిగితే ఆమె జవాబేమని చెప్పగలదు?

చూచి ఎన్నోనాళ్ళయిందని ఒకనాడన్నయ్య బయలుదేరాడు అనంతపురం. అప్పటి కామెగూడా యం. య అయిపోయి ఉద్యోగంలో ప్రవేశించింది కాబోలు! అంతేలెండి! అప్పటికన్నయ్యగూడా రాజంపేటలో టీచరు. ఎంతో ఆశతో వెళ్ళాడు. పాపం! ఎంతగానో కౌగిలించుకుంటుందనుకున్నాడు! ఇతన్ని చూచి ఆశ్చర్యాన్నయితే ప్రకటించింది గాని, ఆనందాన్ని చూపలేదు. గమనించాడు. గమనించనివాడులాగానే, తనధోరణిలో ప్రేమవిషయాలు మాట్లాడుకుంటూ పోతున్నాడు. ఆయన చెప్పుకపోతూంటే, మారువిధంగా తీర్పుచెప్పే జడ్జిలాగా ఊరికే వింటూ పోతూవుందామె! పాపం, అతనిమనసు చివుక్కుమంది. అయినా, ఆమె మాదిరి తానుచేస్తే బాగులేదుగా! ఆమెనునిరసించి తానూ వెళ్ళిపోగలడు! అయితే తాను ఆమెనే చేసుకుంటానని తనహృదయానికి చెప్పుకొని వున్నాడుగా! పదిమందికీ తెలుసుగా! తన మాటను తాను తిప్పుకోలేదు! హృదయానికి ద్రోహంచేసి యింకొకదాన్ని వివాహమాడలేడు. ఈమెహృదయం ఇట్లా యెందుకు మారిందా అని ఆలోచిస్తూ వెంట నడుస్తున్నాడు.

ఇల్లుచేరగానే ఇంట్లో నాన్నా లేడు. తానిపుడేస్థితికొచ్చిందంటే, ఎవరొచ్చినా మాట్లాడదగ్గమాటలుంటే-తనతండ్రిసమక్షంలోనేమాట్లాడాలి-తండ్రి చెప్పినట్లు వినాలి. అది బాగానేవుంది. ఆ సూత్రాన్ని అన్నయ్యలో పాటిస్తే యెట్లా? పాటింపదలచుకున్నదిపో! అన్నయ్య అన్యుడే అవుతాడుగాని తనకు భర్త కాడుగా! తలిదండ్రులకు తృప్తికరంగా నడుచుకోవాలని మొదట ఇతనే చెప్పాడు.అయితే వాళ్ళయెడ తన కర్తవ్యాన్ని నెరవేర్చుకోడంలో యింత దాస్యభావం-అమ్ముడుపోయినతనం వహిస్తే యెట్లా? తానట్లాయెందుకయిందో నాకీనాటికీ దురవగాహంగానే వుంది. తర్వాత ఏదో సంభాషణ మొదలు పెట్టాడన్నయ్య. దూరంగా అంటరాని మనిషి కూర్చునట్లుగా కూర్చొని ఆయన వేసిన ప్రశ్నలకు ముక్తసరిగా జవాబులు చెప్తూ కూర్చుంది. పూర్వపు విషయాలు జ్ఞప్తికి తెస్తూ యేమేమో చెప్పాడు. తానా విషయాలను స్ఫురణకు తెచ్చుకోడమే నిరాకరించింది. తాను మొదట "ప్రేమించాను" అన్ననాడెట్లాంటి ప్రశ్నలయితే కమలానికి వేశాడో - ఆ ప్రశ్నలన్నిటినీ - ఆమె యీనాడతనికి వేసింది. మెత్తగా జవాబులు చెప్పాడతను. 'బిడ్డలు కలిగితే నీ కులం పేరు పెట్టాలనా, నా కులం పేరు పెట్టాలనా' - అన్న ఆమె బుద్ధిహీనపు ప్రశ్న అన్నయ్య నెంత ఏడ్పించిందో తెలీదు. కడకెంతో ఉపన్యాస ధోరణిలో ఏమేమో మాట్లాడాడు. అంతా ప్రాధేయపూర్వకపు పలుకులే. అన్నీ విని, కడపటికి అంది: "అవన్నీ కేవలం ఊహలు! సొసైటీ మారదు" అని. అన్నయ్య హృదయ గుండంలో ఎన్నెన్ని ప్రళయ ఝంఝూ మారుతాలు బయలుదేరాయో! అవమాన దావానలం యెంత పటపటార్భాటాలతో దహించి వేసిందో! బయలుదేరాడు. 'వస్తా' నంటూ బయలుదేరాడు.

"నే వెళ్తాను - నీవేమీ మనసు నొచ్చుకోకు! నీ దోషమేమీ లేదిందులో"- అంటూ బయలుదేరాడు. అన్నానికి గూడా నిలబడ మనలే

దామె-నిశ్చేష్టురాలై శూన్య దృష్టితో చూస్తూ కూర్చుంది. శవం సజీవం అయినట్లుగా అడుగు లేస్తూ - గుమ్మం దాటాడు."

శాంతం కండ్లలో నుంచి కన్నీళ్ళు బొటబొట రాలాయి! కంఠం రుద్ధమయింది. సూటిగా నేలపై చూస్తూ చెప్పుకుపోసాగింది:—

"ఆయ నెంతగా బాధ పడ్డాడో చెప్ప శక్యం కాదు. ఆయన్ని మీరు కనిపెట్టలేరు. మీరే గాదు, మేము గూడా! మా కంతా తెలుసు గాబట్టి కనిపెట్టగలిగాం. ఆయన ప్రశాంత ముఖచ్ఛాయ క్రింద అనవరతమూ అగ్ని గుండాలు ప్రజ్వరిల్లుతూనే వచ్చాయి! వాటి కీలలు అధోముఖానికి పంపి, గుండెలు మండేటట్లు చేసుకుంటాడే గాని, ముఖం పైకి రానీడు. ప్రశాంతతను పోగొట్టుకోడు! ఆ ప్రసన్న వదనం చూచి, ఏలాటి చీకూ చింతలూ లేని మనిషనుకుంటా రందరూ. ఆయన చింత భగవంతుడి కెరుక! ఒక్క స్త్రీ కోసం, ఏకైక వ్రతంగా-అన్ని విధాలా తనకు మించిన వారు లభిస్తున్నా గానీ, ఆ అమ్మాయి కోసమే - తన మాటను నిలబెట్టుకోవా లనే పట్టుదలతో - నీవు చేసుకోకపోతే సముద్రంలో దూకి చస్తాను - అన్న వ్యక్తిని దృష్టిలో పెట్టుకొని, ఆయన తహ తహ పడటం చూస్తే ప్రేమించడం తెలిసిన ప్రతి వ్యక్తికీ అర్థమవుతుంది! ఆ సమయంలో నేను మా వూర్లో వున్నా. ఆయన్ను చూచి, అప్పటికి రెండేండ్లు దాటాయి. అంతకు ముందు అప్పు డప్పుడూ వచ్చేవాడు నేను మద్రాసులో వున్నప్పుడు! ఆ దపా చూడాలని నా కెంత తీవ్రమైన కోర్కె పుట్టిందంటే, తక్షణం తంతిలాగా భావించి, బయలు దేరాల్సింది అని కార్డు మాత్రం వ్రాశాను. దాంట్లో ఒకే ఒక వాక్యం వ్రాశాను. అదిప్పటికీ బాగా జ్ఞాపకం వుంది— "నీవు అన్నవు - నన్ను చెల్లీ అంటావు, అది కేవలం పెదవుల పైన్నుంచి వస్తున్నట్లుంది! నేనే, మీ అమ్మ కడుపులో పుట్టి వుంటే, ఇన్నిసార్లు రమ్మంటున్నా రాకుండా పోతావా?"— అని వ్రాశాను. రెండో నాటికే నాకు పెద్ద కబురొచ్చింది.

చూచాను. నా కానందమిశితమైన దుఃఖం వచ్చింది. ఎంత వడిలో నడిచిం దా జాబు! - అందులో కాస్త ముఖ్య విషయం చెబుతాను.

"అమ్మా! నీ జాబు చదువుకున్నాక నా హృదయం తీయటి బాధను పొందింది. తక్షణం వ్రాస్తున్నా. నీవు నా మాతృయోని సంజాతవు కాకున్నా నా చెల్లివే! ఒక వేళ యేక యోని సంజాతు లయితే మాత్రం అన్నా చెల్లీ అనే అనుకోవాలని యెక్కడుంది? అట్లా అనుకోవాలని కేవలం భావం-అంతే! ఒక తల్లి వుందనుకో! ఒక కొడుకున్నాడు. రెండేండ్లకు ఒక ఆడపిల్ల పుడుతుంది. ఆ పిల్లను వీడికి తెలీకుండా ఎక్కడో దూరంగా పెంచుతారు. వీడి తల్లి కూతురని వీడికి తెలీదు.. ఆ పిల్లకూ తెలియదు! ఒకవేళ వీళ్ళిద్దరూ ఒకే స్కూల్లో చదవటం సంభవిస్తే-ఇతర పిల్ల ల్నన్నట్లుగా ఈ పిల్లనూ చిలిపి మాట లంటాడు. ఇతర పిల్లల్ని గురించి స్నేహితులతో మాట్లాడినట్టే, ఈ పిల్లను గురించి గూడా మాట్లాడ్తాడు. అంత స్థితి కొస్తే ప్రేమిస్తాడు! పెండ్లి గూడా చేసుకుంటాడు. ఇపు డేమయింది? వాడి తల్లి కూతురే వాడి భార్య అయింది. వాళ్ళిద్దరూ ఒక తల్లి బిడ్డ లని ఎవరికీ తెలీదు. సత్యం యేది ఇందులో? అది దూరమైంది. కేవలం భావం తీసుకున్నాం మనం. మన భావన ప్రకారం నడుచుకుంటున్నాం. అంతే నమ్మా! ఒకే తల్లి కడుపులో పుడితే పుట్టావచ్చు. లేకపోతే, పుట్టకాపోవచ్చు. భావం వుంటే చాలు! ఆ భావంతో ప్రవర్తించుకుంటే చాలు! నేను అన్నను! నీవు చెల్లివి. ఆజన్మాంతం మనం అంతే!! చెల్లి వేడికోలు ప్రకారం అన్న రేపు రాత్రి బండికే వస్తున్నాడు.''

ఆ జాబు చదువుకొని యెంత ఆనందించానో, ఎంత యెగిరానో నా భర్తకు మాత్రమే తెలుసు! ఆ రాత్రంతా అన్న విషయమైన కలలే! తెల్లవారి యెనిమిదిగంటలకు కారులో వెళ్ళాం స్టేషనుకు నేనూ నా భర్తా. తీసుకొచ్చాం. ఆయన ప్రసన్నపు పలుకులకు, కొత్త అయినప్పటికీ నా

భర్త యెంతో ఆనందించాడు, అన్న వున్నన్నాళ్ళూ నేను స్వర్గంలో వున్నట్లే! అంతగా ఆనందపడనిచ్చి, కడపట వెళ్లేనాడు ఒక విష గుళిక వేశాడు. అంటే ఒక జాబు యిచ్చాడన్న మాట! అంతవరకూ కమలాన్ని గురించి నేను వేసే ప్రశ్నలకంతా ఏదో చెబుతూ, కాస్త తప్పించుకొంటూ వుండేవాడు. జాబు చూచాను. జాబెంత దారుణంగా వుంది! అన్నయ్య యిక ఆ కమలం ముఖంగూడా చూడడేమో అనే భావన కలిగింది. అన్నీ యీతనిపై ఛార్జీలు! తాను కులవాదట! మొండిగా వాదించే వాడట! తననూ తన తలిదండ్రులనూ అవమాన పరిచాడట! మొదట ఒకనాడు తలిదండ్రులను విడిచిపొరెయ్ అని ఉద్బోధించినాడట!- తాను మొదట పొరపడిందట.అపుడు తలిదండ్రుల విషయం అంతగా ఆలోచించలేదట! తానెప్పటికీ అట్టి ఆశయాలు కలిగి వుండలేదట- ఆదర్శంకోసం వివాహ మాడటం లేదట! మళ్ళీ ప్రేమ వున్నదట! తనను చాలా కష్టపెట్టిందట! తలిదండ్రుల కోసమై, వివాహం చేసుకోకుండా బ్రహ్మచర్యం అవలం బిస్తుందట!- ఇట్లాంటి వెన్నో వ్రాసింది.ఆ జాబు నాచేతికిచ్చి గంభీరంగా కూర్చున్నాడు. ఆ జాబు చదివి నేనెంతగానో దుఃఖించాను? ఆమె యింత తెలివి తక్కువగా, దారుణంగా యెందుకు వ్రాసిందో నాకర్థం కాలేదు! తాను తన హృదయాన్ని పరీక్షించుకుందో లేదో—అథవా పరీక్షింప ప్రయత్నించినా, ఆ కలుషితబావాలు పూర్తిగా కప్పేశాయేమో! నేను మాట్లాడుతూనే వున్నాను దుఃఖంతో. అతనన్నాడు— "ఇంతేగదమ్మా! యిపుడే యింత వయసయింది. ఇక పదేండ్లు కండ్లుమూసుకుంటే యీ యౌవనం గడిచిపోతుంది. ఏలాటి చింతలూ లేకుండా, అనుకున్న పని కాస్త చేసుకొని, సుఖంగా ఈ ప్రపంచాన్ని వదలవచ్చు. కమలం మాత్రం యింతకంటే యేమి చెయ్యగలదు?" అని.

"ఇంత పనికిమాలినపని చేస్తుందనుకో లేదన్నయ్యా!" అన్నాను.

"ఏమోనమ్మా! అది నీ హృదయభావం! ఆమె హృదయంలో ఎట్లాంటి భావం వుందో? ఎట్టి విపరీత పరిస్థితులలో ఉందో ఆమె!" అన్నాడు నిర్వికారంగా. నాకు నిజంగా కోపమొచ్చిందా శాంతపు పలుకులు విని. అటువంటి సమయాలలో అవమానాన్ని ఒకవైపు రుచిచూస్తూ గూడా, అట్లా మాట్లాడితే, అది చేతగానితనమని యెవరైనా భావిస్తారు. నేను గౌరవంగానే, ప్రేమ పురస్కారంగా నాలుగు అనవలసిన మాటలు అనేశాను. తాను మందహాసంతో అన్నీ విన్నాడు. నేనింకా ఉద్రేకంతో ఏమేమో మాట్లాడుతున్నా. ప్రశాంతంగా వింటూన్నాడు. కడపటికి మళ్ళా-

"పోనీ, వేరే కులంలోనే, ఇంకెవర్నన్నా యెందుకు చేసుకోగూడదు?" అని అన్నాను.

"ఇన్నేండ్లు యింత దగ్గరగా జీవించిన - బాగా చదువుకొన్న - ఎన్నెన్నో మాట్లాడిన కమలమే యిట్లా అయితే - ఇంకొకతె బాగా చేస్తుందని నమ్మకమేమిటి?" అన్నాడు. ఆయన ఆ విశ్వాసానికి నేనేమీ అనలేకపోయాను.

మరునాడు సజలదృక్కులతో వీడ్కొల్పాను. ఆయన పోతున్నాడట్లానడిచి నాభర్త వెనుక బస్సుస్టాండుకు! నేను పరికిస్తూ నిలబడ్డాను. నా దృష్టిలో ఆయన ఒక్కొక్కసారి మనిషి చీలి ఎంతో మందిగా కనిపించేవాడు. కండ్లు నలిపి మళ్ళా చూస్తే ఒకడుగానే కనిపించేవాడు. తర్వాత "ఎన్ని విజృంభిత భూతాల్ని హృదయాంతరాళంలో అణచుకొన్న వ్యక్తి!" అనుకుంటూ లోపలికెళ్ళిపోయాను.

అనాడే నాయుడికి తంతిచ్చాను. వచ్చాడు. కథ చాలా అడ్డం తిరిగిందని చెప్పాను. ఆయనకు తెలియని కడపటి విషయం గూడా అంతా చెప్పాను. కమలం అంటే నాకింకా ఆ మమత పోలేదెందుకో!

మళ్ళా విశ్వప్రయత్నాలన్నా చేసి వాళ్ళను కలపాలని సంకల్పించే, నాయుణ్ణి పిలిపించాను. నేను జోక్యం కలుగజేసుకోడానికి వీలులేదు. కులతత్వాలు ప్రబలి, మమ్మల నామె అనుమానిస్తున్నది. మేమంతా అదేకులంగాబట్టి కేశవరావు విషయంలో పట్టుపట్టినట్లుగా యిప్పటికే ఆమె నాయుడితో అంది! మా జాబులకు, మాటలకు ఇటీవల చాలా వెగటైన జవాబులే వ్రాసింది. నాయుడెంతో బాధపడ్డాడు పాపం! అనాడే బయలుదేరాడు.

నాయుడంటే వాళ్ళనాన్నకు గూడా ఆదరణ మర్యాదలున్నాయి. నాయుడు వెళ్ళగానే బాగానే మర్యాదలు చేశారు. నాయుడు స్థిరబుద్ధితో చాలా విషయాలు మాట్లాడాడానాడు. కమలం కాస్త తగ్గింది. కొద్దిగా ఆలోచింప మొదలుపెట్టింది. అంతమాత్రం ఆవకాశమిచ్చి, నాయుడూరి కెళ్ళిపోయి, మళ్ళా కొన్ని మాసాలలో వెళ్ళాడు. ఈదఫా నాయుడు చాలా జాగ్రత్తగా వెళ్ళాడు. ప్రస్తుత విషయానికి పనికివచ్చే ఉత్తరాలూ, తన డైరీ తీసుకున్నాడు. చిన్నగా అన్నయ్య డైరీగూడా కొట్టేశాడు. ఒక టొకటే మాట్లాడ్డం మొదలుపెట్టాడు. కమలం యిక వెళ్ళి అన్నయ్యను పెండ్లి చేసుకొని సంసారాన్ని వెలిగించాలనే ధోరణిగాదు నాయుడిపుడ వలంబించింది- కమలం తన తెలివితక్కువవల్ల యింకొకరి జీవితం యెట్లా నాశనం చేసిందో, బాగా తెలియజెప్పాలని. డైరీ - ఉత్తరాల ప్రమాణాలతో ఆయా సమయాలలో తామెట్లా కష్టపడిందీ-ఏమి చేసిందీ- అంతా చూపించి అదే సమయంలో కమలం డైరీగూడా చూస్తే అదేవుంది! అన్నయ్య డైరీ, కమలం డైరీ - రెండూ ఒకరు వ్రాసినట్లే వున్నాయి! ఉత్తరాలు గూడా మొదట చాలా సాఫీగా వున్నాయి. కడపటి ఉత్తరాల్లో పొత్తు కుదరలేదు. కడపటి ప్రవర్తనపై నాయుడికి కోపం వచ్చింది.

"ఇంత హృదయ విరుద్ధంగా ప్రవర్తిస్తావని అనుకోలేదమ్మా! నీడలు చూచి భయపడ్తావని నే ననుకోలేదు. నిన్నూ, నీ చేష్టలూ, చూచి,

గుండె నిబ్బరం, గుండె ధైర్యం గల మనిషివని అనుకొనేవారం అందరమూ. ఆనాటి నీ భావాలు చూచి, ఎంతో గొప్ప ఉద్యమకర్త గూడా అయిపోతుం దనుకొనేవారం! ఆనాడు నిన్ను గురించి కేశవరావు ఎంత గర్వపడేవాడో నాకొక్కనికే తెలుసు! నీ కొఱకెంత కష్టపడేవాడో, నీకోసంగా వాటి నెంత తృణప్రాయంగా చూచేవాడో నీకు తెలీదు.— ఇపుడిట్లా తయారయ్యావు!

ఆ వ్యక్తిని గురించి నాతోనే ఎన్నెన్ని విషయాలన్నావో జ్ఞాపకముంచుకో, నీవు ప్రేమించినా దూరంగా వుండేదానివి. నేను ఏ క్షణంలో గూడా అతనితో వుండేవాణ్ణి! ఆతనిలో యేమాత్రమన్నా మలినముందా? స్వార్థంతో, అసూయతో, ఏ విషయాన్నన్నా చూచేవాడా? ఆతనికా, నీవు కులతత్వాలంటగట్టడం! మేమిద్దరమూ ఒక కంచంలో గూడా తినేవారం అని తెలీదా? మాకు ఎక్కువ హరిజన అతిథులే వచ్చేవారని తెలీదా? - ఇవన్నీ తెలిసిగూడ నీ నోటి కొచ్చినట్లనేశావు. నానాదుర్భాషలాడావు. అవమానపరిచావు. నీమాదిరే ప్రవర్తించేవాడయితే యీ వేళకు ఎప్పుడో హృదయం మార్చుకొని వేరే వివాహం చేసుకొనేవాడు!

నీవేదో గొప్ప ఆదర్శనారివి అని అతను ప్రతంపట్టి కూర్చుంటే నీవిట్లాంటి ప్రవర్తనల నారివై కూర్చున్నావు. ఎంత బాగుందో చూడు! అందర్నీ వదలి అతను నీకోసం వస్తే, నీవు అతన్నీవిధంగా వదిలావు. ప్రపంచం యిట్లాగే వుంటుందేమో! ........

అని యీ ధోరణిలో మాట్లాడేశాడు. అజ్ఞాన మేఘాలు పటాపంచలై పోగా. జ్ఞానసూర్యుడు ప్రకాశింప మొదలు పెట్టాడు. ఆ మేఘాలు వర్షంగా కురిసినట్లుగా, కమలం ఎంత కన్నీరు కార్చిందో చెప్పలేం! ఎంతగానో పశ్చాత్తాప పడింది. తీవ్రంగా ఆలోచింప మొదలుపెట్టింది. క్షమింపమని కోరుకుంటూ అన్నయ్యకు ఉత్తరం వ్రాసింది. అప్పటికే ఆయన విరుద్ధంగా నిర్ధారించుకున్నాడు.

కమలం కోసంగా ఒకప్పుడు ఇతర స్త్రీని పెండ్లాడనని ప్రతిజ్ఞ పట్టేశాడు. ఎందర్నో నిరాకరించాడు. ఆ స్త్రీయే యిపుడిట్లా ఆచరించి నప్పటికీ, చాలానాళ్ళు ఆలోచించి - "ఏ పరిస్థితిలో గూడా కమలాన్ని వివాహమాడలేను" అని ప్రతిజ్ఞ తీసుకున్నాడు. అంతే! ఇక దానికి చలనం లేదు. అది బండ!

అన్నయ్య వివాహసంబంధిక విషయంలో యిది చరమ ఘట్టం! కమలం కొన్ని నెలలు జాబుకోసం యెదురు చూచింది. రాలేదు. ఎంతో వేదన పడింది. మళ్ళా వ్రాసింది. జవాబు లేదు. నాకూ, శాంతకూ పాపం, దుఃఖిస్తూ, పశ్చాత్తాపంతో వ్రాసింది. మేము అసహాయ పరిస్థితిలో వున్నాం అంటూ జవాబు లిచ్చాం. అన్నయ్యకు మళ్ళా బ్రతిమాలు కుంటూ వ్రాసింది. ఇదివరకంతా జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలోని ప్రేమ సాహిత్యం తిరగవేస్తూ కూర్చుంది. డైరీ తిప్పి తిప్పి చదువుకోడం మొదలు పెట్టింది. పశ్చాత్తాపాగ్ని అజ్ఞానాన్ని పూర్తిగా దహించగా ఒకే మోయన యేడుస్తూ కూర్చుంది. ఒకే తీరున ఆలోచిస్తూ కూర్చుంది. ఒక్కొక్కనాడు అన్నం గూడా మాని ఆలోచిస్తూ కూర్చునేది. ఏదో పిచ్చిపట్టినట్లయింది! తనకన్ని వైపులా అసహాయత్వమే కనిపించింది. తండ్రి దగ్గరికొచ్చి యేదో మాట్లాడించాడు. అమితంగా అసహ్యం వేసిందామెకు! ఆ దినాల్లో అసహ్యించుకున్నట్లుగా అసహ్యంకో మొదలు పెట్టింది. నాయుడు ప్రయత్నిస్తున్నానని వ్రాస్తూ కడపటి జాబులో ఇక నా వల్లకాదని వ్రాశాడు. మళ్ళా మేమేగతి అయ్యాం. పాపం, శాంతికి వ్రాసి, దానింటి కొచ్చింది. అన్నీ మరిచి, అదెంతగానో ఆదరించింది ప్రేమతో ఇద్దరూ కలిసి మా యింటికొచ్చారు హఠాత్తుగా! ఆ హఠా దాగమ

వానికి ఎంతో ఆశ్చర్యపడ్డాను. కండ్లనిండుకూ నీరునింపి 'కాంతీ' అంటూ ఆవేగంతో వచ్చి నన్ను కౌగలించుకుంది. అబ్బా! అదే పాత కౌగిలి! అదే భావం! ఎంత సానుభూతి కలిగింది దాన్ని చూచి! అయితే చేసేదేముంది? అప్పటికే అంతా అయిపోయింది. ఇక గతజల సేతుబంధనమే అవుతుంది యేంజేసినా?

శాంతి వుందిగా ఆలోచన చెప్పడానికి! అన్నయ్యకు అర్జెంటుగా వైరిద్దామంది. ఇదంతా మొన్న మార్చిలో జరిగిన విషయం! ఆ రాత్రి పదిగంటలకే వచ్చాడు.

లోపలి కడుగుపెట్టగానే అందర్నీ కమలంతో పాటు ఒకసారి తేరిపార జూచాడు. ఆ మొగంలో ఆ ప్రసన్నతగానీ, ఆ మందహాసం గానీ లేవు. గాంభీర్యం తాండవమాడుతూ వుంది! మా హృదయాలు ఉద్వేగంతో కొట్టుకుంటున్నాయి. ఆ గంభీర వదనంలో నుంచి దుందుభి స్వరంలాగా-

"ఇందుకా కాంతీ, వైరిచ్చావ్?" అన్న శబ్దం వినిపించింది.

ఇతను మాపై పెవరివైపూ చూడ్డంలేదు. తనలోపల తానే చూచు కుంటున్నాడు! ఎవరమూ మాట్లాడలేదు. అంత చనువున్న మేంగూడా సాహసించలేకపోయాం. తన పెండ్లాం అని ఒకప్పుడు చెప్పుతున్న వ్యక్తి ఇపుడు సాహసించ లేకపోయింది. అదేమిటో అదొక భయంకర వాతావరణమే అనాలి. నిశ్శబ్దంగా వుందంతా. హృదయాన్ని పగల దీసికొని బయటపడే దుఃఖం గొప్పగా ధ్వని చేసుకుంటూ కమలం హృదయ కుహరంలోనుండి వెలువడింది. బిగ్గరగా యేడ్చి, అట్లా, ఆయన కాళ్ళపైబడి చుట్టుకుంది. ఒక క్షణం కాళ్ళపై ముఖాన్ని అదిమి,

మళ్ళా తల పైకెత్తి అతని మొగంలోకి చూచింది. కండ్లూ మొగం, అంతా జలమయం! కండ్లల్లో వస్తున్నది రక్తమే అనాలి! ఎంతో దీనంగా చూస్తూ ఎక్కిళ్ళు పెడుతూ,

"క్షమించవూ?" అంది. అని, మళ్ళా మొగం కాళ్ళపై వేసి, అదుముతూ వెక్కి వెక్కి యేడ్చింది.

నిశ్శబ్దం, కాసేపు నిశ్శబ్దం! నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ ఒక గంభీర వాక్కు:

"ప్రతిజ్ఞంటే నీ యింటి పూరి పుల్లనుకోకు కమలం! ఎంతో కాలం యోచించి, కడకు ప్రతిజ్ఞ తీసుకున్నాను. ఇక ప్రయోజనం లేదని నీ కర్థమయిందనుకుంటాను."

అంతే! బంధం తొలిగించుకున్నాడు. అట్లాగే బయలుదేరాడు. మేము చేతులు చాపి దుఃఖిస్తూ అరుస్తున్నాం. ఆ చీకట్లోపడి వెళ్ళి పోయాడు. వెదికించినా కనిపించలేదు. అక్కడ పడిపోయింది కమలం కూలిపోయి. ఓదార్చాం! "నీ పెండ్లి జరిగేటట్లు చేస్తాంలే కమలం!" అని ఓదార్చాం. మాకింకా ఆశపోలేదు. ఆ ఆశతోనే వచ్చాం. ఇది కత" అంది కాంతం.

కాంతం కండ్లలోనుండి నీళ్ళు వస్తున్నాయి.శాంతకు గూడా! ఇంత లోనే వచ్చాడు కేశవరావా నిశ్శబ్ద వాతావరణంలోకి. తాను విశ్రాంతికని పడుకున్నాడు గదిలో. కాంతం కత చెబుతూవుంటే స్వప్నావస్థలో వున్నట్లుగా భావిస్తూన్నాడు. కవవటికి బయలుదేరి వచ్చాడు! అతని కండ్లలో గూడా నీరు ప్రవహిస్తూ వుంది! అందరి కళ్ళల్లోనూ సానుభూతి అశ్రువులు!

"ఎందుకమ్మా, ఆ వ్యక్తిని గురించి పిల్లవాళ్ళముందు చెప్పావు?" అన్నాడు.

"పశ్చాత్తాప హృదయం క్షమార్హమే గదా అన్నా?" అని అంది కాంతం.

"తథాస్తు" అంటూ గడియారం ఒక దెబ్బ కొట్టింది.

సంపూర్ణం





జననం 1925 కడపజిల్లా వెంకటరాజు పల్లెలో. తెలుగు ఎం. ఏ., హిందీ విశారద! "ప్రబంధములలో ప్రకృతి వర్ణనలు" పైన S.V. యూనివర్సిటీలో డాక్టరేటు సంపాదన- 1974 లో సర్వోత్తమమైనదిగా బహుమతి. అనేక ప్రభుత్వ కళాశాలల్లో అధ్యాపక వృత్తి; ప్రిన్సిపాలు. 1976 నుండి సెక్రెటేరియట్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల ప్రత్యేకాధికారి. 1982 నుండి వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక సహాయ సంస్థ అభివృద్ధి అధికారి. ఎ.పి. వాషర్‌మెన్ ఫెడరేషన్ మొదటి చైర్మన్.

**కావ్యములు :-** (కం) కాళరాత్రి, నవసృష్టి, తాడితవ్యాఘ్రి, ఇప్పుడే, కాలవేదం, ఉషస్వప్నం, ఇరవై ఒకటో శతాబ్దంలోకి, అవతారాల మోసాలు.

**బాలసాహిత్యం :-** కోటవీరన్న సాహసం, ఉదయగిరి పోలన్న ధైర్యం, మంత్రాల రామన్న మొండితనం, కవిగారి బాల్యం, కవిగారి హైస్కూలు చదువు, దొంగ విద్యార్థి.

**సాంఘికనవలలు :-** ఆదర్శం, భావం, ప్రేమభిక్ష, లేడీ లెక్చరర్ స్వగతం, శంపాలత, చీకట్లో కాంతిరేఖలు, శోభాదేవి, ఆప్‌బీతీ. (హిందీ)

**చారిత్రక రచనలు :-** రామరాయలు, శ్రీకృష్ణదేవరాయలు.

**నాటకాలు :-** సహజీవనం, సమరసత్వం, మానవత్వం, పరిష్కారం, ఎక్కడి గొంగడి అక్కడేనా, మహిళా మహస్సు, వేలం వెర్రి, భువన విజయం, ముక్కంటి ముక్కోణం, నిత్యకళ్యాణి, ముల్లును ముల్లుతోనే.

**విమర్శ :-** ప్రబంధాలలో ప్రకృతి వర్ణనలు, డాక్టరల్ థీసిస్.